శ్రీః

# శ్రీమదాంధ్ర మహాభాగవతము

## ఏకాదశస్కంధము - పద్యకావ్యము

శ్రీ కోవూరి పట్టాభిరామశర్మ విరచితము



ప్రకాశకులు

శ్రీ పుష్పగిరి పీఠ మహాసంస్థానమ్

హైదరాబాద్

శ్రీః

# శ్రీమదాంధ్ర మహాభాగవతము

## ఏకాదశస్కంధము - పద్యకావ్యము

**శ్రీ కోవూరి పట్టాభిరామశర్మ** విరచితము



ప్రకాశకులు

**శ్రీ పుష్పగిరిపీఠ మహాసంస్థానమ్**

హైదరాబాదు

శ్రీః

# శ్రీమదాంధ్ర మహాభాగవతము

## ఏకాదశస్కంధము - పద్యకావ్యము


ప్రథమ ముద్రణ: 1924

ద్వితీయ ముద్రణ : శ్రీకృష్ణ జయంతి 2013

ప్రతులు : 500

పుటలు : 306

వెల రూ. : 200-00



**RAVI MOHAN RAO,** M.Sc., M.A. (Sanskrit)
Flat No. 404, Janajanam Complex
Opp. 1 Town Police Station, CHIRALA - 523155
Cell :**94401 15411, 08594-202411**


D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**





Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.



శ్రీ అవనిగడ్డ ఎల్లమందయ్యస్వామివారు
(1919 సిద్ధి)



శ్రీ కవర్తపు చిన్నబ్బిస్వామివారు (చిదానంద)
(20వ శతాబ్ది)

ఓం శ్రీ గురుభ్యో నమః / ఓం అవధూత
దత్తగురువే నమః / భగవద్భక్తులకు వందనములు.
శ్రీమద్భాగవతము - ఏకాదశస్కంధము - సంస్కృతమూలము -
ఆంధ్రానువాదము - శ్రీ కోవూరు పట్టాభిరామశర్మగారు
**- ద్వితీయముద్రణ - ఆవశ్యకత**

ఈ గ్రంథము క్రీ.శ. 1924లో మొదటిసారి అచ్చయినది. ప్రతులు అలభ్యము. దాదాపు 90 సంవత్సరాలకు పూర్వము ఈ గ్రంథము రచింపబడినది. 'పోతన' మహాకవి భాగవతమున - "ఏకాదశస్కంధము - వెలిగండల నారయ' రచన కలదు. అది సంక్షిప్తముగా కలదని కవి దానిని విస్తరించి వ్రాసెను. 31 అధ్యాయాలు, 7వ అధ్యాయమునుండి "ఉద్ధవ" గీతగా పిలువబడుచున్నది. ఈ "ఉద్ధవ" గీత రామకృష్ణమఠం కలకత్తావారు అచ్చువేశారు. "రామానందగౌడీయ మఠంవారు అచ్చువేశారు.తెలుగులో / ఆంగ్లములో తాత్పర్యసహితముగా ముద్రింపబడింది. శ్రీమద్భాగవతమునకు శ్రీధరస్వామి వ్రాసిన వ్యాఖ్య కలదు. ఈ ఏకాదశస్కంధము మోక్షశాస్త్రము. "సృష్టి, స్థితి, లయములు - లేని స్థితిలో ఉన్నది 'సత్తు' (పరమాత్మ) మాత్రమే." దీనినే తురీయావస్థ అని పిలుస్తారు.

ఈ స్కంధమున ఎన్నో విషయములు కలవు. 1. యదు దత్తాత్రేయ అవధూత సంవాదము 2. హంసగీత 3. హరి అవతారములు - అవతార ప్రయోజనము. 3. సాంఖ్యయోగము తత్త్వములు-24/25/26. 3/8 - 4. ఉపాసనా విధానములు. 5. భిక్షుగీత 6. యోగి లక్షణములు 7. వర్ణాశ్రమధర్మములు 8. జీవితలక్ష్యం - మోక్షసాధన.

అవధూత (అగుటకు) లక్షణములు - స్థిరత్వము - తితిక్షలోకోపకార పరత్వము - మమతారాహిత్యం - గంభీరత - సహనము - ప్రశాంత చిత్తము - అలోభత్వం - అమానిత్వం - సమవర్తన. ఇంద్రియ జయం - ఏకాంతవాసం - ఏకాగ్రత - సంగరాహిత్యము - సంపూర్ణ వైరాగ్యం

యోగి పొంగడు - చలించడు. అనికేతుడు.

- ఆశాహిదుఃఖం నైరాశ్యం పరమం సుఖం "గృహారంభోఽతిదుఃఖాయ"- "అంతా ఒక్కటే రెండవది లేదు" అని హంస గీతలో కలదు. సర్వమూ అ పరమాత్మయే. చంచలమైన మనస్సు లయించినచో అద్వైతస్థితి, నామరూపములు సర్వము

భ్రాంతియే. సమస్తము మనఃకల్పితమే. 'శశశృంగవత్', 'కుందేటి కొమ్మువలె' ఈ ప్రపంచము మిథ్య. కేవలాత్మ తప్ప అన్యమేమియు లేదు. "శ్రీకృష్ణఉద్ధవ సంవాదము" అస్మద్గురు పరంపరాగత భూమవిద్యాసర్వస్వంబు"అని కోవూరి పట్టాభిరామశర్మగారు వ్రాశారు. 'శ్రీధరీయ' వ్యాఖ్యను పరిశీలింపవలెను. భూమావస్థయే తురీయము. అదియే జీవన్ముక్తి. అట్టి వారి శివతుల్యులు-వారి ప్రవృత్తి కూడా నివృత్తిగా నుండును. వారికి జన్మకారణమైన మాయాబీజము నశించినది. శ్రీమదన్త అచలబోధసిద్ధాంత సద్గురు దత్తాత్రేయ పరంపరాచార్యులు ఎందరో. అందరికి వందనములు. "పాశబద్ధో భవేత్ జీవః। పాశముక్తో భవేత్ శివః। దృశ్యం సర్వం అనాత్మేతి నిశ్చిను"। ఈ ఏకాదశస్కంధ – ఆంధ్రానువాదకర్త – పట్టాభిరామశర్మగారు – తన గ్రంథ పీఠికలో – శేషాచల స్వామిని – నరసింహస్వామిని స్మరించాడు. స్తుతించాడు. మొదటి పద్యమున "చిన్మయుడైన పరమాత్మను" స్తుతించాడు. రెండవ పద్యమున కేవలాత్మ సుఖభాజనుడు నగు – ఋషిసత్తముని, బాదరాయణుని స్తుతించాడు. మూడవ పద్యమున అవధూత మూర్తియైన శుకుని నుతించాడు.

ఉ॥ వ్యాసమహర్షి సెప్పనిగమార్థమెఱింగి విరక్తి బ్రహ్మని
ష్ఠాసమదృష్టి గ్రుమ్మరుచుజ్ఞానసుధాప్రదుడై ముమూర్షుజి
జ్ఞాసు బరీక్షితున్ దయగాచిన యాయవధూతమూర్తిని
ర్త్రాసుశుకాఖ్యయోగివరుజయ్యనసన్నిధిసేయవేడెదన్.

శుకుడు అవధూత – సమదృష్టి కలవాడు – యోగివరుడు. దుఃఖరహితుడు – స్మర్తృగామి. జ్ఞానామృతప్రదుడు. "స్మర్తృగామియైన శుకుడు నా సన్నిధికివచ్చి, నన్ను – 'వానివలెనె' – భ్రమరకీటకన్యాయమున చేయవలెనని కవి కోరినాడు.

కవి పిమ్మట – ఆది గురువులను, తన విద్యాగురువును –బ్రహ్మవిద్యా గురువులను స్తుతించినాడు.

శా॥ ప్రీతిం గొల్చెద గృష్ణు నుద్ధవుని గోవిందాఖ్యు నారాయణున్
జేతోఽ౽ధిష్ఠితు వేంకటేశగురునిన్ శేషాచలాభిఖ్యు వి
ఖ్యాతుండౌ గురుసింహదేశికుని భూమాఖ్యానమౌ బ్రహ్మవి
ద్యాతత్త్వంబు నను(గ్రహించిన పరార్థంబౌ గురుశ్రేణినిన్.

"విద్యాగురువు – వేంకటేశుడు – బ్రహ్మవిద్యాగురువులు. శేషాచలస్వామి - నరసింహస్వామి. ఈ ఇరువురు (1840 –1900క్రీ.శ) చెన్నపట్టణములోను, మొదట – కందుకూరులోను కలరు. **'చెంచురాజు శిష్యులే. అచలామృత బోధకులే.'**

**అచలమార్గము :** దీనికే పూర్ణభావము - అజాతవాదము - కేవలాద్వైతము - పరిపూర్ణస్థితి - కేవలాత్మభావము - భూమవిద్య' అని పేర్లు. ప్రకృతిసంబంధమైనది సగుణబ్రహ్మము. ప్రకృతి తత్త్వమును అధిగమించియున్న, ఏకైకమైన - కేవలాత్మను పరిపూర్ణము అంటారు. రాకడ - పోకడ లేక సర్వకాల సర్వావస్థలలో సంపూర్ణముగా, శాశ్వతముగా నుండునది కేవలాత్మ. సర్వసాధనల గమ్యము అనేక జన్మల పూర్తి సాఫల్యత పరిపూర్ణమే. ప్రతి మానవుడు ఎప్పుడో ఒకప్పుడు పరిపూర్ణస్థితికి రావలసిందే. దీనినే ముక్తావస్థ అంటారు. నాదానుసంధానం ద్వారా యోగం సిద్ధిస్తుంది. "హంసఃసోఽహం" సోఽహం భావముతో పరమాత్మలో జీవుడు లీనమగును. "సోఽహం ఈశ్వరః చిదేకరసః" సోఽహం భావనోపాసనమత ఏవ" - ఇదియే సులభసాధనమార్గము - తారకమంత్రము.

యోగసాధనకు పూర్ణమైన శారీరక మానసిక శుద్ధి అవశ్యకము. తన్ను తాను నియంత్రించుకొన్నవాడే. **యోగి, ధీరుడు.**

"వికారహేతౌ సతి విక్రియంతే

యేషాం న చేతాంసి త ఏవ ధీరః" - కుమారసంభవం - కాళిదాసు.

భూమావస్థయే తురీయము. తురీయప్రాప్తియే జీవన్ముక్తి. "భూమైవ సుఖం" - ద్వైతబుద్ధి లేకుండ సచ్చిదానందస్వరూపులై తురీయావస్థలో నుండువారు **అవధూతలు** యాజ్ఞవల్క్యోపనిషత్తు - భిక్షుకోపనిషత్తులలో పేర్కొన్న అవధూతలు. సంవర్తక - ఆరుణి - శ్వేతకేతు - దూర్వాస - ఋభు - నిదాఘ - దత్తాత్రేయ - శుక - వామదేవ - హారీతక - జడభరతాదులు. శ్రీదత్తుడు - నారదుడు - వ్యాసుడు - శుకుడు - పవనాత్మజుడు - కార్తవీర్యుడు - గోరక్షకుడు. ఈ ఏడుమంది స్మర్తృగాములు అనగా స్మరించినవారి దగ్గరకు వచ్చెదరని పెద్దలవాక్యము.

1. బ్రహ్మ 2. వసిష్ఠుడు 3. పంచశిఖుడు 4. జనకుడు 5. శుకుడు 6. సాందీపని 7. శ్రీకృష్ణభగవానుడు 8. నరుడు 9. నృగుడు 10. దూర్వాసుడు 11. ఉద్ధవుడు - వీరందరు అద్వైత బోధకులు.

కేవలాత్మ తప్ప అన్యమేమియు తోచకుండుటే శూన్యము. పరిపూర్ణము -

1. ఆత్మైవ కేవలం సర్వం భేదాభేదో న విద్యతే 1 -4 అవధూత గీత
2. ద్వైతాద్వైతవివర్జితమ్ - 1-36
3. 7-13 అఖండితం అనా కారో వర్తతే కేవలః శివః

4. 1-26 ఆత్మన్యేవాత్మనా సర్వం త్వయా పూర్ణం నిరన్తరం।

5. 1-45 'బ్రహ్మైవ కేవలం సర్వం' 6. ఆత్మనైవాత్మనాఽత్మని।

**1. అవధూతగీత** 2. బృహద్ యోగవాసిష్ఠము 3. అష్టావక్రసంహిత - పూర్ణభావమును బోధించును.

యోగవాసిష్ఠము - ఉత్పత్తి ప్రకరణం - సర్గ - 2 శ్లో 97 -98

న ద్వైతం నైవ చాద్వైతం - న చ బీజం న చాంకురః।

న స్థూలం నచ వా సూక్ష్మం। - న జాతమ్ జాతమేవ చ॥

అవధూతగీత కర్త - దత్తాత్రేయుడు - అవధూత శిష్యులు - సంకృతి - పరుశురాముడు - యదువు - కార్తవీర్యార్జునుడు - పరశురాముని శిష్యుడు సంవర్తుడు - శివోఽహం, సోఽహం - దత్తోఽహం - మంత్రాక్షరములు - ఓం - హ్రీం - శ్రీం - సౌః -

"భేద - అభేద - భేదాభేదములు అను ఈ మూడూ లేని సమరసస్థితి జీవన్ముక్తి" 'జీవన్ముక్తగీత' అవధూత దత్తాత్రేయుడు తెల్పినదే.

శ్రీధరస్వామి - శివరామ దీక్షితులు. వీరి శిష్యులు ఎందరో? వారిలో రామకృష్ణయ్యగారు - శ్రీ వీరయ్యగారు - చెంచురాజుగారు (తంగెళ్ల గ్రామం - కందుకూరు తాలుకా) - వారి శిష్యులు కోటప్పదేవర - పోకల శేషాచల గురువు - వారి పుత్రుడు శిష్యుడు - నారసింహ గురుడు - వీరి శిష్యులు రంగయ్యగారు. ఈ నారసింహగురుని శిష్యులే శ్రీ కోవూరి పట్టాభిరామశర్మగారు. ఈ నారసింహ గురుని శిష్యులే అవనిగడ్డ ఎల్లమందయ్య స్వామి (వీరు క్రీ.శ. 1919 దేహమును త్యజించారు.)

1. అవనిగడ్డ ఎల్లమందయ్య స్వామి 2. అబ్దుల్ రజాక్‌స్వామి మరియు కవర్తపు చిన్నబ్బిస్వామి 3. కవర్తపు లక్ష్మీనరసింహంగారు వీరి శిష్యులు - ఎందరో - వారిలో - నడిపినేని సూర్యనారాయణ అని పిలువబడుతున్న నేను ఒకడను. 01-03-1980 పూర్ణిమ నాడు నాకు గురువర్యులు "హంసమంత్రము"ను ఉపదేశించి - దీక్షనొసంగినారు. హంసమంత్ర సాధన ముక్తికి మార్గమని, తెల్పి నన్ను కృతార్థుని చేసినారు. వారి బోధ శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదము - సుజ్ఞాన శాస్త్ర పద్య భావం.

1. పూరకమున "సో" వర్ణమును, రేచకమున "హం" అను వర్ణమును కూర్చి జపించవలెను. ఇదియే తారకమంత్రము. ముక్తి మార్గము.

1. శ్రీధర స్వామి (క్రీ.శ 1658) 2. శ్రీమత్ శివరామ దీక్షితులు క్రీ.శ 1690 -1791

వీరు అచలబోధ గ్రంథము వ్రాసి ఈ మతమును వ్యాప్తిచేశారు. దీనిపేరు శివరామదీక్షితీయము.

3. శ్రీ కంబాలూరి అప్పారావు 4. శ్రీ పరశురామ సీతారామప్రభువులు (1782 - 1854)

5. శ్రీ భాగవతుల కృష్ణ ప్రభువులు - అచల మార్గ గురువు. విరక్తులు.

1. శక్తి ద్వయ నిరాసకంబైన - శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థములు 2. కందార్థ దృష్టాంత ప్రకాశిక - అను రెండు గ్రంథములు వ్రాశారు.

6. శ్రీమత్ పీల్కానా శంకర ప్రభువులు

7. శ్రీ మాధవరాజు వేంకటేశ్వరదాసు

8. శ్రీ కొప్పరపు గోపాలకృష్ణ ప్రభువులు

వీరు 1. శివరామ దీక్షిత చరిత్ర 2. శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థానువాదము - మంజరీ ద్విపద - అను 2 గ్రంథములు వ్రాశారు.

9. శ్రీ కొప్పరపు వేంకటేశ్వరదాస ప్రసాదరావు

10. శ్రీ కొప్పరపు బాల మనోహరరావు -

వీరు ఇంజనీరు - ప్రస్తుతం కూకట్‌పల్లి హైదరాబాద్‌లో నివసిస్తున్నారు. శ్రీ మద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువుల ముఖ్య శిష్యులు శ్రీ ఆదిరాజు తిరుమలరావుగారు - వీరి గ్రంథములనుండి స్వామి బ్రహ్మానందగిరి మహరాజ్‌గారు వ్రాసుకొన్నారు. చెన్నపట్టణములో క్రీ.శ. 1850 - 1900 మధ్య నున్న నారసింహ గురుని శిష్యులు - శ్రీరంగయ్యగారు - వారి శిష్యులే స్వామి బ్రహ్మానందగిరిగారు - వీరు 20వ శతాబ్దిలో ప్రసిద్ధులైన అచల గురువులు - వీరి రచనలు - 1. అనుభవ వేదాంతము 2. సిద్ధాంత బిందువు 3. శుకాష్టకము 4. శుద్ధ నిర్గుణ కందార్థ దరువులు 5. శుక

జనక సంవాదము (అజాతవాదము) 6. అస్పర్శ యోగము 7. వేదాంత బాలబోధిని 8. శాంతి సోపానము 9. శ్రీ బ్రహ్మానంద గీతావళి.

బృహద్ యోగవాసిష్ఠ సిద్ధాంతమే అజాతవాదము. అచల పరిపూర్ణ మతము - కేవలాద్వైతము. - 'ఎఱుక'ను గురుబోధచే నిర్మూలనము చేసినచో మిగిలేది పరిపూర్ణమే.

**అచలమార్గ అనుయాయులు - వారి రచనలు**

1. శ్రీ వకుళా భరణం పరదేశి గురువులు - రచన - పరమాత్మ లక్షణబోధిని (అ)- **1924** ముద్రితము

1(బి) శ్రీమాన్ పోకల శేషాచలస్వామిగారి వేదాంతగ్రంథములు

1. అచల గ్రంథము 2. పరమపదమార్గము 3. సుజ్ఞానరత్నావళి 4. అచల సద్గురు కీర్తనలు 5. సుజ్ఞాన దీపము - అనుగురుగీతాలు 6. నిర్వచన స్వరదర్పణము 7. బుద్ధ్యుపదేశిని 8. ముక్తిప్రదాయిని - అను గురుశిష్య సంవాదము 9. కృష్ణబోధామృతము.

2. శ్రీ కోవూరి పట్టాభిరామశర్మగారు - అచల గురువు.

1. శ్రీమదాంధ్ర భాగవతము - ఏకాదశస్కంధము అచ్చు 1924 - ప్రబుద్ధాశ్రమం - నివాసం - కోవూరు (నెల్లూరు జిల్లా) - ఇతర రచనలు. 2. వివేక చూడామణి. 3. మహావాక్యదర్పణము 4. అపరోక్షానుభూతి 5. ఆత్మానాత్మ వివేకము - వచనం 6. పంచీకరణ వార్తికము 7. భగవద్గీతార్థమంజరి 8. సతీవిజయము - నాటకము. 9. శ్రీరామ శతకము. వీరి రచనల గూర్చి సమగ్ర, పరిపూర్ణమైన పరిశోధన చేయవలసి ఉంది.

3. బాలారాం పంతులు - రాయచూర్ జిల్లా - కేవలాత్మ శతకము.

4. ఎడ్ల రామదాసు - అఖిల రూపాత్మక శతకము

5. రఘుపతి రామమూర్తి - మనోన్మని శతకము.

6. పరమానంద యతి - శివముకుంద - దత్తాత్రేయ - గోపాల - సంపగిమన్న శతకములు - ఈ 'పరమానందయతి - పేరు గలవారు ఇరువురున్నారు.

7. ఆకుల గురుమూర్తి - 1. ఆత్మలింగ శతకము 2. రామతారక శతకము.

'అఖిల జీవసంగ ఆత్మలింగ' మకుటము.

"తాను తాన యనెడి తలపేమి లేకుండ
బట్టబయలు తనకు పట్టమాయె
కొలను విడిచి హంస గోతికి చేరునా"

ఈ బట్టబయలే - సత్తు - పరమాత్మ
- "తుదియు మొదలులేదు తుర్యంబుగాదు"
- "గురుతులేని బయలుగొనుట ప్రాప్తంబాయె"
- భ్రాంతులుడిగిన బ్రహ్మంబు బట్టబయలు.

8. శ్రీ తోట వేంకట నరసింహదాసు : రామరామ శతకము.
9. పరశురామ నరసింహదాసు - (క్రీ.శ 1820 - 60)
   భద్రాద్రి రామశతకము -
   అచలమార్గములో భక్తి భావనలు లేవు. అని కొందరు అంటారు. ఇది భ్రాంతితో అన్నమాట. - ఇది సద్గుణ నిర్గుణ ఉపాసనల సమ్మేళన మార్గము.
10. గోల్ల బుచ్చిరాజావధూత - పాపరాజ యోగిశతకము.
11. ముదినీడు జమలాపురి - అచలశతకము
    "వరద రామమూర్తిగారు (అచల పరిపూర్ణులు)" జమలాపురి గురువు.
12. విడియాల కుమారస్వామి - వీరశైవ శతకము. ఈయనకు 'బసవ' అనే పేరు.
13. బళ్ల వెంకయ్య - పరమపద పరిపూర్ణ శతకము.
14. గంగుల నారాయణరెడ్డి - వట్టి మాయ శతకము.
15. నిత్యానందయోగి - 1. దత్తాత్రేయ శతకము 2. అచల సిద్ధాంతము.
16. వెంకట రామకవి - అచల బోధామృతము
17. పరశురామ పంతుల బ్రహ్మానంద రాజయోగి. అద్వైత వేదాంత కవి 1. ముముక్షు జనచంద్రహాసము. 2. ఆత్మబోధ ప్రకరణ వ్యాఖ్య.
18. 'బ్రహ్మంగారి తత్త్వాలు'
19. వేమన పద్యాలు
20. దూదేకుల సిద్దప్ప - తత్త్వాలు

1. జనక - సులభ సంవాదము, శ్రీకృష్ణ బోధామృతము. ఈ వాదము బోధించే గ్రంథాలు ఇవి రెండు.
2. వీరబ్రహ్మంగారు (బ్రహ్మంగారి మఠం) - వీరి శిష్య ప్రశిష్యులు ఆంధ్ర దేశమునందే కాక చెన్నపట్టణ ప్రాంతమున, కన్నడరాజ్యము నందును కలరు.

ఆదవోని - (ఆదోని) లో "భోజరాజు" అనువారు (1850) ప్రసిద్ధులు.

"హంసమంత్రార్థరూపిణీ" అని లలితాత్రిశతిలో కలదు.

**ఈ 'హంసమంత్రమునుపాసించి, ఎందరో సిద్ధి పొందిరి.**

- ఏ తురీయావస్థలో రెండవది చూడబడదో, వినబడదో తెలుసుకోబడదో అదే భూమావస్థ. శ్రీదేవి భూమాస్వరూపము. అహం జీవాత్మను తెలుపును. సకారము పరమేశ్వర వాచకము. ఆ పరమేశ్వరుడనే నేను. సోఽహం మంత్రమే ఆత్మమంత్రము - 'అజప' - ఇది సంసార పాశములను త్రెంచును. "అజపేయా తతః ప్రోక్తా భవపాశ నికృన్తనీ" - **ఇదియే లయ యోగము.** - ఈ అచల మత బోధకుల రచనలను పరిశీలించుట - "ఆత్మ"యే తప్ప, ఇతరమేమియు లేదని "ఎఱుకను" నాశనము చేయుట పాఠకుల కర్తవ్యము.

ఈ 'భాగవత ఏకాదశస్కంధ' కావ్య పునర్ముద్రణ కావించు భాగ్యము నాకు కలిగినది. దాదాపు 26 యేండ్లకు పూర్వము 1986 -87లో దీనిని - 'వేంకటగిరి'లో గ్రంథాలయమునుండి గ్రహించి చదువుట జరిగినది. ఇది అలభ్య గ్రంథము - దీనిని పునర్ముద్రించిన - ఆంధ్ర పాఠకులకు సులభ గ్రాహ్యమగునని తలంచితిని. "దీనిలోని కొన్ని పద్యములను - మరల మరల పఠించితిని' ' 'మోక్షశాస్త్రము అగు ఈ గ్రంథమును ముద్రించి - గురు ఋణము తీర్చుకోవచ్చునని తలంచితిని. పూజ్యగురువులు - పండితులు - విద్వజ్జనులు - నన్ను అనుగ్రహించుదురుగాక'.

ఎందరో మహానుభావులు - అందరికి వందనములు.

ఇట్లు

**శ్రీ గురుభక్తుడు - 'మోక్షకాంక్షి' అపరోక్షానుభవి**

**నడిపినేని సూర్యనారాయణ**

కందుకూరు - 04-03-2013

1924లో ముద్రింపబడి

నేడు ప్రతులు అలభ్యమగుటచే

పునర్ముద్రణను చేపట్టిన డా॥ యన్.సూర్యనారాయణగారికి,

పీఠికను అందించిన శ్రీ గరిమెళ్ళ సోమయాజులుశర్మగారికి,

**శ్రీపుష్పగిరిపీఠ మహాసంస్థానమ్**

తరపున వెలువరిస్తున్న

**శ్రీశ్రీశ్రీ విద్యానృసింహభారతీస్వామివారికి**

నమస్కరిస్తూ

**- రా మో రా**

సంపాదకుడు

# పీఠిక

"క. పలికెడిది భాగవతమఁట
పలికించెడి వాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁట
పలికెద వేఱొండుగాథఁ బలుకఁగ నేలా".

ఇప్పుడు ముద్రితమై మనము చదువుచుండు శ్రీమదాంధ్ర మహాభాగవతమున నేకాదశస్కంధమున్నది గదా. మఱల నదియేల తెనిఁగింపవలసి వచ్చెనని చదువరులు తలంప వచ్చును. ఆ సందర్భము వివరింపవలసియున్నది.

శ్రీ మహాభాగవతమును బమ్మెర పోతనామాత్య మహాకవి దాదాపుగ నాఱువందలయేండ్ల క్రిందట సలక్షణముగ నాంధ్రీకరించి యుండుటయు నాంధ్రుల దురదృష్టవశమున నందు మఱికొన్ని భాగములతోడ నా యేకాదశస్కంధము శిథిలమై యదియు ద్వాదశస్కంధమును వెలిగందల నారయచేతను కొంత గంగనచేతను మఱికొంత సింగనచేతను నాంధ్రీకరింపఁబడి పోతన గ్రంథము పూర్తిసేయఁబడి యుండుటయు గ్రంథమువలనను నైతిహ్యమువలనను నందఱకును విదితమే.

సంస్కృత పండితులకు నీయాంధ్రగ్రంథముతో నక్కఱలేమినిఁగేవలాంధ్ర భాషాభిజ్ఞులకు సంస్కృతమూలగ్రంథార్థమవిదితమగుటను నీయుభయ భాషా ప్రావీణ్యముగల పెద్దలుపేక్షించుటను నీనారయయాంధ్రీకరణము మూలానుసారమా కాదా యను విషయము బయలుపడకుండె.

ముద్రితాంధ్రమహాభాగవతగ్రంథమువలన దశమస్కంధోత్తరభాగమున 235 వ పద్యము నాల్గవపాదము నుండి గ్రంథము వెలిగందల నారాయణ కవివిరచితమని యేర్పడుచున్నదిగాని దశమస్కంధోత్తరభాగగద్యమునం దాభాగము పోతనామాత్య విరచితంబనియే యున్నది. ఏకాదశద్వాదశస్కంధ గద్యలయందు మాత్రమా స్కంధములు పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారాయణ నామధేయ ప్రణీతంబు అని యున్నది. ఇందువలనను గవనవైఖరింబట్టియు నీ రెండు స్కంధములు మాత్రము పూర్తిగా నారయరచితములనియు దశమస్కంధో త్తరభాగమున నీనారయ రామబాణము పురుగులు గొట్టిన పోతరాజుగారి గ్రంథములో నేవియైనఁ గొన్ని చోటుల మాత్రము సవరించియుందురని

యుండోచెడిని. మఱియు నీయాంధ్రభాగవతమహాకృతి శిథిలమయ్యెనను దుఃఖమున నప్పటి వారికిఁదెగినచెఱువు గండింబూడ్చు వారికింబలె నీ మొండివడినకృతి నెట్లయినంబూర్తిగావించి గ్రంథము నుద్ధరించినం జాలునని యాతురత యుండెంగాని యాపూరణముమూలసారమా కాదా యనువిచార మంతగా గలిగినట్టు చూపట్టదు. ఈవలివారన్నో పూర్వోదాహృత హేతువువలనను గద్యమునందలి 'పోతనామాత్య ప్రియశిష్య'యను మాటలవలనను నీ తెనిఁగింపు పోతనకవితంబోలియే యుండునని నమ్మినట్లున్నది.

ఈ నారయ్య పోతన ప్రియశిష్యుఁడనుటవలన నీయన పూరణము పోతనకాలమునకు సమీపముగ నేయుండి యుండుంగాన నప్పటి నుండియు దీనినెవ్వరును మూలముతోఁబోల్చి చూడకుందురా యనునది విచారింపఁదగిన యంశము. కొన్ని యేండ్ల క్రిందట మాయింటనున్న తాళపత్ర గ్రంథములలో నొక యేకాదశ ద్వాదశస్కంధముల తెనుఁగు గ్రంథము నేఁజూచియుండితి. అది నారయకృతిగాదు. ఎవ్వరిదో చెప్పజాల. అది గ్రామము పరశురామప్రీతియైనప్పుడు పోయినది. నారయకృతి మూలమునకు సరిగాదని నేఁగనుఁగొన్న పిదప దానిందలఁచి యీలోపము నరసి కనుంగొనిన యెవ్వరో దానిని వ్రాసియుందురని యిప్పుడు నాకు తట్టినది. ఆంధ్రపత్రికలో నొకహరిభట్టు వ్రాసిన యేకాదశ స్కంధములోని పద్యములని రెండు మూఁడు ప్రచురింపఁబడియుండుట నేనొక్కప్పుడు చూచియుండి యాగ్రంథము కొఱకు విచారించితి. అది చిక్కదయ్యె. చెన్నపురి ఓరియంటల్ లైబ్రరిలో నుండు నొక ఉద్యోగి నాతో నట్టిదొకటి లైబ్రరిలోనున్నదనియు నదియు నారయకృతింబోలియే యున్నదనియుంజెప్పె. అంత దానియాసయు మానితి.

శ్రీ మహాభాగవతసారమగు నీస్కంధమిట్లు వికృతాకారమును బొందియుంటను దివ్యమగు పోతనామాత్య కృతికిది తీరని కళంకమగుటను విద్యా సంప్రదాయమునకు దీనన్నుప్పు వాటిలుటనుం జూచి సహింపఁజాలక నేనీపనిఁబూనితి. దీని నిర్విఘ్నపరిసమాప్తికి నీశ్వరానుగ్రహమే సాధనము మఱియొండుగాదు.

మఱియు విద్వత్కవివరేణ్యులు మహామహోపాధ్యాయాది వివిధ బిరుదప్రశస్తులు నగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు దయచేసి బహు ఓపికతో నీ కృతిని సాంతముగా విని యానందించిరి.

కావున లోకోపకృతి నుద్దేశించియు శ్రీమదాంధ్రభాగవతము కొఱంతదీనఁ గొంతవఱకు దీఱుననియెంచియు దీని ముద్రింపించి ప్రచురింపఁదలంచితి.

ఇఁక నారయ గ్రంథము మూలానుసారి గామి యెట్లో సదృష్టాంతముగఁ జూపకున్న నీ పీఠిక చదువరులకు సంతుష్టి నీఁజాలదు. వివరముగ వ్రాయఁ బూనిన నిదేయొక్క గ్రంథమగుంగాన సంగ్రహముగా నొక్కింతయే వ్రాసెద.

ఈ యేకాదశస్కంధము సంస్కృతమున 1323 శ్లోకములుగల 31 యధ్యాయముల గ్రంథము. ఇందుఁగథ బ్రహ్మప్రాప్తి సాధనవిశేష వివృతిమణిమాలకు సూత్రమాత్రయై యాద్యంతముల నించుక చూపట్టుచున్నది. అది మొదల ముసలోత్పత్తియుఁజివరను యదుక్షయ భగవన్నిర్యాణవర్ణనములు మాత్రమే. ఇది మూఁడధ్యాయములే. తక్కిన యిరువదియెనిమిది యధ్యాయములును వసుదేవనారద సంవాదమును శ్రీ భగవదుద్ధవోపదేశమునై సమగ్రమగు నాత్మ విచారమైయున్నది. ఇంత గ్రంథమును నారయ కృత్యాద్యంత పద్యగద్యములు నాలుగుంగాక 48 కందములు 9 గీతములు, 10 సీసములు 9 వృత్తములు 47 వచనములు గలిసి నూటయిరువదిమూఁడింటితో ముగించినాఁడు. ఇందు 10 వచనములు సంధి వాక్యములను దక్కినవి తఱుచుగా స్వేచ్ఛానుసారముగ నారయ్యగారు చేసిన యమూలక దీర్ఘవిశిష్టాద్వైత మతోపన్యాసములు.

విమర్శించి చూచినచో నారయ యాంధ్రీకరణమున కాపేరే తగదు. ఏలయన నందు

1. మూల గ్రంథమును దిగ వేయుట.

2. మూల గ్రంథముననే లేని విందు జేర్చుట.

3. మూలగ్రంథ భిన్నముగా దానికిఁదెలుఁగని వ్రాయుటయను దోషములు నిండియున్నవి. ఇందులకు వారి గ్రంథము నుండి యుదాహరణము లొకకొన్నింటి నీక్రిందఁ గనఁబఱిచెద. విజ్ఞులు వీరి కృతిని మూలముతో బోల్చి చూచి సంతుష్టి నొందుదురుగాక.

1. మూల గ్రంథమును దిగవేయుటకు

"వ. అనినఁ గృష్ణుండు నాలుగు వర్ణంబుల యుత్పత్తియు నాలుగాశ్రమంబుల కిట్టిట్టి వర్ణంబులనియును నాలుగు వేదంబులంజెప్పిన ధర్మంబులను బ్రవృత్తి నివృత్తి హేతువుగు పురాణేతిహాసశాస్త్రంబులను వైరాగ్య విజ్ఞానంబులను నివి మొదలుగాఁ

గల వన్నియు నెఱిగించి (అమూలకోపన్యాసము) "శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" యను నుపనిషత్తుల్యంబగు గీతావచన ప్రకారంబున నెవ్వఁడేనియు నా యందు మతిగలిగి వర్తించు వాఁడు నేనని పలుకంబడుఁ బెక్కువిధంబుల వాదంబులేల యని యెందునుం దగులువడక నా మీఁద దలంపుగలిగి వర్తింపుమనిన నుద్ధవుండిట్లనియె". 106

అను వచనము వైఖరియే నిదర్శనము. మరియు నిందువలన భిక్షుగీత ఐళగీత మున్నగు కథాభాగములను విద్యావిచారములెల్లను దిగవేయఁబడినవని తెలియవచ్చు. చూచుకొలంది నిట్లే గ్రంథమెల్ల లోపించి యుండుట తెల్లంబగు.

2. మూలగ్రంథముననే లేని విందుఁ జేర్చుటకు

"క. గర్భమునఁ బరిజ్ఞానము
నిర్భరమైయుండు జీవు నికిఁ దుది నతఁడా
విర్భూతుఁ డైనఁ జెడు నం
తర్భావంబైన బోధ మంతయు ననఘా" 109

ఈ పద్యార్థ మమూలక మగుటట్లుండ నిందలి నాలుగవ పాదము యతిభంగమునకు నుదాహరణమై యున్నది. ఇన్నియేల? తఱచుగా నీయన వచనంబులన్నియు నిట్టి స్వమతి పరికల్పితములే. అందును 104వ వచనమును జూడ నీకవి యమూలకములగు 'హరిదివ్యనామధారణము', 'ముద్రాధారణము' సైతము దనగ్రంథమునం జొనిపి తన విశిష్టాద్వైతమతాచారాభిమానావేశమును వెల్లడించుచు నాయావేశమున దనకిష్టమైన దేదేని విశృంఖలముగా వ్రాసెనని తేటపడు.

3. మూలగ్రంథ భిన్నముగా దానికిఁ దెలుఁగని వ్రాయుటకు

మూలము. శ్లో॥ సర్వభూతేషు యః పశ్యేద్భగవద్భావమాత్మనః
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః

అ. 2, శ్లో. 45

తెనుఁగు. తే.గీ. సర్వభూత మయుండైన సరసిజాక్షుఁ
డతఁడె తన యాత్మయందుండు ననెడువాఁడు
శంఖచక్రధరుండగు సాధుజనుఁడు

(శంఖచక్రధరుండంచు జనెడువాఁడు అని పాఠాంతరము)

భక్తిభావాభిరతుఁడు వో భాగవతుఁడు 46

ఇందల కిందుల ప. 81 చూడుఁడు.

తే.గీ. అఖిలభూతంబు లందుండు నాత్మఁ దతఁడె
బ్రహ్మమనియునునాపర బ్రహ్మమందు
నఖిల భూతంబు లారోపి తాకృతులని
పరగఁ గనువార లుత్తమ భాగవతులు.

మూలము. శ్లో॥ నయస్య జన్మకర్మభ్యాం నవర్ణాశ్రమజాతిభిః।
సజ్జతే2స్మిన్నహంభావో దేహే వై స హరేః ప్రియః

అ. 2,శ్లో.51

తెనుఁగు. క. వర్ణాశ్రమధర్మంబుల
నిర్ణయకర్మములఁజెడక నిఖిలజగత్సం
పూర్ణుఁడు హరియను నాతఁడె
వర్ణింపఁగ భాగవతుఁడు వసుధాధీశా. 47

ఇందుల కిందలి ప. 87 చూడుఁడు.

తే.గీ. జన్మకర్మవర్ణాశ్రమ జాతిసంగ
మెవనికిది నాయది యటంచు నెపుడుఁగలుగ
దీతనువుఁదాననచు నెవ్వఁ డెపుడునెంచఁ
డతఁడె భగవత్ప్రియుండు ధన్యాత్ముఁడవని.

మూలము శ్లో॥ పరస్య విష్ణోరీశస్య మాయినామపిమోహినీమ్।
మాయాం వేదితుమిచ్ఛామో భగవంతో బ్రువంతునః॥.

అ.3, శ్లో.1

నానుతృప్యే జుషన్ యుష్మద్వచో హరికథామృతమ్।
సంసారతాపనిస్తప్తో మర్త్యస్తత్తాపభేషజమ్॥

అ.3, శ్లో.2

తెనుఁగు. క. గజరాజవరదు గుణములు
త్రిజగత్పావనములగుటఁ దేటపడంగా
సుజనమనోరంజకముగ
విజితేంద్రియ వినఁగ నాకు వేడుకపుట్టెన్. 49

ఇందుల కింది ప. 93 - 94 చూడుఁడు.

తే.గీ. మాయికులఁగూడ మోహింపఁ జేయునట్టి
మాయయాథార్థ్య మెఱుఁగ మా మానసముల
నిచ్చ జనియించెఁబరమ మౌనీంద్రులార
దానిఁదెల్పుఁడు మేమది దాఁటుకొఱకు. 93

ఉ. దారుణమైనసంసరణ తాపముచేఁబరితప్తుఁడన్ మహా
ఘోరకరాళమృత్యుముఖకూపనిపాతవిభీతచిత్తుఁడన్
దారిపుడిచ్చు శ్రీహరి కథాసుధ మత్పరితాపభీతిని
స్తారకమెంత ద్రావినను జాలదు నాకు మఱింతగోరెదన్. 94

మూలము శ్లో. నిర్గుణే కేవలే సాక్షాదాత్మనో యద్విపర్యయః।
సైషా భగవతో మాయా యయేదం నిర్మమే విభుః॥

అ. 3, శ్లో. 3

తెనుఁగు. క. పరమబ్రహ్మ మనంగాఁ
బరతత్త్వమనంగఁ బరమపదమనఁగను నీ
శ్వరుఁడనఁ గృష్ణుఁడన జగ
ద్భరితుఁడు నారాయణుండు దా వెలుగొందున్.

51

ప. అవ్యక్త నిర్గుణ పరబ్రహ్మంబు నందుఁ దనకు విపర్యయంబుగా జననంబైన జ్ఞానంబె విష్ణుమాయ యనంబడుఁ బరమేశ్వరుం డట్టి మాయచేతజగంబు నిర్మించి నిశ్చింతుండై యుండు. 52

ఇందులకు నిందలి వ65 చూడుఁడు.

వ. అనిన విని యంత దక్షుండను ముని హర్యక్షుండిట్లనియె. నిర్గుణాద్వితీయ నిరాభాసంబగు పరబ్రహ్మంబునందు స్వరూపవిపర్యయంబగు సగుణత్వసద్వితీయత్వ సాభాసత్వంబులు ప్రత్యక్షంబుగా నెద్దానివలనందోఁచు నయ్యదియె మాయ. దీనిచే నీశ్వరుండీప్రపంచంబు నంతయును సృజియించె. ఇదియు మాయా కార్యంబగుట జాగ్రత్స్వప్నసుషుప్తి ప్రతీతిరూపంబున మిథ్యయైయుండు. 53

మూలము. శ్లో. ఇంద్రియార్థభ్రమో జాగ్రత్స్వప్నోఽ ంతఃకరణ భ్రమః।
సుప్తం తద్వాసనాబీజం తుర్యామూర్తి స్తదన్వితః॥

- అ3శ్లో4

తెనుఁగు. వ.... ఇంద్రియార్థ భ్రమణంబు సేసెడు దుర్మతులకు సుషుప్త్యాద్యవస్థలు వరుసన కలుగుటంజేసి పరమేశ్వరునిం బొందరామియను నాలుగవ యవస్థయుఁ గలుగు ................ 55

ఇందులకు నిందలి ప96 చూడుఁడు.

చ. మెలఁకువ యింద్రియార్థముల - మిథ్యల సత్యములంచుఁ జూచుటే
కలయగు మానసోద్ధత వి - కల్పములన్ నిజమంచునెంచుటే
బలితపు నిద్ర యాయుభయ - వాసనలెందు విలీనమౌ నదే
యలత్రితయంబులోఁ గలిసి - యంటక వెల్గుఁదురీయమారయన్ 96

విస్తరంబేల? ఈయన గ్రంథంబంతయు నిట్లేయుండు. ఇట్లగుట వేదాంత భాగమేకాదు. కథాభాగమున సైతము వీరి కల్పన కడ్డములేదు. ముసలము పుట్టినవార్త యదు బాలకులు శ్రీకృష్ణున కెఱింగించినట్లు వ్రాసినవాఁడు. ఆ ముసలము నినుప పొన్ను వేసిన చందనపు రోకలినిగాఁ నీతడెంచినట్లీయన వ్రాసిన "తత్కీలితంబైన లోహ ఖండంబును" అను మాటలవలనఁ దెలియఁగలదు. మూలమున నీవిషయమెట్లున్నదో చూడుఁడు.

శ్లో. తే తచ్ఛ్రుత్వాతిసంత్రస్తా విముచ్య సహసోదరమ్।
సాంబస్య దదృశుస్తస్మిన్ ముసలం ఖల్వయస్మయమ్॥ అ.1శ్లో 15
తం చూర్ణయిత్వా ముసలం యదురాజస్సఆహుకః।
సముద్రసలిలే ప్రాస్యల్లోహం చాస్యావశేషితమ్॥ అ 1 శ్లో. 20

మఱియు భగవన్నిర్యాణకథ యందు

శ్లో. ముసలావశేషాయః ఖండకృతేషుర్లుబ్ధకోజరాః।
మృగాస్యాకారచరణం వివ్యాధ మృగశంకయా॥
చతుర్భుజం తం పురుషం దృష్ట్వా స కృతకల్బిషః।
భీతః పపాతశిరసా పాదయోరసురద్విషః॥
అజానతా కృతమిదం పాపేన మధుసూదన।
క్షంతుమర్హసి పాపస్య ఉత్తమశ్లోక మే ప్రభో॥
యస్యానుస్మరణం నృణామజ్ఞానధ్వాంతనాశనం।
వదంతి తస్య తే విష్ణో మయాసాధుకృతః ప్రభో॥
తన్మామ్ముజ్జహి వైకుంఠ పాప్మానం మృగలుబ్ధకం।
యథా పునరహం త్వేనం కుర్యాం సదతిక్రమం॥
యస్యాత్మయోగ రచితం న విదుర్విరించో।
రుద్రాదయోఽస్య తనయాః పతయో గిరాం యే॥
యన్మాయయా పిహితదృష్టయ ఏతదంజః।
కిం తస్య తే వయ మసద్గతయో గృణీమః॥
శ్రీకృష్ణః. మాభైషీ ర్జర ఉత్తిష్ఠ కామ ఏష కృతో హి మే।
యాహి త్వం మదనుజ్ఞాతస్స్వర్గం సుకృతినాం పదమ్॥
శ్రీశుకః. ఇత్యాదిష్టో భగవతా కృష్ణే నేచ్ఛా శరీరిణా।
త్రిః పరిక్రమ్య తం నత్వా విమానేన దివం యయౌ॥

అ.30శ్లో33.40

అని మూలమున నుండ నీకవి దీనికిఁ దెనుఁగని

వ..... ఒక్క లుబ్ధకుండు మృగయార్థంబుగా వచ్చి దిక్కులు నిక్కి నిరీక్షించుచుండ వృక్షంబు చాటున నప్పరమపురుషుని చరణ కమలంబు హరి (ణ?) కర్ణంబుగా బోలునని దానింగని శరంబు శరాసనంబు నందు సంధానంబు చేసి యేసిన నతండు హాహారవంబునం గదులుచ్చుండ నప్పరమేశ్వరుని సన్నిధానంబునకు వచ్చి జగన్నాథుంగాఁ దెలిసి భయంబున మహాపరాధుండను బాపచిత్తుండను గుటిల ప్రచారుండ నని యనేక విధ దీనాలాపంబులం బలుకుచు బాష్పజలధారాసిక్త

వదనుండైన సరోజనేత్రుండు వానింగరుణించి యిట్లనియె. నీవేల జాలింబడెదు పూర్వజన్మ కర్మంబు లెంతవారికైన ననుభావ్యంబు లగుంగాని యూరక పోవనేరవు. నీవు నిమిత్తమాత్రుండ వింతియె కాని యని వానికిం దెలిపిన వాడును మహాపరాధులైన వారూరక పోవరు దేవ గురు వైష్ణవ ద్రోహులకు నిలువ నెట్లగునని పవిత్రాంతఃకరణుండై ప్రాయోపవేశంబునం బ్రాణంబులు వర్జించి వైకుంఠ పద ప్రాప్తుండయ్యె నప్పుడు. 117

అని తనకుఁ దోఁచినట్లు వ్రాసినాఁడు అవ్వలి యధ్యాయమున నీ బోయవానిం గుఱించి "స్వరసయన్మృగయుం సదేహం" అని యుండుటయు నీకవి చూడఁ డయ్యె.

ఇందులకు నిందలి. ప 985 – 990 చూడుఁడు.

తే.గీ. ఉక్కరోఁకఁటిఁ జాదఁగా – నున్న తునుక
ములికిమొనఁ జెక్కి జరుఁడను – బోయ వచ్చి
యచట హరిణాస్యమట్లున్న – హరి చరణము
మృగమని తలంచి యాముల్కి – నేసె దాని. 985

తే.గీ. ఏసి దగ్గఱి యాబోయ – హృదయ మెఱియఁ
గనెఁ జతుర్భుజుఁ బురుషవ – ర్యునిఁ బరేశు
నంతఁ గృతకిల్బిషుఁడు భీతుఁ – డై యతండు
హరిపదంబులు దనశిరం – బానఁ బడియె. 986

సీ. పడిమ్రొక్కి లేచి నేఁ – బాపుఁడఁ దెలియక
యిట్లు నేసితిఁ గావ – వే మహాత్మ
పాపుఁడ నగు నాదు – పాశంబు మన్నింప
నీకెయౌ నుత్తమ – శ్లోక దేవ
యెవనిఁ దలంప మా – నవుల యజ్ఞానత
మంబు మాయునటంచు – మహితులందు
రట్టి మహావిష్ణు – వగు నీకు నపకృతి
సేసితి మృగముల – నేసి బ్రతుకు

తే.గీ. పాపజీవనుండను నన్నుఁ - బావనునిఁగ
మనుపు వైకుంఠ సదత్రిక - మంబు నిట్లు
మఱల నేఁజేయకుండ నా - మతిని దిద్దు
దేవ నీకన్న నాకింక - దిక్కులేదు. 987

సీ. స్వాధీనమాయుండ - వగు నీదు రచన బ్ర
హ్మాయును రుద్రాదు లై - నట్టి యతని
తనయులు మఱియు వే - దద్రష్ట లెఱుఁగరు
మాయావృతంబు త - దీయ దృష్టి
యట్టి నీవు రచించి - నట్టి బ్రాహ్మణ శాప
తదనర్థము లివెల్ల - మది నెఱుంగ
నెవనికి వశ మీశ్వ - రేశ్వర పాపజ
న్ములమైన మేము ని - న్నొగడఁ గలమె

తే.గీ. యనుచు నాబోయ వేఁడిన - హరియు జరుఁడ
భయపడకు లెమ్ము నేనె కా - వలయు ననుచు
నిట్లు చేసితి మదనుజ్ఞ - నేఁగు సుకృతు
లరుగు స్వర్గంబునకు నని - యానతిచ్చె 988

వ. అని శుకుండు మఱియు నిట్లనియె. 989

తే.గీ. ఈవిధంబున నిచ్ఛాగృ - హీత దేహుఁ
డైన శ్రీకృష్ణ భగవంతుఁ - డానతీయ
నలరి మువ్మాఱు వలగొని - హరికి మ్రొక్కి
యేఁగె జరుఁడు విమానంబు - నెక్కి దివికి. 990

పిమ్మట అ 30 శ్లో 41 -50

శ్లో. దారుకః స్వర్గ పదవీమన్విచ్ఛన్నధిగమ్య తామ్
వాయుం తులసికామోదమాఘ్రాయాభిముఖం యయౌ।
తం తత్ర తిగ్మద్యుభిరాయుధైర్వృతం
హ్యశ్వత్థమూలే కృతకేతనం పతిమ్।

స్నేహప్లుతాత్మా నిపపాత పాదయో
రథాదవప్లుత్య స బాష్పలోచనః॥

దారుకః. అపశ్యతస్తే చరణాంబుజం ప్రభో
దృష్టిః ప్రణష్టాతమసి ప్రవిష్టా।
దిశో న జానే న లభేచ శాంతిం
యథా నిశాయాముడుపే ప్రణష్టే॥
ఇతి బ్రువతి సూతే వై రథో గరుడలాంఛనః।
ఖముత్పపాత రాజేంద్ర సాశ్వధ్వజ ఉదీక్షతః॥
తమన్వగచ్ఛన్ దివ్యాని విష్ణుప్రహరణాని చ।
తేనాతివిస్మితాత్మానం సూతమాహ జనార్దనః॥

శ్రీభగవాన్. గచ్ఛ ద్వారవతీం సూత జ్ఞాతీనాం నిధనం మిథః
సంకర్షణస్య నిర్యాణం బంధుభ్యో బ్రూహి మద్దశామ్॥
ద్వారకాయాం చ న స్థేయం భవద్భిశ్చ స్వబంధుభిః।
మయా త్యక్తాం యదుపురీం సముద్రః ప్లావయిష్యతి॥
స్వం స్వం పరిగ్రహం సర్వమాదాయ పితరౌ చ నః।
అర్జునేనావితాస్సర్వ ఇంద్రప్రస్థం గమిష్యథ॥
త్వం తు మద్ధర్మమాస్థాయ జ్ఞాననిష్ఠ ఉపేక్షకః।
మన్మాయారచితామేతాం విజ్ఞాయోపశమం వ్రజ॥

శ్రీశుకః. ఇత్యుక్తస్తం పరిక్రమ్య నత్వా కృష్ణం పునః పునః।
తత్పాదౌ శీర్ష్ణ్యుపాధాయ దుర్మనాః ప్రయయౌ పురీమ్॥

అనియుండు మూలమునకు నీకవి తెనుఁగని

క. దారుకుఁడు గనియె నంతట
సారనిరూఢావధాను సర్వజ్ఞు హరిన్
మేరు నగధీరు దనుజ వి
దారుని నేకాంతపరుని దద్దయునెమ్మిన్. 118

వ. కని యత్యంత భయ భక్తి తాత్పర్యంబుల ముకుళితకరకమలుండై యిట్లనియె 119

తే. నిన్నుజూడని కన్నులు నిష్ఫలములు
నిన్నునుడువని జిహ్వాదానీరసంబు
నిన్నుగానని దినములు నింద్యములగుఁ
గన్నులను జూచి మమ్మును గారవింపు. 120

వ....అనుచు నాదారుకుండు నిర్వేదనపరుండై యిట్లని విన్నవించె. యాదవ సముద్రం బడంగె. బంధు గురు మిత్ర జనంబు లక్కడక్కడంబోయిరి. ద్వారకకుం బోయి సుహృజ్జనంబుల తోడ నేమందునని పలుకు నవసరంబున దివ్యాయుధంబులు దివ్యరథరథ్యంబులును నంతర్ధానంబు నొందె. నారాయణుండు వానితో నక్రూర విదురులకు నీ వృత్తాంతం బంతయుఁ జెప్పుము. సవ్యసాచింగని స్త్రీబాల గురువృద్ధజనుంబులఁ గరిపురంబునకుంగొని చనుమనుము పొమ్మనినవాఁడును మఱలిచని కృష్ణునివాక్యంబులు సవిస్తరంబుగాఁజెప్పె నట్లు చేయు నాలోన ద్వారకానగరంబు పరిపూర్ణజలంబై మునింగె నంత నెవ్వరికిం జనరాకయుండె..
121

అని వ్రాసియున్నాఁడు.

ఇందులకు నిందలి. ప. 991 - 998 చూడుఁడు.

సీ. అంత దారుకుఁడు గృ - ష్ణా న్వేషణముసేయు
చును వెస సాశ్వకే - తనము రథముఁ
గొనివచ్చువాఁడు గా - లిని దులసీగంధ
మొదవ మూర్కొని దాని - కెదురు నడచి
యట భగవంతు దీ - ప్తాయుధావృతుఁ బిప్ప
లాగమూలస్థితు - నధిపుఁ జూచి
స్నేహంబుచే నెద - నీరయి యరదంబు
వెస డిగ్గి కన్నుల - వేఁడి నీరు
తే.గీ. జాలుగాఁ దత్పదద్వయి - వ్రాలి దేవ
నీ పదాబ్జముఁ గనని నా - పాప నయన

ములకుఁ జీఁకటి గ్రమ్మె ది - క్కులును నెఱుఁగఁ
జందురుఁడు లేని రాతిరి - చందమయ్యె. 991

మ. అని సూతుండు గలంగి పల్కునెడ ది - వ్యంబై గరుత్మత్పతా
కను వెల్గొందుచు నున్న తేరెగసె నా - కాశంబున న్సాశ్వకే
తనమై దానిని వెన్కొనె న్వెలుఁగుచున్ - దైత్యారి దివ్యాయుధా
ళి నిజాత్మన్వెలుఁగందు దీని గని జా - లింబొందు నాసారథిన్ 992

చ. కని హరివల్కె సూత చను - గ్రక్కున ద్వారక కీవు జ్ఞాతు ల
ల్కను దముఁదామె చంపుకొని - కాలగతిం జనిరంచు రాముఁడుం
దనువుఁ ద్యజించె నేను నది - త్యాగమొనర్పఁగ నున్నవాఁడ నం
చును నెఱిగింపు బంధువులఁ - జూచి విషాదమునొందఁబోకిఁకన్993

తే.గీ. వారితో నను మీరు మీ - బంధువులను
ద్వారకాపురి నిఁక నుండఁ - దగదు నేను
దాని విడువఁగనే సము - ద్రంబు పొంగి
ముంచు నవ్వీటి నని తరలించు వారి. 994

తే.గీ. చెపుము విజయుఁడు దమ్ము ర- క్షించుచుండఁ
దమతమ పరిగ్రహంబు భ - ద్రముగఁ గొనుచు
వారు మాతలిదండ్రులున్ - సేరవలయు
నెల్లవారు నింద్రప్రస్థ - మిపుడె యనుచు. 995

తే.గీ. దారుకా పూను నీవు మ - ద్ధర్మనిరతి
జ్ఞాననిష్ఠను జేసి దృ - శ్యం బుపేక్ష
సేయు మిదియెల్ల నయ్యె నా - మాయ ననుచుఁ
దెలియుచు విరక్తినొంది శాం - తిని వహించు. 996

వ. అని శ్రీకృష్ణదేవుం డానతిచ్చెనని శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. 997

తే.గీ. ఇట్లు హరి పల్క దారుకుం - డెద సఖేద
భక్తితో స్వామి వలగొని - ప్రణతులెన్నొ

చేసి తత్పాదయుగ మాత్మ - శిరముఁ జేర్చి
పొక్కుచును లేచి ద్వారకా - పురికిఁ జనియె. 998

శ్రీభగవన్నిర్యాణ వర్ణనంబును.

శ్రీశుకః. అథ తత్రాగమద్బ్రహ్మా భవాన్యా చ సమం భవః।)
మహేంద్రప్రముఖా దేవా మునయస్సప్రజేశ్వరాః॥
పితరస్సిద్ధగంధర్వా విద్యాధర మహోరగాః।
చారణా యక్షరక్షాంసి కిన్నరాప్సరసో ద్విజాః॥
ద్రష్టుకామా భగవతో నిర్యాణం పరమోత్సుకాః।
గాయంతశ్చ గృణంతశ్చ శౌరేః కర్మాణి జన్మ చ॥
వవృషుః పుష్పవర్షాణి విమానావళిభిర్నభః।
కుర్వంత స్సంకులం రాజన్ భక్త్యా పరమయా యుతాః॥
భగవాన్ పితామహంవీక్ష్య విభూతీరాత్మనో విభుః।
సంయోజ్యాత్మని చాత్మానం పద్మనేత్రే న్యమీలయత్॥
లోకాభిరామాం స్వతనుం ధారణాధ్యానమంగళమ్।
యోగధారణయాగ్నేయ్యా దగ్ధ్వా ధామావిశత్స్వకమ్॥
దివి దుందుభయో నేదుః పేతుస్సుమనసశ్చ ఖాత్।
సత్యం ధర్మో ధృతిర్భూమేః కీర్తి శ్శ్రీశ్చాను తంయయుః॥
దేవాదయో బ్రహ్మముఖ్యా న విశంతం స్వధామని॥
అవిజ్ఞాతగతిం కృష్ణం దదృశుశ్చాతివిస్మితాః॥
సౌదామన్యా యథాకాశే యాంత్యా హిత్వాభ్రమండలమ్।
గతిర్న లక్ష్యతే మర్త్యైస్తథా కృష్ణస్య దైవతైః॥
బ్రహ్మరుద్రాదయ స్తేతు దృష్ట్వా యోగగతిం హరేః।
విస్మితాస్తం ప్రశంసంతః స్వం స్వం లోకం యయుస్తదాః॥

అ.31. శ్లో. 1 -10

అని మూలమున నుండఁగా నీకవి దీనికిఁ దెనుఁగని తన గ్రంథమున

...అప్పరమేశ్వరుండును శతకోటిసూర్యదివ్యతేజోవిభాసింతుడై వెడలి నారదాది ముని గణంబులును బ్రహ్మరుద్రాది దేవతలును జయజయ శబ్దంబులతోడం గదలిరా నిజపదంబున కరిగె నన్నారాయణ విగ్రహంబు జలధిప్రాంతంబున జగన్నాథ స్వరూపంబై యుండె. 121

అని వ్రాసినవాఁడు. ఇది యజ్ఞతయో సాహసమో యెఱుంగ.

ఇట్లు మూలమును దెనుఁగును బోల్చి చూచువారికి నొకప్పుడు గ్రంథ మెంత లోపించినదని చింతయు మఱియొకప్పు డీసంబంధము లేని విషయమెల్ల నెందుండి యిందులకు వచ్చెనని విస్మయంబును గలుగక పోవు. ఒకవేళ నారయ తెనుఁగు జేసిన భాగవతమూలమిది కాదేమో యని యేని నీయన తెలిఁగించిన కాలమున నీ భాగవత మూలమిప్పుడున్నట్లుండ లేదేమోయని యేనియుఁ గొందఱకు సంశయంబుగూడఁ గలుగవచ్చుంగాని విష్ణుపరమగు శ్రీ మహాభాగవత పురాణము మఱియొకటి లేదని యందఱు నెఱుంగుదురు గావునను నిప్పుడుండు నిదే యనాదిగా నున్న మూలగ్రంథమని శ్రీధరీయ వ్యాఖ్యానమును పోతరాజ కృతాంధ్రగ్రంథమునుం జూచినవారికి స్పష్టమగుటకు మూలగ్రంథము విషయమైన సంశయమేదియుం నుండదు.

ఇంకొక్క మాటతో నీ పీఠికను ముగించెద. నారయగ్రంథ మిట్లనర్థహేతువగుట యటుండ నది సలక్షణమైనంగాదు. అందలి 44 - 67, 72-74 పద్యములఁ జూచినచో ఛందోదోషములు 3-20-48, 72 - 85- 90 - 110. పద్యములఁ జదివిన వ్యాకరణ దోషములును 55 - 105- 111 పద్యములవలన వ్యర్థపద బాహుళ్యంబును గానంబడు. ఇంతమాత్రము స్థాలీపులాకన్యాయముగఁ జూపినాఁడ. వరుసగా గ్రంథమంతయుఁ జదువఁబూనినచోఁ గథాసందర్భౌచిత్యహానియుఁ బ్రశ్న ప్రత్యుక్త్యసంగతియుఁ జదువరులకు విసుగుబుట్టింపకపోవు. కాఁబట్టి యీ విషయమగు పూర్ణ విమర్శను లక్షణజ్ఞులగు పెద్దలకు వదలి నే విరమించెద.

కోవూరు. ఇట్లు,

ప్రబుద్ధాశ్రమము బుధజనవిధేయుఁడు,

రుధిరోద్గారి శ్రావణ శుక్ల **కోవూరి పట్టాభిరామశర్మ.**

ప్రతిప దిందువాసరము.

శ్రీరామ.

శ్రీ మహామహోపాధ్యాయాది వివిధ బిరుద ప్రశస్తులగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు దీనిని సమగ్రముగా విని వ్రాసియిచ్చిన యభిప్రాయము.

శ్రీ

విద్వత్ప్రకాండులగు శ్రీమత్ కోవూరి పట్టాభిరామ కవీంద్రులు ఆంధ్రమున రచించిన శ్రీమద్భాగవతైకాదశస్కంధమును సమగ్రముగా వింటిని, మహామహః శ్రీ పోతనామాత్యాది ప్రణీతాంధ్ర భాగవతమందు త్యక్తములైన సకల విషయములు ఇందు మూలమునుండి యనూక్తములై యున్నవి. ఆకారణమున నీప్రబంధము మూలైకాదశస్కంధమునకు సంపూర్ణానువాదముగా నున్నది.

ఈ కవీంద్రుల రచన నా తెలిసిన పాటిలో నిర్దోషము, మృదువు, మధురము, సుగమము, నై మనోహరముగానున్నది. అంతటను చిత్తాకర్షకముగానే యుండును. వీరు ఈ గ్రంథముచే ఈ భాషలోని గొప్ప కొఱంతను తీర్చినారనియు, ధర్మతత్త్వ జిజ్ఞాసువులకు మహోపకార మొనర్చినారనియు, ఎంతయుం గొనియాడఁ దగియున్నారు.

85 రంగనాయకపేట,
నెల్లూరు. వేదము వేంకటరాయశాస్త్రి.
10 జూలై 1923 సం॥

శ్రీరామచన్ద్రాయనమః

# ఉపోద్ఘాతము

## ఆంధ్రమహాభాగవతము - లుప్తపూరణములు

శ్రీబమ్మెర పోతన మహాకవి యాంధ్రమహాభాగవతమును సర్వాంగ సుందరముగా సంతరించెను. ఈయన సంస్కృతభాగవతమును యథామాతృకముగా ననుసరించుటయే కాక పెక్కు ఘట్టములను మూలము కంటెఁ బెంచియుఁ ననువదించుటచేఁ దెలుఁగు భాగవతము సంస్కృతభాగవతమునకు రెట్టింపు గ్రంథ మైనది. నిజమునకు భాగవతము పోతనగారి చేతిలోఁ బడుట తెలుఁగు వారి యదృష్టము. అది యథాతథముగా లభింపక పోవుట మన దురదృష్టము.

సింగభూపాలుఁడు పాఁతి పెట్టించుట వలన నేమి, చెదలు తినుట వలన నేమి భాగవతము లోని 5-6-11-12 స్కంధములలోఁ గొన్ని భాగములు లుప్త మైనవి. భాగవతము 12 స్కంధముల 18000 వేల శ్లోకముల యుద్గ్రంథము. నేఁడు లభించుచున్న యాంధ్ర భాగవతములో 1-2-3-4-7-8-9-10 స్కంధములు పోతన గారివి పూర్తిగా లభించుచున్నవి. ఇవియే పెద్దవి. పంచమస్కంధమును బొప్పరాజు గంగన; షష్ఠస్కంధము నేర్చూరి సింగన; ఏకాదశ - ద్వాదశ స్కంధములను వెలిగందల నారయ పూరించినట్లు కొన్ని తాళపత్ర ప్రతులలో నేఁటి ముద్రిత గ్రంథములలో గ్రంథాంత గద్యములలోఁ గలదు. వీరు పోతన శిష్యకోటి లోని వారు. ఈ స్కంధముల నీకవులు పూర్తిగా రచింపలేదు. పోతన రచించిన భాగవతములో శేషించిన భాగములను గలిపికొనుచు శిథిలములైన పద్యభాగములను గొన్ని ఘట్టములను మాత్రమే పూరించిరి. అందువల్లనే ప్రాచీనతాళపత్రప్రతులలోఁ గొన్నింటిలో నన్ని స్కంధముల చివరఁ బోతనగారి పేరే గలదు. పోతన భాగవతములో 6-11-12 స్కంధము లెక్కువగా శిథిలమగుటచేఁ తరువాతి కాలములో మఱి కొందఱు కవులు కూడ నీ స్కంధములను బ్రత్యేకముగా రచించిరి. పోతన తరువాత మఱి కొందఱు కవులు భాగవతమును బూర్తిగా రచించిన వారు కూడఁ గలరు.

**1. శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (20శ.) - శ్రీకృష్ణభాగవతము:-**

ఇది యథామాతృకానువాదము కాదు. స్వేచ్ఛానువాదము.

**2. శ్రీరామ నృసింహమూర్తి కవులు (20శ.) - ఆంధ్ర భాగవతము :-**

శ్రీగంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహమూర్తి జంట కవులు. వీరు మహావధానులు. గద్వాల సంస్థానకవులు. వీరు భాగవతమును యథామాతృకముగా ననువదించిరి. 'వేమగీత' యనుపేరుతో వేమన 1000 పద్యములను సంస్కృతము లోని కనువదించిరి.

ఇట్లే తెలుఁగులో మఱి కొన్ని ద్విపదభాగవతములు, వచన భాగవతములు వెలసినవి. వీనిలో దేనికిఁ బోతన భాగవతమున కున్నంత వ్యాప్తి లేదు.

ఇప్పుడు శిథిల స్కంధములను రచించిన కవులను గూర్చి తెలిసికొందము.

**1. గంగన (15శ.) :-** ఇతఁడు బొప్పనామాత్యుని పుత్త్రుఁడు. పంచమస్కంధమును బూరించిన కవి. ఈ పంచమస్కంధము రెం డాశ్వాసములుగా విభజింపఁబడినది. ఈ విభాగము మఱి యే స్కంధములందును లేదు. ముద్రితప్రతులలో శ్రీకృష్ణాంకితపద్యములు గలవు. వ్రాఁత ప్రతులలో బోతన రచించిన శ్రీరామాంకిత పద్యములే గలవు. పంచమస్కంధమును గంగన తప్ప మఱి యేకవియుఁ బూరింపలేదు. దీనిని బట్టి పంచమస్కంధము పూర్తిగా శిథిలముగాలేదనియు లుప్తపద్యములను శిథిలభాగములను మాత్రమే గంగయ పూరించె ననియుఁ దెలియుచున్నది. పంచమస్కంధములోఁ బోతనరచన యెక్కువగా నున్నట్లు శ్రీచాగంటి శేషయ్యగారు కూడ నంగీకరించుచున్నారు.

**2. సింగన (15శ) :-** ఇతఁడు షష్ఠస్కంధమును బూరించిన కవి. షష్ఠస్కంధ మెక్కువ భాగము శిథిలము కాఁగా సింగనయే కాక మఱి కొందఱు కవులు కూడ రచించిరి. అజామిళచరిత్ర చిత్రకేతూపాఖ్యానము మొ॥నవి. పోతన రచనలుగానే కన్పట్టుచున్నవి. కువలయాశ్వచరిత్రము సింగన రెండవ కృతి. ఇది నేఁడు లభింపదు.

**3. వెలిగందల నారయ (15శ.) :-** ఇతఁడు పోతనామాత్యుని ప్రియశిష్యుఁడు. ఏకాదశ - ద్వాదశస్కంధములు పూరించిన కవి. ఇతఁడీ స్కంధములను

సంపూర్ణముగాఁ బూరింప లేదు. పోతన రచనలో మిగిలిన పద్యములనే యందదుకులుగాఁ బూరించి పోతనపద్యములనే యక్కడక్కడఁ జేర్చి శిథిలభాగముల కొక స్వరూపము నిచ్చినాఁడు. స్కంధాంతపద్యములు కూడఁ బోతన రచించిన పూర్వస్కంధముల లోనివే. ఈ రెండు స్కంధములు మిక్కిలి సంగ్రహముగా నున్నవి.

**4. హరిభట్టు (1450-1520) :-** ఇతఁడు 1. వరాహపురాణము 2. మత్స్యపురాణము 3. నృసింహపురాణము రచించిన మహాకవి. ఇతఁడు కూడ 6-11-12 స్కంధములను రచించినాఁడు. నారయ - హరిభట్టు రచించిన స్కంధములలోఁ గొన్ని పద్యము లించుక పాఠభేదములతో సమానముగా నున్నవి. దీనినిబట్టి నారయ, హరిభట్టు కూడఁ బోతన శిథిలస్కంధములను గైకొని యెవరికివారు విడివిడిగాఁ బూరించుటచే నిట్టి పద్యసంవాదము కల్గినదని యూహింపవలయును. శ్రీశేషాద్రిరమణకవు లీవిషయమును విస్తరముగా నిరూపించిరి. హరిభట్టు పూరణము విశిష్టాద్వైతమతానుసారి. హరిభట్టు రచించిన యేకాదశస్కంధము నాంధ్రసాహిత్య పరిషత్తు - కాకినాడ వారు ప్రకటించిరి. షష్ఠ - ద్వాదశస్కంధము లింతవఱకు నముద్రితములు.

**5. రాచమల్లుకవులు (నందిఘంటలజంట) (1450-1520) :- కవుల షష్ఠము**
లక్షణగ్రంథములలో రాచమల్లు కవుల షష్ఠస్కంధ మని, కవుల షష్ఠ మని, శృంగారషష్ఠ మని కొన్ని పద్యము లుదాహరింపఁబడినవి. ఈ కవులు మలయమారుత బిరుదాంకితులగుటచే నీషష్ఠస్కంధమును రచించిన వారు నందిమల్లయ - ఘంటసింగయలని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి గారు చాటుపద్యమణిమంజరిలో నూహించిరి. శ్రీనిడుదవోలు వెంకటరావుగారు ప్రబోధచంద్రోదయ పీఠికలో నీయూహను బలపఱచిరి. ఆరుద్రగారు సమగ్రాంధ్రసాహిత్యములో నామోదించిరి. శ్రీరవ్వా శ్రీహరి కూడ నిట్లే భావించి కవులషష్ఠములో లభించిన 27 పద్యముల 'నలబ్ధకావ్యపద్యముక్తావళిలో నుదాహరించిరి. 15వ శతాబ్ది యుత్తరార్ధములో నున్న హరిభట్టు, నందిమల్లయ, ఘంటసింగయ షష్ఠస్కంధములను రచించుటచే బమ్మెరపోతన కాలము 1370-1450 అగుట నిశ్చప్రచము.

**6. సర్వన :-** ఇతఁడు కూడ షష్ఠస్కంధమును రచించె నఁట. నేఁడు లభింపదు.

**7. సంజీవరాయకవి :-** ఇతఁడు కూడ నేకాదశ - ద్వాదశస్కంధముల ననువదించినాఁడు. ఈ కవులను గూర్చి మొదటఁ దెలిపిన వారు శ్రీవేటూరివారు. హరిభట్టు షష్ఠస్కంధములోని 5 పద్యములను; సంజీవరాయకవి యేకాదశస్కంధములోని 12 పద్యములను శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'మీఁగడతఱకలు'లో నుదాహరించిరి.

పోతనభాగవతములో 11-12 స్కంధములు వెలిగందల నారయ పూరణములో మిక్కిలి సంగ్రహముగాను, కొన్నిచోట్ల మూలవిరుద్ధముగా నుండుటచే నాధునికులు మఱి కొందఱీ స్కంధములను బ్రత్యేకముగా రచించిరి.

**8. సంపన్ముదుంబ సింగరాచార్యులు (20శ) :-** ఈ కవి 11 - 12 స్కంధములను రచించినట్లు శ్రీనిడుదవోలువారు, శ్రీదుర్భావారు చెప్పుచున్నారు. నాకు లభింపలేదు.

**9. శ్రీ కోవూరి పట్టాభిరామశర్మ (1924) :-** వీ రేకాదశ స్కంధమును యథామూలముగా ననువదించిరి. వీరిని గూర్చి తరువాత విన్నవింతును.

**10. మిన్నికంటి గురునాథశర్మ (1952) :-** వీరు శ్రీమద్గురుభాగవత మను పేరుతో 11 -12 స్కంధములను యథామాతృకముగా ననువదించిరి.

శ్రీకోవూరి పట్టాభిరామశర్మ (1924) వీరు బడగనాటి కన్నడశాఖకుఁ జెందిన బ్రాహ్మణులు. ఋగ్వేదులు. ఆశ్వలాయన సూత్రులు. విశ్వామిత్ర గోత్రులు. కోవూరి రాఘవశర్మ వీరి మూలపురుషుఁడు. వీరి కుమారుఁడు నారాయణుఁడు. వీరి తనయుఁడు వేంకటరమణయ్య. వీరి భార్య నారాయణమ్మ. ఈ దంపతులకు 5గురు పుత్త్రు లుదయించిరి. ఈ సోదరుల లోని వాఁడే పట్టాభిరామకవి.

వీరు శ్రీశంకర భగవత్పాదాచార్యుల 1. వివేకచూడామణి 2. మహావాక్యదర్పణము 3. అపరోక్షానుభూతి 4. ఆత్మానాత్మవివేకము మొదలగు వేదాంతకృతులను దెనుఁగు చేసిరి. శ్రీసురేశ్వరాచార్యుల 5. పంచీకరణవార్త్తికమును దెనిఁగించిరి. 6. భగవద్గీతార్థమంజరి 7. సతీవిజయనాటకము 8. శ్రీరామశతకము మొదలగు పద్యకృతులను రచించిరి. వీరి పద్యకృతులలోని కెల్లనీయేకాదశస్కంధ ముద్గ్రంథము. ఇది మొట్టమొదట 1924లోఁ బ్రకటింపఁబడినది.

భాగవతము నందలి యేకాదశస్కంధవైశిష్ట్యమును, దానిని మఱలఁ దెనిఁగించుటకుఁ గల హేతువులను గ్రంథకర్తయే పీఠికలో విస్తరముగా వివేచించిరి. మఱలఁ జర్విత చర్వణ మనవసరము.

పట్టాభిరామశర్మగారి యేకాదశస్కంధము గురునాథశర్మగారి రచన కంటె ముందే లోకములో వన్నె కెక్కినది. గురుభాగవతమునకుఁ బీఠిక రచించిన శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగా రిట్లు వ్రాక్రుచ్చినారు -

"ఏకాదశస్కంధ మిర్వురచే నీవఱకే తెనిఁగింపఁబడుటయు శర్మగా రెఱుఁగరు. ఈ యిర్వురలో నొకరు బ్రహ్మవిదులు కోవూరు ప్రబుద్ధాశ్రమనిర్మాతలు కీర్తిశేషులు శ్రీకోవూరు పట్టాభిరామయ్యగారు. వీరిది యేకాదశమునకు యథామూలమైన యాంధ్రీకరణము. రెండవవారు కీ॥శే॥ శతావధాని శ్రీమాన్ సంపన్ముదుంబ సింగరాచార్యుల వారు".

సంస్కృత భాగవతములో 11వ స్కంధములో 31 అధ్యాయములు 1373 శ్లోకములు గలవు. ఇది పట్టాభిరామశర్మగారి చేతిలో 1034 పద్యగద్యముల యనువాద మైనది. ఇందలి శ్రీకృష్ణోద్ధవసంవాదము నిసర్గసుందరము. అవధూత - యదుసంవాదములోఁ బ్రకృతిలోని 26 గురువులు వర్ణింపఁబడినారు. ప్రసంగానుసారముగా వర్ణాశ్రమధర్మములు, జ్ఞాన - కర్మ - భక్తియోగములు, సాంఖ్య - యోగములు, ఐలగీతము మొదలగునవి వివరింపఁబడినవి. ఇవి ముముక్షువులకు మిక్కిలి యుపాదేయములగు విషయములు.

పట్టాభిరామశర్మగారి యనువాదము తిక్కనగారి శాంత్యానుశాసనిక పద్ధతిలోఁ బోతనగారి భాగవతరీతిలోఁ జక్కఁగా సాగినది. వీరిది కవిత్వములో నందె వేసిన చేయి. స్కంధాంతములోఁ జిత్రకవిత్వమును మిక్కుటముగాఁ బ్రదర్శించినారు.

## చిత్రకవిత్వము

**1. అపంచవర్గీయ చంపకమాల:-** శివసహవాస! హేల! సవిశేష! యశస్వి! సహస్రశీర్ష! యా హవవివశాసురా! సురసహాయ! హయాస్యవిశేషవేష! వా సవవశ!

హ్రస్వలీల! శయశస్యశరా! వసువర్షవారి వా హ! విషయలోలవైరి! శశిహారి! హరీశ్వరసేవ్య! యీశ్వరా (1023)

ఈ పద్యములోఁ గవర్గ - చవర్గ - టవర్గ - తవర్గ - పవర్గాక్షరములు లేవు. కేవలము య-ర-ల-వ-శ-ష-స-హ వర్ణములతోఁ బద్యము నడచినది. ఇటువంటి పద్యము కావ్యాలంకారసంగ్రహములోఁ గూడఁ గలదు.

సుగంధి :- హారహీర సారసారి హారశైల వాసవో
ర్వీరుహారిహార శేష వేష హాసలాలస
శ్రీరసోరు యాశసాంశుశీల! వైరి వీర సం
హార! సార శౌర్య సూర్య హర్య వార్య సాహసా! (నరస - 5-245)

మూర్తికవి పద్యము కంటెఁ బట్టాభిరామకవిపద్యమే సుందర సులభశైలిలోనున్నది.

**2. అచుంబిత నిరోష్ఠ్య చంపకమాల :-**

కర ధృత శాత సాయ కనికాయ నికృత్త దశాస్యకంధరా!
గర గళ సాహ్య దగ్ధ శర కర్కశరాక్షసరాణ్నికేతనా!
సరిదధి నాథ నిస్తరణ సాధక కాననచారదీక్షితా!
శరధిశయాన! దీనజనజాడ్యహరా! సకలార్థదాయకా! (1025)

ఉ - ఊ - ఒ - ఓ - ప - ఫ - బ - భ - మ - వ వర్ణములు దీనిలో లేవు. దీనిని జదువునపుడు పెదవు లొక దాని నొకటి ముద్దు పెట్టుకొనవు.

**3. అచల జిహ్వా కందము :-**

బహుపాపౌఘ విపాకా
పహ! పంఖభవాంబకా! విభా భవ మోహా
వహ భూమికా! భవాపహ బహుభంగీ!
భూమిభూ వివాహమహేహా! (1026)

ఈ పద్యము చదువునప్పుడు నాలుక కదలదు.

## గర్భ కవిత్వము

**మత్తేభకందగర్భసీసము :-**

అభవ! భీతార్త్యపహా! ధరారమణ! దృ
ప్యద్వైరిరాణ్ణిగ్రహాద్వితీయ! (1028)

ఇందలి సీసపాదములలో మత్తేభము; తేటగీతిలోఁ గందము నిమిడినవి. వీనినిఁ గవియే విడివిడిగాఁ జూపినాఁడు.

## బంధ కవిత్వము

**5. చక్ర బంధము :-**

శా॥ భక్తారాధిత! కోమలాంగ! జలదాభా! మన్మథద్రవ్యభా
రక్తామర్త్య విపత్తినున్నిజచరిత్రా! కర్మభీకృత్స్నహా
సక్తాచంచల! రాఘవేంద్ర! జగదీశా! విశ్వభూతిస్వభా
భాక్తప్రాభవదూర! రాజసగుణాభావా! మహాత్మర్షభా! (1024)



ఈ చక్రబంధము నందలి మూఁడవ వలయములో 'రామచంద్రకృతి' యని; యాఱవ వలయములో - 'కో.ప.రామకవి' యని కృతిపతి - కవినామములు గూఢముగాఁ గలవు.

కో.ప. రామకవి- కోవూరి పట్టాభిరామకవి.

**6. నాగబంధము :-**

చ॥ నరవర! రాజధీరత! ఘనాఘనభవ్య వినీలదేహ! సుం
దరవదనా! దయారసమతా! మతిమద్ద్విజవారశోభనా!
కరతలచాప! వీరవర! గౌరవనిత్యద! శారదామనో
హరశరణా! విచారపరిహారిమహత్త్వపదా! దయానిధీ! (1028)



దీనిలో నొక శుద్ధాంధ్రసీసము (1027); ఒక సర్వలఘు సీసము గలవు.

పోతన భాగవతము నేకాదశస్కంధములో -

సీ॥ నవవికచ। సరసిరుహ। నయనయుగ। నిజచరణ।

గగనచర। నదిజనిత। నిగమ। వినుత. (భాగ -11స్క - 72)

అని యొక సర్వలఘుసీసము గలదు. దీనిలో నింద్రగణము (నల) నకు బదులుగా నైదు లఘువులు గల (నలల) గణములు వాడఁబడినవి. అనంతుఁడు, అప్పకవి, చిత్రకవి పెద్దన మొదలగు లాక్షణికులు చెప్పిన లక్షణపద్య మిట్లే గలదు. ఇదియే లయానుకూలము.

సీ॥ మృగమదము। తిలకమును। నగుమొగము। చెలువమును।

నలఁతి పవ। దముఁదెగడు। నధర। పుటము. (ఛందో - 3-38)

సీ॥ కరివరద। పరమకృప। ధరణిధర। సురవినుత।

కనకవస। న నరహరి। గరుడ। గమన. (అప్ప - 4-531)

సీ॥ గిఱికొనెడు। కలువలును। దఱచు నలి। నము లొదవఁ

బఱపు గల। చెఱువు బలె। మెఱయు। కొలన. (లక్షణసార - 2-9)

వీని ననుసరించియే నేను గూడ శ్రీవేంకటేశ్వర శతకములో -

సీ॥ అసితజల। దము పసలఁ। గసిమసఁగు। తను వెసఁగఁ

గనకవస। నము విపుల। కటిని। మెఱయ. (వేంక - 55)

అను సర్వలఘుసీసమును రచించితిని.

దీనికి విలక్షణముగా శ్రీపట్టాభిరామశర్మగారు -

సీ॥ దశరథ। వరసుత। ప్రశమిత। మునిభయ।

దశముఖ। విదళన। కుశల। సదయ. (1031)

అను సర్వలఘుసీసమును రచించిరి. దీనిలో నలములే వాడఁబడినవి.

కూచిమంచి తిమ్మకవి రాజశేఖర విలాసములో -

సీ॥ తరుణశశి। భరణసువి। తరణభయ। హరణకర
యరుణసర। సిరుహనిభ। చరణయుగళ (రాజ - 1-17)

అని 5 లఘువులు గల యింద్రగణములతో సీసము రచించి - అచ్చతెలుఁగు రామాయణములో -

సీ॥ తొలిపలు। కుఁగొనలుఁ దెలియుత। పసి చలి
వెలుఁగుల కు దొరకు। చెలవు। ల గని. (అచ్చ-రామా - అరణ్య -114)

అని నలముల తోడనే సర్వలఘుసీసము నడిపినాఁడు.

శ్రీపట్టాభిరామశర్మగారు తిమ్మకవి రామాయణపద్యము ననుసరించి రన్నమాట.

ఇట్లే తక్కిన విశేషములను బాఠకు లెఱుంగవలయును.

ఈ యేకాదశస్కంధములో నిన్ని విశేషము లుండుట వల్లనే యాంధ్ర మల్లినాథులు శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగా రిందలి ప్రత్యక్షరము విని శ్రీపట్టాభిరామశర్మగారి గ్రంథము నెక్కువగా మెచ్చుకొనినారు.

ఈ గ్రంథము 90 సంవత్సరముల క్రిందట 1924లోఁ బ్రకటింపఁ బడినది. దీని ప్రతులు నేఁడు లభింపవు. కందుకూరు వాస్తవ్యులు శ్రీనడిపినేని సూర్యనారాయణ గారి ప్రేరణముతో మిత్రులు శ్రీరామోరాగారు తిరిగి దీనిని ముద్రింపించి పాఠకుల కందించుచున్నారు. ఇది శ్రీపుష్పగిరిమహాసంస్థాన ప్రచురణముగా వెలువడుట నాకు మఱింత యానందముగా నున్నది.

ఈ కావ్యనాయకుఁడైన శ్రీకృష్ణపరమాత్మ; కృతిపతి యగు శ్రీరామచంద్రుఁడు; పుష్పగిరి పీఠాధీశ్వరుఁడగు శ్రీశారదాచంద్రమౌళీశ్వరస్వామి మనల నెప్పుడు రక్షింతురుగాక!

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

అవిడి,
శ్రీవిజయసంవత్సర వైశాఖకృష్ణదశమీ
భానువారము,
2-6-2013.

ఇట్లు
సకలసుకవిబుధజనవిధేయుఁడు,
**గరిమెళ్ళ సోమయాజులు శర్మ,**
పుష్పగిరి మహాసంస్థాన పండితుఁడు.

# మిత్రప్రశంస.

ఈ కృతి ప్రకటమునకు నాకుఁదోడ్పడి భగవత్కృపాపాత్రులైన నామిత్రుల ప్రశంస కృతజ్ఞుఁడనగు నాకిచ్చో నవశ్య కర్తవ్యము. అది యెన్నటికిని నవిస్మర్తవ్యమును. ఎట్లనిన -

చ. భగవదనుగ్రహంబున శి - వంకరమీకృతి పూర్తియౌటయున్
నిగమశిఖారహస్యవిదు - నిం బ్రియమిత్రునిఁగ్రైప శేషయన్
సుగుణుఁదలంచి వారికిది - చూపెదఁగాకని పోవుచుండ నా
కగపడిరీశ్వరేచ్ఛను మ - హామతు లిద్దఱు దేహళీపురిన్.

వీరెవ్వరనిన

సీ. గౌతమగోత్ర వి - ఖ్యాతుఁ డిందొక్కఁడు
వేంకట సుబ్బయా - భిఖ్యునకును
సుబ్బమ్మకును దత్త - సుతుఁడు దన్మాతులుం
డాత్రేయ గోత్రుఁడై - నట్టి మాడు
గుల సుబ్బయాభిఖ్యుఁ - డెలమిఁ దన్పెంప నా
తని కల్లుఁడై వైశ్య - తతిగురుత్వ
భాస్కరాచార్య స - త్పదవినుండును తోట
పల్లి సుబ్రహ్మణ్య - భవ్యనాముఁ

తే.గీ. డీతఁడు పరోపకారి వి - నీతుఁ డొకనిఁ
దల్లిదండ్రులులేని బాం - ధవుఁడుగాని
రంగనాథ సమాఖ్యుని - బ్రహ్మచారిఁ
జేరఁ దివిచి విద్యారతుఁ - జేయుచుండె.

ఇట్లుండ

సీ. ఎవని మాతామహుం డిద్ధ భారద్వాజ
గోత్రరామాశాస్త్రి - కోవిదుండు
సురపురసంస్థాన - శూరకోసల వేంక
టక్షమారమణు క - టాక్ష మొంది
యాస్థాన పండితుఁ - డై బహుళాగ్రహా
రాది సన్మానంబు - లంది కొనియె
నెవ్వని పెదతండ్రి - హృద్యపాండితినాసం
శేషశాస్త్రులు నాఁట - సిద్ధిఁ గనియె
తే.గీ. వెంకమాంబ సుబ్బాశాస్త్రి - పితరులెవని
కెవని నమ్మమ్మ మేనత్త - యిరువురైన
భాగమాంబయు సుబ్బమ్మ - బాల్యదశను
సాఁకి రట్టి సీతారామ - శాస్త్రి యొకఁడు.
క. శాండిల్యగోత్రమున స
త్పండిత వంశమునఁబుట్టి - పండితకవియై
యుండును సురపురి నితఁడా
మండలపతిచేతఁ బూజ్య - మానుండగుచున్.
సీ. ఉభయవంశములకు - నున్న తిఁదెచ్చుచు
సాహిత్యరత్న ప్ర - శస్తిఁగాంచి
యును దన యనపత్య - తను గొఱంతఁగనెంచు
శాస్త్రులఁజూచి భా - స్కరగురుండు
తనయొద్దనుండు బా - లుని రంగనాథుని
మనసొప్పె నేనిఁ బు - త్రునిఁగఁ గొనుము
వీనికినిత్తు నా - బిడ్డను మనకు న
న్యోన్యసంబంధ భా - గ్యంబు గలుగు.

తే.గీ. ననుచు నట్లేయొనర్చె నెం - దైనఁగలదె
యిట్టి కారుణికత్వమీ - యిద్ధఅకును
ధన్యతానందమొదవి మి - థస్సమేధ
మానసంతోషులై యుంట- గానఁబడియె.

చ. సరసులు శాస్త్రకోవిదులు - సారకవిత్వ కళావిచక్షణుల్
గురుతరభక్తినన్గని య - కుంఠిత హర్షమునొంది వీరలీ
శ్వర పరమీకృతింజదివి - చయ్యన నియ్యది యెల్లవారికిం
దొరకొనునట్లు చేయుఁడని - తోడ్పడిరీపని నాకు నెంతయున్.

చ. కృతిపతి వీరికాయువును - గీర్తియుఁ బుత్ర సమృద్ధి విద్యయున్
శ్రుతిపరత స్సమత్వమును - శుద్ధమతిన్సిరిఁ జిత్తశాంతియున్
వితరణమున్నిరంతరము - వృద్ధియొనర్చుతమంచుఁ బ్రేమతో
సతతముఁ గోరుచుండుదుఁ బ్ర - శాంతిని శ్రీపతి సంస్మరించుచున్.

కడప, కన్యకాపరమేశ్వరీ భవనము.
రుధిరోద్గారి ఆశ్వయుజ శుద్ధత్రయోదశి,
సోమవారము.

కోవూరి పట్టాభిరామశర్మ,
కృతికర్త.

మఱియు,

సీ. ఈ గ్రంథమచ్చు వే - యింప ధనంబిచ్చి
నట్టి పుణ్యాత్ములం - దగ్రగణ్య
భూమిఁగోవూరి ప్ర - బుద్ధాశ్రమమునకుఁ
గొనఁ బదివంద లి - చ్చిన వదాన్య
నెల్లూరిమండలి - నల్లూరి నూకల
పాటిరాఘవరెడ్డి - వారి తనయ
పోలెడ్డిపాళియం - బున నున్న సన్నపు
రెడ్డి కోదండ్రామి - రెడ్డిగారు

గృహిణి సుబ్బమ్మయం - దిరువురి పిమ్మటఁ
గన్న రంగారెడ్డి - గారి పత్ని
తే.గీ. పతి బహిఃప్రాణమైయున్న - పరమసాధ్వి
యైన కమలమ్మగారి కి-ష్టార్థసిద్ధి
యాయురారోగ్యములును ధ - ర్మాభివృద్ధి
జ్ఞాన వైరాగ్య సుఖము లీ - శ్వరుఁ డొసంగు.

శ్రీశ్రీశ్రీ

## శ్రీమహాభాగవతైకాదశస్కంధారంభ పఠనీయ పద్యావళి

ఉ. శ్రీకరమైన యెవ్వని ని - రీక్షణ మాత్రమున న్మహాద్భుతా
నేక విలాసవైఖరుల - నీ భువనంబులు నిక్కమైన య
ట్లే కనిపించు నెవ్వని స - కృత్స్మరణంబున నివ్వి వెండియుం
జీఁకటి యెండ నట్లణఁగుఁ - జిన్మయు నావిభు నాశ్రయించెదన్. 1
ఉ. భావము కేవలాత్మ సుఖ- భాజనమయ్యుసమస్త భూతమో
క్షావహ మార్గదర్శక స - మంచిత చింత నశేష వేద వి
ద్యా విభవంబు ప్రాకృతుల - దాపునఁ జేర్చు పురాణరాజి ని
ర్మావిధిఁ జేసినట్టి ఋషి - సత్తముఁ గొల్చెద బాదరాయణున్. 2
ఉ. వ్యాసమహర్షి సెప్ప నిగ - మార్థ మెఱింగి విరక్తి బ్రహ్మ ని
ష్ఠా సమదృష్టిఁ గ్రుమ్మరుచు - జ్ఞాన సుధాప్రదుఁడై ముమూర్షు జి
జ్ఞాసుఁ బరీక్షితున్ దయను - గాంచిన యా యవధూతమూర్తి ని
ర్త్రాసు శుకాఖ్యు యోగివరుఁ - జయ్యన సన్నిధిసేయ వేఁడెదన్. 3
చ. శిరమున లేఁత చందురుఁడు - చేతులఁ బాశము నంకుశంబుఁ బే
రురమునఁ బాప జందెములు - నొప్పగ మూషకరాజ వాహుఁడై
కరగత మోదకంబు చవిఁ - గాంచుచుఁ జొక్కుచు భక్తకోటికిం
బరమ సుఖంబొసంగు గజ - వక్త్రునిఁ జిత్తమునం దలంచెదన్. 4

ఉ. భాగవతార్థ మంతయును - భాగవతం బొనరింపుచున్ శ్రుతిన్
రాగము గూర్చువీణ యను - రాగపుఁ జల్లని చూపు సర్వది
గ్భాగముల న్వెలుంగు తను - కాంతియుఁ జేతుల నక్షమాలయు
న్నైగమ పుస్తకంబలర - నామది శారద నిల్చుఁగావుతన్. 5

ఉ. గోపతులందు గొల్లఁడును - గోపవధూమణులందు జారుఁడున్
బాపులయందుఁ గాలుఁడును - బాండవులందు సహాయుఁడున్ ద్విష
ద్భూపులయందు శూరుఁడును - బుణ్యులయందు దయాస్వరూపుఁడున్
గ్రేపులయందుఁ గాపునగు - కృష్ణుఁబరాత్పరు నాత్మ నెంచెదన్. 6

చ. నిగమ రహస్యమెల్ల ధరణి న్నెరప స్సమకట్టి కృష్ణుతో
సుగమ పథంబు సాధులకుఁ - జూపఁగఁజాలు ప్రసంగమెత్తి శ్రీ
భగవ దనుగ్రహంబునకు - భక్తులఁ బాత్రులంజేసి యిప్పుడున్
జగతిఁ జరించు సుద్ధవుని - సాధుజనాగ్రణి సన్నుతించెదన్. 7

చ. ధరణి నవైదికంబులు మ - తంబులు పుట్టి యధర్మమెచ్చి స
త్పురుషులు బాధనొందు తఱి - భూమిని శంకరసంజ్ఞఁ బుట్టి యా
పరమతముల్ హరించి శుభ - పద్ధతి సత్కృప నిల్పినట్టి యా
పరమశివు న్సశిష్య మది - భావితుఁ జేయుదు జ్ఞానసిద్ధికై. 8

శా. నాదబ్రహ్మసమాధిలో మహతి వీ - ణ న్మీటకే పాడుచున్
మోదంబందుచు సద్విచార పరమౌ - పో రోగిరంబుంబలెం
బ్రోదించేయుచు దక్షపుత్రుల ధ్రువుం - బుణ్యాత్ము వాల్మీకిఁ బ్ర
హ్లాదుంబ్రోచిన నారదున్ సురఋషిన్ - హర్షంబుతో మ్రొక్కెదన్. 9

సీ. ఇక్ష్వాకు పుత్రుఁడౌ - నెవ్వండు దాఁజేయ
నెంచు సత్రమునకు - ఋత్విజునిఁగ
గురుని వసిష్ఠుని - గోరి యాఁతడు రాక
తడిసిన మే నని - త్యం బటంచు

నొరునిచే నాపని - నొనరింపఁగని గురుం
డెవని శపించె మే - నవనిఁ ద్రెళ్ల
నామేనిఁ గాపాడి - యాగంబును ముగించి
ఋత్విజు లెవని మే - నిండటంచు

తే.గీ. దివిజులనువేఁడ వారల - ట్లవుత మనిన
మర్త్యమని మేని నొల్ల క - మర్త్యవరము
వలన నెవ్వఁడు ఱెప్పపా - టుల నడువుచు
నిఖిల తనువులనుండు నా - నిమిఁ దలంతు. 10

శా. ప్రీతింగొల్చెదఁ గృష్ణు నుద్ధవుని గో - విందాఖ్యు నారాయణున్
జోతోఽ ధిష్ఠితు వేంకటేశ గురునిన్ - శేషాచలాభిఖ్యు వి
ఖ్యాతుండౌ గురుసింహ దేశికుని భూ - మాఖ్యానమౌ బ్రహ్మవి
ద్యాతత్త్వంబు ననుగ్రహించిన పరా - ర్థంబౌ గురుశ్రేణినిన్. 11

శా. వేదస్కంధము బ్రహ్మమూలము చతు - ర్వి స్తీర్ణశాఖంబు శ్లో
కాదిప్రస్ఫుట మర్థఫ చకలికం - బామోద పుష్పంబు ని
ర్వేదాలంబశలాటు వైక్యఫలము - ద్విగ్నామృతచ్ఛాయమై
శ్రీదంబౌ ద్విజసేవ్యమై శుకవచ - శ్శ్రీపారిజాతంబిలన్. 12

-: :-



శ్రీరామ

శుభమస్తు అవిఘ్నమస్తు

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రమహాభాగవతము

# ఏకాదశస్కంధము

శ్రీకరమైన యెవ్వని ని - రీక్షణమాత్రమునన్ మహాద్భుతా
నేక విలాసవైఖరుల - నీభువనంబులు నిక్కమైన య
ట్లే కనుపించు నెవ్వని స - కృత్స్మరణంబున నివ్వివెండియుం
జీఁకటి యెండన ట్లణఁగుఁ - జిన్మయు నావిభు నాశ్రయించెదన్. 1

శా. ప్రీతిన్ భాగవతంబు నాంధ్రమున ని - ర్మింప దొరంకొంటి నా
చేతం గాకయు నోగణాధిపతి నా - చిత్తంబున న్నిల్చి యే
రీతి న్నాకృతిఁ బూర్తిసేసెదవొ ని - ర్విఘ్నంబుగా నీదయా
పోతం బెక్కి తరింతు నీజలధి వా - క్స్ఫూర్తిం బ్రసాదింపవే. 2

క. తల్లీ శారద నీదయ
వెల్లిగొనఁగ భాగవతము - వివరింపుచు నా
యుల్లమున నిలిచి యెడపక
సల్లలితోక్తులను గూర్చు - సరణి యొసఁగవే. 3

వ. అని యిష్టదేవతాప్రార్థనంబొనర్చి 4

సీ. బడగణనాటి క -న్నడ బ్రాహ్మణుండు ఋ
గ్వేది విశ్వామిత్ర - విదితగోత్రుఁ
డాశ్వలాయన సూత్రుఁ - డైన కోవూరి రా
ఘవశర్మకు సుపుత్త్రుఁ - డవని వెలసె
నారాయణాఖ్యుండు - వారికిఁ దనయుండు
వేంకటరమణ నా - మాంకితుడు
వారికిఁగల్గిరి - నారాయణమ్మ యం
దేవురు పుత్త్రులం - దేనొకండ

ఆ.వె. గరిమనుద్ధవాది - గురు పరంపరయందు
భూమవిద్యచేఁ బ్ర - బోధమొంది
నట్టివాఁడనగుచుఁ - బట్టాభిరామాఖ్య
వెలసినాఁడ సాధు - విహితమతిని. 5

వ. ఇట్టి నేను గంగాది నానాపుణ్యతీర్థసుస్నాతపరిపూతుండనై యొక్కనాఁ
డస్మద్గురుపరంపరాగత భూమవిద్యాసర్వస్వం బగు
శ్రీమహాభాగవతైకాదశస్కంధంబుం దలంచి 6

ఉ. భాగవతంబు మేటిగద - వ్యాసమహర్షి పురాణకోటి నం
దాగమసారమైన పర - మార్థముఁ దెల్లముగాఁగఁదెల్పు నీ
భాగము దీని నాంధ్రమున - వ్రాసిన పెద్దలు మూలసంగతం
బౌగతిఁబోవమిన్ సరిగ - నాంధ్రముసేయుట మేలుదానికిన్. 7

వ. అదియు శ్రీకృష్ణ భగవదవతార సమాచరిత నిఖిల జగత్పావనక్రీడారూప ప్రవృత్త్యనువర్ణన పరంబగు దశమస్కంధంబున కవ్వలిదై యుపరత నిజయోగమాయా వైభవంబగు నా శ్రీకృష్ణ పరబ్రహ్మంబు భక్తజనానుగ్రహంబు కొఱకు నాత్మతత్త్వంబుపదేశించి క్రీడార్థంబుగా భూతలంబున నవతరించిన దేవతలగు యాదవులను మౌసలవ్యాజంబున సంహరించి వారికిం దత్తదధికారప్రాప్తి నొసంగి బ్రహ్మాది సురనికరం బభ్యర్థింపఁ దానాత్మపదారోహణం బొనరించుటను వర్ణించునది యగుట

న్నివృత్తివర్ణనాత్మకంబై యుండు. అందు మొదల వైరాగ్యోత్పాద నార్థంబుగా నత్యున్నత విషయసుఖంబులను ననిత్యంబులని బ్రాహ్మణ శాపాపదేశంబున నైన యాదవక్షయం బభివర్ణింపంబడియె. పదంపడి విదేహార్షభ సంవాదంబు నను శ్రీభగవదుద్ధవోపదేశమందును సపరికరపరమాత్మ తత్త్వనిరూపణం బొనరింపంబడియె. కావున నియ్యది సకలోపనిషత్సారభూత శ్రీమహాభాగవతసుధానిధి నిర్మథన సముద్ధృతా మృతకలశంబై పరమపావనంబై యొప్పు. 8

తే.గీ. దీని నాంధ్రంబుసేయ నేc - బూనుటెల్ల
యోగ గరుడుని వెంబడి - నేcగcజూచు
టైన శ్రీహరికృప నా క - నూనమైనc
గలుగునే దుర్లభంబైన - కార్యమెందు. 9

వ. అని నిశ్చయించి. 10

ఉ. పోతనcగాను భాగవత - మూలము సాలనియట్లు శ్రీపతి
ఖ్యాతినిcబెంచిపెంచి వివి - ధాద్భుత లీలల వ్రాయ సత్కవి
వ్రాతము నాదుపూన్కి హరి - భక్తి జనించినదౌటc బ్రేముడిం
జూతురుగాక యేకొఱcతc - జూడక మన్ననcజేసి యీకృతిన్. 11

వ. అని సుకవిజనంబులం బ్రార్థించి గ్రంథరచనారంభంబున కుద్యమించి యీ కృతిరత్నంబుc బరిగ్రహింపc బూర్వగ్రంథంబెల్ల నాలకించిన శ్రీరామబ్రహ్మంబే పరమపాత్రంబని మనంబునం దలపోసి. 12

-: షష్ఠ్యంతములు :-

క. రామునకు నయోధ్యాపుర
ధామునకు నభీష్టదాన - తర్పితమౌని
స్తోమునకు నఖిలదనుజ వి
రామునకును నవ్యకంధ - రశ్యామునకున్. 13

క. నిత్యునకు సకలలోక
స్తుత్యునకు విదారితారి - సుతకృత్యునకున్

మత్యుచితసాత్త్వికాత్మో
న్నత్యున కనురాగభరిత - నతభృత్యునకున్. 14

క. ధీరునకు దైత్యరాట్సం
హారునకు గృహీత శబరి - కాహారునకున్
దారుణభార్గవబల దు
ర్వారునకు మహోద్భుతాహ - వస్థైరునకున్. 15

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన శ్రీమదాంధ్రమహాభాగవతైకాదశస్కంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన నట్లు భూభారావతరణంబును భక్తానుగ్రహంబును నిమిత్తంబులుగా భువి నవతరించిన శ్రీకృష్ణ పరబ్రహ్మంబు లోకానుగ్రహంబు కొఱకిలం జరియించిన తెఱంగెల్ల నభివర్ణించి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రు నవలోకించి మఱియు నిట్లనియె. 16

తే.గీ. రాముఁడును దాను యాదవ - ప్రకరములను
గూడి దైత్యులనెల్లఁ జ - క్కాడి శౌరి
బలితమగు నొక్కకలహంబు - గలుగఁజేసి
భూమి భారంబునెల్లను - బోవనడఁచె. 17

సీ. మాయజూదం బప - మానకృత్యములు ద్రౌ
పదిఁగేశపాశంబుఁ - బట్టి సభకు
లాగుట లక్కయి - ల్గాల్చుట విషమిడు
టాదియౌ ధార్తరా - ష్ట్రాపకృతుల
కలిగిన పాండవే - యుల నిమిత్తంబుగాఁ
గొని వారికిని వీరి - కనుఁగులైన
రాజరూపంబుల - రాక్షసకోటుల
భారతాహవభూమిఁ - జేరఁ దివిచి

తే.గీ. యఖిలలోక భయావహం - బైన రణము
నందు వారలనెల్లను - హతులఁజేసి

భూమిభరమెల్లనుడిపి ని - స్సీమమహిమఁ
గాల రూపుఁడు కృష్ణుండు - లీలసలిపె. 18

ఉ. భూమికి భారమైన నృప - పుంగవులన్ మఱి వారి సేనలన్
స్వామి స్వబాహుగుప్త యదు - నాథులచే నిరసించి యెంచె నేఁ
డీ మహిభారమెంత పొలి - యించిన నింకనుఁ బోవ దౌర యు
ద్దామబలుల్ యదూద్వహు లు - దారులజయ్యులు నిల్చియుండుటన్ 19

చ. అతిబలసంయుతుల్ మదను - యాయులునైన యదుప్రవీరు లీ
క్షితి నిఁక నేరిచే నయినఁ - జేద్పడ రట్లగుటన్ వెదుళ్ల ను
ద్గతమగు వహ్ని యా పొదరు - దగ్ధ మొనర్చిన యట్లు వీరిలో
నతిశయవైరముంజొనిపి - యందఱనుం బొలియించి యేఁగెదన్. 20

తే.గీ. అనుచు మదినిశ్చయించి స - త్య ప్రతిజ్ఞుఁ
డీశ్వరుఁడు బ్రాహ్మణోత్తము - లిచ్చినట్టి
శాపమే కారణంబుగా - స్వకులమెల్ల
సంశయింపక తా నుప - సంహరించె. 21

సీ. ఏ తనలావణ్య - మీక్షించు కన్ను లిం
కెందును లావణ్య - మెఱుఁగకుండు
నే తనమధురోక్తు - లెద దలంచినఁ జిత్త
మన్యోక్తులాలింప - నరుగకుండు
నే తనపదముద్ర - లీక్షించువార లిం
కెందు నేమియుఁజేయ - నెఱుఁగకుండు
రే తనతత్త్వంబు - నెఱిఁగిన ధన్యులెం
దేనియు నన్యంబు - నెఱుఁగకుండు

తే.గీ. రట్టి తనదివ్యకీర్తి ని - త్యముగ భూమి
నెఱపి తనవార లనితర - నిష్ఠఁజేసి
భవము దాఁటుదు రతిసుల - భముగననుచు
నరిగె నిజపదమునకు నా - రాయణుండు. 22

వ. అనిన రా జిట్లనియె 23

ఉ. ఆగమమార్గముం గడవ - రర్థుల కేదియు నీయనోడ ర
భ్యాగతులైన పెద్దల క - నారతముం బరిచర్య సల్పుచున్
భాగవతప్రధానులయి - వర్తిలు వృష్ణికులాగ్రగణ్యులం
దేగతి విప్రశాప ముద - యించె మహాత్మ యెఱుంగcబల్కవే. 24

తే.గీ. సజ్జనుల కట్టిశాప మే - సరణి వచ్చె
నేమనుచు విప్రులు శపించి - రేకచిత్తు
లైనవారలలో భేద - మయ్యె నెట్లు
వివరముగ నాకుc దెల్పవే - విప్రవర్య. 25

వ. అనిన శుకయోగీంద్రుం డిట్లనియె 26

ఉ. సుందరవస్తుకోటు లొక - చోట నమర్చిన యట్టులొప్పు మే
నొంది సుమంగళంబులగు - నుత్తమకర్మము లాచరించి గో
విందుc దవాప్తకాముcడు ప - విత్రయశుండయి ద్వారకాపురం
బందు వసించి యాత్మకుల - మంతయుcద్రుంపcదలంచె నాత్మలోన్. 27

వ. ఇది భూభారశేషంబగు యాదవకులం బుపసంహరింప నీశ్వరునకుం బొడమిన స్వతంత్రంబగు నిచ్ఛామాత్రంబు దానివలనం గలిగిన విప్రశాప ప్రకారంబు వినుము. పుణ్యావహంబులును, నత్యంత సుఖప్రదంబులును సకల పాపాపనోదకంబులు నగు విధివిహిత వివిధకర్మంబు లొనరించువాcడై శ్రీకృష్ణదేవుcడు విశ్వామిత్రుండు నసితుండుc గణ్వుండు దుర్వాసుcడు భృగువు నంగిరసుcడు గాశ్యపుండు నత్రి వసిష్ఠుండు వామదేవుండు నారదుండు మున్నగు మహామునుల రావించి నిర్వర్తితాభీప్సిత కర్మకలాపుండై యదుకుల సంహారక రూపంబున వసుదేవునింటనుండి యమ్ముని జనమ్ముల నచ్చటి కనతిదూరమ్మునను౦డు పిండారకమ్మను తీర్థవిశేషమ్మున కనిచె. వారునుం జనుచుండ మార్గమధ్యంబున. 28

-: ముసలోత్పత్తి ప్రకారము :-

క. ఆడుచుc బాడుచు నొండొరుc
గూడి నగుచు యదుకుమార - కులు దమలోనం

గ్రీడాపరులై కొండొక
వేడుక సల్పంగఁదలఁచి - విధిచోదితులై. 29

ఉ. జాంబవతీ తనూభవుని - సాంబునిఁజేరఁగఁబిల్చి వాని ని
క్కంబుగఁదోచునట్టులొక - గర్భిణిఁగా సవరించి మౌనిబృం
దం బరుదెంచుచక్కటికి - దానినిఁ దోడ్కొనిపోయి వారి పా
దంబులు నెన్నొసల్ దవుల - దండముఁబెట్టఁగఁ జేసి వారితోన్ 30

చ. అవితథ దివ్యదర్శనుల - రౌ మునులార దయన్ వచింపుఁ డీ
యువతికి నేమిపుట్టుఁ దన - యుంగనఁగోరెడి నీప్రపూర్ణ గ
ర్భవతి విలజ్జితాత్మయయి - పల్కగనేరదు మిమ్ముఁజూచి యీ
వివరము మమ్ము వేఁడుమనె - భీరువు దీని ననుగ్రహింపుఁడీ. 31

తే.గీ. అనుచు నవినీతులై విన - యాభినయము
గదుర వేఁడిన మునులు ని - క్కంబెఱింగి
కుపితులై మూఢులార మీ - కులముఁద్రుంచు
ముసలమునుఁగాంచు నిది యని - వోయిరధిప. 32

చ. అదివిని బాలురాత్మల భ - యంపడి యప్పుడెపోయి సాంబు పే
రుదరము విప్పియందు గని - రొక్కమహాముసలం బయోమయం
బదిగని యేమిసేసితి మ - హా దురదృష్టులమైతి మేమియం
ద్రిది విని లోకులెల్ల మము - నెట్లిఁక నం చతి విహ్వలాత్ములై. 33

చ. ముసలము నింటికెత్తికొని - వోయి పదంపడి దానిఁగొంచు రా
జ సభకునేఁగి యాదవుల - సన్నిధి దానినిఁబెట్టి బాలకుల్
పససెడి వాడుమోములఁదపస్వుల శాపము హేతువంతయున్
వెస నెఱిగించి రందఱును - విస్మితులై వెఱఁగంది చూడఁగన్. 34

వ. అంత 35

తే.గీ. ముసలమును జూచి బ్రాహ్మణా - మోఘశాప
వార్తవిని ద్వారకాపుర - వాసులెల్ల

యదుకులాంతక హేతు వి - య్యది యటంచు
నధికవిస్మయ భయవిహ్వ - లాత్ములైరి. 36

సీ. అంత నాముసలంబు - యదుకుల ప్రభుఁ డుగ్ర
సేనుండు వొడిసేసి - శిష్టఖండ
మును జూర్ణమును నంబు - ధినినీటఁ గలిపించె
నాఖండమొక్క మ - త్స్యంబుమ్రింగె
నాచేఁప యన్యమ - త్స్యంబులతో వలఁ
బడె బెస్తలది బోయ - వానికమ్మ
నతఁడు దద్గర్భస్థ - మగు లోహఖండంబు
నమరించెఁదనదు బా - ణాగ్రమందు

తే.గీ. పొడియు నంబుధి తరగలఁ - బడిపయోధి
యొడ్డునకుఁగొట్టు కొనివచ్చి - దొడ్డతుంగ
లుగ మొలిచి రేవునిండ న -ల్లుకొని యుండె
నేమనఁగవచ్చు రాజేంద్ర - యీశ్వరేచ్ఛ. 37

క. భగవంతుఁడు సర్వజ్ఞుం
దగు శ్రీకృష్ణుఁడు సమర్థుఁ - డయ్యును గాలుం
దగుట మఱలింప కాగత
మగు బ్రాహ్మణశాప మాత్మ - ననుమోదించెన్. 38

వ. అని మఱియు శుకయోగీంద్రుం డిట్లనియె ని ట్లఖిలయాదవ సంక్షయంబుఁ బ్రతీక్షించుచు శ్రీకృష్ణదేవుండు ద్వారకాపురంబునం గాఁపురంబున్న సమయంబున 39

క. హరిబాహుబలముచేతం
బరిరక్షితయైన ద్వార - వతి నైకత్ర
స్థిరవాసుఁడు నారదుఁడుం
జిరకాలము నిలిచెఁగృష్ణ - సేవాపరుఁడై. 40

క. నిరతము సురవరులను సు
స్థిరభక్తిం గొలుచుచుండు - శ్రీకృష్ణపదాం
బురుహంబుఁ గొల్వఁడే నరుఁ
డురుమృత్యుగ్రస్తు డంగ - యుక్తుఁడు ధరణిన్. 41

## -: వసుదేవ నారదసంవాదము :-

వ. అట్లుండి నారదుం డొక్కనాఁడు వసుదేవు మందిరంబునకుం జనిన
నాతండును నాదేవర్షిప్రవరు నుచిత ప్రకారంబునం బూజించి సుఖోపవిష్టుం
గావించి నమస్కరించి యిట్లనియె. 42

తే.గీ. భక్తులు మహాత్ములగు తాము - వచ్చుటెల్ల
జీవకోట్లకు క్షేమంబు - సేయుకొఱకె
బిడ్డలను దల్లిదండ్రులు - ప్రీతిఁజూడ
వచ్చునట్టులె మీరలు - వచ్చు టనఘ. 43

క. దేవతలు సేయు సరకృతి
తోవచ్చును భూతములకు - దుఃఖము సుఖముం
గేవల సుఖమేయగు స
ద్భావులు సాధువులు తాము - దయసేయుటచేన్ 44

మ. ఎవరేరీతిఁ దమున్ భజింతురటులే - యీ నేర్తురవ్వారి క
ర్మవశత్వంబున దేవతల్ ఫలములన్ - మైనీడ మేనెట్టు ల
ట్లవశంబై చలియించు భాతిఁ దమబోం - ట్లొ సాధులన్నన్ దయా
వివశుల్ దీనులపట్ల మీకరుణ యు - ద్వేలంబు మౌనీశ్వరా 45

మ. అయినన్ సాధుజనాగ్రగణ్య మిమునేఁ - బ్రార్థించెదన్ శ్రీహరి
ప్రియముల్ ధర్మములేవిశ్రద్ధనెవి దా - వించున్ బ్రశంసించుచున్
గ్రియలంజేయుచు మర్త్యుఁడెందుఁ గనినన్ - భీతిప్రదంబై సుదు
ర్జయమౌ సంసృతిఁబాయుఁదెల్పఁగదె వా - త్సల్యంబు నిండారఁగన్46

మ. మునుమాయాపరిమోహితుండనయి నేఁ - బూజించితిన్ శ్రీహరిన్
ఘనసంసారవిమోచనున్ భువిఁబ్రజా - కాముండనై ముక్తిఁ గో
రను నానావ్యసనంబు భీకరము దు - ర్వారంబు సంసార మే
యనువొప్పందరియింతునిప్పుడెయనా - యాసంబుగా మీదయన్. 47

వ. ఆనతిచ్చి నను ననుగ్రహింప మీరే యర్హులరని విమలమతియగు నవ్వసుదేవుండు వేఁడిన శ్రీహరి గుణజ్ఞాపకంబులగు నావచనంబు లాలించి దేవర్షి పుంగవుండగు నారదుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె. 48

తే.గీ. యదుకులోత్తమ మంగళా - యతనములును
పరమపావనములు భాగ - వతములైన
ధర్మములు వినఁగోరితి - తత్పరమగు
నీదు నిశ్చయమొప్పునో - నిర్మలాత్మ. 49

క. వినినన్ మదిఁజింతించిన
ననుమోదించినను మిగుల - నాదరమునఁ జే
సిన నీ సద్ధర్మము పా
వనుల నపుడె సేయు నెట్టి - పాపాత్మకులన్. 50

తే.గీ. నీదు ప్రశ్నంబుచే నేఁడు - నాదుచిత్త
మందునిల్పితి దేవు ది - వ్యప్రభావు
నాద్యుభగవంతు నారాయ - ణాభిధానుఁ
బరమకల్యాణు భువన పా - వనచరిత్రు. 51

వ. అని నారదుండు వసుదేవునకు భాగవతధర్మంబు లుపదేశించువాఁడై యదూద్వహా వినుమిందులకు నొక్క పురాతనేతిహాసంబు గలదది విదేహర్షభ సంవాదంబునాఁ బరగు దాన నీవడిగిన యర్థంబు దెల్లంబగునని యిట్లనియె 52

**- : విదేహర్షభసంవాదము :-**

సీ. ఘనుఁడు స్వాయంభువ - మనువున కుదయించె
సుతుఁడొక్కరుఁడు ప్రియ - వ్రతుఁడనంగ

నతనికి నాగ్నీధ్రుఁ - డాత్మజుం డతనికి0
నాభినా జన్మించె - నందనుండు
వానికి ఋషభుండు - వరపుత్రుఁ డనివింటి
వదిమోక్షధర్మంబు - లవనినెఱుఁగ
నవతరించిన విష్ణు - నంశమం ద్రతనికిఁ
బుత్రులు నూర్వురు - పుట్టిరవని

తే.గీ. వారలెల్లను వేద స - ర్వస్వవిదులు
వారిలోపల జ్యేష్ఠుండు - భరతుఁ డనఁగ
భాగవత ముఖ్యుఁడయ్యె నీ - వర్షమతని
పేర భారతవర్షమై - వెలయుచుండు. 53

సీ. భరతుండు దనతండ్రి - పాలించుచుండిన
రాజ్యంబునేలె ధ - ర్మంబుతోడఁ
గ్రతుశతంబొనరించె - సుతపంచకముఁగనె
నన్నిభోగమ్ములు - ననుభవించె
నంతరాజ్యమురోసి - యాసలు దెగఁగోసి
యిలువాసి యడవికి - నేఁగియందు
సువిరక్తుఁడై తప - స్సున హరిమెప్పించి
మృగశాబకంబు ని - మిత్తమగుచుఁ

ఆ.వె. దపము విఘ్నమైనఁ - దలఁకి యసంగుఁడై
మూఁడుఁ జన్మములకు - ముక్తుఁడగుచు
సకల యోగిగమ్య - శాశ్వతస్థానమౌ
విష్ణు లోకమొందె - విమలయశుఁడు. 54

వ. అతని తమ్ములలోఁద్రొమ్మండ్రు బ్రహ్మావర్తాది నవఖండాధిపతులైరి. ఎనుబదియొక్కం డ్రజనాభంబనం బరగిన యీ భారతవర్షంబునం గర్మమార్గప్రవర్తకులగు బ్రాహ్మణులైరి. మిగిలిన తొమ్మండ్రును బరమార్థనిరూపకులు నాత్మాభ్యాసకృతశ్రములు నాత్మవిద్యాపారంగతులు దిగంబరులు మహానుభావులు నగు మునులైరి. వారు కవి హరి

యంతరిక్షుండు ప్రబుద్ధుండు పిప్పలాయనుండు నావిర్హోత్రుఁడు ద్రమీళుండు
చమనుండు గంభాజనుండు ననంప్రసిద్ధులై. 55

తే.గీ. సదసదాత్మకమగు ప్రపం - చంబునెల్ల
నాత్మకు ననన్యమౌ నీశ్వ - రాకృతిగను
సర్వసమనిర్మలాత్మ ద - ర్శనముగలిగి
జగతిఁ జరియించుచుండిరి - స్వైరవృత్తి 56

వ. ఇట్లెందును నడ్డులేక యథేష్టంబుగా సురసిద్ధసాధ్యగంధర్వయక్షనరకిన్నర
నాగలోకంబులందును ముని చారణ భూతనాథ విద్యాధర ద్విజగోలోకంబు
లందును నసంగులై సంచరించుచుండు వారొక్క నాఁ డీభారతవర్షంబునందు
జనకవంశసంభవుండు మహాత్ముఁడు నగు నిమియను విదేహుండు
ఋషులతోడ ననుష్ఠించుచున్న సత్రయాగంబునకు దైవయోగంబున వచ్చిన.
57

తే.గీ. భానుసంకాశులగు మహా - భాగవతుల
వారిఁ గనుఁగొని నిమియును - వహ్నిగణము
ఋత్విజులు విప్రకోటియుఁ - బ్రీతిసంభ్ర
మములతో లేచి నిలిచిరి - మానవేంద్ర. 58

ఉ. అంత విదేహుఁ డామునుల - నచ్యుత భక్తులుగా నెఱింగి య
త్యంతము హర్షమొంది యుచి - తాసన సుస్థితులంబొనర్చి యే
కాంతరతిన్ సపర్యలిడి - యాత్మరుచి న్వెలుఁగొందుచుండు నా
శాంతుల బ్రహ్మపుత్ర సదృ - శవ్రతనిష్ఠులఁజూచి ప్రీతితోన్. 59

వ. వినయ వినమితగాత్రుండై యిట్లని విన్నవించె. 60

క. తామామధురిపు సన్నిధి
నేమఱకుండెడి మహాత్ము - లే యని తలఁతున్
స్వామికి భక్తులు లోకము
లోముటకై సంచరించు - చుందురు గాదే. 61

చ. జని మరణప్రవాహమగు - సంసృతి మున్గుచుఁదేలుచుండు జీ
వునకు లభింపవచ్చుఁ దను - వు ల్పివిధంబులు వానిలోన నెం

చ నిమిషనాశియైనను న - సాధ్యము మానవజన్మమందు నె
వ్వనికిని దుర్లభంబు భగ - వత్ప్రియభక్తుల దర్శనంబిలన్. 62

తే.గీ. కాన నత్యంతహితమేది - మానవునకు
నానతీయంగ వేఁడెద - మనఘులార
యరయ సంసారమున నిమి - షార్ధమైన
సాధుసంగంబు పెన్నిధి - సాటిగాదె. 63

తే.గీ. ఎవి యనుష్ఠించు భక్తున - కీశ్వరుండు
ప్రీతుఁడై యిచ్చుఁదన్నైన - విప్రులార
యట్టి భగవంతుధర్మంబు - లానతిండు
వాని నేమెల్ల వినఁదగు - వారమేని. 64

తే.గీ. అని విదేహుండు దము నిట్టు - లడుగుటయును
నామహాత్తము లప్పు డా - భూమినాథు
ఋత్విజులను సదస్యుల - నెల్లఁజూచి
చిత్తములమెచ్చి యిట్లని - చెప్పి రెలమి. 65

వ. వారిలోఁ గవియును మహాత్ముఁడు నరుల కెయ్యది యాత్యంతిక క్షేమంబగు
భాగవతధర్మం బది యెఱింగించువాఁడై యిట్లనియె. 66

చ. సకల విపత్సముద్రమగు - సంసృతియందునసన్మయంబు దే
హకముఖమెల్లఁ దానని ప - రార్థమెఱుంగ కనారతంబు ధీ
వికలతనెంచు వెంగలికి - భీతిసమస్తముఁబాప శ్రీహరి
ప్రకట పదాబ్జసేవయె తి - రంబగు సాధన మొండులేదిఁకన్. 67

తే.గీ. తన్ననాయాసముగఁ బొందఁ - దగినవనుచు
నజ్ఞులకు నేయుపాయంబు - లానతిచ్చె
నీశ్వరుండవె నరులకు - హితములైన
భాగవతధర్మములటంచుఁ - బరగ నెఱుఁగు. 68

శా. ఈ ధర్మంబుల నాశ్రయించిన నరుం - డేవేళ నేవిఘ్నమున్
బాధన్ బొందక శీఘ్రకాలమున ని - ర్వాణంబుఁ దానొందు స

న్మేధన్ వానిఁజరించుచోఁ దెలివిలే - మిం గాలమున్ మీఱుటన్
బాధల్గల్గవువాఁడు శ్రీహరికృపన్ - సంసిద్ధినొందున్ వెసన్. 69

క. నరుఁడు తన కనులు రెండునుఁ
బరగన్ మూసికొని త్రోవఁ - బరువిడినను శ్రీ
హరికరుణగలుగ జాఱక
ధరఁగూల కతండు తావుఁ - దప్పకసేరున్. 70

సీ. కాయంబుతోఁజేయు - కార్యంబులెల్లను
నోటనాడుచునుండు - మాటలెల్ల
తన మనస్సునఁగల్గు - తలఁపు లన్నింటిని
బదియింద్రియంబుల - పనులనెల్ల
బుద్ధిలోనుండెడు - పూనికలెల్లను
జిత్తంబు నందలి - చింతలెల్ల
నవశతఁ దనతొంటి - యభ్యాసబలమున
నగుచుండు పనులు స - మస్తములును

తే.గీ. వైదికంబులొ లౌకిక - వర్తనములొ
యేవి తాఁజేయు నవియెల్ల - నీశ్వరునకుఁ
దానొనర్చెడు సేవఁగా - ద్రఢిమఁజేయ
నఖిలమును భాగవతధర్మ - మగు నరేంద్ర. 71

సీ. ఈశ్వరుసన్నిధి - నెడఁబాయ నాతని
మాయచేఁ బురుషుఁడు - మఱచు నతని
దానిచే దేహంబుఁ - దానని తలఁచు నా
తలఁపుచే భీతి యు - త్పన్నమగును
కావున నీమాయఁ - గల్గిన భయము వా
యఁగ బుద్ధిమంతుఁ డ - నన్యభక్తి
గురువె దైవంబని - గుఱిగల్గి వారిచేఁ
దానెఱింగినరీతిఁ - దప్పకుండ

ఆ.వె. భావమందునెపుడు - భగవంతుని భజించి
జగముఁదత్స్వరూప - ముగనె చూచి
భయములెల్లఁబాసి - భవబంధముక్తుఁడై
పరమసుఖమునొందు - ధరణి యందు 72

ఉ. లేనిది యయ్యు నున్నయటు - లే పొడకట్టు జగంబు సూచు న
వ్వానికి నవ్యమైన క్రియ - స్వప్న మనోరథ సృష్టియట్లు త
న్మానసవృత్తి మాత్రమది - మానక కర్మమొనర్ప మానఁగాఁ
బూనుమనంబు నిల్చిన ప్ర - బుద్ధునకున్ భయమెల్లఁ దీఱెడిన్. 73

ఆ.వె. అవనిశుభములైన - హరిజన్మ కర్మ చా
రిత్రములను వినుచుఁ - గృష్ణనామ
గీతగానపరత - భీతిలజ్జలమాని
సంగముడిగి తిరుగు - సాధువెపుడు. 74

సీ. ఈరీతినెపుడు నా - త్మేశ్వరుండగు విష్ణుఁ
బ్రేమమీఱఁగను సే - వించుచుండు
భక్తాగ్రగణ్యుండు - భగవంతునామంబు
లుచ్చరించుచును బ్రే - మోద్గమమునఁ
జిత్తంబు గరఁగి వి - స్మృత బాహ్యలోకుఁడై
హరిసిక్కె నాకని - యట్టెనవ్వు
నింతకాలము నన్ను - నెంచ వైతివటంచు
గట్టిగానేడ్చు నుత్కంఠ నఱచు

తే.గీ. నన్ను రక్షించు మాయయ్య - నిన్ను మఱవ
ననుచు గీతములనుబాడు - హర్షమెసఁగ
నింక నాకేమి గెల్చితి - నీభవంబు
ననుచు వెఱ్ఱియుఁబోలి నృ - త్యంబొనర్చు. 75

వ. మఱియు నతఁడు. 76

తే.గీ. జ్యోతులను వ్యోమముఖమహా - భూతములను
బ్రాణులను దిక్కులనుఁ జెట్లఁ - బర్వతముల

నదుల జలధుల మఱియు న - న్యముల విష్ణు
మూర్తిగ ననన్యభక్తితో - మ్రొక్కుచుండు. 77

చ. హరిభజియించు భక్తునకు - నబ్బునొకప్పుడె విష్ణుభక్తియున్
హరినిజరూప విస్ఫురణ - మన్యపదార్థ విరక్తి మూఁడునున్
బురుషుని భుక్తికాలమున - ముద్దకు ముద్దకుఁ దుష్టి పుష్టి క్షు
ద్విరమణమీత్రయంబునొక - వేళనె గల్గుచునుండుకైపడిన్. 78

తే.గీ. ఇంచుకించుకగానైన - నిట్లుభక్తి
వదలకెప్పుడు సలుప నా - వాసుదేవు
కరుణ నామూఁదు సుగుణము - ల్గలిగియంతఁ
బరమశాంతిని బొందు నా - భాగవతుఁడు. 79

వ. అనిన విని నిమి మహాత్మా మానవులయందు భాగవతులన నెట్టివారు? వారి ధర్మంబులు స్వభావంబులు నెట్టివి? వారెట్టి వర్తనంబున భగవత్ప్రియు లయ్యెద రెఱింగింపుమని వేఁడుటయు హరియును మహానుభావుండిట్లనియె. 80

తే.గీ. అఖిలభూతంబులందుండు - నాత్ముఁడతఁడె
బ్రహ్మమనియును నాపర - బ్రహ్మమందు
నఖిల భూతంబు లారోపి - తాకృతులని
పరఁగ గనువార లుత్తమ - భాగవతులు. 81

క. భగవంతుని యెడఁబ్రేమము
భగవత్పరులయెడమైత్రి - బాలిశులయెడం
దగుకృప రిపుల కుపేక్షయు
మొగిఁజూపెడువారు మధ్య - ములు భక్తులలోన్. 82

క. హరి విగ్రహంబునే త
త్పరతం బూజించు నెవఁడు - తద్భక్తుల యం
దొరులందుశ్రద్ధలేకా
నరుఁడభినవభక్తుఁడని య - నంబడు నవనిన్. 83

తే.గీ. విషయములనెవ్వఁ డింద్రియ - వితతి ననుభ
వించుచుండియు వానిచే - ద్వేషహర్ష
వికృతులొందక సకలంబు - విష్ణుమాయ
గాఁగను నతండె యుత్తమ - భాగవతుఁడు. 84

సీ. శ్రీహరినెప్పుడుఁ - జింతించు ధర్మమం
దేమఱకుండుట - నేఘనుండు
శారీరధర్మముల్ - జన్మనాశంబులు
నైంద్రియ ధర్మ మా - యాసపడుట
ప్రాణధర్మంబులౌ - నాఁకలి దప్పులు
మానసధర్మమౌ - మహితభయము
బుద్ధి ధర్మంబు సమిద్ధ తృష్ణయు నను
ప్రచుర సంసార ధర్మముల వలన

తే.గీ. మోసపోవక వికృతిని - బొందకుండ
నిత్యసుఖలబ్ధిఁదృప్తుడై - నెగడుచుండు
నట్టి భగవత్పరుండు శు - ద్ధాంతరంగుఁ
డగ్రగణ్యుండు భాగవ - తాళియందు. 85

క. కోరికలు నుద్యమంబులుఁ
దోరపువాసనలుఁ జూడఁ - దొడరి పొడమవే
నారాయణపరునం దా
ధీరుఁడు భాగవత సంత - తిని ముఖ్యుడగున్. 86

తే.గీ. జన్మకర్మ వర్ణాశ్రమ - జాతిసంగ
మెవని కిది నాయది యటంచు - నెపుడు గల్గ
దీతనువుఁ దాననుచు నెవ్వఁ - డెపుడు నెంచఁ
డతఁడె భగవత్ప్రియుండు ధ - న్యాత్ముఁడవని. 87

తే.గీ. తనది పరునిది యిది యని - ధనములందుఁ
దనువులందును నెవనికిఁ - దలఁపు గలుగ

దఖిల భూతసముందు శాం - తాత్ముఁడెవ్వఁ
డట్టివాఁడగు భాగవ - తాగ్ర్యుఁడవని. 88

చ. భువనములెల్ల నేలఁగల - భోగమొసంగిన నెవ్వఁడాత్మలోఁ
దవిలి క్షణార్ధమైనను శ్ల - థంబగు భక్తి నవశ్యచిత్తులౌ
దివిజులు సైతమున్ వెదకు - దివ్యము శ్రీహరిపాదపంకజం
బువిడిచి నిల్వఁడాతఁడగు - ముఖ్యుఁడు భాగవతాగ్రగణ్యులన్. 89

శా. ఏపుణ్యాత్ముని చిత్తమందు హరి స - ర్వేశుండు పాదాబ్జమున్
మోపం దన్నఖచంద్రికాప్తి గత స - మ్మోహంబు శాంతంబు ని
స్తాపంబై యది వెల్గు నట్టి హరిభ - క్తశ్రేష్ఠు చిత్తంబునం
దాపం బెట్లుదయించు వెన్నెలను మా - ర్తాండప్రభల్గల్గునే? 90

చ. అవశముగం దలంచిన న - ఘాళి నడంచు మహాత్ముఁ డీశ్వరుం
డెవని హృదంతరంబున ని - జేచ్ఛ వసించుచు నందుఁ బ్రేమ పా
శవితతిచేత నాత్మపద - సారసయుగ్మము బద్ధమౌట దా
ని విడువకుండు నాతఁ డగు - నిక్కము భాగవతాగ్ర్యుఁడీధరన్. 91

వ. అనిన విని యా విదేహాగ్రణి సంతుష్టహృదయుండై భక్తియోగప్రతియోగిని
యగు మాయరూపం బెఱుంగంగోరి యిట్లనియె. 92

తే.గీ. మాయికులఁగూడ మోహింపఁ - జేయునట్టి
మాయ యాథార్థ్య మెఱుఁగ మా - మానసముల
నిచ్ఛ జనియించెఁ బరమ మౌ - నీంద్రులార
దానిఁ దెల్పుఁడు మేమది - దాఁటుకొఱకు 93

ఉ. దారుణమైన సంసరణ - తాపముచేఁ బరితప్తుఁడన్ మహా
ఘోర కరాళ మృత్యు ముఖ - కూప నిపాత విభీత చిత్తుఁడన్
దా రిపుడిచ్చు శ్రీహరి క - థాసుధ మత్పరితాప భీతి ని
స్తారక మెంత ద్రావినను - జాలదు నాకు మఱింత గోరెదన్. 94

వ. అనిన విని యంతరిక్షుం డను ముని హర్యక్షుం డిట్లనియె. నిర్గుణాద్వితీయ
నిరాభాసం బగు పరబ్రహ్మంబునందు స్వరూప విపర్యయం బగు సగుణత్వ

సద్వితీయత్వసాభాసత్వంబులను విశేషంబు ప్రత్యక్షంబుగా నెద్దానివలనం దోఁచునయ్యదియె మాయ. దీనిచే నీశ్వరుండీప్రపంచంబు నంతయును సృజియించె. ఇదియు మాయాకార్యం బగుట జాగ్రత్స్వప్న సుషుప్తిప్రతీతి రూపంబున మిథ్యయై యుండు. 95

చ. మెలఁకువ యింద్రియార్థముల - మిథ్యల సత్యములంచుఁజూచుటే
కలయగు మానసోద్గత వికల్పములన్ నిజమంచు నెంచుటే
బలితపునిద్ర యీ యుభయ - వాసనలెందు విలీనమౌ నదే
యలత్రితయంబులోఁగలిసి - యంటక వెల్గుఁ దురీయమారయన్. 96

చ. కనుఁగొనువాఁడు గాంచుటయుఁ - గానఁగవచ్చెడు రూపమౌ ఫలం
బును నన స్వప్న మందొకఁడె - మూఁడు విధంబులఁ దోఁచునట్టులెం
చ నిట విశుద్ధమైన యొక - జ్ఞానమె మూఁడుగఁదోఁచు మాయచేఁ
గనఁ ద్రిపుటీ స్వరూపమగు - గ్రాహకముగ్రహణంబు గ్రాహ్యమై. 97

సీ. భావరూపముగా ద- భావంబునుం గాదు
నిజముగా లేనిది - నిద్రయనఁగ
స్వప్న జాగరము ల - సత్యముల్ నిద్రలో
లేనివి యొండొంట - లేవుచూడ
నాత్మయందీమాయ - నైన త్రైవిధ్యంబు
స్వప్న మనోరథ - ప్రతిమమగుచు
లేకయేయున్నయ - ట్లాకల్పితంబౌట
మూఁడవస్థలు నెంచి - చూడమిథ్య

తే.గీ. లనుచు లెస్స విమర్శించు - నట్టివాని
కవి నిజముకాదౌ యను సంశ - యంబు దొలఁగు
మాయసంఖ్యలు మూఁడును - మాసి నిత్య
నిర్వికల్పాత్మనిష్ఠయే - నిల్చు నధిప. 98

వ. ఇఁక మాయావిలాసంబు వినుము 99

సీ. ఆద్యుఁడౌ నీశ్వరుం - డామాయచేత నీ
యఖిలంబు సృజియింప - నాత్మనెంచి

భూతకారణరూప - మున మహాభూతంబు
లేనింటిఁజేసి య - వ్వానిచేత
దేవతిర్యఙ్న రా - దిక భూతములసృష్టిఁ
జేసె స్వమాత్రాత్మ - సిద్ధికొఱకు
నిట్లు సృజించిన - యెల్ల దేహములఁ దా
జీవరూపంబునఁ - జేరి యొకటి
తే.గీ. పదియుఁగాఁ దన్ను విభజించి - తదనుగతిని
మానసేంద్రియవిషయ సం - తాన మెల్ల
ననుభవించుచు దేహాత్మ - తను వహించి
తన్ను సంసారిగా మదిఁ - దలఁచుచుండు. 100
ఆ.వె. వాసనాబలంబు - వలనఁగర్మంబుల
వివిధముల నొనర్చి - వీని ఫలము
మేలొ కీడొ పొంది - మేని భరించుచు
దిరుగుచుండు నిందె - దేహి యెపుడు. 101
ఆ.వె. పురుషుఁ డిట్టు లప్ర - బుద్ధుఁడై వివిధదుః
ఖములఁబడుచు స్వకృత - కర్మవశతఁ
బంచభూతవిలయ - పర్యంతమును బహు
జననమరణములను - గనుచునుండు. 102

వ. అంత మహాభూతప్రళయంబాసన్నంబగుటయునాద్యంత రహితంబగు కాలంబీద్రవ గుణాత్మక ప్రపంచంబు నవ్యక్తంబునం జేర్ప నాకర్షించు. అప్పుడు భూమి యందు శతవర్షంబు లతిభీషణంబగు ననావృష్టిసంభవించు. సూర్యుడును నుగ్రంబులగు తనకిరణంబులచే మూఁడు లోకంబులను బరితపింపజేయు. సంకర్షణముఖానలుండు మహావాయు ప్రేరితుండై పాతాళతలంబునుండి యూర్ధ్వజ్వాలాభీలుండై ప్రజ్వలించి లోకంబుల నెల్లను దహించుచు నంతటను నిండి వెలుంగు. అంత సంవర్తకు మేఘగణంబు దివిన్నెరసి విజృంభించి యేనుంగుతుండంబు లంతంతలగు ధారలతో వర్షంబు శతసంవత్సరంబులు గురియు. అజలంబునవిరాడ్దేహంబు మునింగి

లయంబొంద వైరాజపురుషుం డాదేహంబు వదలి నిరింధనానలంబు చందంబున సూక్ష్మంబగు నవ్యక్తంబుఁజేరు. ఇది వైరాజలయం బింకఁ బృథివ్యాదిమహత్తత్త్వపర్యంతఁబులగు తత్కారణంబుల లయప్రకారంబు వినుము. పృథివి సంవర్తకాలనిలాపహృతగంధయై జలంబగు. జలంబును ననలాపహృత రసంబై తేజోరూపంబు దాల్చు. తేజంబును దమోఽపహృత రూపంబై వాయువునందుఁ గలియు. వాయువు నాకాశాపహృత స్పర్శంబై తామసాహంకారంబునను నింద్రియంబులును బుద్ధియు రాజసాహం కారంబునను మనంబును దద్వికారాకారంబులును సాత్వికాహంకారంబు నందును విలీనంబులగు. అహంకారంబు నిజగుణత్రయ తత్కార్యసహితంబై తత్కారణంబగు మహత్తత్త్వంబునం గలియు. అదియుఁ దత్కారణం బగు నవ్యక్తంబునందును నవ్యక్తంబు సర్వకారణకారణంబగు బ్రహ్మంబునందును లీనంబగు. 103

తే.గీ. ఇది మహావిష్ణుమాయ యి - దే నరేంద్ర
జగములు సృజించు రక్షించు - సమయఁజేయు
నట్టి త్రిగుణాత్మిక దురత్య - య ప్రభావ
వింటివె మఱేమి వినవలె - వెఱవకడుగు. 104

వ. అనిన విని నిమి యమ్మునివరుల కరుణకు నుబ్బుచు నిట్లనియె. 105

చ. అవశమనస్కులై జడము - లౌ తనువుల్ దముఁగాఁ దలంచు వా
రెవరికి దాటరాని పర - మేశ్వరమాయను జుల్కఁగాఁ దరిం
చు వెరవు నానతీయవె వి - శుద్ధ చరిత్ర మహర్షిచంద్ర యీ
వివర మవశ్యవేద్యము ప - విత్రము మానవకోటికెంతయున్. 106

వ. అని యడుగుటయుఁ బ్రబుద్ధుండును మహాపురుషం దాతేనిం గనుంగొని యిట్లనియె. 107

ఆ.వె. సతులుఁ బతులుఁ గూడి - సంసృతిఁ జరియించు
నరులు దుఃఖములను - బరిహరింప
సుఖములొందఁజేయు - నఖిల కర్మంబుల
ఫలము దుఃఖమగుటఁ - దలఁపవలయు. 108

చ. అనిశముఁ దాము కష్టపడి - యార్జనఁజేసెదు నాత్మమృత్యువౌ
ధనమును బ్రేమపాత్రములు - దారలు బిడ్డలు నాప్తబంధువుల్
ఘన పశుసంచయంబు నను - కామ్య పరిగ్రహమైన సంసృతిం
గను సుఖమేమి చంచలము - గాదె యిదెంతయు నెంచి చూచినన్. 109

మ. భువి దుల్యాతిశయప్రణాశ యుతమౌ - భూపాల కాన్యోన్యమై
భవమందుం బలెఁ గర్మ నిర్మితములౌ - స్వర్గాదులందుం దొలం
గ వసూయాదులు భోక్తకుం జివరకా - కర్మంబు క్షీణింప నా
భువనంబు ల్నశియించు నిల్వవని స - ద్బుద్ధిన్గ్రహింపందగున్. 110

ఉ. కావున నిందు నందును సు - ఖంబు లవంబును లేమిఁజూచి స
ద్భావముతో ననుత్తమ శు - భంబగు దాని నెఱుంగఁగోరు నా
పావనుఁ డాగమాంత పర - భావ మశేషమెఱుంగు బ్రహ్మని
ష్ఠావిరతుప్రశాంతుని మ - హాత్ముని సద్గురుఁ జేరఁగాఁదగున్. 111

వ. ఇట్లు సకలసంశయనిరాకరణదక్షుండును నపరోక్షాత్మానుభవ విచక్షణుం డునునగు దేశికోత్తముం జేరి వారు దనుం గడతేర్ప నవతరించిన సాక్షాద్బ్రహ్మంబును దనకు నత్యంత ప్రీతిభాజనంబునుంగా నాత్మం దలంచుచు వారి నమాయికపరమభక్తిశ్రద్ధలతో సేవించి యేభాగవతధర్మంబు లెఱింగి యనుష్ఠించినం బరమేశ్వరుండు మెచ్చి నిజస్వరూపంబు భక్తుల హృదయంబులయం దనవరతంబు నిలువ ననుగ్రహించు నట్టి సాధు సంగంబును మనంబునకు నఖిల విషయసంగ పరిత్యాగంబును హీనులయెడ దయయు సములయెడ మైత్రియు నుత్తములయెడ వినయంబును నగు సర్వభూతయథోచితాత్మప్రవర్తనంబును మృజ్జలాదులచే నగు బాహ్యశుద్ధియు నదంభమౌనాదికంబగు నాభ్యంతరశుద్ధియు విధివిహిత నిజధర్మానుష్ఠానంబును దుఃఖంబు లవశంబుగఁ బొసంగిన నవి నిర్వికారత నోర్చికొనుటయు వృథావచనంబు లుచ్చరింపకుండుటయుఁ దన యధి కారంబు కొలఁది వేదాధ్యయనంబును త్రికరణశుద్ధియు ఋతుస్వదార నియమాది యథోచిత బ్రహ్మచర్యంబును భూతద్రోహం బొనర్పమియు ద్వంద్వంబు లనఁబడు సుఖదుఃఖాదులయందు హర్షవిషాదాది

రాహిత్యంబును సర్వభూతంబుల హృదయంబులనుండు సంవిద్రూపుండగు నాత్మని సర్వనియంతయగు నీశ్వరుని నెల్లప్పుడు నెఱుంగుచుండుటయు నేకాంతశీలత్వంబును గృహాద్యభిమాన రాహిత్యంబును నెందేని విజనస్థలంబునఁ బడియుండు వస్త్రఖండంబులైనను నిర్మలవల్కలంబు లైనను ధరించుటయు విధివశంబునందన కులబ్ధంబగునే పదార్థమ్ముచేనైనను బరితుష్టినొందుటయు భగవత్ప్రతి పాదకంబగు శాస్త్రంబునందు శ్రద్ధయు నన్యశాస్త్రంబుల నిందింప కుండుటయుఁ బ్రాణాయామాదులచే మనోదండంబును మౌనంబుచేత వాగ్దండంబును నిచ్ఛారాహిత్యంబుచేతఁ గర్మదండంబును నప్రాణిపీడా కరంబగు యథార్థవచనంబును నంతః కరణనిగ్రహంబును బహిరింద్రియ నిగ్రహంబును నద్భుతచరితుండగు భగవంతుని జన్మకర్మగుణంబుల న్వినుచుఁ గీర్తించుచు ధ్యానించుచుఁ దాఁ జేయు యజ్ఞదానజపతపః ప్రముఖంబులగు నఖిలకర్మంబులును దన సదాచారంబును మఱియు తనకుఁ బ్రియంబగు నఖిలవస్తుసముదయంబును దన దారాపత్యగృహ ప్రాణాదికంబగు సమస్తమ్మును దత్సేవాత్మకంబులుగా నాభగవంతునికే సమర్పించుటయు నను నుత్తమభాగవతధర్మంబు లా సద్గురు ననుగ్రహంబున నభ్యసించుచుం గేవల భగవత్ప్రపన్నులగు భక్తులయెడ నిర్వ్యాజంబగు స్నేహంబుగలిగి స్థావర జంగమాత్మకంబగు నీ భగవన్మూర్తి భేదంబులను నందును విశేషించి మానవ వ్యక్తులను నందును స్వధర్మపరులగు సాధువులను వారి యందును మహాభాగవతులను నిర్మల భక్తియుక్తుండై సేవించుచు వారుం దానునుం జేరి యాపరమపావనుండగు పరమేశ్వరుని దివ్యయశం బొకరితో నొకరు చెప్పుకొనుచు నన్యోన్యప్రేమయు సంతోషంబును, సుఖంబును విషయాత్యంతిక నివృత్తియు స్వభావంబు లగునట్లు ప్రవర్తించుచుండవలయు మఱియును. 112

క. కలుషహరుఁడైన శ్రీహరిఁ
దలఁచుచు నన్యులకు నతనిఁ - దలఁపించుచు ని
ర్మల భక్తిఁబుట్టు ప్రేమం
బులకిత సర్వాంగులగుచుఁ - బొల్తురు భక్తుల్. 113

మ. భగవచ్చింత మునింగి యేడ్తు రొకచో - భక్తుల్ గళద్బాష్పులై
నగుచున్ శ్రీహరి లీలలందలంచి యా - నందించుచు న్వెక్కుచున్
విగతాన్యస్పృహ నాట్యముల్ సలుపుచు - న్గీతంబులం బాడుచున్
భగవత్క్రీడ లొనర్చియుందు రొకచో - బ్రహ్మాప్తి నిశ్చేష్టులై. 114

మ. మనుజాధీశ్వర వింటె భాగవత ధ - ర్మంబు ల్నరుం డెవ్వఁడొ
య్యన వీనిన్ గురుశిక్షితుండగుచు న - భ్యాసంబుగావించుఁ గ్ర
న్నన నందున్ జనియించు భక్తి నతఁడా - నారాయణున్నమ్మి య
ల్లస దుర్లంఘ్య నమేయమాయనవలీ - లందాటుధన్యాత్ముఁడై. 115

వ. అనినవిని యావిదేహవిభుండు బ్రహ్మంబనియుఁ బరమాత్ముండనియు భగవంతుండనియుఁ బలువిధంబులఁ బ్రశంసింపఁబడు శ్రీమన్నారాయణుని నిజస్వరూపం బెఱుంగంగోరెద మది మాకు వివరింప బ్రహ్మవిద గ్రగణ్యులరగు తామే యర్హులరని సవినయంబుగాఁ బ్రార్థింపవిని పిప్పలాయనుండను మునీంద్రుండిట్లనియె. 116

సీ. హేతువిహీనమౌ - నెయ్యది హేతువౌ
విశ్వసర్గస్థితి - విలయములకు
స్వప్నజాగరసుప్త్య - వస్థలఁ జేరియుఁ
జేరక వెల్గించు - స్థిరతనేది
మూఁడవస్థలుమాసి - పోయిన పిమ్మట
దనయంత వెల్గు చై - తన్యమేది
దేహేంద్రియప్రాణ - ధీ మానసాదులు
దేనిచే జీవించి - తిరుగుచుండు

తే.గీ. నదె సుమీ కార్యకారణ - తాతిరిక్త
మద్వయాఖండచిన్మాత్ర - మమల మఖిల
జడపదార్థప్రకాశక - స్వప్రకాశక
మౌ పరంబగు నారాయ - ణాఖ్యపదము. 117

చ. అనలమునందుఁబుట్టిన ని - జాంశములైన స్ఫులింగహేతుల
య్యనలముగాల్పలేని క్రియ - నాపరతత్త్వమెఱుంగలేవు త

జ్జనితనిజాంశముల్ మనసు - చక్షువు వాక్కు సుబుద్ధి దానిగాం
చనివివియన్స్వంతంత్రశ్రుతి - సైతముపల్కదు దానినేర్పడన్. 118

సీ. మొదలనొండగుబ్రహ్మ - మునె త్రిగుణాత్మిక
యగు ప్రధానంబందు - రంత దాని
నందురుసూత్రాత్మ - యని క్రియాశక్తిచే
జ్ఞానశక్తిని మహ - త్సంజ్ఞనెంతు
రంత జీవోపాధ్య - హంకార మదె యంద్రు
జ్ఞానక్రియార్థ ఫ - లానుకృతుల
దైవతకరణార్థ - తత్ప్రకాశములన
నురుశక్తియౌ బ్రహ్మ - మొకటె వెలయుఁ

తే.గీ. గావున ఘటాదులకు మృత్తి - కయునుబోలె
నీసదసదాత్మికమునకు - హేతువును న
భిన్న మగునది బ్రహ్మమే - వేఱుగాదు
బ్రహ్మమిది సర్వమనుశ్రుతి - భావమిదియె. 119

చ. జననమువృద్ధియున్ క్షయము - చావును నాత్మకులేవు మాఱునీ
తనుకరణాద్యవస్థలను - దత్సమయంబులఁజూచుచుండు ఛి
ద్ఘనుఁడతఁ డెప్డు డెందు నవి - కారిత వెల్గుచునుండు నింద్రియా
ళినెనసియున్ వికారములు - లేక మెలంగెడు ప్రాణుపోలికన్. 120

ఉ. మావినిఁబుట్టుజంతువుల - మ్రాకులగ్రుడ్డులస్వేదజంబులన్
జీవుడుపుట్టఁబో నతనిఁ - జేరఁజనుంగదప్రాణుఁ డట్టులే
యీవివిధేంద్రియంబులు ల - యింపనహంకృతిసుప్తిమాయ సూ
క్ష్మావరణంబు లేమి నొకఁ - డై సుఖమాత్రతనాత్ముఁడుండఁడే. 121

వ. అని మఱియు సుషుప్తికాలంబున నిట్లు కూటస్థ నిర్వికారాత్మానుభవంబు గల్గియు మఱల సంసారంబేలా తోఁచు నది యవిద్యాతత్సంస్కారంబులు మిగిలియుండుట వలన నంటేని నవ్వాని నివృత్తిహేతువగు ననుభవం బెప్డుడగునని సంశయించు నిమింగని యింగితజ్ఞుఁడగు పిప్పలాయనుం డిట్లనియె. 122

సీ. ఏషణత్రయమున - నెంత బలంబుండు
నంత బలంబుతో - నబ్జనాభు
చరణంబులు భజించి - సల్పు సద్భక్తిచే
జిత్తంబునందు సం - చితములైన
గుణకర్మజాతని - గూఢ మలంబులఁ
బురుషుఁడు నిశ్శేష - ములుగ నెపుడు
మాయించునపుడు ని - ర్మలదృష్టి యగువాని
కనులకు రవిఁదోచు - కరణి నతని
ఆ.వె. శుద్ధ చిత్తమందుఁ - జూపట్టుఁ దేటగా
నద్వితీయమైన - యాత్మతత్త్వ
మంత మఱలఁ బొడమ - వావిర్భవంబుల
జ్ఞానమూలకములు - సంశయములు. 123
వ. అనిన విని నిమి భక్తి కర్మయోగాధీన యగుటంగని యిట్లనియె. 124
తే.గీ. పురుషుఁడెద్దాన సంస్కార - మును గడించి
పరగఁ గర్మములిందె నా - శం బొనర్చి
పరమనైష్కర్మ్యమొందు నా - భవ్యమైన
కర్మయోగంబు మాకెఱు - గంగఁ జెపుఁడు. 125
వ. మౌనీంద్రులారా! మున్ను మాతండ్రియగు నిక్ష్వాకుని సన్నిధిన్నే నీప్రశ్నంబడిగిన సర్వజ్ఞులయ్యును సనకాది మహామునులేమియు నానతీయరై రది యేమికతంబుననో యెఱుంగ నదియునుం జెప్ప మీరే యర్హులరని నిమి వినయంబున వేఁడుటయు నావిర్హోత్రుండను మునీంద్రుం డిట్లనియె. నరేంద్రా! కర్మంబనియు నకర్మంబనియు వికర్మంబనియుం గర్మంబు త్రివిధంబు - ఇది లోకవ్యవహారసిద్ధంబుగాక వేదైక గమ్యంబై యుండు. వేదంబును నీశ్వరాత్మకంబై యపౌరుషేయం బగుటంబట్టి దాని యర్థంబు వాక్య పౌర్వాపర్యంబుచేతనే గ్రహింపందగు. అది కారణంబుగా వేదార్థనిర్ణయం బొనరించునెడ విద్వాంసులే భ్రమపడుచుందురన నిఁ కబాలుర నేమి సెప్ప. నీవప్పుడు బాలుండవై యుండుటం జేసి నీవడిగిన

యర్థంబు నీకు దుర్గ్రహంబని యమ్మౌనీంద్రులు నీకుం జెప్పరైరి. వినుము విధివిహితంబు కర్మంబనియు నిషిద్ధం బకర్మంబనియు విహితాకరణంబు వికర్మంబనియు నెఱుంగంబడు. అజ్ఞుల కెఱుంగరాని తన యర్థం బెఱింగింపంగోరి నిగమం బొకయర్థంబు వివక్షితంబగుచుండ దాని న్మఱుగుపఱచి మఱియొక యర్థం బుపదేశించు. ఇది పరోక్షవాదంబు నాఁ బరగు. తల్లి రోగియగు తన తనయునకు నౌషధం బియ్యంగోరి యది వాఁడు దినుంగాక యని యిదె పండిత్తునని యాసఁగొల్పి యారెండును నిచ్చి వానికి నారోగ్యంబు గలిగించు తెఱంగున నిగమంబు కర్మబంధంబునుండి పురుషుని విడిపింపందలంచి తత్సాధనంబుగా స్వర్గాది ఫలదంబగు కర్మానుష్ఠానం బుపదేశించి తత్ఫల లోభంబునైన వానిచే నాకర్మం బనుష్ఠింపం జేయు. పురుషార్థంబు కర్మమోక్షంబుగదా యని యజితేంద్రియుండగు నేయుజ్ఞుండు వేదోక్తకర్మంబుఁ దొలుతన యాచరింపం డతం డది విధిహిత కర్మాకరణంబగుట నధర్మం బగు వికర్మంబునంబడి మృత్యుపరంపరం బొందు. అట్లుగాక కర్మఫలాసంగంబు మాని యీశ్వరార్పితంబుగా వేదోక్తకర్మం బెవ్వం డాచరించు వానికిఁ గర్మంబులు నశించి నైష్కర్మ్యసిద్ధి లభించు. వేదోక్త కర్మంబునకు స్వర్గాదికంబు ఫలంబుగాఁ జెప్పుట తత్కర్మాచరణంబునకుఁ బురుషుం బురికొల్పుటకే యని తెలియును. కామికి స్వర్గాది ఫలసిద్ధి నిచ్చు నీకర్మంబై యకామికి నైష్కర్మ్యసిద్ధి నొసంగు. ఇది వైదిక కర్మయోగప్రకారంబు. పరాత్ముండైన జీవునకుం గలిగిన దేహాద్యహంకారరూపంబగు హృదయగ్రంథి నెవ్వం డచిరంబ భేదింపంగోరు వాఁ డీకర్మయోగంబునకుఁ దోడుగా నాగమోక్త కర్మయోగ విధానంబునం బరమేశ్వరు నారాధింపవలయు నది యెట్లనిన. 126

తే.గీ. ముందు నాచార్యుని కటాక్ష - మొంది వారు
తనకుఁ జూపిన దేవతా - ర్చన విధాన
మునఁ దనకు నిష్టమైనట్టి - మూర్తితోడఁ
బరమపురుషుని నర్చింప - వలయు బుధుఁడు. 127

సీ. పూతుఁడై మూర్తి స - మ్ముఖమునఁ గూర్చుండి
ప్రాణసంయమన మౌ - నాది విధుల
దేహంబు శోధించి - తివిరి షణ్న్యాసకృ
తాత్మ రక్షుండయి - హరిసమర్చ
సల్పనౌ నదియు న - ర్చా విగ్రహము నందౌ
స్వాంతంబుననౌ సేయ - వచ్చు నందుఁ
దొలుత లభించిన - కొలఁది పూజాద్రవ్య
ములుకూర్చి శోధితం - బుల నొనర్చి
తే.గీ. గృహము శుభ్రముఁ జేసి వి - గ్రహముఁదోమి
చిత్తమేకాగ్ర మొనరించి - యుత్తమాస
సమునఁ బ్రోక్షించి కూర్చుండి - విమలభక్తిఁ
బూజసేయంగవలె విష్ణు - మూర్తిఁదలఁచి. 128

వ. అదెట్లనిన 129

సీ. అర్ఘ్యపాద్యాది పా - త్రాసాదన మొనర్చి
చిత్తంబునందుఁ బూ - జింపఁబడిన
హరిమూర్తి నావిగ్ర - హమునందు ధ్యానించి
కరహృదాది న్యాస - కలితుఁడగుచు
మూలమంత్రమున నా - మూర్తి సాంగోపాంగ
పార్షదంబుగ శాంత - భవ్యముగను
దలఁచి పాద్యార్ఘ్యాద్య - ముల స్నానవస్త్రభూ
షణగంధమాల్యపు - ష్పములచేత
తే.గీ. ధూపదీపోపహార బం - ధురముగాఁగ
శ్రద్ధతోఁబూజసేసి ని - శ్చలమనస్కుఁ
డవుచు శ్రుత్యుక్తరీతిని - స్తవమొనర్చి
యంత ప్రొక్కంగవలయు సా - ష్టాంగముగను. 130

క. తనుఁ దన్మయునిగఁ జిత్తం
బున హరిమూర్తిం దలంచి - పూజింపవలెన్

వెనుకఁ బ్రసాదము శీర్షం
బున నిడికొని యుద్వసించి - పుచ్ఛఁగవలయున్. 131

వ. దేవుఁ ం దన హృదయంబునను మూర్తిని సంపుటంబు నను సమాదరంబున
నునిచి పూజావిధిని సమాప్తి నొందించు టాగమిక సంప్రదాయంబు 132

తే.గీ. అగ్నిరవిజలముఖ్యంబు - లందుగాఁని
యతిథియందును హృదయంబు - నందుఁగాని
యెవఁడు పూజించు నాత్మయౌ - నీశు నిట్లు
వాఁడు శీఘ్రంబె ముక్తి సం - ప్రాప్తిఁ గాంచు 133

వ. అని తాంత్రికకర్మయోగప్రకారంబు వినిపింప న్విని నిమి యిట్లనియె. 134

- : శ్రీభగవ దవతార వర్ణనము : -

తే.గీ. ఇల నిజేచ్ఛను శ్రీహరి - యెత్తునట్టి
జన్మములలోన నెందెందుఁ - జక్రి యేమి
సేసెఁ జేయుచునున్నాఁడు - సేయఁగలఁడు
మాకు దయ నానతీయరే - మౌనులార. 135

వ. అని యడుగుటయు 136

క. లీలావతారముల హరి
కాలత్రయమందుఁ జేయు - కార్యంబులు భూ
పాలక జగమున నెవఁడుం
జాలఁడు గణుతింప మాకు - శక్యంబగునే. 137

చ. ధరణిఁ బరాగ రేణువులఁ - దాలిమి నెట్లయిన న్గణించు నొ
క్కరుఁడొక కొంతకాలమునఁ - గాని యనంతుని సర్వశక్తి బం
ధురుని యనంతలీలలను - నూల్కొనియెన్న నెవండునేర్చు నె
వ్వరు గణుతింపఁ బూనుదురు - వారలు మందమతుల్ ధరాతలిన్ 138

క. ఐనను నడిగితివయ యివ్వు
డో నరపతి సంగ్రహముగ - నొక కొన్నిటి నీ
కేను వివరింతు ననుచు మ
హానియమి ద్రమీళుఁడనియె - హర్షముతోడన్. 139

తే.గీ. పంచభూతంబులను దాసృ - జించి వాని
చేత వైరాజదేహంబు - సృష్టిసేసి
యందు స్వాంశతఁజొచ్చిన - యాదిదేవుఁ
డైన నారాయణుఁడు పురు - షాఖ్య నొందె. 140

వ. ఇది పురుషావతారంబు. దీని మహిమంబు వినుము. 141

సీ. ఎవ్వని దేహమౌ - నీమూఁడులోకంబు
లెవని యింద్రియముల - నెసఁగుచుండు
నుభయేంద్రియములు జీ - వోపాధులందెల్ల
నెవని రూపమె జ్ఞాన - మెందుఁజూడ
నెవని ప్రాణమున నౌ - నీశరీరబలంబు
నింద్రియ శక్తియు - నెల్లక్రియలు
సత్త్వాది గుణముల - జగతిభూతములకు
స్థితిలయోద్భవములు - సెల్లుచుండు
ఆ.వె. నతఁడె యాదికర్త - యైన నారాయణుం
డతని గుణములూది - యజహరీశు
లఖిల సర్గ రక్ష - ణావ్యయకర్తలై
పరుగుచుందు రిదియె - పురుషమహిమ. 142

వ. ఇంక నరనారాయణావతార ప్రకారంబు వినుము. 143

సీ. మునుధర్మునకు దక్షు - పుత్రిక మూర్తియం
దాదిదేవుండు నా - రాయణుండు
ప్రభవించె నరుఁడు నా - రాయణుం డన రెండు
మూర్తుల ఋషులుగాఁ - బుడమియందుఁ
దీవ్రతపః ప్రశాం - తిని సుప్రసిద్ధులై
నిష్కామకర్మ స - న్నిష్ఠ తెఱఁగు
నారదాదుల కరు - దార బోధించి తా
మాచరించి ఋషీంద్రు - లంఘ్రియుగము

తే.గీ. భక్తిసేవింప నిప్పుడున్ - బదరికాఖ్య
వనమునందుఁ దపోనిష్ఠఁ - దనరియున్న
వారు రాజేంద్ర! వినవయ్య - వారి పరమ
శాంతి కితిహాస మొందు బో - ధింతు నీకు. 144

సీ. పరమపవిత్రమౌ - బదరికాశ్రమమున
నారాయణ మహర్షి - నడుపుచున్న
యతితీవ్ర తపమును - శతమన్యుఁ డీక్షించి
తనపదమతఁడుగ్గై - కొనునొయనుచు
శంకించి మదను న - చ్చరల వసంతుని
ననిలుఁ గోయిలలను - నళులనతని
తపమును జెఱుప స - త్వరముగఁ బనిచె నా
కాముండు సగణుఁడ - క్కానకేగి

తే.గీ. ఋషివరేణ్యుని మహిమంబు - నెఱుఁగ కునికి
నతనిఁదన స్త్రీ కటాక్ష తీ - క్ష్ణాశుగముల
నేసె య్యింద్రు నపరాధ - మెఱిఁగి ఋషియు
వానితో ననె నగుచు గ - ర్వంబుదక్కి. 145

మ. భయ కంపంబులు మానుఁడోమదన! దే - వా వాత! దేవాంగనా
చయమా! మీరతిథుల్ మదాశ్రమమునన్ - సంతుష్టినాతిథ్యమున్
నయమొప్పం గొనుఁడిందురందు సరగన్ - ధర్మంబు శూన్యంబుగా
కయటన్ సుస్థితినొంద నాదు మనవిన్ - గావింపుఁడాసత్కృపన్. 146

చ. అని వినయంబుతోడ నభ - యప్రదుఁడై ఋషివేఁడ సిగ్గునన్
వినత శిరస్కులై యనిరి - నిర్జరులాత్మ గరంగునట్లుగా
ఘనుఁడవు మాయదాటితి వి- కారమెఱుంగ వనన్యనిష్ఠ ధీ
రనికరవందితాంఘ్రివి స్థి - రత్వము సత్కృప నీకుఁజిత్రమే? 147

సీ. నిన్ను సేవింపక - జన్నములను దమ
కెవరు హవిర్భాగ - మిచ్చుచుందు

రట్టివారికి సుర - లాచరింపరు విఘ్న
మట్లుగా కెవ్వ ర - నన్యభక్తి
నిన్ను సేవించుచు - నిర్జరలోకంబు
దాటి నీయుత్తమ - స్థానమొంది
ధన్యులౌదురు వారిఁ - దలబడి బహువిఘ్న
వృతుల జేయుదురు దే - వతలు గినిసి
తే.గీ. యైన నావిఘ్నముల తల - పైన నీదు
పాదమునిచి రక్షింతువు - భక్తకోటి
నట్లగుట వారు సురకృతం - బైన విఘ్న
భయము క్షోభంబుఁగోపంబుఁ - బడరు చెడరు. 148
సీ. ఆఁకలి దప్పుల - నణఁచి కొందఱును శీ
తోష్ణవర్షంబుల - నోర్చి యొరులు
నియమిత ప్రాణులై - నిలిచి కొందఱును జి
హ్వాశిశ్నభోగము - ల్వదలి కొంద
ఱతిదుష్కరతపంబు - లాచరించి యపార
జలధి దాటియును ని - ష్ఫలములైన
క్రోధాదులకుఁ జిక్కి - గోష్పదంబున మున్గి
శాపాదులఁ దపంబు - క్షయము నొంద
తే.గీ. భోగమోక్షంబులకుఁ దప్పి - పొల్లుపోయి
విఫలులౌదురు నిన్ను సే - వింపలేక
కేవలతపంబు చేసిన - కీడువలన
నమిత సౌజన్యసాంద్ర!మహర్షి చంద్ర! 149
తే.గీ. దివిజులీరీతిఁ దన్ను ను - తింప ఋషియుఁ
జక్కదనమున నెల్ల య - చ్చరలఁ గేరు
యువతుల స్వలం కృతలందన - యోగశక్తిఁ
జూపెవారల గర్వంబు - మాపుకొఱకు. 150

ఆ.వె. చూపివారినెల్ల - శుశ్రూష సురలకుఁ
జేయఁబనిచి స్నాన - చిత్రవస్త్ర
భూషణాశనాద్య - శేషోపచారిసం
తుష్టులను బొనర్చి - హృష్టుఁడయ్యె. 151

ఆ.వె. లక్ష్మిఁబోలు రూప - లావణ్యవతులను
జూచి దివిజసతులు - చోద్యమంది
వెల్లనైరి గంధ - వివశలై కాంతివి
హీనులైగతాభి - మానలగుచు. 152

వ. అంత 153

మ. తనకున్మ్రొక్కి యనుగ్రహించి పనుపన్ - దన్వేఁడు దేవాంగనా
జనముంజూచి మహర్షి సుస్మితముతో - స్వర్గార్థయౌనంచు మీ
మనమందొప్పినదాని నిందునొక కొ - మ్మంగొంచుఁ బొండన్న వా
రును వల్లెయని యూర్వశింగొనుచు నిం - ద్రుం జీర నుద్యుక్తలై. 154

వ. ఋషీంద్రునకు మ్రొక్కి వారిచే ననుజ్ఞాతలై యప్సరశ్శ్రేష్ఠయగు నూర్వశిం బురస్కరించుకొని దివంబున కరిగి మహేంద్రునకు నమస్కరించి సభాసదులైన సకల దేవతలును వినుచుండ నా దేవదేవేశుండగు నారాయణమహర్షి మహిమం బంతయును విన్నవించి యూర్వశి నర్పించిరి. ఇంద్రుండు విస్మితుండును జకితాత్ముండును నై యుండె. ఇది నారాయణావతారప్రకారంబు. జగదనుగ్రహార్థంబుగా భగవంతుండు భూలోకంబునం దన యంశంబున నుద్భవించి వెలయించిన మఱికొన్ని యవతారంబులు వివరించెద వినుము. 155

సీ. హంసస్వరూపుఁడై - యాత్మయోగముఁ దొల్లి
పరమేష్ఠి కెఱిగించెఁ - గరుణతోడ
నత్రికుమారుఁడై - హైహయ యాదవ
ప్రకరంబులకు యోగ - బలమొసంగె
సనకాదియోగుల - జన్మంబునొంది ప్ర
త్యక్షంబుగాఁ జూపె - నాత్మనిష్ఠ

మాతండ్రి ఋషభుండై - మహి సర్వధర్మ ప్ర
పంచంబుఁ దా నాచ - రించిచూపె

ఆ.వె. ప్రళయమందు వేద - ముల మధుకైటభుల్
గొని రసాతలమున - నునిచినపుడు
హయశిరస్కుఁడగుదు - హరి రాక్షసులఁ జంపి
వేదములను దెచ్చి - విధికి నిచ్చె. 156

మ. మును గల్పాంతమున న్మహాజలనిధి - న్మగ్నంగనున్నట్టి భూ
మిని సప్తర్షుల నోషధీచయముఁ బ్రా - మిన్కుంగమిం బ్రాణులన్
మనువుం దత్ప్రళయాబ్ధిమధ్యమున మీ - నంబై లయాంతంబు దాఁ
కనురక్షించి విధాతకిచ్చె దనుజా - క్రాంతంబులౌ వేదముల్. 157

చ. తన కజుఁడిచ్చినట్టివర - దానమునం గడు గర్వమొంది కాం
చననయనాసురుం డవని - సాగరమందున ముంచి కొంచుఁబో
వ నెదిరి క్రోడరూపమున - వాని వధించి ధరిత్రిఁ గొమ్మునన్
మునుకొనియెత్తె నీశ్వరుఁడు - భూతములెల్లను దన్నుతింపగన్. 158

చ. అమృతముగోరి దేవదను - జావళి మందరపర్వతంబుఁ గ
వ్వముగ నొనర్చి పాల్కడలి - వైచి మథింపఁ దొడంగ నద్రిసం
ద్రమున మునుంగుచున్నఁగని - దైన్యముతో నిరువాగు వేఁడఁగాఁ
గమఠపురూపు నచ్యుతుఁడు - గైకొని పర్వతమెత్తెవీఁపునన్. 159

మ. బలియుండయ్యు గజేంద్రుఁడామొసలిచేఁ - బాదద్వయాబద్ధుఁడై
వెలికింబోవఁగరాక పౌరుషముతోఁ - బెక్కేండ్లు పోరాడి భీ
తిలి రక్షించెడివారులేమి హరిఁబ్రా - ర్థింపన్ గృపాయత్తుఁడై
నలినాక్షుండు గజేంద్రుఁగాచె మకరిన్ - ఖండించి చక్రంబునన్. 160

మ. సమిధల్ దెండని కశ్యవుండనుపఁద - త్సంరంభులంగుష్ఠ మా
త్రమహాసూక్ష్మతనుల్ దపస్వులగు వా - రల్ వాలఖిల్యాఖ్యులా
సమిధల్ దెచ్చుచు గోష్పదాంబు విధిలో - శక్రుండు నవ్వంగఁగూ
లి మదింగుంది నుతింప శ్రీహరియె జా - లిం బాపె మున్వారికిన్. 161

మ. అమితౌజోబలవిక్రమాన్వితుఁడు వృ - త్రాఖ్యాసురుం దేచి యు
ద్ధమునం ద న్వధియింపవచ్చినఁ దదౌ - ద్ధత్యంబు వీక్షించియు
ల్కి మహేంద్రుండతనిన్ వధించి తన క- ల్మింబాసియెందేని సం
తమసంబందు నడంగియున్న హరి త - ద్దైవ్యంబు వాపెం గృపన్162

సీ. బ్రహ్మయిచ్చిన యమ - రత్వపరంబున
గర్వించి సకల ది - కృతులు దనకు
లెంకలై కొల్వ ని - లింపకామినులను
ననదలఁ బట్టి గే - హమున నునిచి
లోకంబులకునెల్ల - భీకరశత్రువై
సాధువౌ తన పుత్త్రు - బాధపెట్టి
కలుషియైన హిరణ్య - కశిపుని నిర్జింప
నిర్జరుల్ వేఁడిన - నిఖిలలోక
తే.గీ. భయదమైనట్టి నరసింహ - వపువుఁదాల్చి
దేవతలు సంస్తుతింప నా - దితిజుఁ జంపి
చెఱను బడియున్న దేవతా - స్త్రీల విడిచి
విష్ణుఁడీ విశ్వమునకెల్ల - వెఱపుఁదీర్చె. 163

క. దేవాసుర యుద్ధంబున
దేవతలకు హితము సేయ - దృఢనిశ్చయుఁడై
దేవారివీరులను హరి
ప్రావీణ్యంబున హరించి - ప్రస్తుతిఁగాంచెన్. 164

ఆ.వె. మఱియు విష్ణుఁ డఖిల - మన్వంతరంబుల
వివిధరూపములఁ బ్ర - విష్టుఁడగుచు
నవతరించి సకల - భువనంబులను శిష్ట
పాలనంబొనర్చె - లీలమెఱసి. 165

సీ. భార్గవులిచ్చిన - బలమున బలి తన
బలముతో నాకంబుఁ - బట్టుకొనిన

బలవైరి రాజ్యవి - భ్రష్టుఁడై సగణుఁడై
యడవులఁ గొండల - నడఁగియుండ
నదితికశ్యపులకు - నాత్మజుఁడై హరి
వామనుండనఁబుట్టి - వజ్రికొఱకు
బలిని మూఁడడుగుల - స్థలమిమ్మనుచువేఁడి
యాతఁడిచ్చిన యంత - నపుడె పెరిఁగి
తే.గీ. మూఁడుపదముల ముల్లోక - ములను నిండి
విశ్వమయతఁ ద్రివిక్రమా - భిఖ్య నొంది
బలిసి బంధించి వెస రసా - తలముఁజేర్చి
దేవరాజ్యంబు వజ్రికిఁ - దిరుగ నిచ్చె. 166
సీ. కార్తవీర్యార్జునా - ఖ్యానుండు హైహయుం
డొకనాఁడు జమదగ్ని - యున్నయెడకుఁ
జని సత్కృతుండయి - మునిహోమధేనువు
బలిమిమైఁ గొనిపోవఁ - బరశురాముఁ
డని వానిఁజంపె నా - తని పుత్త్రకులు రేగి
జమదగ్ని జపనిష్ఠుఁ - జంపి సనిరి
బ్రహ్మఘ్నమగు క్షత్త్ర - వర్గంబు ముయ్యేడు
మాఱులు రాముండు - మాఱులేక
ఆ.వె. పరశుధార నఱికి - ధరణి నిఃక్షత్త్రఁగా
వించి యంతఁ దాను - విష్ణుఁ డగుటఁ
దంద్రికొఱకు వేల్చి - తా నిల్పె నాతని
శాశ్వతముగ దివిని - సప్తఋషుల. 167
సీ. ఆతఁడే యిపుడ యో - ధ్యాపురి దశరథు
పట్టియై హరుని చా - పంబు విఱిచి
జానకిఁ బెండ్లాడి - మౌనియై వనికేగి
దనుజులఁబెక్కంద్ర - నని వధించి

దశకంధరుండు సీ - తను గొనిపోయిన
నాయమ వెదకుచు - నడవిఁదిరిగి
వానరపతిఁగూడి - వాలినిఁ జంపి పా
వని సెప్ప జానకి - వార్తఁదెలిసి
తే.గీ. కపులతో నబ్ధిఁగట్టి లం - కపయి నెత్తి
సబలబంధుని రావణు - సంహరించి
సీతతోఁగూడి పట్టాభి - షిక్తుఁడై య
యోధ్యనేలెడు శ్రీరాముఁ - డూర్జితముగ. 168
సీ. ద్వాపరాంతమున యా - దవులందు రామకృ
ష్ణాఖ్యల శేషుండు - హరియు జన్మ
మెఱుఁగని వారయ్యు - నీ ధరాభారంబు
నడఁగింప బుట్టి జ - న్మాదినుండి
బలవంతులగు రక్క - సులఁ జంపి భక్తులఁ
జేపట్టి ప్రోచుచుఁ - జివర కధిక
భైరవం బైనట్టి - భారతాహవమున
నమరుల కైన శ - క్యంబుగాని
తే.గీ. యద్భుత క్రీడఁజేసి కృ - త్యార్థులగుచు
యదుకులధ్వంస మొనరించి - యమరు లర్థి
వేఁడఁదనువులు సాలించి - విష్ణుపదము
జేరుదురు భూమి గలి ప్రవే - శించి నడువ. 169
వ. అంతం గలియుగంబున 170
తే.గీ. యజ్ఞములు సేయఁదగిన యో - గ్యతలులేని
రాక్షసులు వానిఁజేయుచుఁ - బ్రబలి భూత
హింసఁ గావింప బుద్ధుఁడై -యిల జనించి
తనదు యుక్తుల హరి వారి - మనసుఁ గలఁచు. 171
తే.గీ. కలియుగాంతమునందు శూ - ద్రులు ధరిత్రి
రాజలై ధర్మదూర మా - ర్గంబుఁబూని

ప్రజల వ్యాకులపఱుప నా - రాయణుండు
గల్కియై చంపు నా లోక - కంటకులను. 172

మ. అవనీనాయక వింటిగాదె హరి వి - శ్వాత్ముండు విశ్వేశుఁ డె
ట్లవనిన్ ధర్మము నిల్ప నిట్టివి యసం - ఖ్యాకంబులౌ జన్మముల్
వివిధంబుల్ గొని సేయు నద్భుతము లౌ - విఖ్యాతకర్మంబు లా
వివరంబంతయుఁ జెప్పనోపు నెవఁడు - ర్వీన్నివె యూహింపుమా. 173

చ. అనిన విదేహుఁడిట్లనియె - నాత్మవిదుత్తములార! లోకమం
దనియతచిత్తులై తనివి - నందని కోర్కులఁజిక్కి యెప్పుడై
నను భగవంతు నీశ్వరు మ - నంబుల నెంచి భజింపరెవ్వ రా
మనుజులు వెన్కఁబొందఁగల - మార్గము మాకు నెఱుంగజెప్పరే. 174

వ. అనిన విని చమనుండను మునివరుం డట్టి మూఢులకు మూడంగల యది
దుర్గతియ యని చెప్పంబూని యిట్లనియె. 175

**- : నిమికిఁ జమనుం డభక్తుల వృత్తం బభివర్ణించుట :-**

సీ. భూమీశ! వినవయ్య - పురుషు నాననమున
సత్త్వంబుతో విప్ర - జాతిపుట్టెఁ
దద్బాహువులను క్ష - త్రకులంబు జనియించె
సత్త్వరజోగుణ - సహితమగుచు
నూరువులందు వై - శ్యులవంశము రజస్త
మోగుణంబులతోడఁ బుట్టెనవనిఁ
బాదంబులందుఁ గే - వల తామసగుణంబు
తోడ జనించె శూ - ద్రుల కులంబు

తే.గీ. నాల్గువర్ణంబులును నిట్లు - నాలుగాశ్ర
మములతోఁ గూడ నవని జ - న్మంబునొందె
నయ్య వైరాజపురుషుని - యవయవముల
వరుసగానట్లు పుట్టిన - వారియందు. 176

తే.గీ. అఖిలభూత గుహాశయుం - డాత్మజన్మ
మునకుం బ్రత్యక్షహేతువౌ - పురుషు నీశుఁ
గొల్వ రెఱుఁగక కొందఱు - గొందఱెఱిఁగి
యపచరింతురు కొల్వక - యట్టివారు. 177

కం. తమ కెట్లొ లభించిన యు
త్తమ మానవజన్మమును జి - తంబగు వర్ణా
శ్రమ సుస్థితిఁ గోల్పడి నీ
చములగు జన్మముల నందఁ - జనుదురు జగతిన్. 178

చ. తెలియనివారలౌట హరి - దివ్యకథ ల్వినవేనిఁ గీర్తనల్
సలపఁగనేని నేరని య - శక్తులు స్త్రీలును శూద్రులాదిగాఁ
గల నరులన్ భవాదృశులు - కారుణికత్వముతోడఁ జూడఁగా
వలయు ననుగ్రహంబునకు - వారలకన్నను బాత్రమున్నదే. 179

సీ. బ్రాహ్మణుల్ క్షత్రియుల్ - వైశ్యులు నన నుప
నయనాది సంస్కార - చయమునొంది
వేదశాస్త్రములఁ బ్ర - వీణులై విద్యలు
నేరిచి హరిపాద - నిరతసేవఁ
జేసి కృతార్థతఁ - జెందఁగా నుత్తమ
మగు నధికారంబు - నందియుండి
యును నర్థవాద వే - దోక్తులు నమ్మి ఫ
లాపేక్షఁ గర్మంబు - లాచరించి

తే.గీ. జ్ఞానలవ దుర్విదగ్ధులై - కర్మపాశ
బద్ధులై మోక్షమార్గ వి - భ్రష్టులగుదు
రట్టివా రచికిత్స్యుల - ట్లగుట మిమ్ము
బోఁటి వారలుపేక్షింపఁ - బోలువారి. 180

వ. వారు మఱియు నెట్టివా రనిన వినుము 181

సీ. ఫలసంగమునఁ జిక్కు - వడక కర్మముసేయ
నెఱుఁగ రన్యులఁ జేరి - యెఱిఁగి కొనరు

మూఢులయ్యును సర్వ - మును దా మెఱింగినట్లు
దురభిమానం బునఁ - ద్రుళ్ళుచుందు
రర్థవాదశ్రుతు - లందు వర్గంబులో
భోగముల్ నోరూరఁ - బొగడు కొనుచు
నవి స్వర్గమునఁ దమ - కవునంచు గర్వించి
యుత్సాహభరితులై - యుందు రిచటఁ

తే.గీ. గర్మఫలసక్తి వారికీ - కరణిఁ బెరుఁగ
బెరుఁగు గామాది రిపుకోటి - భీషణముగ
వారికి నిపాతహేతువై - స్వాంతమందు
నంత వారితెఱంగు వ - ర్ణింతు వినుము. 182

తే.గీ. రాజసులుగాన వారు స - ర్పములఁబోలి
క్రుద్ధులును ఘోర సంకల్ప - బద్ధు లమిత
కాముకులు దాంభికులు పాప - కర్ము లగుచు
దూఱుదురు విష్ణుభక్తుల - దుర్మదమున. 183

సీ. చేసికొందురు పెండ్లి - స్త్రీని సేవింపనే
పెద్దల నెవరి సే - వింపఁ గాదు
గృహపతివృత్తి నం - గీకరింతురు స్త్రీని
గూడనే ధర్మంబు - కొఱకుఁగాదు
కోర్కులంతంతకుఁ గొనలు సాగింతురు
భోగార్థమే త్యాగ - మునకుఁ గాదు
హింస దోషంబని - యెఱుఁగ కనర్పిత
దక్షిణాన్నంబుగా - దంభమునకుఁ

తే.గీ. బశువులను జంపి జీవనో - పాయమనుచు
యజ్ఞములొనర్తు రీశ్వరుం - దలరఁ గాదు
కామలోభ దంభాది సం - కలిత వృత్తి
దుర్గతికె గాని మేలు నొం - దుటకుఁ గాదు. 184

చ. కలిమిని వైభవంబునను - గర్మము సేఁతను విద్యచేత స
త్కులమునఁబుట్టుటన్ బలముఁగూడుటఁ జక్కదనంబు పెంపునన్
బొలుపగునీవిచేఁ బొగరు - వుట్టి వివేకము శూన్యమై మహా
త్ముల హరిభక్తులన్ హరిని - దూఱుచు నుందురు వారు పాపులై. 185

చ. అనిశము నెల్లదేహుల హృ - దంతరమందును నాకసంబు లా
గున వసియించి కోర్కులొసఁ - గూర్చుచు వేదమునందు సుప్రసి
ద్ధినిగని యాత్మయై వెలుఁగు - దేవుని వార్త వినంగలేరు దు
ర్వినయులు వేదతత్త్వముఁ బ్ర - వృత్తిపరంబని యెంతురాత్మలన్. 186

వ. అది యెట్లనిన 187

సీ. సకలజంతువులు స్త్రీ - సంగంబు మాంసభ
క్షణము మద్యముఁ ద్రావు - టను దమంత
నొనరించునెపుడు న - న్యులు సెప్పఁ బనిలేక
శ్రుతి వానియెడ వ్యవ - స్థితు లొనర్చుఁ
బాణిగ్రహణ పశు - బంధసురాగ్రహం
బులన నామూఁడు మా - న్పుటను గోరి
ధర్మైకఫల మైన - ధనమును జ్ఞానవి
జ్ఞానము ల్గలిగించి - శాంతినొసఁగు

తే.గీ. నిట్టి దీనిని స్వకుటుంబ - వృత్తికొఱకు
వాడుకొనుచును నిజకేళిఁ - బర మనిత్య
మనిశము గ్రసించుచుండు దు - రంత వీర్య
మైన మృత్యువుఁ గనరు మూ - ఢాత్ములవని. 188

తే.గీ. శ్రుతియనుమతించుఁ గల్లు మూ - ర్కొనుట వేల్మి
హింసగాదు పశ్వాలంభ - మితరమట్లు
రతికొఱకుఁగాదు ధర్మసం - తతికె పెండ్లి
యిది విశుద్ధ స్వధర్మమం - చెఱుఁగ రకట. 189

ఉ. ఇంత యెఱుంగకే కుమతు - లెంతయు విజ్ఞులమంచు గర్వ మ
త్యంతమునొంది స్తబ్ధులయి - యత్నముతోఁ బశుహింస ద్రోహమౌ

చింత నొనర్తు రా కలుష - చిత్తులు సచ్చిన వారిఁ బట్టి లో
కాంతరమందు నా పశువు - లన్నియుఁ జీల్చి భుజించు నిర్దయన్. 190

తే.గీ. పరతనువులందు స్వాత్ముఁడౌ - హరిఁ బరేశు
నన్యుఁడని యెంచి ద్వేషించి - సానుబంధ
మైన పీనుంగువంటి యీ - మేనియందుఁ
గూర్మివిడలే కధోగతిఁ - గూలుచుంద్రు. 191

తే.గీ. ఎవరు ధర్మార్థకామ ప్ర -వృత్తులగుచు
మూఢులై యుపశాంతి యె - ప్పుడును లేక
యాత్మతత్త్వం బెఱుంగక - వ్యర్థులగుదు
రట్టివారలె సుమ్మాత్మ - హంతలవని. 192

ఆ.వె. ఇట్టి యాత్మహంత - లెపుడు నెమ్మదిలేక
కర్మము నొనర్చు - గతియె జ్ఞాన
మనుచు నమ్మి కాల - మన్ని కోర్కులఁ ద్రుంప
వగతు రకృతకృత్యు - లగుచుఁ దుదకు. 193

ఆ.వె. వాసుదేవమూర్తి - వార్తయు నొల్లని
వారు కడుఁబ్రయాస - పడి వడసిన
సిరుల నిండ్ల సుతుల - స్నేహితులను బాసి
సొరుదు రొల్లకయును - నిరయు గుహను. 194

వ. అని యిట్లు భక్తిమార్గ దార్ఢ్యంబుకొఱ కమ్మునీశ్వరుం డభక్తుల వృత్తం
బభివర్ణించిన విని నిమి మఱియు నిట్లనియె 195

## - : యుగభేద ప్రయుక్త భగవన్మూర్తి భేద వివరణము :-

క. ఏయే యుగముల నీశ్వరుఁ
డేయే వర్ణములఁ బొల్చు - నేపేరులతో
నేయే విధిఁ బూజితుఁడగు
నే యాకృతినుండు నాన - తీవె మునీంద్రా! 196

వ. అని యడుగుటయుఁ గరభాజనుండను మౌనీంద్రుం డిట్లనియె. నరేంద్రా కృతా త్రేతా ద్వాపర కలియుగంబులందు భగవంతుండు నానావర్ణనామాకార యుక్తుఁడుగా నానావిధానంబుల న్నరులచేఁ బూజింపంబడు నెట్లనిన వినుము. 197

సీ. కృతయుగంబున హరి - సితవర్ణుఁడగుఁ జతు
ర్బాహుండు వల్కలాం - బరధరుండు
యజ్ఞోపవీతి కృ - ష్ణాజినంబును జప
మాలయు దండక - మండలువులు
హస్తము ల్గాల్గింట - నలరంగ జటిలుఁడై
బ్రహ్మచర్య వ్రతి - పగిదినుండు
నరులప్పు డధికశాం - త స్వభావులు వైర
రహితులు సామ్య ద - ర్శనులు నగుచు

తే.గీ. ధ్యానమున శమదమముల - హంస! ధర్మ
పురుష! పరమాత్మ! యమల! యీ - శ్వర! సువర్ణ!
యనియు నవ్యక్త! యోగీశ్వ - రా! వికుంఠ
ధామ! యనియును నా దేవుఁ - దలఁతు రెపుడు. 198

సీ. త్రేత నెట్టనిమేను - దేజర్లిలఁగఁ జతు
ర్బాహుఁడై దీక్షితు - పగిది మూఁడు
పేటల మొలత్రాడు - బిగియించి పచ్చని
వెంద్రుకలొప్పుఁ ద్రి - వేదమూర్తి
యై స్రుక్స్రువాదుల - హస్తంబుల ధరించి
యజ్ఞస్వరూపుఁడై - యలరు విష్ణుఁ
డప్పుడు సర్వ దే - వాత్మకుఁ డగు హరి
బ్రహ్మవాదులును - ధర్మప్రవృత్తు

తే.గీ. లైన నరులు త్రయీప్రోక్త - యజ్ఞముల భ
జింతు రురుగాయ! యజ్ఞ! జ - యంత! యనఘ!

పృశ్నిగర్భ! వృషాకపి! - విష్ణుమూర్తి!
సర్వదేవ! యురుక్రమ! - శరణటంచు. 199

సీ. ద్వాపరంబున భగ - వంతుడు శ్యామవ
ర్ణుండును బీతవ - స్త్రుండు శంఖ
చక్రాద్యుదాయుధ - శస్త్రహస్త చతుష్ట
యాంబుజ ముఖ్య రే - ఖాంకితుండు
శ్రీవత్సకౌస్తుభ - శ్రీయుత వక్షుండు
ఘనమహోరాజలాం - ఛన సమేతుఁ
డగు నమ్మహాత్ముని - నప్పటి మనుజు లీ
శ్వర తత్త్వ మెఱిఁగెడి - వాంఛతోడ

తే.గీ. శ్రౌతతాంత్రిక విధులఁ బూ - జనమొనర్చి
వాసుదేవ! సంకర్షణ! - భవ్యమూర్తి!
యనఘ! ప్రద్యుమ్న! యనిరుద్ధ! - యవ్యయాత్మ!
దేవ! మ్రొక్కెదమని సన్ను - తింత్రు మఱియు. 200

క. నారాయణర్షికి మహా
పూరుషునకు నిఖిల భువన - భూతాత్మునకున్
సారెకు నానతి విశ్వా
కారునకు మహాత్మునకు జ - గత్ప్రభువునకున్. 201

వ. అనియు జగదీశ్వరుని ద్వాపరయుగంబున మానవులు సన్నుతింతురని యమ్మునివరుండు మఱియు నిట్లనియె. 202

సీ. కలి నింద్రనీలసం - కాశ దేహుఁడు హరి
శ్రీకృష్ణనాముండు - శ్రీయుతుండు
శ్రీవత్సకౌస్తుభా - క్షీణ లక్షణుఁడును
శంఖచక్రాది ప్ర - శ్తహస్తుఁ
డవ్యయుండును సునం - దాది యుక్తుండు సం
కీర్తనాత్మక యజ్ఞ - గేయకీర్తి

విమలబుద్ధులు భక్తి - విస్తర యుక్తులై
నానాగమోక్తవి - ధాన ముఖ్య

తే.గీ. ముగను వినుతించుచుందు రా - జగదధీశు
నీయుగంబున భక్తుల - కీశ్వరుండు
సులభుఁ డవనీశ యాతని - నలఘుమతులు
నిల్కడ నుతించు తెలుఁగు వ - ర్ణింతు వినుము. 203

చ. అవిరతచింత్య మార్తిహర - మాశ్రయణీయ మభీష్టదంబు జా
హ్నవికిని బుట్టినిల్లు చతు - రానన శంభు నుతంబు భృత్యదై
న్య విరమణంబు సంసృతి మ - హాంబుధి పోతము భక్తపాల యి
ట్లవు భవదంఘ్రిపద్మము మ- హాపురుషా! భజియింతు మెప్పుడున్. 204

చ. స్వగురుని యాజ్ఞ దేవతలు - సైతము గోరెడు వీడరాని రా
జ్యగరిమఁ బాసి కానలకుఁ - జయ్యననేఁగి ప్రియార్థమై యస
న్మృగమును వెంబడించి చని - మేలొనరించితి ధర్మమూర్తి నీ
డగు చరణారవిందము మ - హాపురుషా! భజియింతుఁ మెప్పుడున్205

తే.గీ. అనుచు నీరీతి ప్రతియుగం - బునను దదను
రూపములు నామరూపముల్ - రూఢిఁదాల్చి
శుభకరుండగు హరి యుగ - స్థులగు నరుల
చేతఁ గీర్తింపఁబడుచుండుఁ - బ్రీతి నధిప. 206

తే.గీ. కలియుగంబున గుణదోష - ములను జూచి
ఘన గుణజ్ఞులు విష్ణుకీ - ర్తనము వలన
నందఱును నిష్టలాభంబు - నొందుకతనఁ
గలియె మేలంద్రు నాల్గు యు - గంబులందు. 207

క. హరిగుణ సంకీర్తనమే
పరమసుఖం బిచ్చుటన్ భ - వం బుడుపుట సం
సరణ పరిభ్రాంతుల కీ
కరణి శివంకరము వేఱె - కలదే చూడన్. 208

తే.గీ. మొదటి మూఁడుయుగంబులఁ - బుట్టినట్టి
ప్రజలు గలియుగమున హరి - భక్తియుక్తు
లుందురని వారితోడఁ దా - మందుఁ బుట్ట
నభిలషింతురు కలి సాధు - వగుటఁ గంటె. 209

సీ. అరుదుగా నందందు - భరతవర్షంబున
హరిభక్తులు వసింతు - రవనినాథ
తామ్రపర్ణియు సమ్మ - ద్ధజలాఢ్యయగు కృత
మాలయుఁ గావేరి - మహితపుణ్య
యవలఁ బ్రతీచి మ - హానది ప్రవహించు
ద్రవిళ దేశమున వి - స్తారముగను
హరిభక్తులుందు రా - పరమపావనములౌ
నదుల నీరము ద్రావు - నరులు దఱచు

తే.గీ. ప్రవిమల మనస్కులై భగ - వంతుఁడైన
వాసుదేవునియందు స - ద్భక్తి గలిగి
స్వచరితంబున జగము పా - వనము సేయు
చుందు రీ కలికాలంబు - నందు ముందు. 210

ఆ.వె. కృత్యమెల్లఁ బరిహ - రించి ముక్తి ప్రదు
దేవు నెవఁడు సర్వ - భావములను
శరణమొందు వాని - సురఋషి పితృభూత
మానవాప్త ఋణము - మాసిపోవు. 211

చ. తనపద కంజముల్గొలిచి - తక్కిన చింతలు మాని ప్రీతి భా
జనమగు వానికెట్లొయవ - శంబుగ వచ్చు వికర్మదోష మా
తని హృదయంబునందు సత - తంబు వసించు పరేశుఁడే హరిం
చు నతని భక్తవత్సలత - చోద్యముగాదె నరేంద్ర చంద్రమా. 212

వ. అని చెప్పెనని నారదుండు వసుదేవునితోడ మఱియు నిట్లనియె. 213

ఆ.వె. భాగవతములైన - బహుధర్మముల నిట్టు
లార్షభులు వచింప - నాలకించి

వారి నా విదేహ - వల్లభుండగు నిమి
ప్రీతిఁ బూజసేసె - ఋషులతోడ. 214

తే.గీ. అప్పుడా సిద్ధు లచట ను - న్నట్టి జనము
లందఱును జూడ నంతర్ధి - నంది రంతఁ
దనకు మునులానతిచ్చిన - ధర్మములను
బరగ నడుపుచు నిమియొందెఁ - బరమగతిని. 215

తే.గీ. నీవు నీ ధర్మముల వసు - దేవ వింటి
ధన్యుఁడవు వీనివల్ల శ్ర - ద్ధను వహించి
సంగరహితుఁడవై లెస్స - జరుపుమయ్య
పరమగతి నీకుఁ గలుగునే - భయము లేదు. 216

క. భగవంతుఁ డీశ్వరుఁడు హరి
మగబిడ్డం డగుచు మీకు మహిఁ - బుట్టుటచే
దగు దంపతులగు మీకీ
జగమున సత్కీర్తినిండెఁ - జంద్రికవోలెన్. 217

తే.గీ. తనయుఁడని ప్రీతిఁ శ్రీకృష్ణుఁ - గనుట నతనిఁ
గౌఁగలించుట నతనితోఁ - గలసిమెలసి
శయన సల్లాప భోజనా - సన విహార
ముల నొనర్చుట మీ యాత్మ - పూతమయ్యె. 218

మ. అవనీనాథులు సాల్వపౌండ్ర శిశుపా - లాదు ల్విరోధంబుతో
నెవనిం దద్గతుల న్విలాసములఁదా - మీక్షించి శయ్యాసనా
ద్యవకాశంబుల నెంచుచుండి మతులా - యాకారముం బొందగా
జివరం దత్సమరూపముంగనిరనన్- స్నేహాత్ములన్ జెప్పనే. 219

వ. కృష్ణునియందుఁ బుత్త్రస్నేహంబున సుగతి మాకెట్లగు నని సంశయింపబనిలేదు. శ్రీకృష్ణదేవుండు సర్వాత్మకుండగు నీశ్వరుండు. తన యీశ్వరభావంబుడాచి మాయామనుష్యభావంబున భువి నవతరించిన పరుం డవ్యయుండు కావున మీరా మహాత్ముని సామాన్యుండగు పుత్త్రుండని తలంపకుండు. 220

తే.గీ. ధరకుబరువైన రాజులౌ - దనుజవరులఁ
ద్రుంచి సద్భక్తజనములఁ - బ్రోచి ముక్తి
నిచ్చుటకుఁ బుట్టినట్టి శ్రీ - కృష్ణుకీర్తి
యక్షయంబుగ నీలోక - మందు నిండు. 221

వ. అని యిట్లు నారదుండు దేవకీవసుదేవులకుం జెప్పెనని పరీక్షిన్నరేంద్రు
నవలోకించి శుకయోగీంద్రుండిట్లనియె. 222

క. ఈవృత్తాంతము విని యా
దేవకి వసుదేవుఁడును మ - ది న్విస్మితులై
భావంబుల వ్యామోహముఁ
బో విడిచిరి వార లెంత - పుణ్యులొ జగతిన్. 223

ఆ.వె. ఎవఁడు పుణ్యమైన - యీ యితిహాసంబు
నేక చిత్తుఁడగుచు - నెపుడుఁ జదివి
బుద్ధి నిలుపు వాఁడు - మోహంబు విడిచి బ్ర
హ్మత్వమొంద నిందె - యర్హుఁడగును. 224

**- : శ్రీకృష్ణుని బ్రహ్మాదులు సందర్శించి నుతించుట :-**

వ. అని మఱియు నిట్లనియెనట్లు శ్రీకృష్ణదేవుండు ద్వారకాపురంబున నున్నయెడ న్నరలోక మనోహరంబై సర్వలోక పాపాపహంబగు యశంబు లోకంబుల యందెల్ల న్నెఱిపిన యా భగవంతుని యతిసుందర దివ్యమంగళ విగ్రహంబు నవలోకించు వారలై సనకాది కుమారవర్గంబును దేవతలును బ్రజాపతులునుం దోడరాఁ జతుర్ముఖుండును, భూతగణావృతుండై భూతభవ్యేశ్వరుండగు భవుండును, మరుద్గణంబులతోడ భగవంతుండగు నింద్రుండును, వసురుద్రాదిత్యవిశ్వేదేవగణంబులును ఋభువులును నాంగిరసులును గిన్నరోరగ గంధర్వ సిద్ధ చారణ సాధ్య విద్యాధర గుహ్యకాప్సరో గణంబులును ఋషులును పితరులును ద్వారకా పురంబున కరుగుదెంచి. 225

తే.గీ. అఖిలసంవత్సమృద్ధమై - యధికవృద్ధి
వసుధ రాజిల్లుచున్న యా - ద్వారవతిని
గృష్ణు నద్భుత దర్శనుఁ - దృప్తిలేని
కనులఁ జూచిరి సంతోష - కలితు లగుచు. 226

వ. అంత న య్యమరులు 227

తే.గీ. నందనోద్యాన సంభూత - నవ్య కుసుమ
మాల్యములఁ గప్పుచును సత్ప్ర - మాణ దివ్య
చిత్రపద గర్భితార్థవి - శేషములుగ
స్తవము లొనరించి రాజగ - త్ప్రభుని హరిని. 228

తే.గీ. కర్మమయ ఘనపాశంబు - కట్టు వదల
నెంచి యెదలోన ఘనులు ధ్యా - నించు నీ ప
దాబ్జమును గని మ్రొక్కు భా - గ్యంబు గలిగె
మాకు బుద్ధీంద్రియాసు వా - జ్మానసముల. 229

చ. అగుణఁడవయ్య నీవు త్రిగు - ణాత్మిక మాయను స్వీకరించి దా
ని గుణముల న్మనంబున గ - ణింపఁగరాని జగంబుఁజేసి దా
ని గరిమఁ బ్రోచి మాపుదువు - నీ వనవద్యుఁడ వై నిరంతరం
బగు నిజసౌఖ్యమున్ వదల - వట్లగుట న్నిను నంట వా క్రియల్. 230

చ. ఘనులగు నీదుభక్తులు జ - గన్నుత నీయశమున్ బ్రవృద్ధమై
తనరెడు శ్రద్ధతో వినుచుఁ - దత్పరులైనపు డొందునట్లుగా
వినికిని విద్య నధ్యయన- విశ్రుతదాన తపఃక్రియాదు లే
మొనరిచినన్ దురాత్ములిల - నొందఁగనేరరు శుద్ధి నాత్మలన్. 231

సీ. మతి గరంగఁగ మహా - మౌనులు ముక్తికై
ధ్యానించుచుందు రె - ద్దాని నెపుడు
సారూప్యమును గోరి - సద్భక్తులెద్దాని
నర్చించచుంద్రు వ్యూ - హంబులందు
నాకలోకము దాటి - వైకుంఠమును జేర

వేళవేళల దేని - విజ్ఞు లెంతు
రధ్వరంబులహవ్య - మంజలిఁ గొనినిల్పి
హోత లెద్దాని వే - దోక్తిఁ దలఁతు
తే.గీ. రాత్మమాయ నెఱుంగ న - ధ్యాత్మ యోగు
లగు పరమభాగవతు లేది - తగ భజింతు
రట్టి నీపాద మచ్యుత - యస్మదీయ
దుర్విషయ వాసనలఁ బారఁ - దోలుఁగాక. 232

పంచపాది :

మ. హరి నీవక్షమునందు నుండు సిరి భ - క్తాగ్రేసరుల్ శ్రద్ధ నీ
యురమం దుంచిన వైజయంతిఁ గని యో - హో ప్రాచిదీదండ నా
కిరవౌ నిచ్చట నెట్టులుండఁదగునం - చీర్ష్య న్సపత్నిం బలెన్
నిరసింప న్సిరి నాదరింపక దయన్ - జేకొంటి వాదండ నీ
శ్వర యీ నీ పద మస్మదీయ విషయా - సక్తిం దొలంగించుతన్. 233
సీ. బలిని బంధించు వోఁ - బ్రబలి త్రివిక్రమ
నీదు రెండవది యౌ - పాదకమల
మజుని లోకముఁజొచ్చి - యాక్రింది మూఁడు లో
కములయందును బతా - కయును బోలెఁ
బొడవై భయాభయం - బులు దితిజామర
సేనల కొదవించి - శిష్టదుష్ట
నికరంబులకు స్వర్గ - నిరయంబు లిచ్చుచుఁ
ద్రిభువన పావన - త్రిపథగమన
తే.గీ. యైన గంగకుఁ బుట్టిని - ల్లై తనర్చె
నట్టి నీపాదము భజించు - నట్టి మాకుఁ
బాపములు వాపి మమ్ముఁ బా - వనులఁజేసి
ప్రోచుఁగావుత నీశ్వర - భూమమూర్తి. 234
సీ. తమలోనఁ దాము వై - రముఁ బూని పెనఁగెడు

బ్రహ్మాదులును ముక్కు - ద్రాట నెద్లు
నరులకు వశములౌ - కరణి నీవశవర్తు
లౌదురు వారి జ - యాపజయము
లవశతఁ గాలాత్మ - నమరింతు వారికిఁ
బ్రకృతి పూరుషులకుఁ - బరుఁడ వీవు
పురుషోత్తముఁ డనంగఁ - బరగుదు విశ్వ స
ర్గస్థితిలయముల - కారణమవు
తే.గీ. ప్రకృతిపురుష మహత్తుల - ప్రబల సత్త్వ
మవు త్రినాభి సంవత్సర - మయ గభీర
వేగ సర్వాంతకృత్కాల - భీమమూర్తి
యీశ నీయంఘ్రి సుఖము మా - కిచ్చుఁగాక. 235
చ. పురుషుఁడు శక్తి నీవలనఁ - బొంది పరాత్పర మాయచే జగ
త్కరణ సమర్థయైన యొక - గర్భముఁబోలు మహత్తుఁ జేసె నా
పురుషుఁడె మాయఁగైకొని య - మోఘబలుండయి సృష్టిసేసె నా
వరణయుతంబుగాఁదనని - వాసము హైమమునందకోశమున్. 236
ఉ. కానఁజరాచరాత్మక జ - గత్తున కెల్లవిభుండవీవు మా
యానుగతుండవై తదను - యాతములౌ విషయంబులొందుచున్
వానినినంట వన్యులన - వారె త్యజించిన యర్థముల్ దమున్
మానకయంటునోయని మ - నంబుననుల్కుచునుందురీశ్వరా. 237
సీ. చిఱునగవుల సొంపు - నెఱపు కటాక్ష లే
శములఁ గాన్పించు భా - వములతోడఁ
గడు మనోహరములౌ - కనుబొమలను విండ్ల
సౌరతమంత్ర ప్ర - శస్తములుగఁ
బంచబాణాస్త్రముల్ - బదియాఱు వేవురు
భార్యలు నీవయిఁ - బఱుపుచుండ
వారి నందఱ మోహ - వారాశి ముంచుచు
వశవర్తినులఁ జేయ - వలఁతివైన

తే.గీ. నీదుమానస మెట్టిదో - యాదవేంద్ర!
చలన మొందదు చిత్తంబు - గలఁగ దెపుదు
బ్రహ్మచర్యంబు సెడదు ని - గ్రహము పేర్మి
నెవఁడు గొనియాడ నేర్చు యో - గేశ!నిన్ను. 238

తే.గీ. త్వత్కథామృత నదులును - ద్వత్పదాబ్జ
మధువు గంగయుఁద్రైలోక్య - మలము లుడువుఁ
గాన నీరెండు తీర్థము - ల్వీనుదోయిఁ
దనువులనుఁ గొందు రాశ్రమ - ధర్మపరులు. 239

క. అని యిట్లు దివిజులను శం
భునిఁ గూడి విరించి హరిని - బొగడి మఱియు ని
ట్లనియెను గోవిందునితో
వినయంబున మ్రొక్కి గగన - వీథీగతుఁడై. 240

ఆ.వె. మున్ను మేము నిన్ను - భూమి భారము దీఱ్ప
వేఁడుకొనిన కతన - విశ్వమూర్తి
యవనియందు నిట్టు - లవతరించితి దేవ
మేము కోరినట్లె - మేలు గలిగె. 241

ఆ.వె సత్యసంధులైన - సత్పురుషులయందు
ధర్మమును బ్రతిష్ఠి - తం బొనర్చి
సర్వలోక పాప - శమనమౌ సత్కీర్తి
దిక్కులందు నెఱపి - తివి మహాత్మ. 242

ఆ.వె. యదుకులంబునందు - నత్యంత సుందరం
బైన దివ్య విగ్ర - హంబుతోడ
నవతరించి చేసి - తఖిల జగద్ధిత
కరములైన మహిత - కార్యములను. 243

ఆ.వె. కలియుగంబునందుఁ - గల సాధు జనులెల్ల
నీదు పుణ్యకథల - నియతి వినుచుఁ

బొగడుచుండి యీ త - మోమయ సంస్కృతి
సులభముగఁ దరింపఁ - గలరు దేవ! 244

క. పురుషోత్తమ నీవిట్లీ
ధరణి నవతరించి నేఁటి - దాఁకను సంవ
త్సరములు పరిపూర్ణములై
యిరవొందెను చూడు నూట - యిరువది యైదున్. 245

తే.గీ. కొఱవడక యుండ దేవతల్ - గోరినట్టి
పనుల నెల్ల నొనర్చితి - భవ్యమూర్తి
యీ యదుకులంబు బ్రాహ్మణు - లిచ్చినట్టి
శాపమున నష్టమైనట్లె - సత్వరముగ. 246

తే.గీ. కానరాఁదలఁతేని స్వ - స్థానమునకు
రమ్ము పరమాత్మ వైకుంఠ - నెమ్మిఁబ్రోవు
నీకు లెంకలమగు మమ్ము - లోకములను
లోకపాలురఁ గరుణావ - లోకనముల. 247

క. అని తను వేఁడెడు బ్రహ్మో
ద్యనిమిషులను జూచి మోద - మందుచు మాయా
మనుజుండగు భగవంతుం
డనియె సమాదరము తోడ - నతిమృదు ఫణితిన్. 248

సీ. కమలసంభవ వింటిఁ - గడుఁబ్రీతి నీమాటఁ
బనులెల్లఁదీరె భూ - భరమువాసె
వీర్య శౌర్య శ్రీప్ర - వృద్ధమై విపులమౌ
యదుకులం బుద్వేల - మగు మహాబ్ధి
కరణి ధర్మము దప్పి - గర్వించి లోకంబు
లెల్లనుఁ జెఱుతు నే - నిపుడు దాని
సంహరింపక నిజ - స్థానంబుఁ జేరిన
యదువులఁ గెలువ లే - రవని నొరులు

తే.గీ. బ్రాహ్మణోత్తమ! దత్త శా - పంబువలన
దానికి వినాశ మారబ్ధ - మైన దిప్పు
డది ముగియఁజూచి వైకుంఠ - పదముఁ జేరఁ
బోవుచో వచ్చెదను నీదు - భువనమునకు. 249

క. అనినఁ జతురాస్యుఁ డీశ్వరు
వినయంబున మ్రొక్కి భక్తి - వివశుం డగుచున్
జనెఁ దన లోకమునకు సుర
మునియుతుఁడై వాసుదేవ - మూర్తిఁ దలఁచుచున్. 250

తే.గీ. అంత నా ద్వారకాపురి - యందుఁ దోఁచఁ
బ్రళయ హేతువులైన యు - త్పాతశతము
లవ్వి గని భీతిఁ దన పజ్జ - కరుగుదెంచి
నట్టి యదువృద్ధులను జూచి - యనియె శౌరి. 251

సీ. ఇవె మహోత్పాతంబు - లిం దెల్లెడను దోఁచె
మన కులంబునకు బ్రా - హ్మణులవలనఁ
దప్పని శాపంబు - దగిలె నిం దిఁక నుండ
మనఁ గోరు మనకు ధ - ర్మంబు గాఁదు
పావనంబైన ప్ర - భాస పుణ్యక్షేత్ర
మునకు శీఘ్రము నేఁడె - పోదమందుఁ
జంద్రుండు మునుదక్షు - శాపంబుచేఁదన
కైన క్షయం బాసె - స్నానమాత్ర

తే.గీ. నందు మనమును మునిఁగి పి - త్రమరతర్ప
ణము లొనర్చియు బహువిధా - న్నముల విప్ర
వరులఁ దనిపియు శ్రద్ధతో - నురుఫలముల
వెలయు సత్పాత్రదానము - ల్సలుపవలయు 252

వ. ఇట్లు సేసి నావచే నర్ణవంబుంబలె సకల పాతకంబులం దరింతమని వివిధాధికారమాత్రయోగ్యులై మోక్షానర్హులగు దేవతలైన యాదవులను

మోక్షదాయకంబగు ద్వారకానగరంబునుండి తొలగించువాఁడై సర్వజ్ఞుండగు శ్రీకృష్ణదేవుండు పలికె నట్లు భగవదాదిష్టులై యాదవులు ప్రభాసతీర్థంబునకుఁ బోవఁ నిశ్చయించి తమ తమ యరదంబు లాయితంబులు గావించికొని రప్పుడు. 253

- : శ్రీకృష్ణోద్ధవ సంవాదము : -

మ. యదవు ల్ద్వారవతిం ద్యజింపఁగ ద్రుతం - బౌ యత్నముంజూచి యా
యదుకోటిం గని కృష్ణుఁ డాడినవిధం - బాలించి యవ్వీట భీ
ప్రద ముత్పాత పరంపరంగని మహా - ప్రాజ్ఞుండు గృష్ణైకసౌ
హృదుఁడౌనుద్ధవుఁడాత్మసంచలితుఁడై - యేకాంతమౌ నొక్కచోన్. 254

క. జగదీశ్వరేశ్వరుం డగు
భగవంతుని గాంచి వారి - పదయుగమునకుం
దగ సాగిమ్రొక్కి ప్రాంజలి
యగుచు న్నిలుచుండి యిట్టు - లనియె నరేంద్రా! 255

తే.గీ. దేవ! దేవేశ! యోగేశ! - దివ్యమూర్తి!
పావనచరిత్ర! విప్రశా - పము మఱల్పఁ
గలిగియు మఱల్పవైతివీ - కులముఁ ద్రుంచి
ధరణి విడువంగ నిజముగాఁ - దలఁచి తభవ. 256

సీ. నీపాదకమలంబు - నిమిషార్థమైన నే
విడిచి యుండఁగనేరఁ - బుడమియందు
నన్నును గొనిపొమ్ము - నాథ! నీ దివ్యమౌ
లోకంబునకు దయా - ళుండ వగుచు
నరులకు నీక్రీడ - పరమమంగళము క
ర్ణామృత మది ద్రావి - నట్టివారె
విడుతు రన్యస్పృహ - విశ్వేశ! శయ్యాస
నాటన స్నానపా - నాది విధుల

తే.గీ. నెపుడు భక్తిని గొలుచు మే - మెట్లు నిన్ను
విడుతు మీవు ప్రియంబుగాఁ - దొడిగి పూసి
కట్టినట్టివి గొనుచుండు - కతన నీదు
మాయఁ గెలుతుముగాదె ని - ర్మలుల మగుచు. 257

సీ. యతులు దిగంబరుల్ - స్వాశ్రమనిష్ఠులు
ఋషు లూర్ధ్వరేతస్కు - లిట్టివారు
వ్రతపరిశ్రాంతి ని - ర్గత కల్మషులు శాంతు
లగుచు నీబ్రహ్మాఖ్య - మైన పదము
నందుదురేము శు - భాశుభకర్మ మా-
ర్గముల భ్రమించు వా - రలమె యైన
నీవారితోఁగూడి - నీవార్త లెంచుచు
మనుజ లోకాను క -రణములైన

తే.గీ. నీదుచూడ్కులుఁ బలుకులు - నీచెయువులు
హాసపరిహాస కేళివి - హారములును
నాత్మఁ దలఁచి కీర్తించి ప్ర - యాసలేక
దాటఁగారాని నీమాయ - దాటఁగలము. 258

తే.గీ. అనుచు నుద్ధవుఁ డీరీతి - మనవిసేయ
సంతసంబున నాభగ - వంతుఁడైన
దేవకీసుతుఁ డేకాంత - భావుఁ బ్రియుని
భృత్యు నాతనిఁ గనుఁగొని - యిట్టులనియె. 259

తే.గీ. నేను వైకుంఠమున కేఁగ - నిశ్చయించి
యున్న యది నిక్కువంబు నీ - వన్న యట్లు
పద్మసంభవ భవలోక - పాలముఖులు
నన్ను రమ్మని ప్రార్థించు - చున్నవారు. 260

తే.గీ. అజుఁడు మునువేఁడ నెందుల - కవనియందు
నాదు వంశంబుతోఁ బుట్టి - నాఁడ నట్టి

దేవకార్యం బశేషంబు - దీర్చినాఁడ
యదుకులం బొండె మిగిలియు - న్నది ధరిత్రి: 261

తే.గీ. తటి నదియు విప్రశాప ని - ర్దగ్ధమయ్యె
యదుకులంబు నశించు న - న్యోన్య కలహ
మున మహార్ణవమీపురి - న్ముంపఁగలదు
నేఁటి కేడవదినమున - నిక్క మనఘ! 262

తే.గీ. పుడమి విడిచితినేని నీ - భూమి లోక
మఖిలమును నష్టమంగళం - బగును వేగఁ
గలియుగంబును దీనిపైఁ - గవిసి ధర్మ
హాని యొవరించు సాధు జ - నాగ్రగణ్య! 263

ఆ.వె. నేను భూమి విడువ - నీవు భద్రాత్మ యిం
దుండఁ దగదు కలి ప్ర - చండ మగుడు
నందు జను లధర్మ - మం దభిరుచి గల్గి
పొదలు చుండఁగలరు - పుణ్యమూర్తి! 264

-: శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ బరమ తత్త్వార్థం బుపదేశించుట :-

తే.గీ. అవుట నీవింక స్వజన బాం - ధవుల యెడల
స్నేహ మంతయు విడిచి నీ - చిత్తమందు
నన్ను నెడపక నిలిపి చిం - తలను మాని
సర్వ సమదృష్టివై భూమి - సంచరించు. 265

తే.గీ. మనసుచే వాక్కుచేతను - గనులు వీను
లిట్టి యింద్రియములచేత - నెఱుఁగఁ బడెడు
నది మనోమయమగుట మా - యావిలాస
మస్థిరంబని యెఱుఁగు మె - ల్లపుడు నీవు. 266

సీ. మనసు చలించిన - మనుజుని భ్రమయె నా
నార్థ రూపంబగు - నదియె గుణము

దోషంబుఁగను గుణ - దోష బుద్ధికి నిర్ణ
యించు వేదము గర్మ - మం చకర్మ
మని వికర్మంబని - యును విధి విహితంబు
దన్నిషిద్ధమును లు - ప్తమును వరుస
నావిద్యకం బది - యట్లౌట నుద్ధవా
నియత చిత్తేంద్రియా - న్వితుఁడ వగుచు
ఆ.వె. వితతమౌ జగంబు - వీక్షించు నీయందు
గగనమందుఁ దోఁచు - నగరమట్టు
లంత నిన్ను బ్రహ్మ - మైన నన్నుఁగఁ జూడు
మద్వితీయ సుఖము - నందఁగలవు. 267
తే.గీ. జ్ఞాన విజ్ఞానములు గల్గి - స్వానుభవము
వలన సంతుష్టినొంది దే - హులకు నెల్ల
నాత్మ భూతుండవై యుంటి - వైన నీకు
విఘ్న మేమియుఁ గలుగదు - విజ్ఞతిలక! 268
తే.గీ. ఎవఁడు గుణదోషబుద్ధికి - నవల నిల్చు
నతఁడు గుణమని విహితంబు - నాచరింపఁ
డగుణమని మానఁడు నిషిద్ధ - మవశుఁడగుచు
నర్భకుని భంగి రెండును - నాచరించు 269
తే.గీ. సర్వభూతహితుండును - శాంతమూర్తి
జ్ఞాన విజ్ఞాన సుదృఢ ని - శ్చయుఁడు నగుచు
నెవఁడు విశ్వంబు నన్నుఁగా - నెపుడుఁజూచు
వాఁడు సంసారజలధిలోఁ - బడఁడు మఱల. 270
తే.గీ. అనుచు భగవంతుఁడీరీతి - నానతీయ
విని మహాభాగవతుఁడును - వినయ భరితుఁ
డైన యుద్ధవుఁడతిహృష్టుఁ - డగుచు మ్రొక్కి
యిట్లనియె శౌరితోఁ దత్త్వ - మెఱుఁగఁగోరి 271

తే.గీ. యోగఫలద! యోగాచార్య! - యోగగమ్య!
యోగవిద్యానిధీ! కృప - తో గభీర
మైన సన్న్యాసయోగమౌ - త్యాగ మాన
తిచ్చితివి నాకుఁ బరమమౌ - హితముఁ గోరి. 272

తే.గీ. విషయసుఖసక్తులై నీకు - విముఖులౌ న
భక్తులకుఁ గోర్కులెల్లను - వదలుటైన
త్యాగమిది లేశమైన సా - ధ్యంబు గాద
టంచుఁ దలఁచెద భూమ స - ర్వాత్మ! కృష్ణ! 273

సీ. పరమేశ! నీమాయఁ - బరికల్పితములైన
తనువును దదను బం - ధములఁ జూచి
యవి నేను నాయవి - యని యెంచుచుందు మూ
ఢాత్ముండనై మోహ - మందు మునిఁగి
యిట్టి నేనిప్పు డీ - వెఱుఁగఁజెప్పిన యోగ
మెట్లు సాధింతునో - యెఱుఁగఁజాల
భృత్యుఁడ నాకు నా - రీతి మెల్లఁగనేర్పు
సత్యసిద్ధాత్మ! ని - శ్చయముఁ దెలుప

తే.గీ. నెందు నీవలె సురలందు - నేని లేరు
నీదు మాయను జిక్కి బ్ర - హ్మాదులైన
దేహులెల్లను భ్రమిని యీ - దృశ్యవిషయ
జాతమును సత్యమే యని - చూతు రెపుడు. 274

సీ. కావున ననవద్య! - దేవ! యీశ్వర! దేశ
కాలాద్యుపాధి వి - కారదూర!
వైకుంఠధామ! స - ర్వజ్ఞ! నారాయణ!
జీవకారుణ్య ప్ర - సిద్ధ హృదయ!
పాప భీతుఁడ దుఃఖ - పరితప్త చిత్తుఁడ
దీనుఁడ వెలువడు - తెర వెఱుంగ

నీవె దిక్కని మది - నెఱ నమ్మి శరణంటిఁ
గడతేరు వెరవు నే - ర్పడఁగఁ దెలుపు

తే.గీ. మనుచు నీరీతిఁ దనువేఁడ - నబ్జనేత్రుఁ
డుద్ధవునిఁ జూచి వెఱవకు - మొయ్య నీకుఁ
బరమ ధర్మంబుఁ దెలిపెద - భవము దాటు
మనుచు నిట్లని కరుణతో - నానతిచ్చె. 275

తే.గీ. తఱచుగా లోకమున మునుల్ - దమ మనీష
గురువుగా లోకతత్త్వంబుఁ - దరిచి చూచి
విషయవాసన లాత్మల - విడిచి ధన్యు
లగుదు రన్యగురూపదే - శానపేక్ష. 276

తే.గీ. తనువులందెల్ల మనుజుల - తనువులందు
ముఖ్యముగ గురువాత్మయే - మొనసి యిందుఁ
దాను బ్రజ్ఞాన రూపుఁడై - కానుపించు
జడముఁ బ్రేరించు నితఁడని - జరుగు నూహ. 277

తే.గీ. ధీరులౌ సాంఖ్యయోగవి - శారదులును
సర్వశక్తి సమన్వితు - సత్యరూపుఁ
బ్రత్యగాత్మునిఁగా నన్నుఁ - బరగఁ గాంతు
రీ మనుజదేహమందె యిం - కెందుఁ గాదు. 278

తే.గీ. తగ నొకటి రెండు మూఁడు నా - లుగును బెక్కు
లైన పదములు గలవియు - నపదములను
దనువు లీ సృష్టిఁగల వందు - మనుజతనువు
వానిలో నాకుఁ గడుఁబ్రియం - బైనదనఘ! 279

ఉ. ఈ నరదేహమందు నను - నేమఱుపా టొకయింత లేక ధీ
మానసముఖ్యముల్ నడుపు - మానక యీతఁ డహంక్రియాదులే
వైనను గానివాఁడనుచు - నారసి చూతురు యోగిపుంగవుల్
గానఁ బ్రమాణయుక్తిననుఁ - గన్గొను మా మతిశుద్ధినుద్ధవా! 280

వ. ఈయర్థంబునం దొక్క పురాతనేతిహాసంబు గల దది యవధూతయదు
సంవాదంబనంబరగు నది యెట్లనిన వినుము. 281

## - : అవధూతయదుసంవాదము : -

చ. వయసునఁ బిన్నవాఁడు పర - వస్తువెఱింగి ధరిత్రి నెందునున్
భయమిసుమంతలేక సమ - వర్తన మొప్పఁ జరించువాఁడు సం
శయరహితుండు బ్రాహ్మణుఁడు - సాధువునౌనవధూతునొక్కనిన్
బ్రియమునఁగాంచి యిట్లడిగె - విశ్రుతుఁడౌ యదువుత్సుకాత్ముఁడై 282

తే.గీ. అఖిలము నెఱింగి బాలుని - యట్లు భువిని
సంచరించుచు నున్నాఁడ - వెంచిచూడ
నేమియును జేయ వార్య నీ - కెట్లు గలిగె
నతినిపుణమైన యీబుద్ధి - యనఘ! చెపుమ. 283

సీ. తఱచుగా మానవుల్ - ధర్మార్థకామంబు
లందునాత్మవిచార - మందుసైత
మాయువు సంపద - యశము నపేక్షించి
యోపినంతయుఁజేయు - చుందు రెపుడు
నీ వరోగివి బ్రహ్మ - నిష్ఠుండవు సమర్థుఁ
డవు సుభగుండవు - ప్రవిమలుండవు
మితభాషణుండ వీ - స్థితి నుదాసీనత
నేమియుఁ గోర కే - దేనిఁ జేయ

తే.గీ. కిల జడుఁడు వెఱ్ఱి భూతంబు - వలెఁ జరింతు
కామలోభాగ్ని లోకంబుఁ - గాల్చుచుండ
సోక దది నిన్ను గజము మం - దాకినీజ
లంబునంబలె సుఖివై మె - లంగుచుందు. 284

తే.గీ. కాంచ నీకెట్టి విషయ భో - గములు లేవు
బ్రాహ్మణోత్తమ! నీ వొంటి - వాఁడ విట్టి

నీదు మనమున కెట్టు ప్ర - మోద మొలసె
నడుగుచున్నాఁడఁగ్గృపతోడ - నానతీవె. 285

వ. అని యదురాజడిగెనని చెప్పి శ్రీకృష్ణదేవుం దుద్ధవునితో మఱియు నిట్లనియె. 286

తే.గీ. అతినిశితబుద్ధి బ్రహ్మణ్యుఁ - డైన యదువు
వినయమున నమ్రుఁడై గౌర - వించి తన్ను
నిట్టు లడిగిన ద్విజుఁడును - హృష్టుఁడగుచుఁ
దన విధంబెల్ల నిట్టు లా - తనికిఁ జెప్పె. 287

తే.గీ. నాకుఁ బలువురు గురువులు - న్నారు రాజ
వారి నాబుద్ధిఁచే జేరి - వారివలనఁ
దెలివినొంది ముక్తుండనై - యిలఁ జరింతు
వారి వివరింతు వినుమయ్య - వరుసతోడ. 288

సీ. భూమి వాయువు వ్యోమ - మును జలంబగ్నియు
దరణి చంద్రుఁడు గపో - తం బజగర
మంబుధి శలభంబు - నళి గజంబును మధు
హర్తయు జింక మ - త్స్యంబు వేశ్య
పింగళ కురరంబు - బిడ్డఁడు కన్యయు
శరకారుఁడును బాము - సాలెపురుగు
పేశకృత్తను నివి - పృథివీశ యిరువది
నాలుగు గురువులు - నాకు వీరి 289

తే.గీ. యందుఁ గల్గు శిక్షావృత్తి - నాత్మబుద్ధి
నలవరించితి నిద్దాని - వలన నేది
యెట్లెఱింగితి నదియెల్ల - నిపుడు నీకు
వివరముగఁ జెప్పెద నరేంద్ర! - వినుము తెలియ. 289

తే.గీ. దైవవశములై భూతముల్ - దనువు నొంప
నది విధికృతంబుగ నెఱింగి - యాత్మనిష్ఠ
యందు ధీరతఁగలఁగక - యుందు ధరణి
వలన నే నేర్చుకొంటి నీ - వ్రతము నృపతి. 290

తే.గీ. తనదుకోర్కులు జన్మంబు - తనువుగూడ
నిరత మన్యులు మేలొంద - నే యటంచు
సాధు వెలఁ గంగఁదగు నను - బోధ మేను
సంగ్రహించితి నగము వృ - క్షమును జూచి. 291

సీ. తనప్రాణములు నిల్పఁ - దగిన యాహారమా
త్రమున సంతోషింపఁ దగును మౌని
యింద్రియప్రియముల - పేక్షింప నొప్పద
పేక్షింప మనసు వా - గ్వృత్తి సెడఱు
జ్ఞానంబు సెడు నని - ప్రాణవాయువుఁ జూచి
.తెలిసితి వివిధార్థ - ములను జొచ్చి
యును గుణదోషంబు - లను నంటఁ డనిలున
ట్లాత్మజ్ఞుఁడౌ యోగి - యనియు నఖిల.

తే.గీ. పార్థివ శరీరములఁ జొచ్చి - వానిగుణము
లాశ్రయించియు నవ్వాని - నంటఁడాత్మ
గంధములఁ గూడి యంటని - గాలియట్టు
లని బహిర్వాయువునుఁ జూచి - యాత్మఁ గంటి. 292

తే.గీ. మౌని స్థిరచరములలో వి - లీనుఁ డగుచు
బ్రహ్మభావంబుతోడ సం - వ్యాప్తుఁడయ్యు
వేఱుపడ కేది యంటక - వితతుఁడగుట
నింగి పోలికనని తా నెఱుంగవలయు. 293

చ. ఇల జల మగ్నియుం గలసి - యేర్పడి గాలికి రేగి యంతటం
బొలిచెడు నంబుదాదులను - ముట్టని యాకసమట్లు పూరుషుం
డిలపయిఁగాల నిర్మితము - లీతను ముఖ్య గణంబు లేవియున్
గలియఁడటంచు బాహ్యగగ - నంబును జూచి గ్రహించితి న్నృపా! 294

తే.గీ. ప్రవిమలుండు స్వభావాను - రాగయుతుఁడు
మధురవచనుండు తీర్థసం - భవుఁడు మౌని

యవని సద్భక్తిఁ దనుఁజూడ - నంట నెంచ
జనులఁ బావనులనుజేయు - జలము పగిది. 295

సీ. తేజస్వి తపనుచే - దీప్తుఁ డక్షోభ్యుండు
నపరిగ్రహుండును - నఖిలభక్షుఁ
డయ్యును యతచిత్తుఁ - డౌ మౌని మాలిన్య
మంటక వెల్గుఁ దా - నగ్నిఁబోలె
నొకట డాఁగును దోఁచు - నొకచోట శ్రేయోఽర్థ
లెలమిఁ దన్వేఁడ వా - రిచ్చు దాని
సమతఁ గైకొను వారి - సంచిత పూర్వోత్త
రాఘముల్ గాల్ప శ్రే - యంబు లొసఁగఁ

ఆ.వె. దనదు మాయఁ గల్పి - తంబైన సదసదా
త్మ జగంబునందుఁ - దాను జొచ్చి
యీశ్వరుండు వెలుఁగు - నెల్లెడ సమరూపుఁ
డగుచు నింధనముల - నగ్నికరణి. 295

సీ. పుట్టుటమొదలుగాఁ - బొలియుదాఁక వికార
ములు శరీరమునకే - గలుగుఁగాని
యాత్మకు గల్గ - వం చవ్యక్తమార్గమౌ
కాలంబుచే వృద్ధి - క్షయము చంద్రు
కళలకై చంద్ర మం - డలమున కవిలేమి
గని నిశ్చయించితి - వినుము మఱియు
ఘన నదీవేగమౌ - కాలంబు గల్గించు
నాత్మయం దుదయించు - నఖిలభూత

తే.గీ. ములకు నెడప క జనినాశ - ములను వరుస
నిట్టులుండియు నవి తోఁప - వెవ్వరికిని
మంట లగ్నిని బొడముట - మాయుటట్టు
లని విమర్శించి నేఁ బొంది - తిని విరక్తి. 297

తే.గీ. కిరణములచేత జలమును - దరణి యదన
నందుకొనుచును విడుచుచు - న్నట్లు యోగి
కరణములచేత విషయాళిఁ - గాలమెఱిఁగి
కొనువిడుచు గాని వానితోఁ - గూడఁ డెపుడు. 298

ఆ.వె. ఒక్కడయ్యు నాత్మ - పెక్కులుగా నుపా
ధిస్థుఁ డగుట నజ్ఞ - దృష్టిఁ దోఁచు
నొక్కడయ్యు సూర్యుఁ - డుదకపాత్రంబులఁ
బెక్కులుగను గాను - పించునట్లు. 299

ఆ.వె. ఎవ్వఁడేని నెపుడు - నెవరిపై నెక్కువ
చెలిమి మక్కువయును - జేయఁజనదు
చేసెనేని దీన - చిత్తుఁడై సంతాప
మొందు ననిఁగపోత - యుగము వోలె. 300

వ. అది యెట్లనిన వినుము. 301

## - : కపోతోపాఖ్యానము : -

సీ. ఒక కపోతము భార్య - యును దాను నడవిలోఁ
జెట్టుపై నొక గూఁడు - గట్టి యందు
వసియించెఁ గొన్ని సం - వత్సరంబులు ప్రేమ
మన్యోన్య మభివృద్ధ - మగుచునుండఁ
గను లంగములు బుద్ధు - లును నేకమౌనట్లు
దాంపత్య ధర్మ బ - ద్ధంబు లగుచు
శయ్యాసనాటన - స్థానవార్తాశన
క్రీడలం దవి జోడు - వీడ కడవి

ఆ.వె. నులుకులేక తిరుగు - చుండి సంప్రీతుఁడై
భర్త భార్య గోరు - వాని నెల్ల
నెట్టులైనఁ దెచ్చి - యిచ్చి మెప్పొందు య
యాతితనయ యింద్రి - యాళిఁ జిక్కి 302

ఉ. అంతటఁ గొంత కాలమున - కాసతి తొల్తటి చూలు దాల్చి తా
సంతసమార దాని పతి - సన్నిధి గూఁటను గ్రుడ్లువెట్టెనం
దెంతయు దుర్విభావ్యలగు - నీశ్వరు శక్తులచే జనించె న
త్యంత మనోహరావయవ - హారి తనూరుహ యుక్తశాబముల్. 303

వ. అంత. 304

శా. ప్రీతిం బిడ్డలఁ బ్రోచుచుండిరి కృతా - ర్థీ భూతులై దంపతుల్
పోతంబుల్ గుతుకంబునం బలుకు ప - ల్కు ల్వాని కూఁత ల్గతుల్
సేఁతల్మెత్తని యీఁకలుం దమకునై - శీఘ్రం బెదుర్కొంటలుం
జేతో మోదమొనర్చి వారికిఁ గడుం - జిత్రంబులై తోఁపఁగన్. 305

క. హరిమాయా మోహితు లా
యిరువురు నన్యోన్యమైత్రి - యెదలఁ బెనగొనం
బరి రక్షించిరి కడుఁ బా
మరులై పిల్లలను నదియె - మహితార్థముగన్. 306

సీ. ఇట్లుండ నొక్కనాఁ - డిద్దఱు నడవికిఁ
బిల్లల మేఁతకై - ప్రీతితోడ
నేఁగి యందెల్లెడ - నెరదుఁ గ్రుమ్మఱుచుండి
తడసిన నిచట లు - బ్ధకుఁ డొకండు
దైవవశంబున - నావనిఁ దిరుగుచుఁ
దమగూఁటి పజ్జ సం - తసముతోడఁ
దిరుగాడుచున్న పా - వురము పిల్లలఁజూచి
వలవేసి యన్నిటిం - బట్టికొనియె

తే.గీ. నప్పుఁ డాఁకలిగొనెఁ బిల్ల - లనుచు వేగ
నెరను ముక్కులఁగొనుచు నా - తురత వచ్చి
యా కపోతీకపోతంబు - లచటఁ గాంచె
వలను బడి యేడ్చు తమ ముద్దు - బాలకులను. 307

చ. వలఁబడి తన్నుఁ గాంచి కదు - వందురు పిల్లలఁజూచి తల్లిబి
ట్టలమట నేడ్చుచున్ శిశువు - లవ్వలలోఁబడి యుంటఁజూచియు
న్నిలుపఁగలేని శోకమున - స్నేహమునన్ మతిఁగప్పు మాయచే
వలకడకేగి బిడ్డలకుఁ - బ్రాకుచుఁదాను జిక్కె నావలన్. 308

తే.గీ అపుడు తనప్రాణములకంటె - నధికులైన
బిడ్డలను నాత్మసమయైన - ప్రియను సతిని
వలఁబడినవారిఁజూచి వ్యా- కులత నొంది
కలవరం బిట్టు బిట్టేడ్వఁ - గాఁదొడంగె. 309

సీ. అక్కటనే నెట్టి - యల్పపుణ్యుండను
దుర్మతి నిహపర - దూరగతిని
గృహసుఖాతృప్తుండ - నిట్టినాధర్మార్థ
కామసాధనమైన - గీము మునిఁగె
సాధ్వి నాకనుకూల - సమరూపయగు పత్ని
యిదె నన్నుఁబాడింట - నిందె విడిచి
సాధుపుత్త్రులతోడ - స్వర్గంబునకు నేఁగ
నున్నది నేనెట్టు - లుందు నిందుఁ

తే.గీ. బాదుకొంపను దీనత - భార్యసచ్చి
బిడ్డలును జచ్చి దుఃఖ జీ -వితుఁడ నగుచు
విధురుఁడగు నాకునేల జీ -వించు నాశ
యకట చూడరె నాయపా - యంబు నేఁడు. 310

చ. అని విలపించుచున్ గృపణుఁ - డై తన భార్యను బిడ్డలందఱన్
మును వలఁజిక్కి మృత్యుముఖ - ముంజొరువారిని బుద్ధిహీనులన్
గనియు వివేకహీనుఁడయి - గ్రచ్చఱఁగూలెఁగపోతమావలన్
వనచరుఁడుగ్రుడై చనియె - వారల నందఱఁగొంచు నింటికిన్. 311

ఆ.వె. కాన నేకుటుంబి - యేన శాంతాత్ముఁడై
ద్వంద్వములను మఱిగి - స్వైరవృత్తిఁ

గృపణుఁడగుచుఁ దనదు - గృహమె పోషించు వాఁ
డతనివారితోడ - నందుఁజేటు. 312

ఆ.వె. మాయకుండునట్టి - ముక్తిమార్గంబగు
మనుజలోకమందు - జననమొంది
పక్షిఁబోలెనెవఁడు - బద్ధుఁడౌ సంసృతి
నతనినెక్కి జాఱె - నం(డ్రు బుధులు. 313

వ. అని మఱియు నా(బ్రాహ్మణోత్తముం డిట్లనియె 314

మ. తనకర్మంబు కొలంది దేహి పడుఁగా - దా దుఃఖముం గోరకు
న్నను నట్లే నరుఁడొందు నైంద్రియికమున్ - సౌఖ్యంబు స్వర్గంబునం
దుననున్న న్నరకంబునంబడిన నెం- దుం దానికై యత్నమే
పనిలే దాయువు వ్యర్థమౌ నని బుధు - ల్వాంఛింప రాసౌఖ్యమున్. 315

తే.గీ. రసయుతాన్నముగాని నీ - రసముగాని
యధికమో యల్పమో యేది - విధివశమునఁ
(బాప్తమౌ దాని భుజియించు - నజగర(వ
తంబుతో యోగి యెట్టి య - త్నంబు లేక. 316

ఆ.వె. ఎన్ని దినములైన - నన్న మయత్నతఁ
జిక్క దేని నుపవ - సించి కొండ
చిలువఁబోలె ధీర - చిత్తుం డక్రియుఁడై ప
రుండవలయు దైవ - మండగొనుచు. 317

తే.గీ. ఇం(ద్రియమనశ్శరీరస - మృద్ధబలము
లుండియును నేమియును జేయ - కుండు తనువు
తోడ నిర్నిద్రుఁడై పండి - తుఁడు పరుండు
నిం(ద్రియము లుండియును జేయఁ - దేదియేని. 318

సీ. నిండి లోఁతెఱుఁగరా - కుండు నన్యుఁడు దన
తలఁపును గనిపట్ట - వలఁతి గాఁడు
తను మించ నెట్టివాఁ - డును జాలఁ డిట్లని
దేశకాలాదులు - దెల్పనోప

వేమాత్రము గలంగc - దేవికార మెఱుంగc
దలలు లేని సముద్ర - మట్లు మౌని
విషయసక్తుండు గామి - విషయము ల్నిండుగా
నున్న లేకున్న దా - నుబ్బc దణcగc

తే.గీ. డెపుడు నారాయణపదంబు - నేమఱcదు స
మృద్ధిగా నేళ్ళు పాఱిన - నెచ్చు లేని
నెండిపోయినcదానును - నెండులేని
లేని సాగరమును బోలి - మౌని యుండు. 319

తే.గీ దేవమాయాస్వరూపయౌ - స్త్రీని జూచి
దాని భావంబులకుc జిక్కి - మానసంబు
నిల్పలేని నరుండు వ - హ్నిcబడి సమయు
మిడుత పోలిక నంధతా - మిస్రమొందు. 320

చ. తనకుపభోగయోగ్యములు - తథ్యముగా నని మూఢుcడెవ్వcడీ
శుని ఘనమాయచే నయిన - సుందరులన్ సొగసైన చీరలం
గనకపుసొమ్ములం గని వి - కారమునం దదధీనుcడౌ నతం
డనలమునం బతంగముక్రి - య న్నశియించు వినష్టదృష్టియై. 321

తే.గీ ఎంతcదిన నిల్చుc దనదేహ - మంతమాత్ర
మించుకించుక యన్నంబుc - గొంచుc దేcటి
పగిది భిక్షాన్నవృత్తియై - బ్రతుకు మౌని
యేగృహస్థుని నొప్పింపc - డించుకేని. 322

తే.గీ. పెద్దవియుc జిన్నవియు నైన - పెక్కుశాస్త్ర
ములను సారంబు దేcటి పు - వ్వుల రసంబు
గ్రోలువిధమునc గొనcదగుc - గుశలుcడైన
నరుcడు వ్యర్థకుతర్కత - త్పరుcడు గాక. 323

తే.గీ. భిక్షితాన్నంబు నఱచేతc - బెట్టికొనునొ
మ్రింగునో గాని దాcపcడు - రేపటికిది

మాపటికి దంచు ముని యట్లు - దాఁపఁ దేనె
దాఁచి చెడు తేఁటివలెఁ జెడుఁ - దానితోడ. 324

తే.గీ. కాలనైన నంటఁ - గారాదు సన్న్యాసి
పొలఁతిరూపు కొయ్య - బొమ్మనైన
నంటెనేనిఁ గరిణి - యంగంబు నంటిన
హస్తి బోలి బద్ధుఁ - డగు నిజంబు. 325

ఆ.వె. తనకు మృత్యువైన - తరుణి నెప్పటికిని
బొందఁ దగదు బుధుఁడు - పొందెనేనిఁ
గరిణిఁబొంది యన్య - కరులచేఁ గరివలెఁ
డెగు నతండు శక్త్య - ధికులచేత. 326

ఆ.వె. తానుదినక మఱియు - దానంబుసేయక
వనట లోభి గూర్చు - ధనముఁ బరుఁడు
గుఱుతెఱింగి తీసి - కొనిపోయి భుజియించుఁ
దేనెఁ దేనెఁబట్టు - వానిఁబోలి. 327

క. తమ సుఖమునకు గృహస్థులు
శ్రమపడి యార్జించినట్టి - ద్రవ్యముఁ దొలుతన్
భ్రమరములు గూర్చు తేనియ
నెమకి కొనెడు వాని పగిది - నియమి భుజించున్. 328

క. వినఁదగదు గ్రామ్యగీతము
వనచరుఁడగు యతి మృగంబు - వ్యాధుని గీతం
బును విని మోహితమై శర
వినిహితమగు టెఱుఁగవలె వి - వేకము పేర్మిన్. 329

తే.గీ. కామినులు పాడి చూపిన - గ్రామ్యములగు
నృత్త వాదిత్ర గీతంబు - లెదను గలఁప
మృగిసుతుండగు ఋషి ఋశ్య - శృంగుఁ డట్టి
వేశ్యలకు నాటబొమ్మగా - వశుఁడయ్యె. 330

తే.గీ. కడుఁగలంచుచు గెలువ శ - క్యంబుగాని
నాల్కకోర్కులఁ జిక్కిన - నరుఁడు వొలియు
నెఱ్ఱకై గాలమును ట్రింగి - మృతిని బొందు
కుమతియగు మీనమును బోలి - కువలయేశ! 331

తే.గీ. ప్రాజ్ఞు లాహారమును మాని - పరగ గెల్తు
రన్నియింద్రియముల నాల్క - నాఁపఁజాల
రది నిలువకున్న నభివృద్ధి - నంది యెల్ల
యింద్రియంబులఁ గలఁచు మ - తింత వడిగ. 332

తే.గీ. ఇతరముల నింద్రియంబుల - నెల్ల గెలిచి
యున్న జిహ్వను గెలువక - యుండెనేని
నతఁడు గాఁడు జితేంద్రియుం - డధిప!నాల్క
గెల్చెనేనియు నన్నిటిం - గెల్చినట్లె. 333

## - : పింగళోపాఖ్యానము : -

క. వెలసె విదేహపురిం బిం
గళ యను నొక వేశ్య దానిఁ - గని నే బుద్ధి
న్నిలిపినది కొంత నీకుం
దెలిపెద నైరాశ్యమహిమ - తేటపడంగన్. 334

సీ. అక్కామచారిణి - యగు వేశ్య యొకనాఁడు
రతిసేయఁగాంతుని - మతినిఁ గోరి
ముదమొప్పఁ గైసేసి - మొగసాల నిలుచుండి
త్రోవను వచ్చు పూ - రుషులఁ జూచి
యర్థకాముక గాన - నందఱ ధనికులు
దాతలుఁ బ్రియులంచుఁ - దలఁచుచుండె
నొకఁడొక్కఁడే వచ్చి - యొయ్యనఁ బోవఁగా
నధికధనం బిచ్చు - నట్టి ధనికుఁ

తే.గీ. డింకొకఁడు దన్ను బొంద రాఁ - డే యటంచు
వాకిటన నిల్చి పేరాస - పడి పలుమఱు
వెలికి లోనికిఁ దిరుగుచు - వేఁగుచుండెఁ
జింతతోఁ నంతలోన ని - శీథమయ్యె. 335

తే.గీ. విసివి యా వేశ్య యనుకొన్న - విధము వినుము
పురుషు నాశామహాపాశ - మునకు విసుకె
యసి యది జనింపదేని దే - హంపుకట్టు
విడువఁ డెవనికి నెప్పుడుఁ - బుడమియందు. 337

చ. కటకట! కంటిరే మనసు - గట్టిగ నిల్పఁగలేని నాకు మి
క్కుటమగు మోహ ముప్పతిలెఁ - గొంచక దాన విమూఢబుద్ధినై
యిటు లతితుచ్ఛుడౌఁ మనుజుఁ - డిచ్చును నాకు సుఖంబు లంచు వి
స్ఫుటముగ నమ్మి దుర్విటుల - పొందునె కోరుచునుంటినెప్పుడున్. 338

సీ. తలఁప సమీపమం - దెలమిఁ జూపట్టువాఁ
డత్యంత సుందరుం - డైనవాఁడు
సకలసుఖంబులు - సంపద లిచ్చువాఁ
డొద్దనే యెప్పుడు - నుండువాఁడు
నైనయీశ్వరు మాని - యతితుచ్ఛుఁడై నాదు
కోరికల్ దీర్పగా - నేరకుండు
వాని దుఃఖభయార్తి - భాజను శోకమో
హప్రదు నొకనరు - నాశ్రయించి

ఆ.వె. తెలివిలేక నేను - దిరిగితి నిన్ని నా
ళ్ళకట నాదుపుట్టు - వ్యర్థమయ్యెఁ
జాలుఁజాలు నీచ - సాంకేత్యవృత్తి చీ
యనుచు నున్నవారు - జనులు నన్ను. 339

తే.గీ. ధనము రతిసుకమును నిరం - తరముఁగోరి
యమ్ముకొంటిని నామేని - నర్థలుబ్ధు

లైన స్త్రీలంపటులకు నా - యాత్మ నెంత
దుఃఖపెట్టితి నయ్యయో - దుష్టనగుచు. 340

సీ. వెన్నెముకయుఁ బ్రక్క - నున్న యెమ్ములును దూ
లమును వాసంబులై - యమరి యుండ
హస్తపాదముల ను - న్నట్టియెమ్ములు దృఢ
స్తంభంబులై ప్రశ - స్తములు గాఁగ
వెలిచర్మమును లోమ - ములు నఖరంబులు
నొప్పుగానుండు పై - కప్పు గాఁగ
నిలువ కెప్పుడు మలం - బులుగాఱు తొమ్మిది
రంధ్రముల్ దాని ద్వా - రములు గాఁగ

తే.గీ. మలము మూత్రము నిండిన - మైలకొంప
యైన మానవదేహంబు - నందుఁ గాంత
బుద్ధిఁజేసితి నిట్టివి - మూఢమతిని
నేనెగాని మదన్య లెం - దేనిఁ గలరె 341

తే.గీ. ఈ విదేహుల నగరిలో - నేనొకతెనె
గాని యింకెవ్వతెయు లేదు - కలయవెదక
దన్ను నిచ్చెడు శ్రీహరి - కన్న నన్యు
రమణుఁడని కోరు మూఢాత్మ - రాలు స్త్రీల. 342

వ. కావున. 343

తే.గీ. ప్రియతముఁడును విభుఁడు సు - హృదుఁడు నాత్మఁ
డెవ్వఁడీదేహధారుల - కెల్ల నట్టి
హరికి నను జట్టిగా నిచ్చి - యతనిని గొని
క్రీడసల్పుదు నతనితో - శ్రీనిఁబోలి. 344

తే.గీ. మొదలు దుద గల్గువిషయము - ల్సదయు లగుచుఁ
గామములఁ దీర్చు నరులును - గాలకలితు

లైన దివిజులు నైన భా - ర్యకు నొనర్చి
నట్టి సంప్రీతి యేమాత్ర - మగు గణింప. 345

సీ. ఇది నిజం బేఁ దొల్లి - యే పుణ్యకర్మమో
చేసియుండితి దాని - చేత హరికి
భగవంతునకుఁ గల్గెఁ - బరగ నాయెడఁ బ్రీతి
గాన దురాశనై - కలఁగు నాకు
నిక్కం పుసుఖమిచ్చు - నిర్వేదము జనించె
నటుగాక మందభా - గ్యనుగ నున్న
నేదిగల్గిన నరుం - డీ యనుబంధంబు
విదళించి శమమొందు - వేగ నట్టి

తే.గీ. తీవ్రనిర్వేదమును నాకుఁ - దెచ్చునట్టి
క్లేశములు గల్గ వీ యుప - కృతిని శిరసు
తో గ్రహించుచు గ్రామ్యుల - తోడఁ గూడ
కాశ వర్జించి శ్రీహరి - నాశ్రయింతు. 346

తే.గీ. ఇందు సంసారకూపంబు - నందుఁ గూలి
విషయములు గ్రమ్మి తనదృష్టి - వెస హరింపఁ
గాలసర్పంబు దను మ్రింగఁ - గలఁగు నాత్మఁ
గావ హరికన్న దక్షుండు - గలఁడె యొరుఁడు 347

తే.గీ. సకలవిషయంబు లిఁకఁజాలుఁ - జాలు ననుచు
విసివినప్పుడు తనుఁగాచు - విష్ణుఁ డతఁడె
యీజగంబెల్లఁ గాలాహి - యెనసి మ్రింగి
యుండు టేమఱకయె చూచు - చుండ వలయు. 348

వ. అని యిట్లు పింగళ దలపోసె నని చెప్పి యాబ్రాహ్మణుం డిట్లనియె. 349

తే.గీ. అట్టు లది నిశ్చయించి కాం - తార్థమైన
తన దురాశను గోసి శాం - తము వహించి

శ్రీహరి న్మది నిల్పి ని - శ్చింత యగుచు
హాయిగాఁ జేరెఁ దనదు శ - య్యాతలంబు. 350

**తే.గీ. ఆశయే గద పరమదుః - ఖాశ్రయంబు**
**పరమసుఖ మాశలేమియే - యరసి చూడ**
**వేశ్య పింగళ కాంతాశ - విరతిఁ ద్రెంచి**
**సుఖముగా నెట్లు నిద్రించె - చూచితయ్య. 351**

వ. అని మఱియు నా బ్రాహ్మణుఁడు యదురాజుం జూచి యిట్లనియె 352

చ. తనకుఁ గడుంబ్రియం బయిన - దానిఁ గొను న్నరుఁ డందుచేత నా
తనికి సుఖంబు గల్గునని - తాఁ దలపోయును గాని దుఃఖమే
పెనగొను దీని గుఱ్ఱెఱిఁగి - పెద్దలు సర్వపరిగ్రహంబు మా
ని నిరతసౌఖ్యముం బడసి - నిర్భయు లౌదు రకించన స్థితిన్. 353

చ. కురర మొకండు మాంసమును - గొంచు దివింజన జూచి యన్యము
ల్గురరము లామిషార్థమయి - కూయుచు వెన్కొనె దానిఁజంపఁ నా
కురరము మాంసఖండమును - గొబ్బునఁ బారఁగవైచి సౌఖ్యముం
బొరసెఁ బరిగ్రహంబు సుఖ - మో యటుగాదొ యెఱుంగు భూపతీ! 354

తే.గీ. నాకు మానావమానబం - ధంబుగాని
యిల్లు బిడ్డలు గలవారి - యెదరుగాని
లేదు నిత్యాత్మరతుఁడ ని- ర్లేపబుద్ధి
నాత్మఁ గ్రీడింతు బాలుని - యట్టు లెందు. 355

ఉ. ఏమి యెఱుంగకేఁజతన - మేని నొనర్పక యుండు బాలుఁడున్
క్షేమపథంబునం బ్రకృతి - గెల్చిన ధన్యుఁడు వీర లిద్దఱే
యీ మహిఁ జింతలెల్లఁ ద్యజి - యించి యనుత్తమ నిత్యసౌఖ్యది
వ్యామృతసాగరాంతరము - నందు మునింగిన వార లెన్నఁగన్. 356

సీ. ఉర్వీశ! వినుము నే - నొక కన్యవలన గ్ర
హించిన ధర్మంబు - నెఱుకపఱుతు

లోకానుకరణంబుఁ - గైకొని తత్త్వంబు
నెఱుఁగఁగాఁ గోరి నే - నేగుచుండ
నొకయింట నొక్కక - న్యక తన మనువున
కరుగుదెంచిన బంధు - వరులఁ జూచి
తన పెద్దవార లిం - టను లేమి వారికి
నుపచారములు దానె యొనరఁ జేసె

తే.గీ. నప్పుడా బుద్ధిమంతురా - లన్నమునకు
గుట్టుగా వడ్లు వెస దంచు - కొనుచు నుండ
గల్లుగల్లున గవ్వచే - కట్లు మొఱయ
రోఁతగాఁ దోఁచి బిడియంబు - చేత నామె. 357

క. రెండేసి నిల్పి గవ్వలఁ
బిండిగ నన్నిటినిఁ గొట్టి - వెండియు దంచన్
రెండును గలగలలాడె నొ
కం దందును బోవనడువ - గలగల మానెన్. 358

క. అక్కన్యగవ్వవలె ముని
యొక్కఁడె తిరుగవలె నంచు - నూహించితి నేఁ
బెక్కులు సేరినఁ గలహం
బెక్కువయగు గోష్ఠి సాగు - నిద్దఱు గూడన్. 359

సీ. ఆసనశ్వాస జ - యంబున నేకాగ్ర
మొనరింప వలయును - మనసుఁబట్టి
విక్షిప్తమౌ దాని - విరతి నిల్పఁగవలె
నభ్యాసమున లక్ష్య - మందు నిల్పి
మనసు లక్ష్యబ్రహ్మ - మున నిల్ప నదికర్మ
వాసన ల్మెల్లఁగా - వదలుచుండు
సత్త్వంబు నెటిఁగి ర - జస్తమంబు లడంగ
మన సనింధనవహ్ని - మాడ్కివృత్తి

తే.గీ. రహితమై ధ్యేయమౌ పర - బ్రహ్మమందు
నణఁగి లోవెలి నెఱుఁగదే - య్యదియు శరముఁ
జక్కగాఁ జేయువాఁడు ప - జ్జఁ జను రాజు
నెఱుఁగ కున్నట్టు లని వాని - గుఱిని గంటి 360

మ. జనసంగంబును మాను నొక్క నియత - స్థానంబు లేకుండుఁ దా
ననయం బేమఱఁ డొంటిఁ బండుకొను నే - కాంతంబునం జర్యలం
దను నెవ్వారు నెఱుంగలే రొరులఁ జెం - తం జేర్పఁ దత్యల్ప భా
షణుఁడై సర్పముఁ బోలె మౌని దిరుగున్ - స్వైరప్రచారంబునన్. 361

తే.గీ. అధ్రువంబైన మేనికి - నై గృహంబుఁ
గట్టుకొను టెంతయును దుఃఖ - కరము విఫల
మొరులు గట్టిన యింటిలో - నుండి పాము
సుఖముగా వృద్ధిబొందదే - చూడు మధిప! 362

సీ. ఆది నొక్కండు నా - రాయణదేవుండు
మును దన మాయచే - తను సృజింపఁ
బడిన యీజగమును - బ్రళయంబునను గాల
శక్తిచేఁ దా నుప - సంహరించి
యద్వితీయైక ని - రాశ్రయ స్వాధార
చిన్మాత్రుఁడై ప్రకా - శించుచుండె
నపుడు జగత్కార - ణాత్మక సత్త్వాది
శక్తులయ్యాత్మ ప్ర - శస్తమహిమఁ

తే.గీ. గాల పరిపాకమున సామ్య - గతినిఁ బొంద
నాప్రధానముఁ దదుపాధి - కాత్మ వీని
కీశుఁడు బరాపరాత్మల - కెల్లఁ బ్రాప్యుఁ
డాది పురుషుండు గైవల్య - మనఁగఁ నిలుచు. 363

సీ. అపరాత్ముఁడె కేవ - లానుభవానంద
ఘనుఁడగు నిరుపాధి - కస్వరూపుఁ

దతఁ డాత్మమహిమచే - నా త్రిగుణాత్మిక
మాయను క్షోభింపఁ - జేయనందుఁ
దొలుత జనించె జీ - వుల సంసృతికి హేతు
వగు సూత్రసంజ్ఞ మ - హత్తు దాని
నవ్యయయౌ త్రిగు - ణవ్యక్తి యందురు
త్రైగుణ్యనానావి - ధప్రపంచ

తే.గీ. సృష్టి కది మూల మద్దాన - నీజగంబ
హంకృతిప్రముఖంబు సం - వ్యాప్తమయ్యె
దీనిచేత నిబద్ధుఁడై - దీనుఁడగుచుఁ
బురుషుఁడు చరించు సంసార - మునను జిక్కి. 364

తే.గీ. తన హృదయమందుఁ బుట్టి వ- క్త్రమున వెడలి
నట్టి జొల్లున బూ జల్లి - యందు వలసి
నట్లు విహరించి సాలెపు - ర్వివల దాని
మ్రింగున ట్లీశ్వరుఁడొనర్చు - సృష్టి లయము. 365

తే.గీ. ప్రేమనైనను బగనైన - భీతినైన
దేహి తన బుద్ధిబలమున - దేనియందు
మనసు నేకాగ్రమున నిల్పు - మానకెపుడు
నాతఁడా రూపమును నిశ్చ - యముగఁబొందు. 366

ఆ.వె. తన్ను బట్టి తెచ్చుచున్న తేఁటిని భీతిఁ
తలఁచుచుండి పురుగు - దాని గూఁటఁ
దన్ను బెట్టఁ బూర్వ - తనువుఁబాయకయె త
ద్రూప మొందుఁగద య - దుప్రవీర! 367

శా. ప్రేమన్ గోపికలున్ జరాసుతముఖుల్ - ద్వేషంబునన్ గంసుఁడు
ద్దామంబైన భయంబునన్ హరి నెదన్- ధ్యానించి తద్రూపమున్
దా మంతంబునఁ బొందిరన్న నటఁ - జిత్రం బేమియుం గల్గదీ
భూమిం గీటముఁ బేశకృత్తుఁ గని నీ - బుద్ధిన్ విమర్శింపుమా. 368

క. ఈ గురువుల శిక్షను నే
నీగతి నామతికిఁ బరమ - హితము గఱపితిన్
నాగురువై యీదేహము
బాగుగఁ జెప్పిన హితంబుఁ - బలికెద వినుమా 369

సీ. పుట్టువుఁ జావును - బొరయు చుండుటను ని
రంతర దైన్యకా - రణము నగుట
నాదు వైరాగ్యంబు - నకు గురు విది యయ్యెఁ
దత్త్వంబు లిద్దానఁ - దగ గణించి
యవి యసత్యములని - యాత్మ సత్యంబని
యాత్మనిశ్చయహేతు - వయ్యెఁ గాన
నిది నా వివేకసం - పదకును గురువయ్యె
నింతయు నెఱిఁగి నే - నిపుడు దీని

తే.గీ. బ్రతికియుండఁగఁ జుట్టాల - పాలి దనియు
నంతమున నగ్నిలో మంట దగునొ గాక
కంకకాకాదులదొ యంతె - గాని నాది
గాదనుచు దాని నే నంట - కయె చరింతు. 370

సీ. పురుషుఁ డాత్మశరీర - భోగము ల్గోరి దా
రాపత్యవిత్తగృ - హాప్తభృత్య
పశువర్గములఁ గష్ట - పడి ధనమార్జించి
పోషించు నాయువు - పూర్ణమైనఁ
బొలియు నా తను వంతఁ - బోవక యది చెట్టు
విత్తనంబుల వేఱు - వృక్షములను
బుట్టించినట్లు తా - మున్నొనర్చిన కర్మ
మున దేహి కన్యమౌ - తనువుఁ గూర్చుఁ

తే.గీ. గాన నీ దేహమున కెంత - గాసిపడి సు
ఖం బొనర్చిన వ్యర్థమే - గాక దేహి

కది నిరంతరదుఃఖదా- యకము నగుట
నాతఁడు విరక్తుఁడౌట శ్రే - యస్కరంబు. 371

వ. అదియునుంగాక. 372

సీ. తను నాల్క రుచులు దె - మ్మని యీడ్చు నొకవంక
దప్పి నీ రిమ్మని - తగవు వెట్టు
శిశ్నంబు లాగుఁ దన్ - స్త్రీలకై యొకతట్టు
స్పర్శసుఖార్థమై - త్వక్కు పెనఁగు
నాస యీడుచుఁ దన్ సు- వాసన లిమ్మని
చూపు వేధించుఁదన్ - రూపములకు
వాగాదులను గర్మ - వశుఁడవు గమ్మని
పలుదెసలకుఁ దన్నుఁ - బట్టి యిగ్గుఁ

తే.గీ. బెక్కు సవతులు పతితోడఁ - బెనఁగినట్లు
పట్టి యిన్నియుఁ దనతన - తట్టుపురుషు
నీడ్వ నీదేహమున వాఁడు - హృతవివేకుఁ
డగుచు బెగడొంది మిడుకు నో - యవనినాథ! 373

సీ. అవ్యయుం డీశ్వరుం - డజయగు తనశక్తి
వృక్షసరీసృప - పక్షి మత్స్య
పశుదంశ ముఖములౌ - బహువిధ తనువుల
సృజియించి వానిచేఁ - దృప్తిలేక
యపరోక్షముగ బ్రహ్మ - మరసి యెఱుంగ సా
ధనమగు మానవ - తనువుఁజేసి
ముదమందె బహుజన్మ - ములకు నవ్వల దుర్ల
భంబైన యీమేను - వచ్చెనిదియు

తే.గీ. నస్థిరంబయ్యు నగుఁ బురు - షార్థదంబు
గాన ధీరుండు వెప ముక్తిఁ - గాంచుదాఁక
మృత్యుముఖమునఁ బడకముందే - ప్రయత్న
మును సలుపనొప్పు విషయంబు- లను ద్యజించి. 374

తే.గీ. విషయములకేమి కొల్లగా - వెలయుఁబ్రీతి
ననుభవింపంగ నఖిల దే-హములయందు
ముక్తినొందఁగ నేదేహ - మునను గాదు
మనుజదేహంబుననెగాని - మానవేంద్ర! 375

తే.గీ. అనుచు వైరాగ్యమొంది యా - త్మానుభవము
తోడ విజ్ఞానదీపవే - ద్యుఁడగు నాత్మ
నందె రతిగల్గి సంగ మ్మఁహంతవదలి
యీధరఁ జరించుచుందు ని - జేచ్ఛ నెందు. 376

తే.గీ. ఆత్మయాథార్థ్యబోధకం - బైన జ్ఞాన
మొకగురువు సెప్పుటనె యంత - యును గలుగుచు
రెండవదిలేని బ్రహ్మమే - ఋషులచేత
బహువిధంబుల వర్ణింపఁ - బడును గాన. 377

వ. అని యిట్లు బ్రాహ్మణుండు యదువునకుం జెప్పెనని యుద్ధవునితో భగవంతుం
డిట్లనియె. 378

చ. ఘనమతి విప్రుఁడీవిధము - గా యదువుం గని ప్రేమతోడఁ జె
ప్పి నయముమీఱ నాతనిని - వీడ్కొని తత్కృత పూజలు న్నుతుల్
గొని చనియెన్ యథేష్టగతిఁ - గూరిమి నయ్యవధూతు వాక్యముల్
విని జితసంగుఁడున్ గత వి - భేదుఁడు నయ్యె యదుప్రముఖ్యుఁడున్ 379

-: శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ దత్త్వ జ్ఞానసాధనంబుల వివరించుట :-

వ. అని మఱియుఁ శ్రీకృష్ణదేవుం డన్వయవ్యతిరేకప్రకారంబున నట్లు
విమర్శించుటంబుట్టిన వివేకజ్ఞానంబుగలవాని కాత్మతత్త్వజ్ఞానంబు
సంపాదించుటకు వలయు సాధనంబులను వివరంబుగా నెఱింగించువాఁ
డై యుద్ధవునిం గని యిట్లనియె. 380

ఉ. నే నెవి యాగమంబుల గ - ణించితి భాగవతస్వధర్మముల్
గా నవి యప్రమత్తుఁడయి - గట్టిగ నన్నెద నమ్మి చేయుచున్

వానికి లోప మేమియును - వాటిలకుండ నకామ్యుఁడై విధిన్
మానక యాచరింపనగు - మాన్యకులాశ్రమవర్ణధర్మముల్. 381

చ. ఎవఁడు విశుద్ధచిత్తుఁడగు - నిట్లు స్వధర్మము నాచరించి వాఁ
డు విషయసక్తులై చెడు జ - డు ల్విషయావళి సత్యమం చెదం
దవిలి యొనర్చు యత్నములు - దద్విపరీత ఫలంబు లిచ్చుటన్
బ్రవిమలదృష్టిఁ జూచు మఱి - వాఁడు ఫలంబును గోరఁ డేపనిన్. 382

మ. నిదురం దోచిన స్వప్నకల్పితములున్ - మేల్కొన్నచో మానసా
భ్యుచితంబుల్ వివిధంబులౌట బయలం - దున్నట్లుగాఁ దోఁచుటన్
బొదలున్ వ్యర్థములై పదార్థములిటన్ - బుద్ధీంద్రియగ్రాహ్యతా
స్పదనానావిషయంబు లట్టివె సుమీ - భావింప మిథ్యాకృతుల్. 383

తే.గీ. మత్పరుండయి కామ్యక - ర్మములు విడిచి
కడఁకతో నిత్యనైమిత్తి - కము లొనర్ప
వలయు నాత్మవిచారంబు - సలుపు నప్పు
డవియు మది నాదరింపమి - యభిమతంబు. 384

తే.గీ. యమము లొనరింపఁదగుఁ గడు - నాదరమున
నియమములఁ జేయనౌ సాధ్య - మయినయట్లు
మత్పరుండయి మదభిజ్ఞు - మన్మయాత్ము
శాంతు సద్గురుఁ జేరఁగాఁ - జను మహాత్మ. 385

సీ. తా నధికుఁడ నను - తలఁపు లేమియు నొరు
లేమలొంద వగవమి - తాలిమియును
జాగులేమియు బంధు - జనులపై మమతను
మానుట చెదరని - మనసు కలిమి
గురునెడ దృఢమగు - కూరిమి గలుగుట
పరమార్థమెఱుఁగఁదీ - వ్రమగు నిచ్ఛ

తే.గీ. యనెడు నీలక్షణంబు లె - వ్వనికిఁ గలుగు
నతఁడు గురుని భజింపఁగా - నర్హుఁడవని

నాతనికి మోక్షఫలదయౌ - నట్టివిద్య
యబ్బు గురుకృప నంతరా - యంబు లేక. 386

తే.గీ. ఆలు బిడ్డలు నిండ్లు ద్ర - వ్యంబు పొలము
స్వజన మను వీని యందెల్ల - సమతఁదానె
చెందుసుఖమని యం దుదా - సీనుఁడగుచు
మమత దిగనాడి గురుసేవ - మలఁగవలయు. 387

సీ. దాహకుండౌ నగ్ని - దాహ్యమౌ దారువు
నందుండియును నన్యుఁ - డై వెలుంగు
కరణి నీస్థూలసూ - క్ష్మశరీరముల నుండి
సాక్షి విలక్షణ - స్వప్రకాశుఁ
డై పరాత్మ వెలుంగు - నాతండు దేహగు
ణావళిఁ బొందుట - యగ్నిదారు
ధర్మంబులగు నిరో - ధంబు నుత్పత్తిని
పెద్దది చిన్నది - పెక్కులగుట

ఆ.వె. నందునుండి పొందు - నట్టులే యగుఁగాని
నిజముగాదు నిత్య - నిర్వికారుఁ
డాత్మ దేహగుణము - లగు ననిత్యత్వాదు
లెన్నఁడేనిఁ బొందఁ - డెంచిచూడ. 388

క. పరమేశ్వర మాయాగుణ
విరచిత మీదేహ మింద - విద్యం దాదా
త్మ్యరతిం బొందిన సంసృతిఁ
బొరయును జీవుండు ముక్తిఁ - బొందును విద్యన్. 389

ఉ. కాన విచారము న్సలిపి - కారణకార్యసమూహమైన యా
మేనుల నుండు నాత్ముని న - మేయు నసంగుఁ బరాత్ముఁగా దృఢం
బైన మనీషఁ గాంచి క్రమ - మారఁగ స్థూలముగాను సూక్ష్మముం
గానని మేనుల న్నిజము - గాఁ గను బుద్ధిని మాను టొప్పగున్. 390

ఆ.వె. అడుగు నరణి గురువు - నాపైది శిష్యుండు
రెంటిసంధి గురువ - రేణ్యు శిక్ష
యందుఁబుట్టు నగ్ని - యట్టిది విద్య శి
ష్యునకు నదియె పరమ - సుఖము నిచ్చు 391

సీ. అత్యంతనిపుణులౌ - నాచార్య శిష్యుల
సువిచారమునఁగల్గు - శుద్ధమతియె
త్రిగుణకార్యాత్మకం - బగు జీవుఁ దత్సృష్టి
హేతువులను జని - యింపఁజేయు
నట్టి యవిద్యను - నగ్ని యింధనములఁ
గాల్చి శమించెడు - కరణి మాపి
నిరుపాధికాద్వయ - పరమసుఖాకృతి
యై వెలుఁగొందు న - ట్లౌట నాత్మ

తే.గీ. యొక్కఁడే నిత్యుఁ దద్వితీ - యుం దుపాధి
కృతము లతని కర్తృత్వ భో - క్తృత్వ ముఖ్య
ధర్మములు దద్విభిన్నం బ - తథ్య మఖిల
మని విరతి నొందువాఁడు గాం - చును విముక్తి. 392

వ. అట్లుగాక పుణ్యాపుణ్యకర్మంబు లొనరించి సుఖదుఃఖంబు లనుభవించు నీజీవు లన్యోన్యభిన్నులనియు వారు కర్మఫలంబు లనుభవించు నెలవులగు లోకంబులను దద్భోగకాలంబును భోగసాధనకర్మబోధకంబులగు నాగమంబులును భోక్తయగు జీవాత్మ యునిత్యంబులనియుం దలంచు వారి మతంబున నహం ప్రత్యయ జ్ఞేయుండె యాత్మ. వాడును ప్రతిశరీరంబునను భిన్నుండై కర్తృభోక్తృరూపంబున నుండు. వారి కెల్లను స్వరూపభూతుండును నిర్వికారుండును నొక్కండగు పరమాత్మలేఁడు. లోకకాలాగమాత్మ లనిత్యంబులు గామి వైరాగ్యంబునకు హేతువు లేదు. స్రక్చంద నస్త్ర్యాద్యశేషవిషయజాతంబు పురుషకర్తృకంబై ప్రవాహరూపంబున నిత్యంబై యుండు. జగంబిట్లుగాక యొండు విధంబున నెన్నండును నుండదు

గావునదీనికింగర్తయాశ్వరుండగు నొక్కండు లేఁడు. ఏది యెట్లుండు నది యట్లే యెప్పుడును నుండు. ఇది మాయామయంబుగాదు. ఆత్మకు స్వరూపభూతంబై నిత్యంబు నొక్కండగు జ్ఞానంబులేదు. ఘటపటాద్యాకార భేదంబున బుద్ధియే మాఱుచుండుం గావున జ్ఞానపరిణామంబె యాత్మ. అది జ్ఞానంబేయగుట వికారియైనను ననిత్యంబుగాదు. ఇంద్రియాదిరహితుం డాత్మయనిన నాతనికిఁ బరిణామంబు గల్గమి జడంబగు. తత్ప్రాప్తి పురుషార్థంబు గానేరదు. కావునం బ్రవృత్తియే శ్రేయంబు గాని నివృత్తిగాదను నీమతాంతర విరోధ వాక్యంబులచేత నుద్ధవా నీకు సందేహంబు గలుగనొప్పు దెట్లనిన విను మాపక్షంబున సంవత్సరాది కాలావయవంబులచే జన్మవృద్ధి పరిణత్యపక్షయ వ్యాధి నాశంబులు దేహులకెల్లను దేహయోగంబునన గలుగు ననవలయు. అట్లనినను గర్మముల నొనర్చువానికి సందు నస్వాతంత్ర్యంబె వాటిల్లు. స్వాతంత్ర్యంబు గలదనిన వాఁడనిష్టంబగు దుష్కర్మం బొనర్పనేల? దుఃఖం బనుభవింపనేల? సత్కర్మం బొనర్ప నేర్చినవాఁడె సుఖంబు ననుభవించు నేరనివాఁడే దుఃఖంబు బొందు ననిన విద్వాంసుఁడగు వానికి సుఖం బించుకేని లేకుండటయు మూఢునకును దుఃఖంబులేకుండటయుం గాంచినచో మేము కర్మకుశలులమగుట సుఖపడుచున్నవారమని వారు విఱ్ఱవీగుట వృథాహంకారంబ యని తేలక తప్పదు. వారొకవేళ సుఖము రాకను దుఃఖము పోకను నెఱింగియున్నను మృత్యు వెన్నండునుం దమకుఁ గలుగనీని యోగంబు వారెఱుంగరనుట తెల్లంబ. మరణకాలంబు వఱకునైన నవిరతసుఖం బనుభవింతుమనిన మృత్యు ముఖంబునం బడఁబోవు విద్వాంసులకు సైతము నర్థకామంబులు సుఖదంబులు గానేరవు. వధస్థానంబునకుఁ దన్నుఁ జంపం గొనిపోవునప్పుడు వధ్యున కేదియైనను సుఖదంబగునే? మరణానంతరంబునం బరలోకంబున సుఖం బొందెదమనిన నటఁ బరసుఖాసహన పరగుణదోషావిష్కరణ క్షయ వినాశంబులవలన నిందలి దృష్టసుఖంబువలె నాస్వర్గాది శ్రుతసుఖంబును దుఃఖంబే యగు. అది మఱియుం గృషింబోలె బహు విఘ్నవైగుణ్యాది

బాధితంబుగాన నిష్ఫలంబ. విఘ్నవైగుణ్యాద్యభావం బంగీకరించినను దానికి వినాశం బనివార్యం బెట్లనిన. 393

తే.గీ. విఘ్నరహితముగా విధి - విహితమైన
ధర్మమును లెస్స జరిపిన - ధన్యుఁడును సు
ఖానుభవమునకై స్వర్గ - మందుఁ బొందు
నెలవు నశియించు తెఱఁగు వ - ర్ణింతు వినుము. 394

సీ. యజ్ఞంబు లిట దేవ - తార్థమై చేసిన
యాజ్ఞికుం డేగును - నాకమునకు
నచటఁ దానార్జించి - నట్టి దివ్యసుఖంబు
లను దేవతను బోలి - యనుభవించుఁ
దన పుణ్యమున మండి - తమగు విమాన మం
దభిరామవేషుఁడై - యమరకాంత
లందు గంధర్వ గా - నామృతం బానుచు
విహరించుచుండు సం - ప్రీతితోడఁ

తే.గీ. గింకిణీ జాలయుతము స్వ - లంకృతంబు
నైన కామగ యానంబు - నందు స్త్రీలు
గొలువ నమరవిహార భూ - ములఁ దిరుగుచుఁ
జొక్కి యాత్మనిపాతంబు - జోలి మఱచు. 395

తే.గీ. తనదు పుణ్యంబు క్షీణించు - దాఁక నిట్లు
స్వర్గమున మోదమందుచు - సంచరించు
నది ముగియఁ గాలచాలితుఁ - డై యతండు
వలపకయుఁ దలక్రిందుగాఁ - బడు ధరిత్రి. 396

సీ. అటుఁగాక యెవఁ డధ - ర్మాసక్తుఁడై దుష్ట
సంగతి నింద్రియ - జయములేక
కోరిక ల్మనసుఁ జి - క్కులఁ బెట్ట దీనుఁడై
భోగ తృష్ణాకుల - బుద్ధియగుచు

స్త్రీ లంపటుండు గు - త్సితుఁడు భూతద్రోహి
యై ప్రేతభూత ము - ఖ్యములఁ దనుపఁ
బశువుల నవిధిగాఁ - బట్టి యజ్ఞముఁ జేసి
పాపుఁడై దేహంబు - వాయు నతఁడు

తే.గీ. నరకముల కవశుండయి - యరిగి యందు
దుఃఖములఁ బొంది స్థావరా - దులను బుట్టు
దురితదుర్గతి దుర్జన్మ - సరణిఁ దిరుగు
చున్న సుఖమేమి మర్త్యతా - పన్ననకును. 397

వ. మర్త్యు లననెంత? ప్రవృత్తిప్రవాహపతితులై వైరాగ్యంబు నొందరేని నెవ్వరికిని
సుఖలేశంబును లేదు. 398

తే.గీ. నిత్యము లమర్త్యములునైన - సత్య ముఖ్య
లోకములు గల్గు జీవులౌ - లోకపాల
కులును ద్విపరార్ధ జీవియౌ - నలువ దానె
జంకు నాకన సుఖపడు - నింక నెవఁడు. 399

తే.గీ. గుణములు సృజించు నింద్రియ - గణము నదియె
కర్మము లొనర్చు జీవుండు - గర్తగాఁడు
వాఁ దహంకృతిచేఁ గర్మ - ఫలము లొంది
భోక్తయగు నింద్రియాదుల - పొందువలన 400

సీ. గుణము లెందాఁక సం - క్షోభించుచుండు నం
దాఁక జీవులకు నా - నాత్వముండు
నెందాఁక జీవుల - కెనయు నానాత్వ మం
దాఁక వారికిఁ బార - తంత్ర్యముండు
నస్వతంత్రత వారి - కమరునందాఁక నీ
శ్వరునకు భయపడ - వలయు వార
లీగుణవ్యతికర - భోగకర్మముల మూ
ధతఁ జిక్కువారు దుః - ఖతతిఁ బడుదు

తే.గీ. రట్లగు టసన్నివృత్తియే - యగు సుఖంబు
పరుఁడ నేన జీవత్వము - పాధికృతము
జగము నాయందు మాయచే - సత్యమట్లు
తోఁచుచుండును మూఢ బు - ద్ధులకు నెల్ల. 402

తే.గీ. కాలమని లోకమనియు నా - గమము లనియు
ధర్మము స్వభావ మనియు నా - త్మయని నన్నె
గుణములు గలంగినపుడు పే - ర్కొందు రవనిఁ
బలువిధంబుల నేనె స - ర్వమును నిజము. 402

చ. అన విని యుద్ధవుండను మ - హాత్మ! రహస్యములెల్ల వింటి నా
మనమున నొక్క సంశయము - మాత్రము వీడదు ముక్తుఁడౌట యీ
గొనములు లేనియప్పు డొన - గూడునొ యయ్యవి దేహజాకృతిం
బొనరిన యప్పుడో వివర - ము న్వినఁగోరెఁద జెప్పవే దయన్. 403

వ. ముక్తి గుణాభావంబున నగు ననిన గుణాభావంబున జ్ఞాన సాధనాభావం బగుట ముక్తి నేరదు. గుణములున్నప్పుడనిన నాత్మ గుణంబులనుండియుం దత్కార్యంబులగు దేహ సంభూతకర్మంబులయందును సుఖాదులయందునుం దగులువడకుండుటెట్లు? అట్లుండియు నాతండాకాశంబు పగిది నసం గుండగుట వానిచే బద్ధుండు గాఁడనిన నాత్మకు బంధంబే యసంభవంబు గావలయు. బద్ధుండుగాని వానికి ముక్తిం జెప్పు టెట్లు? ఆత్మ గుణకార్యం బులయం దహంకారంబుచే బద్ధుండగుఁ దన్నివృత్తిచే ముక్తుండగు ననిన వీఁడు బద్ధుండు వీఁడు ముక్తుఁడని యెఱుఁగుటెట్లు? వారెట్లుండుదురు? వారి యాహారవిహారవిసర్జనశయ నాసనయా నంబు లేతీరునం జరుగు? వారి నేలక్షణంబులచే నెఱుంగనగు? అనాదిగుణ సంబంధంబువలన నాత్మ నిత్యబద్ధుండేనిఁ గావలయు. ముక్తికుత్పత్తిఁ జెప్పినచో దానికనిత్యత్వంబు సంభవించు నది యప్రమాణంబు గావున నాత్మ నిత్యముక్తుండేనిఁ గావలయునని నామనంబు భ్రమపడుచున్న యది. ఈ సంశయంబు

నివారింపవే సర్వజ్ఞమూర్తీ యని యుద్ధవుండు ప్రార్థించినం
గరుణామయుండగు భగవంతుం డిట్లనియె. 404

## -: బంధమోక్ష తత్త్వవిచారము :-

ఉ. బద్ధుఁడు ముక్తుఁ డాత్ముఁడని - పల్కుట మద్గుణసంగియౌటనే
సిద్ధముగాదు నిక్కముగఁ - జెప్పెద నామత మిట్లు శాస్త్రసం
బద్ధము మాయఁబుట్టు గుణ - మండలి మాయకు నేనియంత నీ
బుద్ధి నెఱుంగు బంధమును-ముక్తియు నాకుఁ బొసంగ వెప్పుడున్ 405

చ. కలుగును శోకమోహములుఁ - గష్టసుఖంబులు దేహసంగమున్
బలితపునాదు మాయవల - నన్ గుణకార్య వినిర్మితంబులై
కలను స్వబుద్ధికల్పిత వి - కారములాత్మకుఁ దోఁచునట్లు మి
థ్యలె యగు నాత్మసంసరణ - ధర్మము లేవియుఁగావు సత్యముల్. 406

తే.గీ. దేహులకు బంధమోక్షము - లెచ్చునవి య
విద్యయును విద్య నామాయ - వృత్తులవి య
నాద్యులయ్యును నిత్య స- త్యములుగావు
కాన మిథ్యలు బంధమో - క్షములు రెండు. 407

వ. ఇందు జీవులను బహువచనపదంబువలన జీవుండు పరమాత్మభిన్నుండగు వస్తువనియు నట్టిజీవులకుఁబ్రతిశరీరభిన్నత్వంబంగీకృతంబనియు భ్రమపడకుము. మహామతీ! యిది యత్యంతరహస్యంబై నీబుద్ధిచే నిశ్చయింపందగినవిషయంబగుట సావధానచిత్తుండవై యాకర్ణింపుము. సూర్యుఁడొక్కండయ్యు జలాద్యుపాధికృతంబై తత్ప్రతిబింబ రూపంబగు భేదంబు గాన్పించు. మఱియు నాయుపాధులంగల జలాది కృతంబులగు కంపాదులు ప్రతిబింబంబునకేగాని బింబంబునకు లేవు. ప్రతిబింబ బహుత్వంబును దదన్యోన్యభేదంబును నుపాధిబహుత్వ భిన్నత్వంబులవలనఁ గలుగు. ఏజలపాత్రంబు భగ్నంబగు నద్దానం దోఁచిన ప్రతిబింబంబునకే బింబైక్యంబగుఁగాని యన్యజలపాత్రప్రతీత ప్రతిబింబంబులకుఁగాదు. ఇత్తెఱంగున నవిద్యాప్రతిబింబితమదంశంబగు జీవునకే తత్కృతబంధమోక్ష

సుఖదుఃఖాదులగుంగాని నాకులేవు. జీవతదన్యోన్యభేదప్రతీతియు నుపాధి కృతంబకాఁదెలియుము. జీవునకునవిద్యవలననగు ననాత్మతాదాత్మ్యంబున ననాది సంసారబంధంబును విద్యవలననగు తద్వైలక్షణ్యంబున మోక్షంబును స్ఫురించు. ఇంక బద్ధముక్తవై లక్షణ్యంబు వివరింతు వినుము. అదిజీవేశ్వరవై లక్షణ్యంబును జీవాన్యోన్య వైలక్షణ్యంబునని యిరుదెఱంగులు. అందు శోకానందోభయ ధర్మంబులుగల యీయేకశరీరంబునందు విరుద్ధధర్ములగు జీవేశ్వరులు నియమ్య నియంతృభావంబులనుండుటాదిమంబు. నశ్వరంబగు దేహం బశ్వత్థవృక్షంబు. తత్పృథగ్భూతులు చిద్రూపులునవి యుక్తులు నేకమతులునగు జీవేశ్వరులను పక్షులు రెండందు మాయావశంబున హృదయంబను గూఁటిని నిర్మించుకొని దానిలో నివసించుచుండు. అందు జీవపక్షి శరీరవృక్షంబునం బండు కర్మఫలంబుల భుజియించు. ఈశ్వరపక్షి భుజింపకయు నిజానందతృప్తిబలంబున జ్ఞానాది శక్తిచేత నధికబలంబు గలదియై యుండు. 408

ఆ.వె. ఫలము గుడువకెఱుక - గలవాఁడె తనునన్యు
నెఱుఁగుఁ గుడుచు నాతఁ - డెఱుఁగలేఁడు
నెఱి నవిద్యఁగూడ - నిత్యబద్ధుండగు
మోక్షవిద్య నిత్య - ముక్తుఁడతఁడు. 409

వ. ఇంక రెండవదియగు జీవాన్యోన్యవైలక్షణ్యంబు వినుము. 410

తే.గీ. స్వప్నమునుగని మేల్కొన్న - వాని కరణి
నాత్మ దేహస్థుఁడయ్యుఁగాఁ - దరసి యెఱుఁగ
స్వప్నమునుగాంచు కుమతియౌ - వాని కరణి
దేహగుఁడు గాకయును నాత్మ - దేహగతుఁడు. 411

తే.గీ. విషయముల నింద్రియంబులు - స్వీకరింప
నవికృతుండగు విజ్ఞుం డ - హంత లేక
కొనుగుణంబుల గుణములే - యని యెఱుంగుఁ
గాని తాఁగర్తనని యెంచి - కట్టుఁబడఁడు. 412

తే.గీ. కర్మవశమగు నీదేహ - కంబు నందు
నింద్రియంబులు దమ పను - లెల్లఁజేయ
నజ్ఞుఁ డందుండి తాఁగర్త - నని తలంచి
కర్మఫలసన్నిబద్ధుఁడై - కష్టపడును. 413

చ. అని విరతిన్ బుధుండు శయ - నాసన మజ్జన భోజనావలో
కనముల స్పర్శన శ్రవణ - గంధ రస గ్రహణాదులందు న
జ్ఞునివలెఁగా కకర్త యగు - చు న్విషయంబుల నింద్రియంబు లొం
దునటు లొనర్చుచు న్సుఖము - దుఃఖము నంటకయుండు సాక్షియై 414

సీ. అంతట న్నిండియు - న్నట్టి యాకసమును
నన్ని చోట్లఁ జరించు - నట్టి గాలి
జలఘటంబులఁ బ్రతి - ఫలన మొందెడు రవి
యేయుపాధి వికార - మేనిఁ బొరయ
కున్నట్లు ప్రకృతియం - దుండియు విజ్ఞాని
దాని వికారము - ల్దవులఁ డెపుడు
కలఁ గన్నవాఁడు మే - ల్కని దానిఁ దేఱిన
తనమతిఁ జూచు తీ - రున నితండు

తే.గీ. విరతిచేఁ దీక్ష్ణమగు జ్ఞాన - విమలదృష్టి
గలిగి నానాప్రకారమై - కానుపించు
తనువు మున్నగు జగముతోఁ - దగులువడక
చూచు నది లేక యున్నట్లు - తోఁచుచుండ. 415

తే.గీ. ప్రాణమానస బుద్ధీంద్రి - యముల వృత్తు
లెవ్వనికి సాగు సంకల్ప - హీనములుగ
నతఁడు దేహస్థుఁడయ్యు దే - హమ్ము గుణము
లొక్కటియు లేక విహరించు - చుండు నవని. 416

తే.గీ. దైవవశమున దుర్జను - ల్దనువు నొంపఁ
గాని సుజనులు పూజింపఁ - గాని యెవని

మానస మమర్ష హర్ష సం - భవ వికార
ముల నొలయు దాతని నెఱుంగు - ముక్తుఁ డనుచు. 417

ఉ. ఒక్కఁడు సన్నుతించి తన - కొప్పుగ మేలొనరించుచున్న వే
ఱొక్కఁడు తన్నుదూఱుచు న - యోగ్యతఁ గీడొనరించుచున్న నం
దొక్కని మెచ్చుచుం బొగడఁ - డొక్కనిఁ దిట్టఁడు వారి నిద్దఱన్
జక్కఁగఁ జూచు సంయమి గు -ణంబును దోషము నెంచఁడెందునున్.

తే.గీ. ఆచరింపఁడు శుభమైన - నశుభమైన
ననఁడు తన నోటఁ దలఁపఁడు - మనసునందు
నాత్మ రతిగల్గి యీవృత్తి - నాశ్రయించి
జడునివలె మౌని దిరుగు నీ - జగతియందు. 419

తే.గీ. వేదమంతయుఁ జదివిన - విజ్ఞుఁడైన
బ్రహ్మము నెఱుంగఁడేని వ్య - ర్థంబు దత్ప్ర
యాస మెల్లను బాలీని - యావుఁదెచ్చి
యాసఁ బోషించువాని ప్ర - యాసమట్లు. 420

సీ. పాలిచ్చు టుడిగిన - బడుగు గోవును దన
కనురక్త గాకుండు - నట్టిభార్య
నన్యుని కర్పితం - బైన దేహంబును
నిహపరసాధన - హీనుఁ దనయుఁ
దగు పాత్రమందు ద - త్తముగాని విత్తంబు
నన్ను బ్రశంసింప - కున్న వాణిఁ
బోషించు నతఁ డొందుఁ - బోరిపోరి దుఃఖంబు
లుద్ధవా! విను మతీ - యొక్కమాట

తే.గీ. జగము గల్పింప రక్షింప - సమయఁజేయఁ
గోరి నేనెత్తు లీలావ - తారముల మ
దీయ పావనచరితము - ల్దెలుపకుండు
వ్యర్థమౌ వాక్కు నాదరిం - పఁడు బుధుండు. 421

తే.గీ. అని విమర్శించి విద్వాంసుఁ - డాత్మయందుఁ
గలుగు నానాత్వ విభ్రాంతిఁ - దొలఁగఁద్రోచి
యమలమగు తన మనము స - ర్వాత్ముఁడ నగు
నాకు నర్పించి యూరకుం - డంగవలయు. 422

ఆ.వె. కదలకుండ మనసుఁ - గట్టి బ్రహ్మమునందుఁ
జేర్పలేనివాఁడు - సేయవలయు
నఖిల కర్మముల మ - దర్పణంబులుగ ఫ
లాభి సంధిలేక - యవశుఁ డగుచు. 423

సీ. పరమపావనములు - భద్రంబులైన నా
కథల నెవ్వఁడు శ్రద్ధ - గలిగి వినుచు
స్తుతియించు చెదఁ దలం - చుచు నాదు జన్మక
ర్మముల పోలిక నర్త - నము సలుపుచు
ధర్మార్థ కామ వ - ర్తనమెల్ల ననుగూర్చి
యాచరించుచు నన్నె - యాశ్రయించు
నతఁడు సనాతనుం - డైన నాయందు ని
శ్చల భక్తినొందు సం - శయములేదు

తే.గీ. భక్తి సత్సంగ లబ్ధయై - ప్రబల నెవఁడు
నన్ను ధ్యానించుచుండుఁ బ్ర - పన్నుఁడగుచు
వాఁడు పెద్దలు నాస్వరూ - పమని దేనిఁ
దెలుపుదురొ దాని బొందును - సులభముగను. 424

-:శ్రీకృష్ణుం డుద్ధవునకు సాధులక్షణంబును
భక్తియోగంబును నెఱింగించుట:-

సీ. అన విని యుద్ధవుం - డును నుత్తమశ్లోక
పలుతెఱంగులు సాధు - వులను గలరు
నీమతంబున సాధు - వేమాడ్కినుండు వాఁ
డిల సదాదృతయయి - యీవుమెచ్చు

భక్తి యెట్టిది తేట - పడ నాకుఁ జెప్పవే
పరమాత్మ ప్రకృతికిఁ - బరుఁడవీవు
బ్రహ్మాదులకును నీ - శ్వరుఁడ వాకస మట్టు
లంతటనుండియు - నంట వెదియు
ఆ.వె. సురలుగోర నిట్లు - పురుషాకృతి ధరించి
యవతరించితివి మ - హాత్మ! యిట్టి
నీవుగాక చెప్ప - నేర్చునే యన్యుఁడీ
యర్థమనినఁ గృష్ణుఁ - డతని కనియె. 425

వ. పరదుఃఖాసహిష్ణుండగు దయాళుండును నకృత భూతద్రోహుండును క్షమావంతుండును సత్త్వబలుండును నసూయాదిదూరుండును సుఖదుఃఖసమ భావుండును సర్వోపకారపరుండును గామాక్షుబ్ధచిత్తుండును సంయత బాహ్యేంద్రియుండును మృదుహృదయుండును సదాచార వంతుండును బరిగ్రహరహితుండును దృష్టాదృష్ట క్రియాశూన్యుండను లఘ్వాశియు నియతాంతఃకరణుండును నిజధర్మసుస్థిరుండును మదేకాశ్రయుండును మననశీలుండును నప్రమత్తుండును నిర్వికారమానసుండును ధృతిమంతుండును నిర్జిత షడూర్మియు నిజపూజాకాంక్షావివర్జితుండును నన్యసత్కారపరాయణుండును బరబోధనసమర్థుండును నవంచకుండును గరుణైకప్రవృత్తియు బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానసంపన్నుండును నగు వాఁడు సాధువనం బరగు. మఱియు నీ దయాళుత్వాది ధర్మంబులు సత్త్వశుద్ధ్యాదిగుణంబులనుదద్విపరీత ధర్మంబులను మదాజ్ఞారూపంబగు వేదంబున స్వధర్మంబుగా నిర్ణయింపంబడిన తన వర్ణాశ్రమధర్మంబులను మద్ధ్యాన విక్షేపకంబులనియు మదనన్యభక్తిచేత సర్వధర్మానుష్ఠానంబు సిద్ధంబగుననియు దృఢనిశ్చయుండై యవి యెల్లను మాని నన్నే భజించు నాతండును సాధువయగు. ఇంతయకాదు. నేను సర్వాత్ముండ సచ్చిదానంద లక్షణుండ దేశకాలాద్యపరిచ్ఛేద్యుండనని యెఱింగియేని నెఱుంగకయేని నెవ్వ రేకాంతభావంబున నన్ను భజియింతురు వారి న్నాకత్యంతభక్తులంగాఁ బరిగ్రహింతు. ఇమ్ముప్పదియు సాధులక్షణంబులు. ఇఁక భక్తిలక్షణంబులు

వినుము. నాప్రతిమాదులను నాభక్తులను దర్శనస్పర్శనార్చన పరిచర్యాస్తుతి ప్రణామంబులచే సేవించుటయుఁ దద్గుణకర్మానుకీర్తనంబును మత్కథాశ్రవణ శ్రద్ధయు మదను ధ్యానంబును సర్వలాభసమర్పణంబును దాసునిగా నాకుఁ దన్నప్పగించుటయు మజ్జన్మకర్మకథనంబును మదవతారాదిపుణ్యదినోత్స వానుమోదనంబును గీతతాండవ వాదిత్రగోష్ఠీ ప్రయుక్తంబుగా మద్గృ హోత్సవం బొనర్చుటయుఁ దత్సందర్శన యాత్రయు నెల్లప్పుదును విశేషించి వార్షికపర్వకాలంబులందుఁ బుష్పోపహారాదులు నాకర్పించుటయు వైదికంబు నొండె దాంత్రికంబునొండె నన్నర్చించు దీక్షంబూనుటయు మద్వ్రత ధారణంబును మదర్చామూర్తి ప్రతిష్ఠాశ్రద్ధయుఁ దనంతన యేని నన్యులఁ గూడియేని నాకుం బ్రీతిగాఁ దోఁటలను దోఁపులను విహారస్థానంబులను బురమందిరాదులను నిర్మింప నుద్యమం బొనర్చుటయుఁ జిమ్మి యలికి చల్లి ముగ్గులిడి మదాలయంబు నమాయకంబుగా దాసునివలె సేవించుటయు నభిమానదంభరాహిత్యంబును నాకొఱకుఁ దాఁజేసినది యొరులతోఁ జెప్పికొనమియుఁ దానుగాని యన్యులుగాని నాకు సమర్పించిన వస్తువులను దీపావలోకనంబు సైతము భక్తింగాక రాగాదివశుండై గ్రహింపకుండుటయును భక్తియనఁజను మఱియును. 426

ఆ.వె. ఏది లోకమందు - నెక్కువప్రియమగు
నేది తనకు మిగుల - నిష్టమైన
దట్టి దాని నాకు - నర్పణం బొనరింప
నది యనంతఫలద - మగు గణింప. 427

వ. ఇదియునుంగాక మత్పూజాధిష్ఠానంబులు పదునొకండుగలవవి వివరింతు వినుము. 428

క. ఇనుఁడగ్ని బ్రాహ్మణుఁడు గో
వును హరి భక్తుండు వాయు - వును సలిలము మే
దిని యాత్మ హృదాకాశం
బును భూతావళియు నాకుఁ - బూజాపదముల్. 429

సీ. ఇనమండలమునఁద్ర - యీవిద్యచేతను
 ననలునియందు హ - వ్యంబుచేత
ద్విజవర్యునందు నా - తిథ్యంబుచేతను
 నావులయందుఁ దృ - ణాదికమున
భక్తునియం దాత్మ - బంధుభావంబున
 ధ్యానంబుచేత హృ - ద్గగనమందు
ననిలునియందు ము - ఖ్యప్రాణదృష్టిచే
 జలములఁ దర్పణా - దుల నొనర్చి
తే.గీ. యవని మంత్రరహస్య వి - న్యాసములను
నాత్మయం దిష్టభోగ్య స - మర్పణమున
భూతములయందు క్షేత్రజ్ఞ - బుద్ధిఁజేసి
సమునిఁగా నన్నుపాసింపఁ - జను మహాత్మ! 430
సీ. శ్రీకరరత్నకి - రీటకుండలహార
 కేయూరకటకాంగు - ళీయకాఢ్య
మబ్జనేత్రప్రస - న్నాస్యంబు శ్రీవత్స
 కలితవిశాల వ - క్షఃస్థలంబు
శంఖచక్రగదాంబు - జాతశోభితచతు
 ర్బాహువు పీతాంబ - రప్రశస్త
మంగదాంచితకిసా - లారుణాంఘ్రియుగంబు
 నైన నారూపంబు - ధ్యానభూము
తే.గీ. లైన యీచోట్ల భావించి - యమరనిలిపి
చెదరకుండఁగ నిశ్చల - చిత్తులగుచు
శ్రద్ధతోడ నుపాసకు - ల్సలుపవలయు
నాగమోక్తంబులగు వివి - ధార్చనములు. 431
వ. మఱియు నెవ్వండిష్టంబనంబడు నగ్ని హోత్రాదిక్రియాకలాపంబును బూర్తంబనంబడు కూపారామాది నిర్మాణంబును సమాహితమనస్కుండై

మదర్పణంబులుగనె యొనర్చునాతండును నాయందలి దృఢభక్తింబొందు. సాధుసేవంజేసి మదీయజ్ఞానంబులభించు. తఱచుగా నిట్టి భక్తియోగంబునను సత్సంగంబుననుంగాక సంసారతరణంబొందుపాయంబు బాగుగ సిద్ధింపదు. సాధుజనంబులకు నెల్ల నేనేగదా పరమాశ్రయంబు కావున నుద్ధవా! జ్ఞానయోగంబు భక్త్యంతరంగంబుగా నెఱుంగుము. నీవు నాకు భృత్యుండవు సుహృదుఁడవు సఖుండవుం గావున సుగోప్యంబైనను బరమరహస్యంబగు నొక్కయర్థంబిప్పుడు నీకుం జెప్పెద. యదువంశపావనా! సావధానుండవై వినుమని మఱియు భగవంతుడిట్లనియె. 432

సీ. తమునను ష్ఠించు నం - దఱను ఫలాసంగ
  మున వీడకుండఁద్రి - ప్పులను బెట్టు
యమనియమాసన- ప్రాణసంయమనయో
  గంబులనైన సాం - ఖ్యముననైన
ధర్మనిష్ఠలను స్వా - ధ్యాయయజ్ఞములను
  వ్రతదానతీర్థయా - త్రలనునైన
సన్న్యాసముననను ని - ష్టాపూర్తములనైనఁ
  దపములనైన మం - త్రములనైన
తే.గీ. వశుఁడఁగా నెవ్వరికి నుద్ధ - వా! స్వతంత్ర
మగుచునే సాధనముఁగోర - కాశ్రితులకు
సత్ఫలముఁ దప్పకుండ నొ - సంగు సాధు
సంగమున నొక్కదానఁద - క్కంగనెందు. 433

వ. సత్సంగంబునంజేసి కదా మున్ను వృత్రప్రహ్లాదవృషపర్వబలిబాణమయ విభీషణాదులగు దైతేయులు రాక్షసులును సుగ్రీవ హనుమజ్జాంబవద్గజేంద్ర జటాయుః ప్రముఖ ఖగమృగాదులను తులాధారధర్మవ్యాధకుబ్జాగోపీ యజ్ఞపత్నీప్రభృతులగు మానవులయందలి రజస్తమస్స్వభావులగు స్త్రీవైశ్యశూద్రాంత్యజాతులను మఱియు గంధర్వనాగాప్సరస్సిద్ధచారణ గుహ్యకవిద్యాధరులునుం బెక్కం డ్రాయాయుగంబుల నమ్మత్పదంబుఁజేరి కృతకృత్యులైరి. 434

తే.గీ. వీరు వేదంబుఁజదివిన - వారుగారు
కొల్వలేదు మహాత్ములౌ - గురుజనముల
వ్రతములు దపంబులేని స - ల్పంగలేదు
నన్ను సత్సంగమునసె పొం - దంగఁగనిరి. 435

వ. ఇంతయకాదు నేను యోగసాంఖ్యదానవ్రత తపోఽధ్వరవ్యాఖ్యాస్వాధ్యాయ సన్న్యాసంబులచేత నెంత ప్రయత్నంబుననుం బొందరాని వాఁడనైనను. 436

తే.గీ. కొండలును జెట్లునహిమృగ - గోగణంబు
గోపికలు మూఢు లన్యులు - గూడు సాధు
లైన నావారి నన్ను న - త్యంతభక్తిఁ
దలఁచి చుల్కఁగ ననుఁజేరి - ధన్యులైరి. 437

శా. మున్నక్రూరునిచేతఁ గంసుడు మము - న్మోసంబునంబిల్వఁ బం
పన్నే నన్నను గూడి యేగి మధురం - బ్రాపించి యందున్నచో
నన్నుంబాయుట కోర్వఁజాలక వగ - న్మచ్చిత్తలై గోపికల్
నన్నేగాని మదన్యునెంచరు మదిన్ - సౌఖ్యార్థమై యెన్నఁడున్ 438

శా. బృందారణ్యమునందు గోపిక లతి - ప్రేమాస్పదున్నన్ను నిం
పందంబొందిన యేనిశల్గడపిరో - యర్ధక్షణంబుల్వలెన్
గ్రందౌ నానిశ లాసతుల్గడపి రౌ - క్కండొక్క కల్పంబుగా
నందేనన్నెడఁబాసి యున్నయెడఁ బ్రే - మాబద్ధలై నెవ్వగన్. 439

చ. మునులు సమాధియందును స - ముద్రమునందు నదుల్ స్వనామరూ
పనియతులం బలెన్సతులు - స్వాంతము నన్నును బాయకుండుటం
దనతనదౌపరిగ్రహము - దాఁపును దూరముఁ దమ్మునన్యమున్
మొనయ నెఱుంగరైరి పరి - పూర్ణసుఖంబున మున్గి యుద్ధవా! 440

ఉ. కాంతుఁడు జారుఁడంచు ననుఁ - గామవిమోహితలై వరించిరా
యింతులు నాస్వభావము నౌ - కింతయు వార లెఱుంగ రైన నా
చెంతను వారు సేరుటది - సిద్ధము బ్రహ్మముఁ జేరుటయ్యె న
య్యింతులు వేనవేలు కృత - కృత్యతనందిరి ముక్తసంగలై. 441

సీ. కావున నుద్ధవా - నీవు నీయర్థంబు
నెఱిఁగి శ్రుతిస్మృతి - హితములైన
విధినిషేదములఁ బ్ర - వృత్తి నివృత్తుల
శ్రోతవ్యమును శ్రుతం - బాతతంబు
వర్జించి సర్వ భా - వములను సర్వ దే
హంబుల నాత్మయౌ - నట్టి నన్ను
నొక్కనినే శర - ణొందు సర్వాత్మ భా
వంబు నీకగును నా - వలనఁ బిదప

తే.గీ. నీకు భయ మెందునేనియు - లేకపోవు
నిదియె సత్సంగమహిమంబు - మదనురక్తి
సాధుసంగ మహావిశే - షంబునిచ్చు
నదియె ననుఁ జేర దగ్గఱ - యైన త్రోవ. 442

సీ. అనవుడు నుద్ధవుం - డను మహాయోగేశ్వ
రేశ్వర! నీబోధ - మెల్లవింటి
నందు నాకొక సంది - యము వీడకున్నది
దానిచేఁగలఁగు నా - మానసంబు
మును వచించితి కర్మ - ములు సేయవలయుట
నిపు దవి విడుమని - యెదవు దేవ
కర్తృత్వ మాత్మకుఁ - గలదొ లేదో యని
కార్యమో త్యాజ్యమో - కర్మమనియు

ఆ.వె. నాత్మ విషయమైన - యట్టి యీసంశయం
బుడుప నీకుఁగాక - యొరుల కగునె
సందియంబుఁ దొలఁచి - సరగ నన్బ్రోవవే
యనిన ననియెఁ గృష్ణుఁ - డతనితోడ. 443

వ. మాయావశంబున నీ ప్రపంచాత్మకుండనై ప్రకాశించుచుండు నీశ్వరుండనగు
నేను మత్సృష్టంబైన యీపంచాత్మకశరీరంబున మూలాధారాది షట్చక్ర

గుహల నభివ్యక్తుండనై తొలుతం బర యనంబడు నాదంబుతోఁ గూడిన ప్రాణంబుతో సంగతుండనై మూలాధారచక్రంబుఁ బ్రవేశింతు. అంత మనోమయంబై సూక్ష్మంబగు పశ్యంతీరూపంబున మణిపూరక చక్రంబును మధ్యమరూపంబున విశుద్ధచక్రంబుననుం జొచ్చి పిమ్మట వక్త్రంబున హ్రస్వాదిమాత్రాకారంబును నుదాత్తాదిస్వరాకారంబును నకారాదివర్ణా కారంబునుం బొంది యతిస్థూలరూపంబున వేదశాఖాత్మకుండ నగుదు. కాష్ఠచ్ఛిద్రంబున నగ్ని యవ్యక్తోష్మరూపుండై! యుండి తన్మథన వేగంబున వాయుసహాయుండై సూక్ష్మ విస్ఫులింగాది రూపంబున వెలువడి యాజ్యాదిహవిర్ద్రవ్యంబులచే నభివృద్ధినొందు క్రియన్నాదియగు నీ వాగ్రూపాభివ్యక్తియగునని యెఱుంగుము. తొలుత నిట్లు వాగ్వృత్తి రూపంబుననే వ్యక్తుండనై పిదమ హస్తపాదపాయూపస్థఘ్రాణరసనా దృక్త్వక్ఛ్రవణంబులను కర్మేంద్రియ జ్ఞానేంద్రియంబుల వృత్తులగు కర్మగతి విసర్గావఘ్రాణరసన దర్శన స్పర్శన శ్రవణంబులుగను మనోబుద్ధ్యహంకార వృత్తులగు సంకల్ప విజ్ఞానాభిమానంబులుగను బ్రధానవృత్తియగు వ్యాపకత్వంబుగను సత్త్వరజస్తమోవికారాధిదేవతాది త్రివిధరూపంబుగను నీప్రపంచాకారంబున వ్యక్తీభవించితి. ఇట్లీశ్వరుండనగు నేనొక్కఁడం దొలుత నవ్యక్తుండనై కాలపరిపాకంబున విభక్త వాగాదీంద్రియ రూపశక్తులతోడం గూడి యేకవృక్ష జాతంబులగు బీజంబులు క్షేత్రంబునుం బొంది నానాప్రకారంబులై తోఁచినట్లు బహుప్రకారుండనై నట్లు వ్యక్తిఁబొందితి. నేనాద్యుండ. త్రిగుణాశ్రయుండ జగత్కారణుండ. ఓతప్రోతరూపంబగు తంతు వితానంబునఁ బటంబట్లు నాయందీప్రపంచం బశేషంబు నుండు గావున నిది నాకన్న నన్యంబు గాదు. అవిద్యచే నాత్మాధ్యస్తంబైన యీ సమష్టివ్యష్ట్యాత్మకవిశ్వం బనాదియై జీవునకుఁగర్తృత్వాది సంసారహేతువగు నొక వృక్షంబుఁబోలు. దీనికిఁ గర్మంబును దత్ఫలంబును బుష్పఫల రూపంబులగు. పుణ్యపాపంబులు దీని బీజంబులు. శతపరిమితంబులగు వాసనలువేళ్లు. త్రిగుణంబులు ప్రకాండంబులు. శబ్దాదిపంచరసంబులుగల

పంచభూతంబులు స్కంధంబులు. మనంబుతోడం బదునొకండింద్రియంబులు గొమ్మలు. ఇందు జీవేశ్వరపక్షిద్వయ నీడంబు హృదయంబు. దీనికి వాతపిత్తశ్లేష్మంబులు మూఁడుందాఁటలు. సుఖదుఃఖంబులు దీనంబందు ఫలంబులు. సూర్యమండలంబు భేదించి యేగువారి కిది లేకుండుంగావున నీ సంసారవృక్షంబు సూర్యమండల పర్యంతంబును వ్యాపించి యుండునని చెప్పుదురు. దీని రెండు ఫలంబులలో నొక్కటియగు దుఃఖంబును గాముకులగు గృహస్థులు భుజియింతురు. వివేకులు నరణ్యవాసులునగు సన్న్యాసులు బ్రహ్మసుఖంబను రెండవ ఫలంబును భుజింతురు. ఇట్లు బహురూపంబగు మాయామయసంసారవృక్ష స్వరూపంబుఁ బూజ్యులగు గురువులవలన నెఱింగినవారు వేదతత్త్వార్థం బెఱుంగుదురు. కావున నిట్లు గురూపాసనంబున నేకాంతభక్తిచే జ్ఞానంబను తీక్ష్ణకుఠారంబున నీత్రిగుణాత్మకలింగశరీరజీవోపాధిని ధీరుండవై ఛేదించి పరమాత్ముండనగు నన్నుం బొంది లింగభంగసాధనంబగు జ్ఞానంబుం ద్యజింపుమని సాదరంబుగ నుపదేశించి భగవంతుం డుద్ధవునితో మఱియు నిట్లనియె 444

తే.గీ. వెలయు సత్త్వ రజస్తమ - స్సులని మూఁడు
గొనము లివియుండుఁ బ్రకృతి కా - త్మునకు లేవు
సత్త్వమునఁ బెఱ రెండింటిఁ - జదువవలయు
సత్త్వమును ద్రుంపవలయును - సత్త్వముననె. 445

తే.గీ. శుద్ధసత్త్వంబుచేఁ బురు - షునకు నాదు
భక్తియను ధర్మమొదవు స - త్త్వంబు సాత్త్వి
కార్థ సంసేవచేఁ గల్గు - నవల ధర్మ
మంతకంతకు నభివృద్ధి - నందు ననఘ! 446

తే.గీ. సత్త్వవృద్ధి నొనర్చు శ్రే - ష్ఠతమమైన
ధర్మము హరించు రజసును - దమసు నివ్వి
రెండును హతంబులైన నా - రెంటివలన
బుట్టెడు నధర్మ మదియునుఁ - బొలియుఁ జూవె. 447

వ. శాస్త్రజల ప్రజాదేశ కాలకర్మజన్మధ్యాన మంత్రసంస్కారంబులు పదియును గుణహేతువులు. ఇందుఁ బెద్దలచేఁ బ్రశంసింపఁబడు నివృత్తిశాస్త్రంబులునుఁ బుణ్యతీర్థంబులును, నివృత్తిపరులగు జనులును వివిక్తదేశంబులును ధ్యానయోగ్యంబగు బ్రాహ్మముహూర్తంబును నిత్యకర్మంబును వైష్ణవ శైవదీక్షాది లక్షణంబగు జన్మంబును శ్రీమహావిష్ణుధ్యానంబును బ్రణవాది మంత్రంబులను నాత్మసంశోధకంబగు సంస్కారంబును సాత్త్వికంబులు. వృద్ధనింద్యంబులగు పాషండశాస్త్రంబులును సురాగంధోదకాదులును బ్రవృత్తదురాచారజనంబులును రథ్యాద్యూత వేశాదిదేశంబులును బ్రదోషనిశీథాదికాలంబును గామ్యాభిచారాదికర్మంబును శాక్తక్షుద్రదీక్షాది లక్షణజన్మంబును గామినీశత్రుప్రముఖధ్యానంబును గామ్యక్షుద్రాది మంత్రంబులును గేవల దేహగేహాదిశోధకసంస్కారంబునుం దామసంబులు. పెద్దలచే నుపేక్షితంబులు రాజసంబులుం గావున. 448

ఆ.వె. సత్త్వవృద్ధిఁగోరు - జనుఁడు సేవింపనౌ
నిందు సాత్త్వికముల - నే వరించి
దాన ధర్మ మవలఁ - జ్ఞాన మాత్మాపరో
క్ష్యం బనర్థగుణ జ - యంబుఁ గలుగు. 449

వ. అనిన విని యుద్ధవుం డిట్లనియె. 450

సీ. పెంటి తన్నఁబడుచు - బెదరించుచున్నను
గుక్క దానినె వెను - కొనెడురీతి
మూతిపైఁ గాళ్ళతో - మోఁదుచున్నను నాఁడు
గాడిదతో నేఁగు - ఖరముమాడ్కిఁ
దనుఁ జంపఁ గొనిపోవు - తఱిని జింబోతు మేఁ
కను దాఁటఁబోయెడు - కరణి ధరణి
దఱచుఁగా దమ యాప - దలకు మూలము విష
యంబులే యని మర్త్యు - లాత్మబుద్ధిఁ
తే.గీ. దెలిసియుండియు నవి మానఁ - దలఁప కకట
వానినే గోరి కడగండ్లఁ - బడుచు ననుభ

వించుచుందురు మనముల - విసుగులేక
యిందులకు హేతువేమి గో - వింద! చెపుము. 451

వ. అనిన భగవంతుం డిట్లనియె 452

సీ. అవివేకవశత మి - థ్యాదృష్టి దేహాదు
లందు నేనను బుద్ధి - యలము కొలఁది
సాత్త్వికంబౌ మాన - సంబును ఘోరమౌ
రజసు ప్రాపించు నా - రజసుఁ గూడి
మనసు చలించు నం - త నపేక్ష విషయముల్
ధ్యానింప దుర్ధరం - బగుచుఁ గామ
ముత్పన్నమగు మూఢుఁ - డొయ్యనఁ దత్కామ
వశగుఁడై యింద్రియ - వశత దుఃఖ

తే.గీ. హేతువులఁ గర్మములఁజేయు - నెఱిఁగి యెఱిఁగి
యిది రజోవేగమున విమో - హిత మనస్కు
లైన వారలగతి దీని - యందుఁ బడక
తన్నుఁ గ్గాపాడుకొనెడు వి - ధంబు వినుము. 453

సీ. రజసును దమసును - బ్రాపించి మతిచెడ్డ
వెడఁగైనగాని వి - వేకమూని
విషయంబులును మహా - విషములాగునఁ జూచి
నేర్పుతో మనసును - నిల్పవలయు
నపుడసంగుండగు - నతఁడట్లు మనసు ని
ల్పఁగలేనియెడల నా - లస్యముడిగి
శ్వాసను నిల్పి యా - సనశుద్ధిఁ ద్రిషవణ
నియతుఁడై నన్ను ధ్యా - నించుకొనుచు

తే.గీ. మనసు నాయందు నల్లన - ల్లనఁ గుదించి
సిద్ధుఁడగు మున్ను సనకాది - శిష్యకోటి
కేను జెప్పితి నీయోగ - మిదియె మనసు
సులభముగ లాగి నాయందుఁ - జొనుపు వెరవు. 455

వ. అనిన విని యుద్ధవుం డిట్లనియె 456

- : హంసోపాఖ్యానము : -

క. ఏరూపంబున నెప్పుడు
ధీరులు సనకాదులకును - దెలిపితి భవసం
తారకమగు నీయోగం
బారూపము నాకుఁ దెలియ - నానతి యీవే 457

క. అన విని భగవంతుండను
సనకాదులు బ్రహ్మమాన - స ప్రభవులు దం
డ్రిని గని దుర్జ్ఞేయంబగు
ఘనయోగము పార మెఱుంగఁ - గా నుత్సుకులై. 458

సీ. మనసునందు స్వభావ - మునఁ బుట్టు రాగాదు
లంత నయ్యది విష - యములఁజేరు
ననుభూత విషయము - ల్మనసున వాసనా
మయముల్తె నెలకొని - మానకుండు
విషయము ల్మనసు నీ - విధమున నన్యోన్య
సంగంబు వదలక - జరుగుచుండ
విషయబంధమునుండి - విడిపించుకొని ముక్తి
పదము గోరెడువాఁడు - వానిమాను

ఆ.వె. టెట్లు మాకుఁ దెలుప - వే తండ్రి యని పుత్త్రు
లడుగ నా మహాత్ముఁ - డైన బ్రహ్మ
చిత్తమందు లెస్స - చింతించి కర్మ వి
క్షిప్తుఁడగుట బదులు - సెప్పలేక. 458

ఆ.వె. ప్రశ్నబీజ ముత్త - రము నెఱుఁగుటకునై
తనదు చిత్తమందుఁ - దలఁచె నన్ను
నంత నేను హంస - నై యాకసమునఁ బ్ర
త్యక్షమైతి నతిని - యంతికమున. 459

క. నను గనుఁగొని యప్పుడె క్ర
న్నన దగ్గతి పాదవంద - నముఁజేసి విధిన్
ముని నిడుకొని నీవెవ్వఁడ
వని వినయము తోడ నన్ను - నడిగిరి వారల్. 460

తే.గీ. తత్త్వజిజ్ఞాసులైన యా - తపసులెల్ల
నన్ను నారీతి నపుడు ప్ర - శ్నంబుసేయ
వారితో నేను జెప్పిన - తీరు నీకు
నిప్పు డెఱిఁగింతు నుద్ధవా! - యెలమి వినుము. 461

సీ. ఎందు నానాత్వ మొ - క్కింతయు లే దట్టి
యాత్మవస్తువు నిట్టి - లడుగఁదగునె
నిర్విశేషుఁడనగు - నే నేయుపాధితో
బదులు సెప్పుదు మీకుఁ - బాలురార
దేవమనుష్యాది - దేహము ల్పాంచభౌ
తికము లన్నియుఁ జూడ - నొకటె యగుట
నీవెవ్వఁడనుచు వా - నినినేని నడుగుట
తగ దది మాట మా - త్రంబె కాదె

తే.గీ. మనసుచే వాక్కుచేతను - గనులచేతఁ
దక్కునింద్రియగణముచే - తను గ్రహింప
నైన యదియెల్ల నేనె య - న్యంబుగాదు
దీని లెస్స విమర్శించి - తెలిసికొనుఁడు. 462

సీ. వినుఁడు పుత్త్రకులార - మనసుగుణంబుల
గుణములు మనసునఁ - గూడుచుండు
నీరెండు నారూప - మేయైన జీవున
కధ్యాసమున దేహ - మగుచునుండుఁ
బలుమఱు గుణములఁ - దలఁపఁ జిత్తము వానిఁ
జొచ్చు నాగుణములు - సూక్ష్మవాస

నారూపమును బొంది - చేరుఁ జిత్తంబునఁ
గాన మద్రూపంబు - దానుబొంది
తే.గీ. చిత్తగుణములు రెంటిఁద్య - జింపవలయు
జాగరస్వప్నసుప్తులు - నీగుణముల
వలనఁ గలిగెడి బుద్ధి వృ - త్తులగుజీవుఁ
డరయ నివిలేని కూటస్థ - సాక్షినుండి. 463
మ. మతితోడం జనుచుంట నాత్మునకు సం - సారంపు బంధంబు సం
గతమై స్వప్నము సుప్తి జాగరము నాఁ - గన్పట్టు నీ మూఁటి సం
తతి సన్ దుర్యునిఁబొంది పాయవలె నం - త న్వీడు నన్యోన్యసం
గతి నాచిత్తమునుం గుణంబు లవి సం. - గంబొంద వామీఁదటన్. 464
చ. అనయము సౌఖ్యమిచ్చు విష - యంబులటంచు నహంక్రియాబలం
బున దృఢబంధ మాత్మునకుఁ - బుట్టు విపర్యయబుద్ధిఁ దెల్విగ
ల్గిన ఘనుఁ డవ్వి దుఃఖదము - లే యని రోసి తురీయు నన్నుఁ బొం
ది నెఱయ మానఁగానగు మ - తం బొడసూపెడు భోగచింతలన్. 465
మ. వివిధవ్యక్తిమయంబుఁగాఁగ జగము - న్వీక్షించుటెందాఁక వ
స్తువిచారంబున మాన దెవ్వనికి న - జ్ఞం బాతఁడందాఁక వా
ని వివేకంబును సత్క్రియల్గలవలె - న్మిథ్యాస్వరూపంబులై
భువి స్వప్నంబునఁ గాంచు జాగరమునుం - బోలు న్విచారించినన్466
సీ. ఆత్మకు నన్యంబు - లై యున్నవిగఁ దోఁచు
ప్రాణమానసశరీ - రాదికములు
నందుచేఁ గలుగు వ - ర్ణాశ్రమాదిక భేద
మదియిచ్చుచుండు స్వ - ర్గాదిఫలము
నందుల హేతువై - నట్టి కర్మంబును
నాత్మకు దృశ్యంబు - లైన కతన
నగు నసన్మాత్రంబు - లావిద్యకంబులు
వివరింప లేవివి - విప్రులార

తే.గీ. కలను గనువాఁడు సూచు వి - కల్పములను
బోలి లేకయె యున్నట్లు - పొలుచుమృషలు
సత్యమున్నట్లు చూచు న - జ్ఞాని వీని
నట్టి వానిఁ బ్రబోధించు - నాగమములు. 467

సీ. ఎవ్వఁడు మెలఁకువ - నింద్రియంబులతోడ
క్షణికార్థముల వెలిఁ - గని భుజించు
నెవ్వఁడు గలలోన - నెద మెలంకువఁ గన్న
యట్టి సూక్ష్మార్థంబు - లనుభవించు
నెవ్వఁడు నిద్రలో - నీస్థూల సూక్ష్మార్థ
జాలంబుఁ దానుప - సంహరించు
వాఁడు నే మేల్కాంచి - నాఁడఁ గలంగంటి
నెఱుఁగకుండితి నని - యెఱుఁగుచుంటఁ

తే.గీ. ద్రిగుణవృత్తికి సాక్షి యిం - ద్రియ విభుండు
నొక్కఁడే యగు నాత్మ వే - ఱొకఁడు లేఁడు
క్షణికమున మాఱు త్రివిధ దృ - శ్యంబు మిథ్య
యెఱుఁగుఁడీ పుత్త్రులార మీ - రీ విమర్శ. 468

సీ. సరవి నీరీతిని - సత్త్వంబు రజసు త
మస్సు బలమ్మున - మనసు వొందు
స్థూలసూక్ష్మానంద - లోల భోగస్థాన
ములు జాగరము స్వప్న - మును సుషుప్తి
యను మూఁడవస్థలు - నగును నామాయ నా
యందె యం చెద నిశ్చ - యంబు నొంది
యఖిల సంశయముల - కాయతనం బయి
హృదయస్థమగున హం - కృతిని బట్టి

ఆ.వె. సద్గురూపదిష్ట - సరణి సదుక్తుల
నానుమానిక ప్ర - మాణములను

శ్రుతులఁ గలుగు తీక్ష్ణ - సుజ్ఞానమను కత్తి
చేతఁ దునిమి నన్నుఁ - జేరుఁడయ్య. 470

సీ. ఇది యెల్లను మనో వి - జృంభితబగుటను
దృష్టమైయుంట వి - నష్టమౌట
భ్రమమాత్రమగు నీ జ - గము స్వప్నమును బోలి
యిది యతిచంచలం - బెట్టు లనినఁ
జీఁకటిఁ గొఱవిని - జిఱజిఱ ద్రిప్పంగఁ
గనవచ్చు చక్రంబు - కరణినుండి
కాంచు విజ్ఞాన మే - కంబయ్యుఁ బెక్కులై
నట్టు లజ్ఞులకుఁ జూ - పట్టుచుండు

తే.గీ. నగుట గుణపరిణామ కా - ర్యంబు త్రివిధ
మగు నవస్థావికల్ప భే - దానుభవము
మిథ్య స్వప్నంబు మాడ్కి న - మేయమైన
మాయ యనునది యిదియ బ్ర - హ్మణ్యులార! 470

సీ. తోఁచుదృశ్యంబును - జూచుట మాని ని
జానందమయుఁడయి - యలరు యోగి
యాస్థితి సుస్థిరం - బగుటకు విషయాశ
మగుడ రానీక వా - జ్మానసాంగ
చేష్టలుమాని సు - స్థితుఁడగుటొప్పున
వస్తువం చెఱిఁగి ము - వ్వదలినట్టి
జగ మొకప్పుడు తన - కగపడె నేనియు
నది చూచి మోసపోఁ - దతఁడు మఱల

తే.గీ. దేహపాత పర్యంతంబు - దృశ్యమెల్ల
స్వప్నమును జూచునట్టు లా - భాసమాత్ర
ముగఁ గనుచునుండుఁ దాఁ బరి - పూర్ణుఁడగుచు
నేమఱఁ డొకింతయేనిఁ ద - దేకనిష్ఠ. 471

సీ. దేనిని విడిచి మున్ - దా నొందె నిజరూప
మట్టి నశ్వరమైన - యాత్మ తనువు
నడుచుచుండుట యాస - నమునఁ గూర్చుండుట
దైవవశంబునఁ - దలఁగి చనుట
మఱి యెందునుండుట - యెఱుఁగడు సిద్ధుండు
కలుద్రావి మైమఱ - పొలసి నతఁడు
తన మొలగుడ్డ జా - ఱిన నున్న నెఱుఁగని
కందువ నుండు నా - నంద మొంది

తే.గీ. తనువు దైవవశంబయి - తనకు హేతు
వైన కర్మంబు క్షీణించు - నంతదాఁక
బ్రతికియుండును విజ్ఞాత - పరమతత్త్వుఁ
డాతఁ డారూఢయోగ స - మాధియగుట. 472

క. కలఁగని మేల్కని నరుఁడా
కల మఱలం గనని క్రియ జ - గంబును దనువున్
గలవలె మును దోఁచి వెసం
దలఁగిన యవి కాంచఁ డిరులు - దరణియుఁ బోలెన్. 473

తే.గీ. సాంఖ్య యోగంబులను రహ - స్య మగు దీని
వెలయఁ దెల్పితి మీకు నో - విప్రులార!
ధర్మములు మీకుఁ జెప్పఁగాఁ - దలఁచి యిచటి
కేఁగుదెంచిన విష్ణుండ - నెఱిఁగికొనుఁడు. 474

తే.గీ. సాంఖ్యమునకును యోగశా - స్త్రంబునకును
ఋతమునకు సత్యమునకుఁ గీ - ర్తికిని సిరికి
దమమునకుఁ దేజమునకు ను - త్తమగుణంబు
లన్నిటికిఁ బుట్టినిల్లు నే - ననఘులార! 475

తే.గీ. గుణములే లేక యేమియుఁ - గోర కఖిల
మునకు హితుఁడు బ్రియుండు నా - త్ముఁడగున న్న

సంగసామ్యాది గుణములు - సకలములును
ననవరత మాశ్రయించి యుం - డును వరించి. 476

వ. అని మఱియు భగవంతుండిట్లనియె 477

క. అని యిట్లేఁ జెప్పిన విని
సన కాదిమును ల్నివృత్త - సంశయులై హె
చ్చిన భక్తితోడఁ బూజన
మొనరించి నుతించి రప్పు - డుద్ధవ! నన్నున్. 478

తే.గీ. ఆ మహర్షులచేత నే - నధిక భక్తిఁ
బూజితుఁడ సంస్తుతుండనై - మ్రొక్కులంది
బ్రహ్మసూచుచునుండనే - వచ్చినాఁడ
నానిజస్థానమునకు నం - తర్ధి నొంది. 479

సీ. అన విని యుద్ధవుం - డనియె నోస్వామి! య
న్నిట సంగమును బాసి - నిన్ను మనసు
సేరుటకు ఫలంబుఁ - గోరకచేయు స
ద్భక్తి యోగమె సదు - పాయనుంటి
బ్రహ్మవాదుల యభి - ప్రాయంబునందు శ్రే
యస్సాధనములు పె - క్కగుచునుండు
నవి యెల్ల ముఖ్యమో - యందేదిముఖ్యమో
వాని కంగాంగి భా - వంబు గలదొ

తే.గీ. యన్నిటి ఫలఁబు తుల్యమో - యట్లుగాదొ
యనెడి సంశయమొదవు నా - మనమునందు
నిది తొలంగింపు మనిన శ్రీ - కృష్ణదేవుఁ
డాప్తుఁడగు నుద్ధవునిఁ జూచి - యనియె నిట్లు. 480

## -: భక్తి ధ్యాన యోగవిచారము :-

సీ. చిత్తంబు నాయందు - స్థిరముగా దేనిచే
నిలుచు నాధర్మంబుఁ - దెలుపునట్టి

యీవేదసంజ్ఞిత - యౌవాణి కాలక్ర
మంబునఁ బ్రళయకా - లంబునందు
నశియించె నది నేఁ బు - నస్సముద్ధృతఁజేసి
నలువకుఁ జెప్పితిఁ - దొలుత నంతఁ
దనకగ్రపుత్త్రుఁడౌ - మనువునకుం జెప్పె
నతఁ డామనువును భృ - గ్వాదులైన

తే.గీ. యట్టి యేడ్వురు బ్రహ్మ మ - హర్షులకును
దెలిపె నా మునివర్యుల - వలన వారి
వారి సత్పుత్త్రులెఱిఁగిరి - వసుధమీఁద
వేద మీరీతి నెఱసె స- ద్విదితమగుచు. 481

వ. ఇట్లా పరమధర్మప్రతిపాదకంబగు నిగమంబు దేవదానవ గరుడగంధర్వ సిద్ధచారణ విద్యాధరగుహ్యక మనుష్య కిందేవకిన్నరకింపురుష నాగయక్షాదులయందు విస్తృతంబయ్యె. వారును సత్త్వరజస్తమోగుణ సంభూతులగు వివిధబహువాసనాసంయుక్తులు. అందువలన నఖిలభూతంబులును వాని బుద్ధులును దత్తత్స్వభావవైచిత్ర్యంబు చొప్పున భిన్నంబులు. వారిచేఁజేయంబడు వేదార్థవ్యాఖ్యానంబును వివిధంబ. ఇట్లు ప్రకృతి వైచిత్ర్యంబువలన నరుల బుద్ధులను భిన్నంబులగుచున్వచ్చి చివరకుఁ గొందఱు వేదవిరుద్ధార్థబుద్ధులైరి. మన్మాయావిమోహితాత్ములై మఱికొందఱు పురుషులు దత్తత్కర్మానుసారంబు గను నిష్ఠానుసారంబుగను బరమ పురుషార్థసాధనంబు నానాప్రకారంబని వక్కాణింపం దొడంగిరి. అందు మీమాంసకులు నిత్యనైమిత్తిక కర్మకలాపంబును గావ్యాలంకారకర్తలు యశంబును గామందవాత్స్యాయనాదులు గామంబును యోగశాస్త్రకర్తలు యశంబును శమదమసత్యంబులును దృష్టార్థవాదులగు దండనీతికర్తలు సామాద్యుపాయసాధ్యంబగు నైశ్వర్యంబును లోకాయతికులు త్యాగభోగంబులును నన్యులు యజ్ఞదానతపోవ్రత యమ నియమంబులును శ్రేయస్సాధనంబులుగా వచియించిరి. 482

సీ. కడకు వీరలు సేరఁ - గల యట్టి లోకము
లన్నిజ శుభాశుభ కర్మ - నిర్మితంబు
లాద్యంతవంతంబు - లత్యంత దుఃఖ దా
యకములు మోహ ప - ర్యవసితములు
కర్మక్షయావధి - కంబగు తుచ్ఛ సౌ
ఖ్యము నిచ్చునవి యని - త్యములు మఱియు
నాది మధ్యాంతంబు - లందెల్ల శోకసం
వ్యాప్తము ల్స్వప్న తు - ల్యములు సూడ
తే.గీ. మనసు నాయందుఁ జేర్చి యెం - దును నపేక్ష
యించకయు లేక యాత్మ న - న్నెంచుచుండు
భక్తుని సుఖంబు విషయ సం - సక్తచిత్తు
లైన ఫలలుబ్ధులకుఁ బొంద - నగునె యెందు. 483
తే.గీ. తనది యని యేదియును లేక - మనసు నింద్రి
యంబులను నిల్పి సమచిత్తుఁ - డగుచు నాదు
ప్రాపుగని తుష్టహృదయుఁడౌ - వానికెప్పు
డెందుఁ జూచిన సుఖమె యౌ - నెల్లదిశల. 484
ఉ. ధీరుఁడు మానసంబు మద - ధీనమొనర్చిన నన్నెగాని తాఁ
గోరఁడు బ్రహ్మలోకమును - గోరఁడు దివ్యమహేంద్రలోకమున్
గోరఁడు సార్వభౌమతను - గోరఁడు భోగవతీ ప్రభుత్వమున్
గోరఁడు యోగసిద్ధులను - గోరఁడు మోక్షముఁ గోరఁడేదియున్. 485
చ. ప్రియతనయుండు బ్రహ్మయును - బ్రేయసి లక్ష్మియు మత్స్వరూపుఁడ
వ్యయుఁడగు శంకరుండును మ - దగ్రజుఁడౌ బలుఁడు స్సుమంగళా
లయమగు నాదుమూర్తియుఁ ద - లంపఁగ భక్తుఁడనైన నీవలెం
బ్రియములు గావునాకు నిఁక - వేఱుగఁ జెప్పఁగనేల యన్యముల్. 486
తే.గీ. కోరికలు లేక శాంతుఁడై -వైర ముడిగి
యంతయును నన్నుఁగాఁ జూచు - న మ్ము నీంద్రు

వెంట నే నేఁగుచుందును - జంటఁబాయ
కతని పదధూళిచేఁ బవి - త్రత వహింప. 487

సీ. స్వీయమం చేమియు - విత్తంబులేక నా
యం దనురక్తమౌ - నాత్మ గలిగి
శాంతులై నిర్గతా - హంతలై నిఖిల జీ
వులయెడ మిగుల వ - త్సలత గలిగి
బుద్ధి కేకోర్కుల - పొందులేకుండెడు
నాదుభక్తులు వొందు - నైరపేక్ష్య
సుఖమిట్టిదనుచు న - చ్చుగ వారె యెఱుఁగుదు
రన్యుల కెఱుఁగ శ - క్యంబుగాదు

తే.గీ. మోక్షమందేని నెవరి క - పేక్ష యుండ
దట్టి సాధులు మత్ప్రీణ - నార్థమేక
భక్తి సల్పుదు రేకోర్కిఁ - బట్టుపడక
వారి సుఖమెవ్వరికి లేదు - వసుధయందు. 488

చ. ఇలపయి నాదుభక్తుఁ డజి - తేంద్రియుఁడై విషయాళిఁ జిక్కి బా
ధలు పడుచున్న నైన బలి - తంబగు భక్తియె వానిఁ బాపు ను
జ్జ్వలమగు వహ్ని కట్టియల - భస్మమొనర్చు విధంబున న్వని
శ్చలమగు భక్తి తద్వృజిన - జాలమునెల్ల హరించు నుద్ధవా! 489

మ. వినుమా యుద్ధవ! నన్నుఁజేరుటకు ను - ర్విన్ ధర్మము న్సాంఖ్యమున్
ఘనయోగంబుఁ దపంబు నధ్యయనమున్ - ద్యాగంబు మున్నైన సా
ధనముల్ భక్తినిబోల వేకమగు స - ద్భక్తిన్ గడున్ శ్రద్ధతో
నను గొల్వన్ సుజనాళికాత్మను బ్రియుం - డంగాన నేఁ జిక్కుదున్ 490

తే.గీ. నిశ్చలంబుగ నెవనికి - నిలిచియుండు
భక్తి నాయందు నెపుడు ని - ర్వ్యాజమగుచు
పొఁడు దుష్కర్మఫలిత స్వ - భావుఁడైన
శ్వపచుఁడైనను శుద్ధుఁడై - భవము గెలుచు. 491

తే.గీ. దయయు సత్యంబుగూడిన - ధర్మమొందె
విశ్రుత తపంబుగూడిన - విద్యయొందెఁ
బావనుఁడ నగు నాయందు - భక్తిలేని
వాని నిష్పాపునిగఁ జేయ - వలఁతి గాదు. 492

క. మెయిగరుపాఱక చిత్తము
రయముగఁ గరఁగక నిరంత - రము బ్రమదాశ్రుల్
నయనముల జాఱ కేకం
బయి భక్తియులేక హృదయ - మందునె శుద్ధిన్. 493

సీ. నాయందు నిర్వ్యాజ - మైయుండు సద్భక్తి
సర్వభావంబుల - సహజమగుట
వాక్కు దగ్గుత్తికఁ - బడుచుండు నెవ్వనిఁ
దలఁపుతో నెవని చి - త్తంబు గరఁగుఁ
బలుమాఱు నెవ్వండు - పకపక నగుచుండు
నెవ్వఁడొక్కొకతఱి - నేడ్చుచుండు
నానలే కెలుగెత్తి - గాన మెవ్వఁడు సేయు
నానంద వశత నృత్యం - బొనర్చు

తే.గీ. నుత్తమ గుణానుగతిని లో - కోపకృతిని
జిత్రచారిత్ర విఖ్యాతి - శిష్టభీతిఁ
దలఁచి యానందరూపుఁడై - నిలిచి యట్టి
వాఁడు భువనంబు నెల్లఁ బా - వనము సేయు. 494

తే.గీ. జ్వలము నందూఁదఁ గనకంబు - మలము విడిచి
తనదు చొక్కపు రూపఁబుఁ - దాల్చునట్టు
లాత్మ మద్భక్తి యోగదా - ర్ఢ్యమునఁ గర్మ
వానసలఁ బాసి నాదు రూ - పంబు నొందు. 495

ఆ.వె. సాధు పుణ్యకథల - మోదంబుతో విని
చెప్ప నాత్మశుద్ధిఁ - జెందుకొలఁది

పంజరంబు వేయ - పక్షిపోలిక నది
సూక్ష్మతత్త్వమరసి - చూడ నేర్చు 496

తే.గీ. విషయ సంతతిఁ దలఁచు పూ - రుషుని చిత్త
మనిశ మావిషయంబుల - యందె చిక్కు
నన్ను నెడపక తలఁచెడు - నరుని చిత్త
మొయ్య నాయందు లీనమై - యుండుఁ జూవె. 497

తే.గీ. కాన స్వప్న మనోరథా - కారమైన
యసదభిధ్యానమును మాని - యాత్మయందు
నన్నుఁ దలపోసి తలపోసి - నాదు రూప
మొందు నద్దాని వల్ల నా - యందుఁ గలుపు. 498

తే.గీ. ధీరుఁడై స్త్రీల వారలఁ - జేరువారి
దూరమునమాని విజనంబు - భీరహితము
నైనయెడలఁ గూరుచుండి మాం - ద్యంబులేక
నిరతమును నన్ను నాత్మ ధ్యా - నింపవలయు. 499

తే.గీ. స్త్రీలతోడను వారలఁ - జేరునట్టి
వారితోడను గూడుట - వలనఁ గలుగు
కష్టమును బంధమును ధరఁ - గలుగ వన్య
సంగమున మానవులకు ని - శ్చయము వత్స. 500

వ. అనిన నుద్ధవుం డిట్లనియె 501

క. ఏరీతిగ నేగుఋతుల
నేరూపుగ నిను ముముక్షు - లెంచఁగ వలయున్
నీరేజనయన ధ్యానము
తీరెల్లను నీవ నాకుఁ - దెల్పఁగ వలయున్. 502

వ. అనుటయు భగవంతుండు గృపాళుండై యిట్లను. సాధకుండత్యుచ్ఛ్రితంబును నతినీచంబునుం గాని కంబళాద్యాసనంబున సమకాయుండును నిజోరున్యస్తహస్తుండనై యథాసుఖంబుగాఁ గూరుచుండి చిత్తస్థైర్యంబుకొఱకు

నాసాగ్రనిరీక్షణంబు సేయుచు నిర్జితేంద్రియుండై పూరకకుంభకరేచక క్రమంబుననేని రేచకపూరకకుంభక క్రమంబున నేనిం బ్రాణమార్గంబు నల్లనశోధించు టభ్యసింపవలయు. ఈ ప్రాణాయామంబు సగర్భంబనియు నగర్భంబనియు రెండు తెఱంగులు. అందు సగర్భంబుత్తమం బది యెట్లనిన మూలాధారచక్రంబునుండి నిలుపులేకుండ ఘంటానాదతుల్యంబుగా బిసతంతువుంబోలి సూక్ష్మంబై హృదయంబుదాఁక వ్యాపించి యందు నిల్చి యుండు నోంకారంబును బ్రాణవాయువుతోడ ద్వాదశాంగుళ పర్యంతంబు వెలికినేని మూర్ధాంతంబు పైకినేని లాగి యంత మాత్రాతీతంబగు నచ్చోటఁ బంచదశబిందు పరిమితంబును బిందుశిరస్కంబును నగు స్వరం బుదాత్తనాదాత్మకంబుగా సుస్థిరం బొనర్పవలయు. ఇట్లు పవన త్రయంబునను బదేసి మాఱులు ప్రణవసంయుక్తంబుగాఁ బ్రాణాయామం బభ్యసించుచుండ నొక్క మాసంబులోపల ననిలజయంబు గలుగు. ఇది ధ్యానాంగంబు. ఇఁక ధ్యానంబు తెఱంగు వినుము. దేహాంతర్వర్తియై యూర్ధ్వనాళంబును నధోముఖంబునై యరఁటిమొగ్గంబోలియుండు హృదయకమలంబు నూర్ధ్వముఖంబు వికసితంబు నష్టదళంబు గర్ణికాయుతంబునుం గాధ్యానించి యాకర్ణికాంతరంబున వరుసగా సూర్య సోమాగ్నిమండలంబుల విన్యసించి యయ్యగ్నిమండల మధ్యంబున ధ్యానంబునకు శుభవిషయంబగు నారూపంబు ధ్యానింపందగు నెట్లనిన.

సీ. సమము బ్రశాంతంబు - సుముఖంబు దీర్ఘచ
        తుర్బాహుయుతము గౌ - స్తుభవిభాసి
సుందర గ్రీవంబు - సుస్మితవదనంబు
        సుకుమార మఖిలాంగ - సుందరంబు
సమకర్ణవిన్యస్త - కమనీయమకర కుం
        డలలసత్సుకపోల - తలయుగంబు
కనకాంబరంబు మే - ఘశ్యామమురుభుజాం
        తర రమాశ్రీవత్స - చిరనివాస

తే.గీ. మరి దరగదాబ్జవనమాలి - కాంచితంబు
నూపురలసత్పదంబు మ - నోజ్ఞమకుట
కటక కటిసూత్ర కేయూర - కలితమును ప్ర
సాద సుముఖేక్షణము హృద్య - సత్త్వమయము. 504

క. అగు నారూపంబును నొ
ప్పగు సర్వాంగంబులందు - స్వాంతంబు స్థిరం
బగునట్లు నిల్పి ధ్యానం
బొగి సల్పఁగవలయు బుద్ధి - యుక్తుం డనఘా. 505

తే.గీ. ఇంద్రియార్థంబులందుండి - యింద్రియముల
మనసుచే నీడ్చి యంత నా - మనసుఁబట్టి
బుద్ధి సారథిగాఁ జేసి - బుద్ధిశాలి
సావయవమైన నారూప - మందు నిలుపు. 506

వ. ఇట్లు మదీయ సర్వాంగంబుల యందును వ్యాపించి నిశ్చలంబైయుండు చిత్తంబు నాకర్షించి సుస్మితశోభనంబగు మన్ముఖైకదేశంబునందు నిలిపి యితరాంగంబులేవియు న్మఱలఁ జింతింపకుండునది. అంత మన్ముఖమాత్ర నిష్ఠితంబైన చిత్తంబు నాకర్షించి సర్వకారణరూపంబగు నాకాశంబున న్నిలిపి పిమ్మట నా కారణంబు సైతము వదిలి శుద్ధబ్రహ్మంబగు నాయందు దాని నారూఢంబుఁజేసి ధ్యాతృధ్యేయవిభాగంబునుంగూడఁ జింతింపకుండునది. ఇట్లు సమాహితమతియై నన్నుఁ దనయందును సర్వాత్ముండనగు నాయందుఁ దన్నును జ్యోతియందు జ్యోతినింబోలెఁ జేర్చి పూర్ణత్వంబు నొందునది. ఇట్లతితీవ్రంబగు ధ్యానంబుచే మనంబు మన్మయంబు గావించు యోగీంద్రునకు నచిరంబు యధిభూతాధిదైవాధ్యాత్మాభిధానదృశ్య ద్రష్టృదర్శనరూప ద్రవ్యజ్ఞాన క్రియాభ్రమం బుపశమించునని యానతిచ్చి భగవంతుం డుద్ధవునింగని యిట్లింద్రియంబుల జయించి స్థిరచిత్తుండును జితశ్వాసుండునునై చిత్తంబు నాయందుఁ గదలకుండ న్నిలుపు। యోగీంద్రునకు మత్ప్రాప్త్యంతరాయప్రాయంబులై యోగసిద్ధు లావిర్భవించుం

గావున యోగి వానిం బరిహరించి మత్పరాయణుండ కావలయు ననిన
విని యుద్ధవుం డిట్లనియె. 507

## - : అణిమాది సిద్ధి లక్షణము : -

క. యోగులకు సిద్ధులొసఁగెడు
యోగేశ్వర సిద్ధు లెన్ని - యున్నవి యందే
లాగున ధారణఁ జేసిన
యోగికి నెదియెట్లు గలుగు - నో చెప్పఁగదే. 508

వ. అనిన భగవంతుం డిట్లనియె. ధారణాయోగ పారంగతులగు యోగీశ్వరులు సిద్ధులు పదునెనిమిది గలవందురు. అందు నెనిమిది యీశ్వరుఁడనగు నాసారూప్యంబు నొందిన యోగి నాశ్రయించి యుండునవి. తక్కినవి సత్త్వగుణోత్కర్షంబునం గలుగునవి. మత్ప్రధానంబు లెనిమిదియు నణిమ మహిమ లఘిమ గరిమ ప్రాప్తి ప్రాకామ్యంబు నీశిత్వంబు వశిత్వంబు ననంబరగు. ఇందు మొదటి నాలుగును శారీరంబులు. తక్కినవి యైంద్రియికంబులు. శరీర మణురూపమగుట యణిమ. అది గొప్పదియగుట మహిమ. తేలికయగుట లఘిమ. బరువగుట గరిమ. పురుషుం డింద్రియాధిష్ఠాతృ దేవతారూపంబు నొంది సర్వప్రాణుల యింద్రియంబులతో సంబంధంబు గలిగి తన యిష్టప్రాప్తి నొందుట ప్రాప్తి. ఇహ పరలోకంబుల యందలి దృష్టశ్రుత సర్వవిషయభోగంబులం గను సామర్థ్యంబు ప్రాకామ్యంబు. ఈశ్వర తదంశంబులయందు మాయా తదంశభూతంబులం బ్రవర్తింపంజేయు సర్వాతిశాయిత్వసిద్ధి యీశిత. విషయభోగంబులయందసంగుండగుట వశిత. ఇవి యీశ్వరుండనగు నాస్వాభావిక నిరతిశయసిద్ధులు. వీనిచే యోగి తాఁగోరెడు సుఖంబుల నెవ్వియైనను సమగ్రంబులుగాఁ బొందుచుండు. ఇఁక గుణహేతుకంబులగు సిద్ధులను వినుము. ఈ శరీరంబున క్షుత్పిపాసాశోకమోహ జరామరణంబులను షడూర్మ్ములు లేకుండుటయు దూరశ్రవణ

దూరగ్రహణంబులును మనోజవగమనంబును గామరూప ధారణంబును బరకాయప్రవేశంబును స్వచ్ఛందమరణంబును దేవత లచ్చరలతోడం జేయు క్రీడలంజూచుటయు తన సంకల్పంబు దప్పక నెరవేరుటయు నెందును నడ్డగింపరాక తనయాజ్ఞం జెల్లించుకొనుటయు ననువదియు సత్త్వగుణోత్కర్షంబున నగునవి. ఇవియుంగాక భూతభవిష్యద్వర్తమాన కాలంబులయందలి విషయంబుల నెఱుంగుటయు శీతోష్ణాదులం దిరస్కరించుటయుఁ బరచిత్తాదుల నెఱుంగుటయు నగ్న్యర్కజల విషాది స్తంభనంబును నెందునుం బరాజయంబు నొందకుండుటయు ననునీయేనును క్షుద్రసిద్ధులు. యోగధారణంగలుగు నీసిద్ధులను సంగ్రహంబుగాఁ జెప్పితి. ఇఁక నిందేది యే ధారణచే నెట్లు సిద్ధించు నావివరం బెఱింగింతు వినుము. యోగిభూతసూక్ష్మోపాధికుండనగు నాయందుఁదన్మాత్రంబుగాఁ దనమనంబు ధారణసేయ నాయదియగు నణిమయను సిద్ధి యాతనికి లభించు. మహత్తత్త్వోపాధికుండను బరమాత్ముండను నగు నాయందు మహత్తత్త్వాకారంబుగాదఁ న మనంబును ధరియించు వాఁడు మహిమ యనంబడు సిద్ధిం బొందు. ఇందాకాశాది మహాభూతపంచకోపాధికుండనగు నాయం దేయేమహాభూతంబునఁ దన్మయంబుగాఁ దన మనంబు ధరియించు నాయా మహాభూతంబు మహిమంబు వేఱువేఱుగా నతం డొందు. మహాభూత పరమాణూపాధి కుండనగు నాయందుఁ బరమాణుమయంబుగాఁ దనచిత్తం బెవ్వండు ధరించు నాయోగి కాలపరమాణూపాధిరూపంబగు లఘిమసిద్ధిం బొందు. స్థూల మహాభూతోపాధి కుండనగు నాయందు స్థూలాకారంబుగాఁ జిత్తంబు నిలిపి ధారణసేయ గరిమసిద్ధి యగు. ఇందును నేయే మహాభూతమున నట్లాయోగి ధారణసేయు నాయా మహాభూతంబు గరిమంబు వేఱువేఱుగా నాతనికి లభించు. వైకారికాహంకారోపాధికుండనగు నాయం దేకాగ్రంబగు మనంబు ధరియింప నాయందట్లు మనంబు నిలిపిన ప్రభావంబుననే సర్వప్రాణీంద్రియాధిష్ఠాతృత్వప్రాప్తియగు ప్రాప్తి సిద్ధి గలుగు. సూత్రాత్మయనంబడు క్రియాశక్తి ప్రధానంబగు మహత్తత్త్వం బుపాధిగాఁ

గల నాయందు మానసంబు ధరియింప నవ్యక్తజన్ముండనగు నానర్వోత్కృష్టంబగు ప్రాకామ్యంబను సిద్ధిం బడయఁగలుగు. త్రిగుణమాయానియంతనుఁ గాలవిగ్రహుండను నంతర్యామినినగు నాయందుఁ జిత్తంబును ధరించువాఁడు క్షేత్రక్షేత్రజ్ఞ చోదనారూపంబగు వశిత్వ సిద్ధిం బొందు. విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతోపాధిత్రయంబు లేని సమగ్రైశ్వర్యవీర్య యశశ్శ్రీజ్ఞానవైరాగ్య యుక్తం బనంబడు నారాయణాభి ధానతురీయ పదంబగు నాయందు మనంబు ధారణసేయు యోగి మద్ధర్మంబగు వశిత్వసిద్ధిం బొందు. ఇవి యట్లుండ నిర్గుణబ్రహ్మంబగు నాయందు విశదంబగు తనమనంబు ధరియించు యోగి యెందుఁ గోర్కులెల్ల నంశభూతంబులై సమాప్తినొందునట్టి పరమానందంబు నొందు. ఇవి యస్మదీయసిద్ధులు. శ్వేతద్వీపాధినాథుండను శుద్ధసత్త్వధర్మమయుండను నగు నాయందుఁ జిత్తంబునిలిపి నరుండు షడూర్మిరహితుండై శుద్ధస్వరూపుండగు. ఆకాశాత్మక సమష్టిప్రాణరూపుండనగు నాయందు మనస్సుతో నాదంబుఁ జింతింప హంసరూపుండగు నీజీవుండు జ్ఞాతృస్వరూపుండై యయ్యాకాశంబునందు నభివ్యక్తంబులగు సకల భూతవిచిత్రవాగ్జాలంబులనెల్ల దూరంబుననుండియే వినంగలుగు. ఇది దూరశ్రవణసిద్ధి. మఱియుం జక్షురింద్రియంబుందదధిష్ఠాతయగు నాదిత్యునందును నాదిత్యునిం జక్షురింద్రియంబునందునుం గలిపి తదుభయసంధిన్మనంబున నన్ను ధ్యానింప సూక్ష్మదృష్టియై యోగి విశ్వంబును దూరంబున నుండియే చూచువాఁడగు. ఇది దూరదర్శనసిద్ధి. మనంబును దేహంబునుం దదనువర్తి యగు వాయువుతోడ నాయందు గలిపి ధారణసేయు ప్రభావంబున మనంబుతోడన దేహంబుసనుచుండు. ఇది మనోవేగగమనసిద్ధి. మనం బుపాదానకారణంబుఁజేసి యోగి యేయేదేవాదిరూపంబుఁ దానొందం గోరు వాఁడాయామనోభీష్ట రూపంబును మద్యోగప్రభావాశ్రయంబునం బడయునేర్చు. ఇది కామరూపధారణాసిద్ధి. ఏపరశరీరంబుం బ్రవేశింప సిద్ధుం దభిలషించు దానం దానున్నట్లు భావించి నిజశరీరంబున మడిమతో గుదస్థానంబు

గట్టిగా నిరోధించి ప్రాణప్రధానంబగు లింగశరీరోపాధిని గ్రమంబుగా హృదురః కంఠమూర్ధస్థానంబుల కెక్కించుచుం గడకు బ్రహ్మరంధ్రమార్గంబున దాని న్విడిచి యాలింగశరీరోపాధితోడ బాహ్య వాయువుం బ్రవేశించి యమ్మార్గంబున భృంగంబు పుష్పంబువదలి పుష్పాంతరంబుఁ బ్రవేశించు తెఱంగున నతఁడు నిజశరీరంబువదలి యాపరశరీరంబుఁ బ్రవేశించు. ఇది పరకాయ ప్రవేశసిద్ధి. దీనియందుంబలె నభిలషితకాలంబున మనంబుచేత లింగశరీరంబు బ్రహ్మాద్యపేక్షితపదంబునం జేర్చి నిజశరీరంబు విడుచుట స్వచ్ఛందమరణసిద్ధి. దేవతావిహార స్థానంబులం గ్రీడింపఁగోరు యోగి శుద్ధసత్త్వంబగు మన్మూర్తిరూపంబుఁ జింతింపవలయు. అప్పుడు సత్త్వాంశభూతలగు దేవతాస్త్రీలు వానిని విమానంబునందు విహరింపంజేయుదురు. మత్పరుండగు పురుషుఁడు సత్యసంకల్పుఁడనగు నాయందుఁ దనమనంబుఁ జేర్చి దృఢవిశ్వాసంబుతోఁ దనబుద్ధిచే నెప్పుడెట్లుసంకల్పించినను నాతనికిఁ దత్సంకల్పానురూపంబుగా సర్వంబును సిద్ధించు. సర్వనియంతను స్వతంత్రుండను నగు నాస్వభావంబు నొందిన పురుషుండెందును నాపదంబొరయండు. నాయాజ్ఞంబోలె వానిదియు నప్రతిహతంబగు. ఇవి గుణహేతువులగు సిద్ధులు. ధారణావిదుండగు నెవ్వనికి నాయందలి భక్తింజేసి చిత్తంబు శుద్ధంబగు నాయోగికి నిజజన్మమృత్యు పరంపరాది త్రికాలవస్తుజ్ఞానసిద్ధియుఁ బరచిత్తాద్యభిజ్ఞాన సిద్ధియును గలుగు. మద్యోగప్రశాంతచిత్తుండగు మునీంద్రుని తనువగ్న్యాది సర్వోపఘాతశూన్యుండనగుదునను నాతని యోగంబునఁ బరినిష్ఠితంబై జలచరంబు జలంబులచేతం బలె నగ్న్యాదులచే నుపహతంబుగాదు. మఱియు నది శీతోష్ణాది ద్వంద్వంబులను నిగ్రహించు. శ్రీవత్సాది విభూషితంబులు ధ్వజాతపత్రవ్యజనాది సమేతంబులునగు మదవతార మూర్తుల నభిధ్యానించు వారి కపరాజితత్వసిద్ధి గలుగు. ఇయ్యవియేనును క్షుద్రసిద్ధులు. నన్నీవివిధ ధారణలచే నుపాసించు మౌనీంద్రు నకీ చెప్పఁ బడిన సిద్ధులశేషంబులును నావిర్భవించు. 509

తే.గీ. ఇన్ని సెప్పఁగనేల జి - తేంద్రియుండు
జితపవనమానుసుం డుపా - ర్జితదముండు
నిరతమద్ధారణాభ్యాస - పరుఁడు నైన
మౌని కేసిద్ధి దుర్లభం - బైన దిందు. 510

క. మేలగు యోగాభ్యాసము
చే లీలఁ దురీయు నన్నుఁ - జేరెదు మునికిం
గాలముఁ గడపెడు విఘ్నము
లోలి నివి యటంచు యోగు - లొల్లరు వీనిన్. 511

సీ. జలచరంబులు జల - స్తంభనసిద్ధిని
ఖగముఖంబులు వియ - ద్గమనసిద్ధి
నమరులు సిద్ధుల - నన్నింటిఁ దమ జన్మ
ములతోన గలిగి యొ - ప్పుదురు మఱియు
మనుజులు తపముల - మంత్రౌషధ క్రియా
ద్యములచేతను సమ - స్తంబులైన
యీయోగసిద్ధుల - నాయాసముగ బొందఁ
గలరు గావున ఫలా - కాంక్షలేక

తే.గీ. వీని మద్ధారణా సమ - న్వితములుగనె
యభ్యసింపఁగవలయుఁ గా - మ్యముల మరగి
యోగగతి మానుటొప్పదు - భోగియగుచు
మానెనేనిఁ బదభ్రష్టుఁ - డౌను యోగి. 512

సీ. సకల సిద్ధులను నొ - సంగెదు హేతువున్
వానిఁ బాలించెదు - వాఁడ నేను
మోక్షంబునకు జ్ఞాన - మునకు ధర్మమునకు
బ్రహ్మవాదులకును - బ్రభుఁడ నేను
లోపల వెలుపల - వ్యాపించి తనువులఁ
బంచభూతములుండు - పగిది నేను

నిఖిలదేహులయందు - నిలిచి యంతర్యామి
నై యుండుఁగాని య - నావృతుండ

తే.గీ. నవ్యయుండ నసంగ చి - దాత్మకుండ
నండజాది చతుర్విధ - వ్యక్తభూత
నిచయ యంత్ర ప్రవర్తక - నిర్వికార
శుద్ధ చైతన్యమాత్రుండఁ - జూవెనేను. 513

సీ. అన విని యుద్ధవుం - డను సర్వభావ స
ర్గస్థితి రక్షణ - ప్రళయ కరుఁడ
వాద్యంత రహితుండ - వవ్యవచ్ఛేద్యుండ
వద్వితీయుఁడవు బ్ర - హ్మంబవీవు
హెచ్చులు తగ్గులౌ - నీభూతముల నుండు
నీవు మూఢులచేత - నెఱుఁగఁ బడవు
వేదార్థమెఱిఁగిన - విప్రులు భూతాత్మ
కుఁడవని యెఱిఁగి ని - న్గొలుతు రెపుడు

ఆ.వె. నెందునెందు నిన్ను - నెట్లెట్లు సేవించి
పరమఋషులు సిద్ధిఁ - బడయుచుందు
రాతెఱంగుఁ జిత్త - మంతర్ముఖము సేయ
లేని నాకుఁ దెలియ - నానతీవె. 514

## - : భగవద్విభూత్యభివర్ణనము : -

సీ. భూతంబులందున - స్ఫుటముగాఁ జరియింతు
వవిసేసి యందాత్మ - వై వసించి
వానిఁగాంచెదు నిన్నుఁ - గానవయ్యవి నీదు
మాయలో మునిఁగిన - వై యనంత
దివ్యమహావిభూ - తివి దేవ నీయని
ర్వాచ్యయౌ శక్తిచే - బహు విధములఁ

బుట్టింపఁబడి దివి - భువి రసాతలమున
నెల్లదిక్కుల విల - సిల్లుచుండు
తే.గీ. నీ విభూతుల నాకు వ - ర్ణించి చెప్పు
భువన పావనతీర్థ సం - భవపదాబ్జ
నీకు మ్రొక్కెదననుఁ గరు - ణింపు మిప్పు
డనిన శ్రీకృష్ణదేవుఁ డి - ట్లానతిచ్చె. 515
సీ. మున్ను కురుక్షేత్ర - మున నర్జునుండు శత్రు
వులతోడ యుద్ధంబు - సలుపవచ్చి
చంపెడు వాఁడునుఁ - జంపఁగాఁ బడువాఁడుఁ
దానని మోహితుం - డై నితాంత
రాజ్య లోభంబునఁ - బూజ్యులు నాప్తులౌ
తనవారిఁ జంపు ట - ధర్మమనియు
గర్హ్యమంచుఁ దలంచి - కయ్యంబుమాని ప్రా
కృత బుద్ధియై నన్ను - నిట్లె యడిగె
తే.గీ. నపుడు నేనానరోత్తము - నాత్మఁ గలఁక
దేఱఁగా యుక్తులను జెప్పి - తిని విమర్శ
నతఁడు దెలివొంది రణరంగ - మందు నన్ను
గాంచి నీవలెఁ బలికె ను - త్కంఠతోడ. 517
సీ. ఈ భూతములకెల్ల - నీశ్వరుండు ప్రియుండు
నగు నాత్మనే నుద్ధ - వా! సమస్త
భూతంబులును నేను - భూతసర్గస్థితి
నాశంబులకుఁ గార - ణంబు నేను
గతిగలవారికి - గతినేను మతి వశీ
కరణంబుగలవారి - కాలమేను
సకల గుణంబుల - సామ్యంబు నేనౌదు
గుణవంతుల స్వభావ - గుణము నేను

తే.గీ. మూఁడు గుణముల కార్యంబు - మొదలు నేను
దండివారలలో మహ - త్తత్త్వ మేను
సూక్ష్మములయందు జీవుండ - సుమ్మునేను
మహి గెలువరాని వానిలో - మనసు నేను. 517

సీ. వేదంబులకు నెల్ల - వేధను నేను మం
త్రంబులందు త్రివృత్తు - ప్రణవ మేను
అక్షరంబులయందు - నగుదు నకారంబు
నన్ని ఛందముల గా - యత్రి నేను
దేవతలం దెల్ల - దేవేంద్రుఁడను నేను
వసువులలో హవ్య - వహుఁడ నేను
ఆదిత్యులను విష్ణుఁ - డనువాఁడ రుద్రుల
యందు శివుండ బ్ర - హ్మర్షులందు

తే.గీ. భృగువు రాజర్షులందు నే - నగుదు మనువు
దేవ ఋషులందు మతి ముని - ధేనువులను
గామధేనువు నేను ని - క్కముగ సిద్ధ
పతులఁ గపిలుఁడ గరుడుఁడఁ - బక్షులందు. 518

సీ. అఖిల ప్రజాపతు - లందు నే దక్షుండ
నగుదును బితరులం - దర్యముఁ డను
దైత్యుల యందెల్లఁ - దదధీశుఁడైన ప్ర
హ్లాదుండ నే నుద్ధ - వా! యెఱుంగు
తెలియు నక్షత్రౌష - ధుల నన్ను సోముఁ గా
యక్షరక్షస్సుల - నధిపు ధనదు
నన్నిగజంబుల - నైరావతము వారి
చరములఁ బ్రభువగు - వరుణఁడేను

తే.గీ. వేఁడితో వెల్గు వానిలో - వేఁడి వెలుగు
మానవులయందు నెల్ల నే - మనుజపతిని

వాహనములందు నుచ్చైశ్శ్ర - వంబు నేను
సకల ధాతువులందుఁ గాం - చనము నేను 519

సీ. దండించు వారిలో - దండధరుండను
సకల సర్పముల వా - సుకిని నేను
నాగేంద్రులందు న - నంతుండనే నేను
శృంగి దంష్ట్రులయందు - సింహమేను
అశ్రమంబులను దు - ర్యాశ్రమంబే నేను
వర్ణంబులందు నే - బ్రాహ్మణుఁడను
తీర్థవాహినులలో - దివ్యగంగను నేను
సరసుల యందెల్ల - సాగరంబ.

తే.గీ. నాయుధంబులయందు బా - ణాసనంబ
ధన్వులందెల్లఁ ద్రిపుర ని - ర్దాహకుఁడను
వాసభూములలో మేరు - పర్వతంబ
నఖిల దుర్గములందు హి - మాలయంబ. 520

సీ. సకల వృక్షముల న - శ్వత్థవృక్షము నేను
బ్రవిమలౌషధులందు - యవలు నేను
నేఁ బురోహితులందు - నెల్ల వసిష్ఠుండ
బ్రహ్మిష్ఠులను బృహ - స్పతిని నేను
సేనాపతులయందు - నేను గుమారుండ
నగ్రణులందు నే - నజుఁడఁ జుమ్ము
యజ్ఞంబులను బ్రహ్మ - యజ్ఞంబు నే నౌదు
సద్వ్రతంబుల నహిం - సనము నేను

తే.గీ. వాయువగ్నియు రవిజల - వాక్కులాత్మ
నగుచు శుచులందు నెల్ల న - త్యంత శుచిని
యోగములలో సమాధినై - యుందు జయము
నిరతమును గోరువారిలో - నీతి నేను 521

వ. మఱియు న్వినుము. వివేకాదినైపుణ్యంబుగలవారిలో నాత్మానాత్మ వివేకవిద్యను నేను. అఖ్యా త్యన్యథాఖ్యాతి శూన్యఖ్యాత్యసత్ఖ్యాత్యనిర్వచనీయఖ్యాతి వాదులయందు నట్లో యిట్లో యను దురంత వికల్పంబు నేను. స్త్రీలయందు శతరూపయుఁ బురుషులయందు స్వాయంభువ మనువును మునులయందు నారాయణమునియు బ్రహ్మచారులయందు సనత్కుమారుండును నేను. ధర్మంబులయందు సన్న్యాసంబును నభయస్థానంబులయందు నంతర్నిష్ఠయు రహస్యంబులయందు ప్రియవచనమౌనంబులును మిథినంబులయం దెవ్వని దేహార్థంబులు రెండును మిథునంబయ్యె నట్టి ప్రజాపతియును నేన. అప్రమత్తులయందు సంవత్సరంబును ఋతువులయందు వసంతర్తువును మాసంబులయందు మార్గశీర్షంబును నక్షత్రంబులయం దభిజిత్తును యుగంబులయందుఁ గృతయుగంబును ధీరులయందు దేవలాసితులును వేదవిభాగకర్తలయందు ద్వైపాయనుండును విద్వాంసులయందు మతి మంతుండగు శుక్రుండును షడ్గుణైశ్వర్యసంపన్నులయందు వాసుదేవుండను భాగవతులయందు నీవును నేన. వినుమేను గింపురుషులయందు హనుమంతుడ. విద్యాధరులయందు సుదర్శనుండ. రత్నంబులయందుఁ బద్మరాగంబును సుందరవస్తువుల యందు బద్మకోశంబును దర్భజాతుల యందుఁ గుశయు హవిస్సులయందు గోఘృతంబును నేన. వివేకబుద్ధి గలవారియందు ధనాదిసంపద నేను. జూదరులయందుఁ గపటవ్యాపారంబు నేను. ద్వంద్వంబు లోర్చువారి యందోర్పు నేను. సాత్త్వికుల యందలి సత్త్వంబు నేను. బలవంతులగు వారి యింద్రియ మనోబలంబులు నేను. భాగవతులు భక్తింజేయు కర్మంబు నేను. వారొనర్చు నవవ్యూహార్చనంబు నందలి వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ నారాయణహయగ్రీవ వరాహ నృసింహ వామన మూర్తులయందు నాదిమూర్తియగు వాసుదేవుండను నేను. గంధర్వులయందు విశ్వావసుండను నేను. అప్సరసలయందుఁ బూర్వచిత్తిని నేను. పర్వతంబులయందలి స్థైర్యంబు నేను. పృథ్వియందలి నిర్వికార గంధంబు నేను. జలంబునందలి మధురరసంబు నేను. తేజోవంతులయం

దగ్ని నేను. సూర్యచంద్రనక్షత్రంబులయందలి కాంతి నేను. ఆకాశంబు నందలి పరయనంబడు శబ్దంబు నేను. బ్రహ్మణ్యు లర్పించు బలి నేను. వీరులయం దర్జునుండ నేను. భూతంబుల స్థిత్యుద్భవాప్యయంబులు నేన. కర్మేంద్రియవ్యాపారంబులగు వచనాదాన గమనవిసర్గానందంబులును జ్ఞానేంద్రియవ్యాపారంబులగు స్పర్శనదర్శన శ్రవణఘ్రాణాస్వాదంబులును నేను. పృథ్వివ్యప్తేజో వాయ్వాకా శశతన్మాత్రంబు లేనను నహంకారంబును మహత్తత్త్వంబును నేను నేఁడు ప్రకృతివికారంబులును నేన. పంచమహాభూతంబులును నేకాదశేంద్రియంబులుంగలిసి పదియాఱు కళలుగల పురుషుండగు జీవుండును నవ్యక్తం బనంబడు ప్రకృతియు రజస్సత్త్వతమస్సులను ప్రకృతిగుణంబులును పరబ్రహ్మంబును నను నివి యన్నియు న్నేన. వీని పరిగణనంబును లక్షణంబులచే వీని నెఱుంగుటయుఁ దత్ఫలంబగు తత్త్వవినిశ్చయంబును నేన మఱియును. 522

సీ. జీవుఁ డీశ్వరుఁడును - క్షేత్రంబు క్షేత్రజ్ఞుఁ
దును గుణంబును గుణి - యను సమస్త
మును నెన్నఁడును నెట్టు - లును మఱన్యంబైన
భావంబుగాదు స - ర్వంబు నేనె
భూమ్యాది పరమాణు -వులనైన నేనెంత
కాలంబునకొ యెన్నఁ - గలను గాని
బ్రహ్మండకోటులఁ - బ్రభవింపఁజేయు నా
వైభవంబెన్న నా - వలనఁ గాదు

తే.గీ. నిక్క మొకమాట విను వేయి - లెక్కలేల
తేజ మైశ్వర్య మోర్పు కీ - ర్తి సిరి లజ్జ
త్యాగ సౌభాగ్య భాగ్య వీ - ర్యములు బలము
జ్ఞానమును గల్గునవి మదం - శంబు లెందు. 523

తే.గీ. స్వాంతమును నిల్పు నిపుడు నే - సంగ్రహముగఁ
బొనఁగఁ జెప్పిన యీ నా వి - భూతులెల్ల

మానస వికారములు నామ - మాత్రకములు
గగన సుమములంబోలు ని - క్కములు గావు. 524

వ. కావున నీవు వీనియందత్యంతాభినివేశంబుఁ జేయకుము.
మఱి యేమనిన వినుము. 525

తే.గీ. ప్రాణవాఙ్మానసేంద్రియ - వర్గములను
బొడమనీక యడంపుము - బుద్ధిచేత
బుద్ధి నణఁపుము సాత్త్విక - బుద్ధిచేత
మరలరావీవు సంసార - మార్గమునకు. 526

తే.గీ. బుద్ధిచే వాక్కు మనసును - బొసఁగ నణఁప
లేని సన్న్యాసి వ్రతతపో - జ్ఞాననిష్ఠ
పచ్చికుండను బోసిన - వారి యట్లు
నిల్వ కంతయు వేగ క్షీ - ణించి పోవు. 527

తే.గీ. కాన మత్పరుఁడగుచు నే - కాంతభక్తి
నమలమగు బుద్ధి వాఙ్మనః - ప్రాణములను
బట్టి యుపసంహరింపఁ గా - వలయు భక్తుఁ
డంత నాతఁడు గృతకృత్యు - డగు ధరిత్రి. 528

వ. అనిన నుద్ధవుండు శ్రీకృష్ణదేవునింగని సవినయంబుగా నిట్లనియె. 529

మ. పలుకంగాఁబడెఁ దొల్లి నీవలననే - వర్ణాశ్రమాచార వం
తులుఁ దద్దీనులు నెల్ల జాతులగు మ - ర్త్యుల్నీదు సద్భక్తికిన్
బలమౌనట్లు స్వధర్మమున్ జరుపనౌ - వర్జింపకం చట్లువా
రలు తద్ధర్మము నాచరింపఁదగు మా - ర్గంబంతయుం జెప్పవే. 530

చ. పరమసుఖప్రదంబులును - భవ్యతమంబులు యోగధర్మముల్
వరుస నెఱుఁగఁ జెప్పితివి - బ్రహ్మము హంసమురూపుదాల్చి మున్
సరసిజనేత్ర! యిప్పుడవి - నాశము నొందెను దీర్ఘకాలమై
పరగవు మర్త్యలోకమునఁ - బ్రాగనుశాసితముల్ మహార్థముల్. 531

మ. ఇల బోధించెడు బ్రాహ్మణుల్ సుఖముగా - నీధర్మముల్ సేయు పె
ద్దలు వీనిం బరిరక్షసేయు ప్రభువుల్ - ధాత్రీతలిన్ యుష్మద
న్యులు లే రిందునెయేల సర్వకళలున్ - రూపంబులంబొల్చు నా
నలుమోముల్లల వేల్పు నోలగములో - నంగూడ లేరచ్యుతా! 532

తే.గీ. కర్త వీ ధర్మములకు ర - క్షకుఁడ వీవు
వక్తవును నీవె యానీవు - వసుధ విడిచి
చనిననిం దివి నశియించు - వెనుక వీరి
మాకుఁ జెప్పఁగనేర్చు నే మానవుండు. 533

తే.గీ. కాన త్వద్భక్తి లక్షణం - బైన ధర్మ
మెవ్వఁ డెట్లు చరింపనౌ - నెఱుఁగఁ బలుకు
సర్వధర్మజ్ఞ! ధర నిది - శాశ్వతముగ
నిలుచునట్లును నీమదిఁ - దలఁపు దేవ. 534

మ. అని యిట్లుద్ధవుఁడార్తుఁడై యడుగఁగా - నా యాదవస్వామి యి
ట్లను నీ ప్రశ్నము ధర్మ్యముద్ధవ! యవ - శ్యంబిప్పుడేఁ జెప్పుదున్
విను వర్ణాశ్రధర్మనిష్ఠులకు సం - వేద్యంబు నిశ్శ్రేయసా
ర్థవిధానంబిదియంచుఁజెప్ప దొడఁగెన్ - ధర్మంబు భక్త్యంగమున్. 535

- : వర్ణాశ్రమ సంభవప్రకారము : -

ఆ.వె. అది కృతయుగంబు - నందు మానవులకు
హంసవర్ణమనఁగ - నయ్యెనొకటె
వారు బ్రహ్మవలన - నైరి కృతార్థుల
ట్లగుటనదియుఁ గృతయు - గాఖ్య నొందె. 536

తే.గీ. వేద మోంకార మాత్రమే - యాదియందు
ధర్మమగు నేను వృషరూప - ధరుఁడనైతి
మానవులు నన్ను నేకత - పోనిరూఢిఁ
గొలిచి నిర్ముక్త పాపులై - వెలసిరపుడు. 537

తే.గీ. త్రేత మొదలిడ వైరాజ - దేహుఁడైన
నామనంబున నుండి ప్రా - ణంబుతోడ
హోత యధ్వర్యుఁడుద్గాత - యును బఱంచు
త్రయి వొడమె నంత నే మఖా - త్మకుఁడనైతి. 538

వ. అంత వైరాజ పురుషుండ నగు నాముఖబాహూరు పాదంబుల నుండి విప్రక్షత్ర విట్ఛూద్రులు నిజధర్మలక్షణంబులతో నుద్భవించిరి. నాజఘనంబునుండి గృహస్థాశ్రమంబును, హృదయంబునుండి బ్రహ్మచర్యంబును, వక్షస్థలంబు నుండి వానప్రస్థాశ్రమంబును, శీర్షంబు నుండి సన్న్యాసాశ్రమంబును బొడమె. ఈ వర్ణాశ్రమంబుల జన్మభూముల మందమధ్యమోత్తమ స్వభావంబుల ననుసరించి తత్తద్వర్ణాశ్రమంబుల మానవుల స్వభావంబులును మందమధ్యమోత్తమంబులై విలసిల్లె. అందు శమదమ తపశ్శౌచంబులును సంతోషక్షమార్జవంబులును మద్భక్తియు దయా సత్యంబులును బ్రాహ్మణస్వభావంబులు. బల ప్రతాపంబులును ధైర్యశౌర్యంబులును దితిక్షౌదార్యోద్యమంబులును స్థైర్యంబును బ్రహ్మణ్యతయు నైశ్వర్యంబును క్షత్రస్వభావంబులు. ఆస్తిక్యంబును దాననిష్ఠయు నదంభంబును విప్రసేవనంబును ద్రవ్యార్జనంబునం దతుష్టియు వైశ్యస్వభావంబులు. దేవద్విజగోసేవ లమాయికంబులుగాఁ జేయుటయు దానం గలుగు లాభంబున సంతుష్టి నొందుటయు శూద్రస్వభావంబులు. అశౌచంబును ననృతంబును స్తేయంబును నాస్తిక్యంబును నహేతుక కలహంబును గామ క్రోధ లోభంబులును జతుర్వర్ణ బాహ్యులగు నంత్యజుల స్వభావంబులు. అహింసయు సత్యంబును నస్తేయంబును గామక్రోధలోభ రాహిత్యంబును భూతప్రియహితాచరణంబు సార్వవర్ణికధర్మంబులు. బ్రహ్మచర్యం బుపకుర్వాణంబు నైష్ఠికంబునని ద్వివిధం బందుఁ బ్రథమం బెట్లనిన వినుము. 539

-: బ్రహ్మచారి ధర్మప్రతిపాదనము :-

సీ. త్రైవర్ణికుండు గ - ర్భాదాన ముఖ్య సం
స్కార పూర్వముగ నా - చార్యుచేత
నుపనీతుఁడై ద్వితీ - యోద్భవంబంది ద్వి
జాఖ్యుఁడై గురుకులం - బందు నిల్చి
దాంతుఁడై మౌనియై - తనుఁ బిల్చి చెప్పఁగా
సార్థంబుగా వేద - మభ్యసించు
జటిలుఁడౌఁ దాల్చుఁ గు - శల్ జన్నిదము మౌంజి
దండాజినాక్ష క - మండలువుల

తే.గీ. నరుణ పీఠుం డధౌత ర - దాంబరుండు
స్నానజప హోమ భోజనో - చ్చారములను
మౌనియగు గోరులేని లో - మంబు లేనిఁ
దుద కుపస్థను గక్షలఁ - ద్రుంచఁ డతఁడు. 540

తే.గీ. బ్రహ్మచర్య వ్రతస్థుఁ డె - ప్పటికిఁ దాను
జాఱిపోనీఁడు రేతస్సు - జాఱెనేని
నీటమునిఁగి ప్రాణాయామ - నియతుఁ డగుచుఁ
ద్రిపద గాయత్రి జపియింపఁ - దీఱు నఘము. 541

తే.గీ. మౌనియై సంధ్యల జపించు - మతి సమాహి
తాత్ముఁడై నిత్యమును నగ్ని - నర్కు గురుని
ద్విజుల నాచార్యు గోవుల - వృద్ధజనుల
సురలఁగని మ్రొక్కుచుండు వి - శుద్ధుఁడగుచు. 542

క. గురువున్ననుగాఁ గనఁదగు
నరయ కెపుడుఁ జేయ నొప్ప - దాతని కెగ్గుల్
సురనికరరూపునాతని
నరుఁడంచు నసూయఁ జూచి - నన్ దురితమగున్. 543

ఆ.వె. తేపుమాపుఁ దా ని - జోపయుక్తికిఁ దెచ్చు
భైక్షమేని నన్య - వస్తు వేని
వడుగు గురునకిచ్చి - వారొప్పియిచ్చిన
వానినే భుజింప - వలయు నియతి. 544

సీ. గురువు వోవుచునున్నఁ గూడ వెన్కొనిపోయి
నిలిచిన నంతంత - నిలిచియుండి
నిదురించునప్పుడు - న్నిద్రుఁడై దగ్గఱఁ
గ్రిందఁ బరుండి తా - ముందె లేచి
యలసినఁ బాదంబు - లల్లన నొత్తుచు
నెందేనిఁ జనినఁ బ్ర - తీక్షఁజేసి
యాసీనుఁడై నఁ గృ - తాంజలియై నిల్చి
చెప్పిన పనులెల్లఁ - జేయుచుండి

తే.గీ. నిత్యమును వారి వదలక - నీచుఁడుబలె
వటువు శుశ్రూష సేయఁగా - వలయు గురున
కిట్లఖండితదీక్ష భో - గేచ్ఛవదలి
యుండవలె గురు - కులమున నుండువఱకు. 545

వ. ఇది వివాహోపయుక్తంబగు నుపకుర్వాణ బ్రహ్మచర్య వ్రతప్రకారం బింక నైష్ఠిక
బ్రహ్మచర్య నియమ విశేషంబులు వినుము. 546

సీ. ఈ బ్రహ్మచారి ముం - దాబ్రహ్మలోకంబుఁ
జేరఁగాఁ దనమదిఁ - గోరెనేని
నధికవేదాధ్యయ - నార్థంబుగాఁ దన
దేహంబునీవలె - దేశికునకు
నంతటఁ దనయందు - నఖిల భూతములందు
నగ్నియందును గురు - నందు సమత
నేకత్వబుద్ధి న - న్నే యుపాసింపఁ గా
వలయు సద్భక్తినీ - వటువు పిదపఁ

తే.గీ. బొందcగలుగు వేదాభ్యాస - భూరితేజ
మఖిల పాపంబులను బాసి - యమలుcడగును
నైష్ఠిక బ్రహ్మచారి య - నంగ నితcడె
విను మితని ధర్మములు గొన్ని - వివరముగను. 547

సీ. భావగర్భంబుగాc - బడతిc జూడcగరాదు
దాని శరీరంబుc - దాcకరాదు
సరససల్లాపము - ల్సలుపరాదు మనంబు
సెదఱcగా నెగతాళి - సేయరాదు
దాని నెప్పుడుc దన - దగ్గఱc జేర్పరా
దేకాంతమునకు రా - నీయరాదు
దాని పాటలు మాట - లేనియు వినరాదు
దాని చేష్టలు మతిc - దలcపరాదు

తే.గీ. జోడులై మన్మథక్రీడc - గూడి తనకుc
గట్టెదుటనుండు ప్రాణులc - గాంచరాదు
బ్రహ్మచారికి నిది యధ - ర్మంబనర్థ
మట్లె యగును వనస్థ స - న్యాసులకును. 548

సీ. శౌచమాచమనంబు - స్నానసంధ్యోపాస్తు
లన్మదీయంబగు - నర్చనంబు
తీర్థసేవనమును - త్రిషవణ జపమును
ముట్టcగా రానివి - ముట్టకునికి
భక్షింపరానివి - భక్షింపకుండుట
పలుకcగూడని పట్లc - బలుకకునికి
యను నివియెల్ల స - ర్వాశ్రమ ధర్మంబు
లుద్ధవా! సర్వ ధ - ర్మోత్తమములు

తే.గీ. మానసవచశ్శరీర సం - యమనమును ని
రంతరము నన్నుగానె యీ - యఖిలభూత

ములను గని శ్రద్ధతో సేవ - సలుపుటయును
నందఱకు నివి మోక్షసౌ - ఖ్యావహములు. 549

సీ. బ్రహ్మవ్రతంబు స - ద్భృద్ధ నిట్లు ధరించు
బ్రాహ్మణుండు వెలుంగు - వహ్నివోలె
నతఁ డొనరించెడు - నతి తీవ్రతపమునఁ
గర్మంబులెల్ల ద - గ్ధంబులగుట
విమలమైయొప్పు చి - త్తముగల్గి కామాది
దోషంబులకునెల్ల - దూరమగుచు
నాయందు నిర్వ్యాజ - మైయుండు సద్భక్తి
యఖిలభూతముల స - మైక్యవృత్తి

తే.గీ. గలిగి యేకాంతభక్తుఁడై - కాంచు ముక్తి
నైష్ఠిక బ్రహ్మచారి స - న్నిష్ఠ వింటి
వింక విను ముపకుర్వాణుఁ - డేఁగు తెరవు
సార్థ వేదవిచారంబు - సల్పి యతఁడు. 550

- : గృహస్థధర్మ వివరణము : -

సీ. ఆశ్రమంబుల రెండ - వది యగు గార్హస్థ్య
మును బొందఁ గోరి న - ప్పుడు కడంక
నాచార్యునకుఁ బ్రియం - బైన దక్షిణ సమ
ర్పించి తదాజ్ఞ న - ర్థించి పడసి
గురుకులంబున నుండి - మరలి యింటికిఁబోయి
యభ్యంజనాదికం - బాచరించి
.......కామసమేతుఁ - డైనచో గార్హస్థ్య
మును మనశ్శుద్ధిఁ గో - రిన వనంబు

తే.గీ. నాశ్రయింప వలయు - నటుగాక సువిరక్తుఁ
డైన సన్న్యసింప - నగు ద్విజాగ్ర్య

దా(శమంబునుండి - యా(శమాంతరమిట్లు
చేరవలె నిజాధి - కారసరణి. 551

క. ఏయా(శమమునఁ జేరక
యే యుండుట గాని వెనుక - కేఁగుటగానీ
న్యాయముగా దా(శములు మ
దీయ పరత్వమున (వ్రతముఁ - దీర్పఁగ వలయున్. 552

సీ. గార్హస్థ్యమునఁ జేరఁ - గడఁగు నాతఁడు దన
కనురూప భార్యఁ బెం - డ్లాడవలయుఁ
గులశీల లక్షణం - బుల నింద్యఁ గూడదు
వయసువఁ బిన్న గా - వలయుఁ దనకుఁ
దన వర్ణమున కన్య - దగు నన్యవర్ణఁ జే
కొనునేని ముందుగాఁ - దన కులంబు
కన్యను బెండ్లాడి - యన్యల నెల్ల వ
ర్ణక్రమంబునఁ గొను - (క్రమముపాడి

తే.గీ. శా(స్త్రమునఁ గూడు నన్న ల - క్షణము లుండి
వలవదన్నవి లేకుండ - వలయుఁ గన్య
కిట్టి దానినె చూచి (గ - హింపవలయు .
గృహసుఖంబును వటుఁడు గాం - క్షించెనేని. 553

తే.గీ. ద్విజులకెల్లను నర్హముల్ - యజన మధ్య
యనము దానంబు ననఁబడు - పనులు మూఁడు
(బాహ్మణార్హంబులై యుండు - పనులు మూఁడు
యాజనంబు (ప్రతి(గహా - ధ్యాపనములు. 554

తే.గీ తపముఁ దేజంబు యశమును - దఱుఁగఁ జేయు
నని పరి(గ్రహమొల్లని - యట్టి వి(ప్రుఁ
దన్యముల రెంట జీవింప - నగు నవి సరి
పడకయుండిన (బ్రతుకునౌఁ - బఱిగలేటి. 555

క. ఈ విప్ర తనువు వృథయై
పోవc దగదు క్షుద్రకామ - ముల పాలగుచున్
గేవల తీవ్రతపం బిటc
గావించి యనంత సుఖముc - గాంచనె యగుటన్. 556

చ. వరిపొలమందు నంగడుల - పజ్జను గింజల నేఱి వానితోc
బరమ ముదంబున న్నుదుకు - బ్రాహ్మణుcడందునె యాతిథేయ స
త్కరణ మొనర్చుచు న్మనసు - కామములం జొరనీక నిత్య మ
త్పరుcడయి యింటనుండియును - దానెదియంటక కాంచు మోక్షమున్557

తే.గీ. నన్నె నెఱ నమ్మి తన జీవ - నంబు కొఱకు
గష్టపడు బ్రాహ్మణునినేమి - గడవబెట్టు
వారి వార్నిధినుండి నా - వై వలె నేను
నాపదలు వాపి రక్షింతు - నచిరముగను. 558

తే.గీ. బుద్ధిcగొని మానసేంద్రియం - బులను నిలిపి
గజముల గజేంద్రు నట్లు త - న్గాcచికొనుచుc
దంద్రి బిడ్డలనుం బలె - ధరణినాథుc
డాపదలు వాపి ప్రజలcc గా - పాడవలయు. 559

ఆ.వె. ఇట్లుసేయు నృపతి - యిచటcదాc జేసిన
పాపమెల్లc బాసి - భానునట్లు
తేజరిల్లుచుండు - దివ్యవిమానంబు
నెక్కి యేcగి యలరు - నింద్రుతోడ. 560

సీ. జీవనంబునకుc గ - ష్టించు విప్రుcడు సురా
లవణాది వర్జిత - వివిధవస్తు
తతి నమ్మికొనియైనc - దరవారిcగొని క్షాత్ర
వృత్తిచేనైన జీ - వింపవచ్చు
గైకొనవచ్చును క్షత్రియుం డాపద
వైశ్యవృత్తినొ వ్యాధ - వర్తనమునొ

యధ్యాపనాదికం - బగు విప్రవృత్తినో
కూడదు నీచులఁ - గొల్చుటెపుడు
తే.గీ. శూద్రవృత్తిఁ జరింపఁ వై - శ్యునకుఁజెల్లు
శూద్రునకును బ్రతిలోమజ - క్షుద్రజాతి
వృత్తి నాపదయందుఁజ - రింపఁ బాడి
ధర్మములె యగు నివి విప - త్కాలమందు. 561
క. ఆపద గడువన్ వైశ్యుఁడు
నీపగిదిన్ నింద్యకర్మ - మే వృత్తికి ని
త్యోపాయముగాఁ గొనరా
దోపిన యట్లాత్మధర్మ - మూనఁగ వలయున్. 562
సీ. బ్రహ్మయజ్ఞంబుచేఁ - బరమర్షులను స్వధా
కారంబుచేఁ బితృ - గణమునెల్ల
స్వాహా యనుచు దేవ - వర్గమున్ బలిహర
ణంబుచే భూత సం - తానమెల్ల
నన్నోదకాదుల - నఖిలమానవులను
మద్రూపములుగ నా - త్మను దలంచి
యనుదినంబును గల - యంత విత్తముతోడఁ
దనుపఁగావలె గృహ - ధర్మపరుఁడు
తే.గీ. దనకు లేకున్న దైవల - బ్ధంబొ శుద్ధ
ధర్మసంచితమో యైన - ధనముతోడఁ
బోష్యవర్గంబు నొప్పిని - బొరయకుండ
నాకుఁ బ్రీతిగఁ గ్రతువులు - నడుపవలయు. 563
మ. ధనదారాదులయందు సంగ ముడుగున్ - ధర్మంబులన్ జేయుచు
న్నను మన్నిష్ఠను నేమఱండు మతిలో - నన్ సద్విచారంబు స
ల్పి నిజం బేర్పడ నిందు దృష్టములపో - ల్కి న్నశ్వరంబుల్ పరం
బున సౌఖ్యంబు లటంచుఁ జూచి విరతిం-బొందున్ గృహస్థుండిలన్. 564

తే.గీ. పుత్త్రదారాప్త బంధు సం - భూతి పాంథ
సంగమముఁ బోలు దేహంబు - సన్నయపుడు
పాయు నిదియెల్ల నిద్దుర - వచ్చినపుడు
కలవలె నటంచు మదిలోనఁ - దలఁపవలయు. 565

తే.గీ. అనుచు సద్యుక్తిచే విమ - ర్శన మొనర్చి
నేను నాయది యనుటను - మాని యతిథి
యట్టు లింట వసించుచు - నచటివారి
యంటు లేకుండ మెలఁగు గృ - హస్థుఁ డెందు. 566

ఆ.వె. భక్తిగలిగి చేయ - వలసిన కర్మముల్
నాకుఁ బ్రీతిగా నొ - నర్చుచుండి
యింటనుండు వనము - నేనిఁ బ్రవేశించు
సంతు గలిగెనేని - నన్న్యసించు 567

ఆ.వె. అట్లుగాక గేహ - మందెవ్వఁడాసక్తి
గలిగి పుత్త్రవిత్త - కాంక్షఁ దగిలి
స్త్రీ ప్రసక్తుఁడగుచు - దీనుఁడౌ నామూఢుఁ
డేను నాది యనుచు - నింటఁ జిక్కు 568

సీ. తల్లిదండ్రులు ముదు - సళ్ళు నా కయ్యయో
ప్రేయసి యిది పసి - బిడ్డ తల్లి
బిడ్డ లనాథులు - వీరు నేఁ బోయిన
వెనుక దుఃఖమున జీ - వింతు రెట్టు
లనుచు నిట్లు గృహాశ - యాక్షిప్త చిత్తుఁడై
యాతఁడైహిక సుఖా - తృప్తుడగుచు
దదనుబంధములనే - ధ్యానించుకొనుచు మృ
త్యుగ్రస్తుఁడై మేను - దొఱఁగి చనిన

తే.గీ. శమనకింకరు లతని సం - యమనిఁ జేర్తు
రచట దండితుఁడై యాతఁ - డవనియందు

మూఢ తిర్యగ్జడాదులఁ - బుట్టుగిట్టు
నిది యభక్తులు దుర్గతి - కేఁగు తెఱఁగు. 569

వ. అని మఱియు శ్రీకృష్ణదేవుం డిట్లనియె 570

-: వానప్రస్థ ధర్మ వివరణము :-

సీ. వనముఁ బ్రవేశింప - మనసు గల్గిన వాఁడు
భార్యను పుత్త్రుల - పాలవిడచి
యైననుఁ దనవెంట - దానిఁ దోడ్కొని యైన
వని కేఁగి శాంతుఁడై - తన తృతీయ
భాగమౌ నాయువు - పర్యాప్త మగు దాఁక
వ్రతముతో వసియింప - వలయునందె
వృత్తి వన్యములుఁ బ - విత్రంబులౌ కంద
ఫలమూలముల నడు - పంగవలయు

తే.గీ. నారచీరలొ తృణమొ ప - ర్ణములొ జింక
చర్మమో కట్టుకొనఁదగు - శ్మశ్రు రోమ
కేశ నఖములఁ బెంచనౌ - గిల్లరాదు
పండ్లుదోముట శౌచంబు - వలవ దపుడు. 571

తే.గీ. మూఁడు కాలములను నీట - మునుఁగవలయు
నేలనె పరుండవలె నెండ - కాలమందుఁ
బంచవహ్నులఁ గ్రాఁగనౌ - వానకాల
మైన తఱి జడివానల - నానవలయు. 572

క. చలితతఱి నాకంఠంబుగ
జలములలో మునిఁగియుండఁ - జను నోరుపుతో
నిల నిదివానప్రస్థుం
డలవడఁగాఁ జేయఁదగిన - యట్టి తపమగున్. 573

ఆ.వె. అడవినుండి తెచ్చి - యగ్నిపక్వముఁ జేసి
యైనఁ గాలపక్వ - మైన వైన

భోజ్య మేధ్య వస్తు -వుల భుజింపగఁ నగు
నొంటిపూట నడవి - నుండు తపసి. 574

ఆ.వె. రోల దంచియైన - ఱాల నూరినవైన
నోఁట గొఱికియైన - నీటి వడ్లు
తండులములు సేసి - వండి భుజింపఁగా
వలయు నడవినుండు - వ్రతమునందు. 575

ఆ.వె దేశకాల బలముఁ - దెలిసి వానప్రస్థుఁ
డాత్మ జీవనార్థ - మైన సకల
వస్తువులను దానె - వనినుండి తేవలె
నెపుడొ తెచ్చినవి గ్ర - హింపఁ జనదు. 576

ఆ.వె. అప్పు డపుడుఁజేయ - నైన యాగ్రయణాది
విధుల విపినవస్తు - వితతి ఁజేయు
నన్నముననుఁ బిండి - న న్నుపాసింపనౌ
శ్రౌత పశువుఁ బట్ట - రా దతండు. 577

ఆ.వె. అతఁడు దొంటియట్లె - యగ్న్యుపాస్తిని దర్శ
పూర్ణి మేష్టి యుగ్మ - మును జరింప
వలయు నాల్గునెలల - వ్రతమును నైగమి
కోక్తవిధులఁ జేయు - చుండవలయు. 578

తే.గీ. ఇట్లు తప మొనరించుట - నెవనిమేను
నరము లేర్పడున ట్లెండి - నవయు నతఁడు
ననుఁ దపోమయుఁగాఁ గొల్చు - టను గ్రమంబు
నన్మహర్లోక పథమున - నన్నుఁ జేరు. 579

తే.గీ. తనకు మోక్షదమును మహ - త్తరము నైన
యట్టి కష్టతపంబు ని - కృష్ట కామ
ఫలమయిన పుణ్యలోక సం - ప్రాప్తి కొఱకు
వ్యయపఱచువాఁడు కోపనుం - డైన జడుఁడు. 580

ఆ.వె. అంత ముదిసి వణఁకు - నపుఁ డీ వనాశ్రమి
నియమములను జరుప - నేరఁడేని
నగ్నులాత్మయందు - నారోపణము సేసి
ననుఁ దలంచుకొనుచు - ననలుఁ జొచ్చు. 581

సీ. కానిచో నాతఁడు - గర్మ విపాకముల్
లోకంబు లధిక దుః - ఖాకరంబు
లని సువిరక్తిఁ జెం - దిన నగ్నులను మాని
శీఘ్రుంబుగా నన్న్య - సింపవలయు
నది యెట్టులన్న శ్రా - ద్ధాష్టకం బొనరించి
వెనుకఁ బ్రాజాపత్య - మనెడు నిష్టి
నాకు నిష్టముగా నొ - నర్చి ఋత్విజులకుఁ
దనదు సర్వస్వ మ - ర్పణము సేసి

తే.గీ. యగ్నులను దన ప్రాణమౌ - నాత్మఁ జేర్చి
యందు నహమాదికము వేల్చి - యవలఁ గోర్కు
లన్నియును మాని మత్పరుం - డై సుఘోషఁ
బ్రేష మ్ముమ్మాఱు నతఁ డుచ్చ - రింపవలయు. 582

ఆ.వె. సన్న్యసింపఁబోవు - సద్విప్రుఁ జూచి భా
ర్యాదిరూపు లగుచు - నమరులెల్ల
మనల మించి వీఁడు - సను బ్రహ్మమును జేర
ననుచుఁ జెఱుతు రతని - యత్నమెల్ల. 583

-: సన్న్యాసి ధర్మ నిరూపణము :-

ఉ. గోఁచియె గాక యింక నొక - గుడ్డ ధరింపఁగ నిచ్చగల్గినన్
గోఁచిని దాఁచునంతవఱ - కున్‌యతి సుట్టఁగవచ్చుఁ దన్నుఁ దా
గాచికొనం గమండలువుఁ - గఱ్ఱను మాత్రము చేకొనం దగున్
ద్రోచిన వింక నేవియు య - తుల్మతికై కొనరా దనాపదన్. 584

తే.గీ. చక్కఁగాఁ జూచి పద ముంచ - జనును ధరణి
వలువఁ దేర్చిన నీరు ద్రా - వంగవలయు
నరసి నిక్కపు మాటల - నాడవలయు
సరిగ మన సొప్పు పనులను - సలుపవలయు 585

తే.గీ. కలఁకలేని మౌనంబు వా - గ్దండమగును
తాఁ గదలకుంట శారీర - దండ మనిల
నియమనంబు మనోదండ - మయినది యివి
లేక యతియౌనె వేణు దం - డైక భృతిని. 586

సీ. నాల్గు వర్ణములలో - ననుఁ బూర్వములఁ జిక్క
దేనిఁ బరంబులౌ - వానియందు
నభిశస్తపతిత గ - ర్హ్య గృహంబులను మాని
మున్ను విచారింప - కున్న యిండ్ల
నేడింట సన్న్యాసి - యెత్తనౌ భిక్షంబు
నెంత చిక్కిన నంతఁ - దృప్తుఁడగుచు
నూరికి వెలుపల - నీరుండు చోటికి
నరిగి జలస్పర్శ - మాచరించి

తే.గీ. మౌనియై ప్రోక్షణాదుల - దాని శుద్ధ
ముగ నొనర్చి హరిబ్రహ్మ - పూష భూత
ములకుఁ బాల్లిచ్చి శిష్టాన్న - భుక్తి సల్పఁ
దగు నతం డం దొకింతయు - మిగులకుండ. 587

సీ. ధీరుఁడై యీభూమిఁ - దిరుగఁగావలె యతి
యొంటిగా సంగంబు - నుడిగి యింద్రి
యంబుల నియమించి - యాత్మ సంతుష్టుఁడై
యాత్మమాత్ర క్రీడ - నవశుఁ డగుచు
సర్వభూతంబుల - సమదర్శనము గల్గి
శాంతుఁడై నిర్మల - స్వాంతుఁడగుచు

భీ రహితంబును - విజనమౌ నెడ నిల్చి
భావంబు మద్భక్తి - భాజనముగ
ఆ.వె. భిన్నములుగఁ దోఁచు - విషయంబులందు న
భిన్ను నేకరూపు - నన్నుఁ జూచి
యద్వితీయ సంత - తానంద మగ్నుఁడై
మహిత వృత్తి వెలుపు - మఱపులేక. 588
తే.గీ. ఇంద్రియంబులు రేఁగిన - నెసఁగు బంధ
మవి యడంగిన మోక్షమౌ - నని యతండు
బంధ మోక్షంబు లాత్మకుఁ - బరగుచుంట
జ్ఞాననిష్ఠనుజేసి కాం - చంగవలయు. 589
తే.గీ. కాంచి కామాది శత్రు వ - ర్గము నడంచి
కోరికల నన్నిటను విర - క్తుండు మహిత
పరమ సుఖలబ్ధి సంతుష్ట - భావుఁడగుచు
నను దలంచుచు సంచరిం - పనగు మౌని. 590
సీ. పుణ్యదేశంబులఁ - బుణ్యనదుల్ భూరి
శైలంబు లడవు లా - శ్రమములుండు
ధరణి యతీంద్రుండు - దిరుగు భిక్షార్థమై
పట్టణంబులకును - బల్లియలకు
గోష్ఠంబులకు యాత్రి - కులు నిల్చుచోట్లకుఁ
బోవు వానప్రస్థ - మునుల భిక్ష
శిలవృత్తిచే నుపా - ర్జిత మౌట నది మోహ
ముడిపి సత్త్వవిశుద్ధి - నొసఁగుఁగాన
తే.గీ. బలుమఱును వారి భిక్షకై - వనుల కేఁగు
దృశ్యమౌ నీ జగంబెల్ల - నశ్య మగుట
వస్తుభావంబుతో దాని - వలను జూడ
రాత్మలో నెంచు మాయామ - యంబుగాఁగ. 591

క. ఎందును జిత్తముఁ జేర్పక
యిందును బరలోకమందు - నెందుల కెది సే
యం దివురక నిస్పృహతయె
డెందంబునఁ గదుర నొక్కఁ - డే తిరుగు ధరన్. 592

సీ. వాక్ప్రాణమానస - వర్గంబుతోఁగూడి
నాయది యనఁబడు - నీయఖిలము
నేననంబడుచుండు - మేనును దీనిచేఁ
గలుగుచునుండు సు - ఖంబు గూడ
సర్వంబు నరయఁగా - స్వప్న తుల్యంబు మా
యామాత్రమని మనం - బందు లెస్స
గా విమర్శించి త్యా - గ మొనర్చి స్వస్థుఁడై
మఱల దానిని దలం - పఁడు యతీంద్రుఁ

ఆ.వె. డెవఁడు బాహ్యవిషయ - సువిరక్తుఁడై ముక్తిఁ
గోరు నతఁడుగాని - కోర్కి లేక
నాకు భక్తుఁడైన - యేకాంతిగాని స్వ
నిష్ఠ నిశ్చలముగ - నిలిచినపుడు. 593

క. తడయక సచిహ్నములుగా
విడుచు సమస్తాశ్రమముల - విధికింకరుఁడై
నడుపఁడు ధర్మము లవశత
నడుచు నసంగత్వమున మ - నశ్శుద్ధిమెయిన్. 594

వ. మఱియు నతండు. 595

తే.గీ. విజ్ఞుఁడయ్యును గ్రీడించు - నజ్ఞునట్లు
నిపుణుఁడయ్యును జడుని య - ట్లెపుడుఁదిరుగుఁ
బండితుండయ్యు నున్మత్తు - పగిదిఁ బలుకు
వైదికుండయ్యును నటించుఁ - బశువు మాడ్కి 596

సీ. కర్మకాండమున వ్యా - ఖ్యానముల్సలుపఁడు
వేదాంతచింతఁగా - వించుఁగాని
శ్రుతికిని స్మృతికి వి - రుద్ధమౌ పద్ధతి
నడువఁడు తగినట్లు - నడుచుఁగాని
కేవల తర్క వా - దావర్తగతుఁడు గాఁ
డనుగత శ్రుత్యర్థుఁ - డగును గాని
శుష్కవాదవివాద - శూరుఁడై నిష్ప్రయో
జన గోష్ఠి నెవరి ప - క్షమును గొనఁడు
తే.గీ. కలఁగఁ డెవ్వరిఁ గని యేరిఁ - గలఁకపఱుపఁ
డెవరు తన దూరుచున్న స - హించు నియమి
యెవరి కపమతి సేయఁ డొ - క్కింతయేని
ధీరుఁడై నిస్తరంగాబ్ధి - తీరుఁదాల్చు. 597

చ. తనువులటంచు భూతములఁ - దాఁ గనుగొన్నపు డవ్వి వాని కా
రణత నొకండె యౌటఁగని - రంజిలు వానిని నాత్మదృష్టిచేఁ
గని నపుడున్ బయోగత వి- కారము లొంది బహుత్వభాసియై
కనఁబడు చంద్రున ట్లొకటి - గాఁ గను వైరముసేయఁ డేరితోన్. 598

క. ఒక్కొకతఱిఁ దన కన్నము
చిక్కకపోయిన గలంగి - చింతిల్లఁ దతం
డెక్కువ చిక్కిన నుబ్బఁడు
చిక్కుట చిక్కమియు దైవ - చేష్టిత మనుచున్. 599

తే.గీ. తత్త్వ మెఱిఁగిన మోక్ష మొం - దంగవచ్చు
నాయెఱుక గల్గును విమర్శ - నదియుఁ బ్రాణ
ధారణంబున నగుఁ గాన - దానిఁ దాల్ప
యత్న మొనరింపవలయు నా - హారమునకు. 600

తే.గీ. దైవవశమున శ్రేష్ఠమో - తదితరంబొ
తనకుఁ జిక్కిన యన్నంబుఁ - దినఁగవలయు

నట్లె సంప్రాప్తమౌ తావు - నైన శయ్య
నైనఁ గొని తృప్తిఁ బొందఁగా - నౌను మౌని. 601

సీ. శౌచ మాచమనంబు - స్నానంబు మఱియు న
న్యములగు నియమముల్ - జ్ఞాననిష్ఠ
కవిరోధములుగ న - నాసక్తి నీశ్వరుం
డైన నావలెఁ జేయ - నగును జ్ఞాని
విధిచోదితము లని - వేద కింకరుఁడయి
చేయరా దవి నిష్ఠఁ - జెఱుచుకొనుచు
భేదప్రతీతి న - న్వీక్షింప మానెఁగా
వున నది మఱల నా - తనికి రాదు

తే.గీ. వచ్చెనేనియు నది తోఁప - వచ్చు దేహ
పాత పర్యంత మెప్పుడైన - ఖ్యాతిమాత్ర
నంత దేహంబు వాలిసిన - నతఁడు నన్నుఁ
గలియు నద్వయ చిన్మయా - కారుఁ డగుచు. 602

వ. కావున. 603

ఆ.వె. బుద్ధిశాలి దుఃఖ - ములఁ దెచ్చు కామభో
గముల విసివి నన్నుఁ - గలియు సాధ
నముల నెఱుఁగకున్నఁ - గ్రమముగా గురునిఁ జే
రంగవలయు దృఢ వి - రక్తి తోడ. 604

ఆ.వె. అపుడు గురుఁడు దన్ను - నాదరించి గ్రహింప
గురుని నన్నుగానె - కొలువవలయు
శ్రద్ధతో నసూయ - రానీక ప్రాజ్ఞుండు
బ్రహ్మ మెఱుఁగుదాఁక - పట్టుగలిగి. 605

మ. అరిషడ్వర్గము గెల్వలేక విషయా - త్యాసక్త దుర్బుద్ధియై
విరతి జ్ఞానవిహీనుఁడైన యతి కా - వేషంబు జీవింప నా

దరువౌ వంచనసేయువాఁడు సురలన్ - దన్ దేహగు న్నన్ను ధ
ర్మరతి న్వాసి యపక్వ దుష్టుఁడయి చే - రం డందు నిం దెందునన్606

తే.గీ. శమమును సహింస యతికి ధ - ర్మములు దపము
మన్నిరీక్షయు వనవాస - మున్నతనికి
భూతరక్షయు యజ్ఞంబు - సేఁత గృహికి
ద్విజున కాచార్యసేవయు - వేదవిధులు. 607

సీ. బ్రహ్మచర్యంబు ద - పంబు శౌచంబును
సంతోషమును భూత - సౌహృదంబు
ఋతువున నిజదార - రతియు వైరాగ్యంబు
సర్వభూతముల మ - త్సామ్యసేవ
యను నివియెల్ల గృ - హస్థున కధికంబు
లగు ధర్మము లటంచు - నరసి యెఱిఁగి
నన్ను భజించు న - నన్యభక్తి నెవండు
నిజధర్మనిష్ఠుఁడై - నిరత మతఁడు

తే.గీ. సర్వభూతములందునన్ - సమతఁజూచి
నాదు సద్భక్తి వేగ పొం - దంగ నేర్చుఁ
గల్పవృక్షంబు నాయందుఁ - గలుగు భక్తి
యది యెవని కేమి యియ్యఁ జా - లదు ధరిత్రి. 608

తే.గీ. సర్వలోక మహేశ్వరు - సర్వసర్గ
రక్షణాప్యయములకుఁ గా - రణమునైన
బ్రహ్మమగు నన్ను నుద్ధవా! - పాయకుండు
భక్తిచేతనె చేరఁగా - వచ్చు నతఁడు. 609

మ. తనధర్మంబొనరించి సత్త్వము విశు - ద్ధంబౌట నెవ్వాఁడు మ
ద్వీను త్రైశ్వర్యమెఱింగి జ్ఞానయుతమౌ - విజ్ఞానమున్గల్గి యెం
దును వైరాగ్య మెసంగ నీధరణి యం - దుం బొల్చు నాతండె స
య్యనఁ జేరుం బరమాత్మనౌ నను విధూ - తాశేషసంకల్పుఁడై. 610

క. ఇది వర్ణాశ్రమవంతుల
కుదితం బాచారమనఁగ - నొప్పెడు ధర్మం
బిదె మద్భక్తియుతంబై
పొదలును మోక్షంబొసంగ - ముఖ్యంబగుచున్. 611

తే.గీ. నరుఁడు నిజధర్మమొనరించి - నాకు భక్తుఁ
డగుచు మత్పదమును జేర - నర్హుఁడగుట
యెట్లొ యావివరంబు నీ - కెఱుఁగఁ బలికి
నాఁడ నుద్ధవ! నీదు ప్ర - శ్నమున కమర. 612

వ. అని యిట్లు యుక్తి తర్కంబులచే జగన్మిథ్యాత్వం బెఱింగిన వానికి స్వానుభూతి ప్రభావంబున దిగ్భ్రమంబు నివర్తించు తెఱంగున జగంబాత్మయందు లీనంబగు పర్యంతంబును జ్ఞాననిష్ఠయనుష్ఠేయంబుగా నుపదేశించి భగవంతుడు జ్ఞాన సన్న్యాస ప్రకారం బెఱింగించువాఁడై యుద్ధవునింగని సాదరంబుగా నిట్లనియె. 613

సీ. గాఢ తార్కిక పరో - క్ష జ్ఞానమునఁ దృప్తి
పడక యాచార్యుల - వలన విన్న
యర్థంబు స్వానుభ -వైక సిద్ధముగాఁగఁ
బ్రాప్తాత్మతత్త్వుఁడై - నట్టి విజ్ఞుఁ
డగపడు జగము మా - యా మాత్రమగు రజ్జు
సర్పంబువలె నని - జ్ఞానమొంది
యాజ్ఞానమును దాని - కగు సాధనంబుల
శాస్త్రశాస్త్రాదుల - సంత్యజించి

తే.గీ. కేవల పరాత్మనిష్ఠుఁడై - భావమందు
నన్నె గాకన్య మెంచక - యున్న యతఁడు
ధన్యుఁడీభువి నిదియె వి - ద్వాంసుఁడగుచుఁ
జేయు సన్న్యాసమందురు - శిష్టజనులు. 614

ఉ. జ్ఞానికి నేనె యిష్టుఁడఁ బ్ర - శస్త చతుర్విధపూరుషార్థముల్
నేనె తదాప్తి సాధనము - నేనె త్రివిష్టపమున్ విముక్తియున్
నేనె మదన్య మాతనికి - నిక్కముగా నొక కృత్యమేనియున్
దాని ఫలంబు ప్రాప్యమును - ధారుణి లేదు ప్రియంబు నిష్టమై. 615

తే.గీ. జ్ఞానవిజ్ఞాన సంపన్ను - లైన ఘనులు
తెలియుదురు శ్రేష్ఠమైన నా - నెలవు నరసి
జ్ఞానమున వాఁడు నను౯ బట్టఁ - జాలుఁగాన
జ్ఞాని యిట నాకుఁ బ్రియతముఁ - డైనవాఁడు. 616

తే.గీ. జ్ఞానలేశంబుచేఁ బొంద - నైన యట్టి
యధికమగు శుద్ధినరునకు - నబ్బదెట్టి
తపములను దీర్ఘయాత్రల - జపవిధులను
దానముల నింక నన్య స - త్కర్మములను. 617

తే.గీ. కాన నుద్ధవ! నీవును - జ్ఞానయుతుఁడ
వగుచు స్వాత్మ నెఱింగి య - న్యంబు వదలి
జ్ఞాన విజ్ఞాన యుతుఁడ వై - నను భజించు
మయ్య నిర్వ్యాజభక్తి నా - యందుఁ గలిగి. 618

తే.గీ. సకల యజ్ఞంబులను నధీ - శ్వరుఁడనైన
నాకుఁ బ్రీతిగ జ్ఞాన విజ్ఞాన యజ్ఞ
మందు మనమును దమబుద్ధి - యందు వేల్చి
మునులు సంసిద్ధులై నన్నె - పొందఁగనిరి. 619

సీ. నిను నండగొని మనం - బుననుండు నాధ్యాత్మి
కాది వికారత్ర - యాత్మకమగు
తను విదే మాయ మ - ధ్యను దోఁచు నున్నట్లు
మొదలను దుదను లే - దిది యసత్తు
జననాదు లీ దేహ - మునకుఁ గల్గినతఱి
నవి లే వధిష్ఠాత - వైన నీకుఁ

దనువసత్తొటను - జననాదు లద్దాని
కేనియు లే వది - యెట్టు లనిన
తే.గీ. మొదలఁ దుద నేది యగు నస - త్తది యసత్తె
యగు నడుమ రజ్జుసర్పంబు - నట్టు లేది
తుద మొదల సత్తు మధ్యమం - దు నది సత్తె
రెంటికిని జననాదివి - క్రియలు లేవు. 620
ఆ.వె. కాన నీవు నిర్వి - కారుండ వజుఁడవు
బ్రహ్మ మీవె యుద్ధవా! యటన్న
జ్ఞాన నిష్ఠయందు - స్థైర్యంబుఁగోరి యి
ట్లనియె నుద్ధవుఁడు జ - నార్దనునకు. 621
సీ. ఇప్పుడు నా కీవు - సెప్పిన విరతి వి
జ్ఞాన యుతంబు స - నాతనంబు
నైన జ్ఞానమను బ్ర - హ్మాదులు వెదకు త్వ
ద్భక్తి యోగమును వి - స్తరముగాఁగ
తేటయౌనట్లుగాఁ - దెల్పు విశ్వేశ్వర!
విశ్వమూర్తీ!భవ - భీమమార్గ
మందుఁ దాపత్ర యా - హతుఁడు సంతప్తుఁడౌ
వానికి నీపద - ద్వయమె గొడుగు
తే.గీ. నమృతవర్షంబు గాని వాఁ - డాశ్రయింపఁ
దగిన దిఁక నేదియును లేదు - తచ్ఛ్రమంబు
వాపి సౌఖ్యం బొసంగ ని - ర్వాణ సుఖద
భక్తరక్షక పరమేశ - పరమపురుష. 622
ఉ. కూలితి జన్మమృత్యు మయ - కూపమునం దిట నన్నుఁబట్టి యీ
కాలమహాహియుం గఱచెఁ - గాని నికృష్ట సుఖాశమానఁగాఁ
జాలక చిక్కినాఁడ దయ - సాలఁగఁ గల్గి మహానుభావ న
న్నేలుము ముక్తిబోధక సు - మృష్ట వచస్సుధఁ జిల్కి నాపయిన్. 623

క. అని యుద్ధవుండు వేఁడిన
వినిభగవంతుఁడు దయార్ద్ర - విశదహృదయుఁడై
యనె నాతని మనమునఁగల
యనుమానము వాసి నిశ్చ - యము గలుగంగన్. 624

సీ. ఆ ఘోర భారతా - హవ మైన పిమ్మట
నాప్తులఁ జంపుట - కాత్మఁగలఁగి
ధర్మ తనూజుండు - ధర్మవి న్ముఖ్యుని
భీష్ముని మేమెల్ల - వినుచునుండ
నీ యట్లె యడిగి శాం - తి నతండు సెప్పఁగా
వివిధ ధర్మంబులు - విని ముముక్ష
మోక్షధర్మములఁ జె - ప్పుమటంచు వేఁడిన
నతఁ డాతనికిఁ జెప్పె - నవ్వియెల్ల

తే.గీ. శ్రద్ధ భక్తియు జ్ఞాన వి - జ్ఞానములు వి
రక్తి యనువాని లెస్స ని - ర్ణయము సేయు
మాట లవి నేను భీష్ముని - నోట వింటి
నవి యిపుడు నీకుఁ జెప్పెద - నయ్య వినుము. 625

సీ. పంచ తన్మాత్రముల్ - ప్రకృతి పూరుష మహ
త్తులు నహంతయు నను - దొమ్మిదియును
మనసుతోఁ బదునొకం - డును నింద్రియములు మ
హా భూతములగు పృ - థ్వ్యాదు లైదు
గుణములు మూఁడును - గూడి యేర్పడును బ్ర
హ్మాది స్థిరాంత దే - హంబు లనియు
నీ దేహములయందు - నెల్లను నంటక
యొక్కఁడే పరమాత్మ - యుండు ననియుఁ

తే.గీ. గార్య కారణ మయమౌ జ - గంబు దత్ప
రంబయిన కేవలాత్మ మా - త్రంబ వేఱు

గాదనియు దేనిచేఁ జూడఁ - గలుగు నదియె
జ్ఞానము సునిశ్చితంబని - నామతంబు. 626
ఆ.వె. ము న్ననేకములుగఁ - బొడకట్టుచుండిన
వాని నట్లు గనుట - మాని పరమ
కారణైక దృష్టి - గలిగిన తటిని వి
జ్ఞానమంద్రు జ్ఞాన - సంజ్ఞితమునె. 627
సీ. గొనములు మూఁటఁ బు - ట్టిన వౌట సావయ
వంబులై యుండు భా - వముల నెల్లఁ
బుట్టుట నుండుటఁ - బొలియుట నెయ్యది
యనుగతం బగునొ కా - రణత నొంది
నిరవయవం బయి - నిలుచు నెయ్యది వాని
యందుఁ బుట్టెడు వాని - యందుఁ గూడ
నవి యన్నియు నశించి - నంత నే యొక్కటే
నిర్వికారం బయి - నిలిచి యుండుఁ
తే.గీ. గార్యములు లేక యున్నట్లు - కానఁ బడుటఁ
గారణ విభిన్న వస్తువు - ల్గావుగానఁ
గారణత్వము లేని యా - కారణంబె
కార్య కారణ భిన్న మే - కమగు సత్తు. 628
సీ. ఇందు నానాత్వ మొ - క్కింతయు లేదను
దివ్య వాణియె యౌ శ్రు - తి ప్రమాణ
మఖిల ఘటాది కా - ర్యంబు మృదాది కా
వ్యతిరిక్త మనుట ప్ర - త్యక్షమగును
వ్యాసాదులైన మ - హాత్ములు నరులకుఁ
దెలిపిన యదియె యైతిహ్య సంజ్ఞ
జగ మిది మిథ్య దృ - శ్యంబౌట రజ్జుహి
మాడ్కి నన్నది యను - మాన మనఁగ

తే.గీ. యీ ప్రమాణము ల్నాల్గిట - నీ జగంబు
సత్యమనెడి వికల్పంబు - సరగ మాపి
నిత్య సత్యాత్మ మాత్ర దృ - ఙ్నియతి నరుఁడు
దృశ్య సువిరక్తుఁ డగుట ని - శ్శ్రేయసంబు. 629

తే.గీ. దృష్టసుఖ మూర్వినట్లె య- దృష్ట సుఖము
బ్రహ్మలోకము దాఁక స - ర్వత్ర వివిధ
కర్మ పరిణామ మమిత దుః - ఖం బమంగ
ళంబు నశ్వరమని బుధు - ల్దలఁప వలయు. 630

తే.గీ. అనఘ మద్భక్తిఁ బుట్టించు - నట్టి భక్తి
యోగమును మున్నె నేఁ జెప్పి - యున్న వాఁడ
బాగుగా విన ముచ్చట - పడుచు నుండు
నీకు నిదె దాని మఱల వ - ర్ణింతు వినుము. 631

వ. మత్కథామృత శ్రవణంబున నత్యంతాదరంబును శ్రుత కథా వ్యాఖ్యానంబును మత్పూజా పరినిష్ఠయు దివ్యస్తుతులచే నన్ను సన్నుతించుటయు మత్పరిచర్యాదరంబును నాకు సర్వాంగాభివందనం బొనర్చుటయు నా భక్తజనంబులకు నభ్యధిక పూజ సేయుటయు సర్వభూతంబులను నన్నుగాఁ దలంచుటయు లౌకిక క్రియారూపంబగు శారీరచేష్ట నాకొఱకే చేయుటయు లౌకికవాక్కులచే నాగుణంబుల వర్ణించుటయు మనంబు నాకు సమర్పించుటయు సర్వకామ విసర్జనంబును మద్భజనార్థంబుగాఁ దద్విరోధియగు నర్థంబునుస్త్ర్యాదిభోగంబులను బుత్త్రోపలాలనాది సుఖంబులను ససాధనంబులుగాఁ బరిత్యజించుటయు మదర్థంబుగా నిజ్యాదాన హోమ వ్రత తపశ్చర్యాదులొనర్చుటయు నను నిట్టి ధర్మంబులచే నుద్ధవా! మానవులాత్మ నివేదనం బొనరించిన నాయందలి ప్రేమలక్షణంబగు భక్తి గలుగు ననిన నిఁక నేమి కొఱఁత. అంతర్బహిర్నిష్ఠార్థానర్థ కారణంబగు చిత్తంబు సత్త్వవృత్తి ప్రధానంబై శాంతంబై యీశ్వరుండనగు నాకెప్పు డర్పితంబగు నప్పుడ పురుషునకు ధర్మ జ్ఞాన వైరాగ్యైశ్వర్యంబులు గలుగు.

అట్లుగాక చిత్తంబెప్పుడు వికల్పరూపంబగు దేహగేహాదికంబునం దర్పితంబై యింద్రియంబుల వెంటం బరిభ్రమించు నప్పుడది యసన్నిష్ఠం బగుటం బురుషు నధర్మాజ్ఞానాది భాజనం బొనర్చు. మద్భక్తికరణంబు ధర్మంబనియు నేకాత్మదర్శనంబు జ్ఞానంబనియు గుణసంగంబులేమి వైరాగ్యంబనియు నణిమాదికంబైశ్వర్యంబనియుం జెప్పం బడునని భగవంతుం డానతిచ్చిన విని యుద్ధవుండు భగవత్కృత ధర్మాది వ్యాఖ్యానంబున కచ్చెరువొంది యిట్లను. దేవా!యమంబును నియమంబును నెన్ని విధంబులు శమంబును దమంబును దితిక్షయు ధృతియు దానంబును దపంబును శౌర్యంబును సత్యంబును ఋతంబును శౌచంబును ద్యాగంబును నిష్టంబగు ధనంబును యజ్ఞంబును దక్షిణయు నను వీని లక్షణంబు లెవ్వి. మఱియుం బురుషునకు శ్రేష్ఠంబగు బలం బెయ్యది. భాగ్యంబును నుత్తమంబగు లాభంబును విద్యయు హ్రీయు నాభరణంబును నెవ్వి. సుఖదుఃఖంబు లననేవి. పండితుం డెవఁడు. మూర్ఖుండెవ్వఁడు. సన్మార్గంబును నున్మార్గంబును నేవి. స్వర్గనరకంబు లెయ్యవి. బంధువెవ్వఁడు. గృహమేది. ఆఢ్యుం డెవ్వఁడు. దరిద్రుఁ డెవఁడు. కృపణుం డెవ్వండు. విపర్యయుం డెట్టివాఁడు. సాధువులకెల్లను నేడు గడయగు నో మహాత్మా! మహాజన ప్రసిద్ధంబులగు ధర్మాదులయందుంబోలె నీప్రశ్నార్థంబులయందును నేదేని వైలక్షణ్యంబు గలదో యను నా సంశయంబు నివారింపవే యని ప్రార్థించిన శ్రీకృష్ణదేవుండిట్లనియె. ఉద్ధవా! విను మహింసయు సత్యంబును నస్తేయంబును నసంగంబును హ్రీయు నసంచయంబును నాస్తిక్యంబును బ్రహ్మచర్యంబును మౌనంబును స్థైర్యంబును క్షమయు నభయంబును బాహ్యశౌచంబును నంతశ్శౌచంబును జపంబును దపంబును హోమంబును శ్రద్ధయు నాతిథ్యంబును మదర్చనంబును దీర్థాటనంబును బరార్థప్రవృత్తియు దుష్టియు నాచార్యాసేవనంబును నను నివి వరుసగా నివృత్తపురుషముఖ్యంబులగు యమంబులు పండెండ్రును బ్రవృత్తపురుషముఖ్యంబులగు నియమంబులు పండెండ్రునునై యుండు. ఇవి తమ్ముపాసించు నరులకు నభ్యుద

యాపవర్గంబుల యథాకామంబుగా నొసంగు. మహాజన ప్రసిద్ధంబులగు శమాదుల నీవెఱుఁగుదు వింకఁ దద్విలక్షణంబుల నీకెఱిఁగింతు విను మెట్లనిన శమంబన మన్నిష్ఠితంబగు బుద్ధిగాని శాంతి మాత్రంబుగాదు. దమంబన నింద్రియసంయమనంబుగాని చోరాదిదమనంబు గాదు. తితిక్షయన విహితదుఃఖసహనంబుగాని భారాది సహనంబుగాదు. ధృతియన జిహ్వోపస్థ వేగధారణంబుగాని యనుద్వేగమాత్రంబుగాదు. ఉత్తమంబగు దానంబన భూతద్రోహత్యాగంబు గాని ధనంబిచ్చుటగాదు. తపంబనఁ గామత్యాగంబును భోగోపేక్షయుంగాని కృచ్ఛ్రాదికంబుగాదు. శౌర్యంబన వాసనావిజయంబుగాని విక్రమంబుగాదు. సత్యంబన సర్వభూతసమంబగు బ్రహ్మంబు దర్శించుటగాని యథార్థభాషణ మాత్రంబుగాదు. ఋతంబనఁ బ్రియంబును హితంబును నగు వాణియని బ్రహ్మవాదులు ప్రశంసింతురు. శౌచంబనఁ గర్మంబులయం దనాసక్తిగాని మృజ్జలాదులచేఁ జేయంబడు శుద్ధిగాదు. త్యాగంబన సన్న్యాసంబుగాని మలత్యాగంబుగాదు. ఇష్టంబగు ధనంబన ధర్మంబకాని పశ్వాది సాధారణ విత్తంబుగాదు. యజ్ఞంబనం బరమేశ్వరుండ నగు నేనకాని పశ్వాలంభాది క్రియారూపంబు గాదు. శ్రేష్ఠంబగు బలంబన దుర్దమ మనోదమన సాధనంబగు ప్రాణాయామంబు గాని శారీరాదికంబుగాదు. భాగ్యంబన నీశ్వరుండనగు నాసమగ్రైశ్వర్యాది షాడ్గుణ్యంబుగాని విత్తసంపత్తిగాదు. ఉత్తమం బగు లాభంబన మద్భక్తియెగాని పుత్త్రాదికంబుగాదు. విద్యయన నాత్మయందుఁ బ్రతీతంబగు భేదంబుడుగుట గాని జ్ఞానమాత్రంబుగాదు. హ్రీయన నిషిద్ధకర్మంబులయెడఁ గలుగు హేయత్వదర్శనంబుగాని లజ్జామాత్రంబుగాదు. అభరణంబన సుగుణ సంపదగాని కిరీటాదికంబు గాదు. సుఖంబన సుఖదుఃఖాననుసంధానంబు గాని భోగంబుగాదు. దుఃఖంబన విషయభోగాపేక్షయగాని యగ్నిదాహాది కంబుగాదు. పండితుండన బంధమోక్షస్వరూపం బెఱుంగు వాఁడుగాని విద్వన్మాత్రుండుగాఁడు. మూర్ఖుండన దేహ గేహాదుల యందేను నాయదియను నభిమానంబు గలవాఁడు గాని ఘాతుకుండు గాఁడు. సన్మార్గంబన నన్ను

బొందించు నివృత్తిమార్గంబకాని కంటకాది శూన్యంబు గాదు. ఉన్మార్గంబనఁ జిత్తవిక్షేపంబగు ప్రవృత్తిమార్గంబకాని చోరాద్యాకులంబుగాదు. స్వర్గంబనఁ సత్త్వగుణోద్రేకంబగాని యింద్రాది లోకంబుగాదు. నరకంబనఁ దమోగుణోద్రేకంబకాని తామిస్రాదికంబుగాదు. బంధువన గురుండనగు నేనకాని పుత్త్రాదికంబుగాదు. గృహంబన ససాధనంబును భోగాయతనంబు నగు మనుష్యశరీరంబకాని హర్మ్యాదికంబు గాదు. ఆఢ్యుండన సుగుణసంపన్నుండకాని ధనాఢ్యుండుగాఁడు. దరిద్రుండన నసంతుష్టుండ కాని నిర్ధనుండుగాఁడు. కృపణుండన నజితేంద్రియుండకాని దీనుండు గాఁడు. ఈశ్వరుండన విషయానాసక్తబుద్ధియకాని స్వతంత్రుండగు రాజు బోఁటివాఁడుగాఁడు. విపర్యయుండన గుణసంగియగునీశుండు. శమాదివిపర్యయంబును నిట్లే యెఱుంగుము. 632

- : గుణదోషస్వరూపప్రతిపాదనము : -

తే.గీ. ఉద్ధవా! వింటె మోక్షోప - యుక్తములుగ
నీదు ప్రశ్నంబులకు నెల్ల - నిర్ణయంబొ
నర్చినాఁడను గుణదోష - చర్చ యింత
దూర మొనరింపనేల వి - చార నిపుణ! 633

క. విను మిది గుణ మిది దోషం
బనుచు విమర్శించు దృష్టి - యగు దోషం బ
ట్లనకయె గుణదోష ద్వయ
మును విడిచిన యదియె గుణము - ముఖ్యార్థజ్ఞా! 634

సీ. అనవుడు నుద్ధవుం - డను నీశ్వరా! భవ
దాజ్ఞయౌ వేదంబు - నందు నుండు
వివిధ వర్ణాశ్ర - విభజనంబునకును
ద్రవ్య కాలవయః ప - దంబులకును
నన్యులౌ ప్రతిలోమ - జానులోమజులకు
నాకంబునకు నిర - యంబునకును

నను వగు విధి నిషే - ధార్థ కోక్తులకుఁ గా
వలయును గుణదోష - పక్ష దృష్టి

తే.గీ. వేదమునఁ గర్మకాండలో - నీదు విధిని
షేధలక్షణవాక్యము - ల్సాధనములు
గానిచో మానవులకెట్లుఁ - గలుగు శుభము
దాని కవిదప్ప లేవు ప్ర - మాణవిధులు. 635

తే.గీ. దేవతలుఁ బితరులు నరు - లైదెలియలేని
స్వర్గమోక్షాదిగతులకు - సాధ్యసాధ
నముల నిర్ణయమునకును - నైగమంబు
లైన నీ వాక్కులే గదా - యాశ్రయములు. 636

తే.గీ. వెలయుదు తనంత గుణదోష - భేదదృష్టి
నీదు నాదేశురూపమౌ - వేదమదియె
దానిని విధించు మతి యదే - దాని వలవ
దను నరుల కిందు భ్రమ పుట్ట - దా? మహాత్మ! 637

వ. అనిన భగవంతుం డిట్లనియె 638

తే.గీ. కర్మయోగంబు జ్ఞాన యో - గమును భక్తి
యోగమును మానవులకు శ్రే - యోవిధాయ
కంబులుగ మూఁడు జెప్పితిఁ - గాదె ముక్తి
కిట్టి దిఁక వేఱుపాయ మెం - దేని లేదు. 639

తే.గీ. కర్మములఁ దత్ఫలంబుల - గాసినొంది
సన్న్యసించిన వారికి - జ్ఞాననిష్ఠ
యట్లు చేయక కర్మ ఫ - లార్థులైన
కర్మఠులకుఁ జెప్పంబడెఁ - గర్మనిష్ఠ. 640

తే.గీ. అవశముగ మత్కథా శ్రవ - ణాదిసక్తి
గలిగి కర్మవిరక్తుండు - గాని తత్ఫ

లాతిసక్తుండు గాని గా - కవని నెవఁడు
గ్రాలు నతనికి భక్తియో - గంబు లెస్స. 641

తే.గీ. అంతవఱకుఁ గర్మంబుల - నాచరింప
వలయు నరుఁ డెంతవఱకు ని - ల్వదు విరక్తి
మత్కథా శ్రవణాదుల - మరగి యందు
మంచి శ్రద్ధ జనింపదు - మనసునందు. 642

ఆ.వె. తనదు ధర్మమందుఁ - దా నిల్చి సవనముల్
ఫలముఁ గోరకుండ - సలుపుచుండి
వలవదన్న యట్టి - పనులుసేయకయున్న
స్వర్గనరకములకుఁ - జనఁడు నరుఁడు. 643

ఆ.వె. పాపవిరహితుండుఁ - బరిశుద్ధుఁడును స్వధ
ర్మస్థుఁ డగుచు నిందు - మనుచునుండ
మానవుండు విమల - మైన జ్ఞానమునొ మ
ద్భక్తినో యదృచ్ఛఁ - బడయఁ గలఁడు. 644

ఆ.వె. స్వర్గ నరకలోక - వాసు లాదేహముల్
జ్ఞాన భక్తి సాధ - నములు గామి
భూమిలోకమందుఁ - బుట్టఁ గోరుచునుందు
రవి గడింపవచ్చు - నచట ననుచు. 645

సీ. నరుఁడు పాపముఁజేసి - నరకంబు గోరని
యట్లె యతండు పు - ణ్యంబుఁజేసి
స్వర్గంబును గోరఁ - జన దుత్తమంబని
మర్త్యతఁ గోర స - మ్మతము గాదు
నరదేహమున నిది - నాది యం చాసక్తి
వుట్టి స్వార్థము సెడి - పోవుఁ గాన
నెఱుకగల్గిన యాతఁ - డిది మోక్షసాధనం
బైనను మరణ యో - గ్యంబె యగుటఁ

తే.గీ. దెలిసి మృత్యువుచే నిది - తెగకమున్నె
తా మఱలc బుట్టు వొందక - తలcగుకొఱకు
తనువునందలి యాసక్తి - దగులకుండ
సత్ప్రయత్నంబు శీఘ్రంబె - సలుపవలయు. 646
సీ. తానొకపక్షి యీ - తనువు వృక్షము దీన
నుండెడు నొకగూట - నుండుc దాను
యమునట్లు నిర్దయు - లైనవా రాచెట్టు
నఱుకుచుండుటc జూచి - పఱచి పక్షి
తానున్న గూటి యా - స్థను మాని నిర్భయం
బౌ నెడc జేరి సౌ - ఖ్యంబుc బడసి
నట్లె రాత్రులుc బగ - ళ్ళాయువుc దఱిగించు
చుండు టెఱింగి న - రుండు భయముc
తే.గీ. గంపమును బొంది దేహ సం - గంబు మాని
భయము లేకుండ శాశ్వత - పదముc దెలిసి
యందు శీఘ్రమె చేరి యే - పొందులేక
పరమసుఖ మొందుచుండcగాc - వలయుc గాదె. 647
సీ. ఫలమున నెల్ల సం - పాదింప మూలంబు
పుణ్య కోటులనైనc - బొందరాని
దయ్యు నిష్టప్రాప్త - మగుటచే సులభంబు
పటుతరం బీ నర - వపువు నావ
దీనికి గురువు సు - క్కానుc బట్టcగc దగు
వాయువై నేను వీ - వంగc దీని
నెక్కి పూరుషుcడు సం - సృతి సముద్రము దాcట
వలయును గడు సుల - భముగ నాతc
ఆ.వె. డట్లు చేయcడేని - నవిరక్తుcడై భవ
వారిరాశియందుc - బడి మునింగి

పలుదెఱంగులైన - బాములఁ బడి పడి
యాత్మహంత దానె - యై నశించు. 648

సీ. కర్మంబు లెల్ల దుః - ఖములుగాఁ గనుఁగొని
ఫలభోగ విరతి యే - ర్పడిన యప్పు
డింద్రియంబులను జ - యించి మనంబున
నాత్మతత్త్వ ధ్యాన - మలవరించి
యది స్థిరంబుగ నిల్ప - నగు యోగి య ట్లది
నిలువక తిరుగుచుం - డిన నతండు
దానినిఁ గొంచెము - పోనిచ్చి మఱలించి
నిలుపుచు నభ్యాస - నియతి నిట్టు

తే.గీ. లేమఱక దాని వదలక - యింద్రియములఁ
బ్రాణముల గెల్చి సత్త్వ సం - పన్న బుద్ధి
చేత దానినిఁ బట్టి ని - శ్చేష్టితముగఁ
జేసి యది తనవశముగాఁ - జేయవలయు. 649

తే.గీ. మొండి గుఱ్ఱముఁ దన వశ - ముగ నొనర్చు
వాఁ డనుసరించు ననురోధ - పద్ధతి యిది
మనసు నిల్పఁగ నిది యుత్త - మమగు యోగ
మొక్కసారిగ నది నిల్ప - కున్నతనికి. 650

తే.గీ. మానసము గొంత నిశ్చలం - బైన పిదప
వరుస మహదాది దేహాంత - భావముల స
ముద్భవ లయంబులను నెంచు - చుండ వలయు
నదియె నిలిచి ప్రసన్నమౌ - నంతదాఁక. 651

సీ. అంతట భూత ల- యావధి యగునాత్మ
నెఱిఁగి ము న్నట్లు దా - నెఱుఁగని తతి
దుఃఖ రూపంబయి - తోఁచిన సంస్కృతిఁ
గాంచి వేసరి విరా - గంబుఁ బూని

గురువు సెప్పిన యర్థ - మరసి యెఱింగి ప
ల్కుఖు దానినే తలం - పఁగ మనంబు
దేహాభిమానంబుఁ - దీఱ విసర్జించు
నంత నామౌని య - మాదులైన
తే.గీ. యోగమార్గంబులఁ బదార్థ - యుగ విమర్శ
సలుపు విద్యనొ నాదు న - ర్చా విచింత
నాదులనొ నన్నె తలఁపనొ - నంతె గాని
యన్య కర్మంబు లతఁడు సే - యంగఁ దగదు. 652
ఆ.వె. అట్లుగాక చేసె - నా ప్రమాదంబు చే
యోగి గర్హ్య కర్మ - మొక్కవేళఁ
గాల్ప వలయు దానఁ - గలుగు పాపము యోగ
మునన గాని వేఱు - పనులఁ గాదు. 653
తే.గీ. వలదె నిష్కృతి వాని పా - పముల కనిన
నెవని కేనిష్ఠ దగు నది - యే గుణంబు
తగని యదె దోష మీరెంటి - తత్త్వమిదియె
యోగి కర్హంబు యోగమే - యొండు గాదు. 654
సీ. సకల కర్మంబులు - సహజ ప్రవృత్తిచే
నగుట నశుద్ధముల్ - త్యాజ్యము లవి
యన్నింటి నొకసారి - త్యజియింపఁగా రామి
నించుకించుక త్యజి - యించు కొఱకె
యివి గుణంబులు కొను - మవి దోషములు మాను
మని నియమంబు సే - యంగఁబడియె
గుణమగు కర్మంబు - గూడ బంధముగాదె
యట్లౌట నదియుఁ ద్యా - జ్యంబుగాదె
తే.గీ. వేదము ప్రవృత్తిపర మన - రాదు యోగి
కెపుడు సహజ ప్రవృత్తి లే - దిట్టివాని

కేడ పాపంబు వేదంబు - లేర్పఱించు
నిష్కృతియు నేడ? నైష్కర్మ్య - నిరతుఁడతఁడు. 655

సీ. నాసత్కథల్విన - నాసక్తిజనియించి
యన్యకర్మంబుల - నరతి గలిగి
కామంబు లెల్ల దుః - ఖదములం చెఱిఁగియు
వాని మాపఁగలేని - వాఁడు శ్రద్ధ
నన్నికోర్కులుఁ బొంద - నగు భక్తినని దృఢ
నిశ్చయంబున నన్ను - నే భజించి
కామంబులను బ్రీతిఁ - గాక దుఃఖోదర్క
ములుగ గర్హించుచుఁ - బొందుచుండి

తే.గీ. నిత్య మే మున్ను జెప్పిన - నియతిభక్తి
నన్ను భజియింప నతని మా - నసమునందు
వార కే నుందు నంత నా - ధీరుఁడైన
మౌని మదిఁ గోర్కు లన్నియు - మాసిపోవు. 656

తే.గీ. నన్ను నఖిలాత్మకుని గనుఁ - గొన్నయపుడె
వానికి నహంత యను గ్రంథి - దానె వీడు
దానఁ బుట్టిన సంశయ - తతియుఁ దెగును
త్రివిధకర్మంబులు నశించుఁ - దీవ్రముగను. 657

తే.గీ. కానఁ జిత్తంబు నాయందుఁ - గలుపు యోగి
యైన నాభక్తున కిట శ్రే - యస్సుఁ గూర్ప
భక్తియోగంబ కాని యె - ప్పటికి జ్ఞాన
మైన వైరాగ్యమైన న - ర్థంబుగాదు. 658

ఉ. కర్మములం దపంబులను - జ్ఞానవిరక్తుల యోగ దాన స
ద్ధర్మములం దదన్య శుభ - ద క్రియల న్నరుఁ డొందు సత్ఫలం
బర్మిలిఁ గోరెనేని నల - నాకము మోక్షము మత్పదంబునున్
శర్మద భక్తియోగమున - నాప్రియభక్తుఁడు వొందుఁ జుల్కఁగన్. 659

తే.గీ. నాయెడనె ప్రీతి గల్గిన - నాదుభక్తు
లలఘుమతు లగు సాధువు - లెలమి నెదియు
గోర రననేల నేనిత్తుఁ - గొనుఁడటన్న
వలవ రపునర్భవంబుఁ గై - వల్యమైన. 660

తే.గీ. అధిక ముత్తమంబు - నైన నిశ్శ్రేయస
ఫలము సాధనమును - వాంఛలేమి
గానఁ గొఱంత గోర్కి - లేని వానికిఁ గల్గు
నన్నుఁ జేర్పఁ గలుగు - నాదు భక్తి. 661

ఆ.వె. సాధువులును సర్వ - సమచిత్తులై యీశు
బుద్ధిసాక్షిఁ బొంది - శుద్ధభక్తు
లైన వారి నెపుడు - నంటవు గుణదోష
జనిత పుణ్యపాప - సంచయములు. 662

ఆ.వె. నన్నుఁజేర సాధ - నములుగా నే నిట్లు
చెప్పియుండు రీతిఁ - జేయువారు
మంగళమును గాల - మాయాది దూరమౌ
బ్రహ్మమనెడి నాదు - పదముఁ గంద్రు. 663

వ. అని మఱియు భగవంతుండిట్లనియె. 664

ఉ. ముక్తికి సాధనంబులని - మున్వివరంబుగఁ దెల్పినట్టి స
ద్భక్తిని జ్ఞానముం గ్రియల - బట్టుగఁ బూనక యెవ్వఁడేని నా
సక్తిఁ జరించు నింద్రియ వ - శంగతుఁడై చల నీచ కామ సం
సక్తి నతండు పుట్టుచును - జచ్చుచు సంసృతిఁ ద్రిప్పులం బడున్. 665

క. తన తన యధికారమునకు
ననువగు నిష్ఠం జరించు - టది గుణ మనఁగాఁ
జను విపరీతము దోషం
బనఁబడు నీరెంటి నిశ్చ - యం బిదియె సుమీ. 666

సీ. సకల వస్తువులును - సమములై యున్నను
నిందు స్వభావ ప్ర - వృత్తి మాన్ప
నది యోగ్య మిది యయో - గ్యం బనియును గుణ
మది యగుణం బిది - యనియు నవ్వి
యర్థదంబులును న - నర్థదంబులు నగు
టను బట్టి శ్రుతి విధిం - చును విభాగ
మిదియు నధర్మంబు - వదలి ధర్మ మొనర్చి
యఘమును దొఱంగి పు - ణ్యంబు వడసి
తే.గీ. ప్రజలు మేలొంద దేహ యా - త్రయును జరుగఁ
గల్పితంబయ్యె నిది యధి - కారి కొలఁది
గర్మ జడులకు నే శాస్త్ర - కర్తనై ప్ర
సక్తి వివరించినాఁడ నా - చారకాండ. 667
తే.గీ. బ్రహ్మ మొదలుగ నీ స్థావ - రముల దాఁకఁ
బ్రాణుల శరీరములు పాంచ - భౌతికములు
సమము లం దాత్మ యొక్కఁ డే - సమత నుండుఁ
గలుగు నె ట్లిఁక భేదావ - కాశమిందు. 668
తే.గీ. సమములై యుండఁ బ్రాణిదే - హముల యందు
భేదదృష్టిని గల్పించు - వేదచయము
ప్రాణుల ప్రవృత్తి నియమించి - వానికిఁబురు
షార్థసిద్ధి నొనర్పఁగా - నభిలషించి. 669
తే.గీ. దేశ కాలాదులను నుపా - దేయ వస్తు
వులను నధికారుల విశేష - ములను గర్మ
నియమమున కయి గుణదోష - నిర్ణయంబు
నే నొనర్చితి నుద్ధవా! - దాని వినుము. 670
సీ. దేశంబులందు నా - దేశం బశుచి యెందు
నల్లజింక చరింప - దుల్ల మలర

నందును నశుచి బ్రా - హ్మణభక్తి లేనిది
యట్టి జింక చరించు - నట్టివయ్యు
నవని సౌవీర బా - హ్యము లంగ వంగ క
ళింగాదు లెల్ల న - మంగళములు
సమ్మార్జనాది శూ - న్యమ్ములు మ్లేచ్ఛ సం
కులములు చౌటినే - లలను నంతె

తే.గీ. యశుచి దేశంబు లివ్వి వ - ర్జ్యములు దక్కి
నవి విశుద్ధములగుట సే - వ్యములు ధరణి
నెందు సత్పాత్రముండు న - దే విశుద్ధ
మైన దేశంబనుచు నాదు - నాశయంబు. 671

తే.గీ. ద్రవ్య సంపత్తినో తనం - తనొ సుకర్మ
ములకు నర్హంబగుచు మంచి - ఫలము నిచ్చు
కాలము విశుద్ధ మటుగాక - కర్మముల క
నర్హము నకర్మకంబగు - నదియె యశుచి. 672

ఆ.వె. చూడ ద్రవ్య శుద్ధ్య - శుద్ధులు ద్రవ్యంబు
చలన వచన కాల - ములను మఱియు
సలిల సేచనాది - సంస్క్రియఁ గాలాల్ప
తా మహత్త్వ తార - తమ్యమునను. 673

తే.గీ. శక్తి గలుగుట నది లేమి - జ్ఞానమయినను
గలిమిచే లేమిచేతను - గలుగుచుండు
నం దశుద్ధంబులైన ద్ర - వ్యములు వివిధ
దేశము లవస్థలను బట్టి - తెచ్చు నఘము. 674

వ. ద్రవ్యంబులకుఁ దోయాదులచే శుద్ధియు మూత్రాదులచే నశుద్ధియు ద్రవ్యంబువలన నగునవి. శుద్ధ్యశుద్ధి విచికిత్స నిదమిత్థమను బ్రాహ్మణవచనంబున నిర్ణయింపంబడినది వచనంబుచే నగునది. పుష్పంబులకుఁ బ్రోక్షణాదులచే శుద్ధియు నవఘ్రాణాదులచే నశుద్ధియుఁ బర్యుషితాన్నాదులకుఁ బ్రోక్షణాదులచే శుద్ధిలేమియు సంస్కారంబుచే

నగునవి. పగలురేయి మున్నగు కాలంబులం దేఁబడు నవోదకాదులకు శుద్ధియుం దద్విపరీతంబులకు నశుద్ధియు నుచ్ఛిష్టాదులకు నశుద్ధియుఁ గాలంబున నగునవి. అంత్యజాది స్పృష్టంబులగు తటాకాద్యుదకంబులం జెఱువులు మున్నగు పెద్దవానికి శుద్ధియు బావులు మున్నగు చిన్నవానికి నశుద్ధియుఁ మహత్తాత్వల్పత్వంబులవలన నగునవి. సూర్యోపరాగ సూతకాన్నాదులకు నశక్తులయెడ శుద్ధియు శక్తిగలవారి యెడ నశుద్ధియు శక్త్యశక్తులచే నగునవి. పుత్రోత్పత్త్యాదులఁ దెలియుట బహిర్దశాహంబున శుద్ధియు నంతర్దశాహంబున నశుద్ధియు జ్ఞానంబుచే నగునవి. జీర్ణ మలవద్వస్త్రాదుల ధరించుట బీదలకు శుద్ధియు ధనికులకు నశుద్ధియు గలిమిలేములచేనగునవి. ఈ ద్రవ్యవచనాదుల నగు నశుద్ధులు పురుషునకుఁ గలిగించు పాతకంబు దేశ కాలాత్మ ద్రవ్య తత్ప్రయోజ నోపపత్త్యవస్థల ననుసరించియుండు. నిర్భయ దేశంబులను నరోగయౌవనాద్యవస్థలను నఘంబు లగునవి తద్విపరీతంబుల నట్లు గాకుండు. ఈద్రవ్యాదులలో వచనాదుల నగు శుద్ధి యేకరూపంబగాని ద్రవ్యంబుచే నగు శుద్ధి బహు ప్రకారంబది యెట్లనిన నస్పృశ్యస్పృష్టంబులగు ధాన్యంబులకును దర్వీచమసాది దారువులకును గజదంతాద్యస్థులకునుఁ దైలఘృతాదులగు రసవస్తువులకును సువర్ణాది తైజసంబులకును జర్మనిర్మితంబులగు నుపానద్వస్త్రాదులకునుఁ గాలవాయ్వగ్ని మృత్తోయంబులచే శుద్ధి. ఇందు ధాన్యంబులకు వాయువుచేతను దా ర్వస్థి రస తైజసంబులకు నగ్ని చేతను జర్మవస్త్రంబులకు మృత్తోయంబులచేతను రథ్యాకర్దమఘటేష్టకాదులగు పార్థివ ద్రవ్యంబులకు నీ కాలాదులలో నొక్కక్కదానిచేఁ గాని కొన్నింటి కూడికం గాని శుద్ధి. అదియుఁ గాకాంత్యజాది స్పృష్టితారతమ్యంబును దేశకాల వస్థాదులను ననుసరించి యుండు. ఇఁక నశుద్ధవస్తులేపశుద్ధి విధానంబు వినుము. పీఠపాత్రవస్త్రాదులకు నంటిన యశుద్ధద్రవ్యంబువలన నగు నశుద్ధి తక్షణ ఘర్షణక్షారామ్లోదకాదులచే నాద్రవ్యంబువలనఁగలిగిన గంధలేపంబు నివర్తించి యది నిజరూపంబు నొందువఱకు నుండు. ఇది ద్రవ్యశుద్ధి ప్రకారం బిఁకఁ గర్తృశుద్ధి యెట్లనిన వినుము. సాహంకారుండగు గర్తకు

విహితకర్మార్థంబుగా స్నానదాన తపస్సులచేతను గౌమారాద్యవస్థలచేతను సామర్థ్యంబు చేత్తను నుపనయనాది సంస్కారంబుచేతను శౌచసంధ్యోపాసనా దీక్షాదిలక్షణంబగు కర్మంబుచేతను మత్స్మరణంబుచేతను శుద్ధియగు. ఇట్లు శుద్ధుండై ద్విజుండు విహితకర్మానుష్ఠానం బొనరింపవలయు. ద్విజుండనుట శూద్రాద్యుపలక్షణార్థంబు. మఱియు సద్గురు ముఖంబున సమగ్రంబుగా మంత్రం బెఱుంగుట మంత్రశుద్ధి. ఈశ్వరార్పణంబుగాఁ గర్మంబొనర్చుట గర్మశుద్ధి. ఈ దేశకాలద్రవ్యకర్తృమంత్రకర్మంబులను నాఱింటి శుద్ధిచే ధర్మంబును విపర్యయంబుచే నధర్మంబును గలుగుచుండు. గుణదోషవిభాగం బీప్రకారంబైనను నిది వాస్తవంబుగా దెట్లనిన నెయ్యది యొకప్పుడు గుణంబగు నదియే మఱియొకప్పుడు దోషంబగు. ఇట్లే యొకప్పుడు దోషంబైనదే మఱియొకప్పుడు గుణంబగు. ప్రతిగ్రహంబాపదయందు గుణంబైనను ననాపదయందు నిషిద్ధంబగుట దోషంబు. పరధర్మంబు పరునకు గుణంబైనను దనకుదోషంబు. అవిరక్తునకు నిజకుటుంబ త్యాగాదికంబు దోషం బైనను విరక్తున కది దోషంబుగా కుండుటయె గాక విధిబలంబున గుణంబే యగు. కావున గుణదోషార్థ నియమంబుసేయు నీశాస్త్రంబు తద్భేదబాధకంబే యగుచున్న యది మఱియు నొక్క విశేషంబు వినుము. ప్రసిద్ధదోషంబగు సురాపానాదికంబు జాతిచే నొండెఁ గర్మంబుచే నొండె భ్రష్టుండైన పతితునకు దోషంబుగాక యపతితునకుఁ బతనహేతువగు దోషంబగు. మఱియును సన్న్యాసికి దోషం బగు స్త్రీ సంగంబు గృహస్థునకు ఋతుస్వదారగమనవిధిం బూర్వస్వీకృతంబై దోషంబుగాక గుణంబయగు. ఇట్లు దోషంబు దోషంబుగాక గుణంబగుట నేలం బరుండువాని కధః పాతంబు లేని తెఱంగు. గుణదోషవిధాయకంబగు శాస్త్రంబునకుఁ బ్రవృత్తిని సంకుచితం బొనర్చు నుపాయంబుతో సర్వకర్మ నివృత్తియందే తాత్పర్యంబు గావున. 675

తే.గీ. మనుజుఁ డెయ్యెయి కర్మంబు - మానుచుండు
వాని కయ్యయి బంధంబు - వదులుచుండు

నరుల కీధర్మమే శివం - కరము పరము
ననవరత శోకమోహ భ - యార్తి హరము. 676

సీ. మనుజుండు విషయంబు - లను మంచివని యెంచ
నతని కం దాసక్తి - యతిశయించు
నాసక్తిచేఁ గామ - మావిర్భవించు నా
కామంబె కలహంబుఁ - గలుగఁజేయు
నా కలహంబున - నగుఁ దీవ్రమగు క్రోధ
మందు సంమోహ జా - డ్యంబు పుట్టు
నది వేగ దిగమ్రింగు - వ్యాపిని యగు ప్రజ్ఞ
నదిలేమి వాఁ డస - త్పదృశుఁడగును

తే.గీ. వాని కంతటఁ బురుషార్థ - హాని గలుగు
నతఁడు బ్రతికియు మూర్ఛితు - మృతునిఁ బోలి
వ్యర్థ జీవితుఁడగు నుద్ధ-వా! యిదెల్ల
విషయవిషపానఫల మతి - భీషణంబు. 677

తే.గీ. విషయముల వాంఛఁ జూచు న - వ్వెడఁగు దన్ను
నన్య నెఱుఁగక వృక్షమ - ట్లవని బ్రతుకు
నిష్ప్రయోజన మాతని - నిశ్వసనము
కొలిమితిత్తి యాతనికంటెఁ - గొంతమేలు. 678

సీ. శ్రుతులయందలి ఫల - శ్రుతులు నిశ్శ్రేయస
బోధకంబులు గావు - సాధకునకు
నవి కర్మములుసేయ - నాతనిఁ బురికొల్పుఁ
బదపడి ముక్తిఁ జె - ప్పం దలంచి
వేఁపనూనియఁ ద్రావు - పాపఁడ నీకిత్తు
ఖండ లడ్డుకములు - దండిగనని
తండ్రి సెప్పిన నది - త్రాగి పుత్త్రుఁడు దాని
ఫలమును బొందున - ట్టులె యవెల్లఁ

తే.గీ. దమకుఁ బరిపాకమందు దుః - ఖములె యైన
యాయు రింద్రియు శక్తి వీ - ర్యార్థ బంధు
కోటిపై రక్తి మర్త్యుల - కును స్వభావ
ముననె గల దందుఁ బురికొల్పు - పనియు నేల? 679

తే.గీ. పరమపురుషార్థ మెఱుఁగక - వంగిఁవ్రాలి
పాపగతిఁ ద్రిమ్మరుచునుండు - పామరులకు
నాప్త సర్వజ్ఞ యగు శ్రుతి - యకట మఱియుఁ
జెట్లు ఱాలును గండని - చెప్పుచున్నె. 680

తే.గీ. వేదతాత్పర్య మిదియని - వెడఁగులైన
కొంద ఱెఱుఁగక యందలి - కుసుమితాగ
మట్టి యీయర్థవాదోక్తి - కాసపడుదు
రది నిజంబని వేదజ్ఞు - లనరు ఋషులు. 681

సీ. కోరికలకుఁ జిక్కి - కుసుమంబులె ఫలంబు
లని వానిఁగోరి హై - న్యంబునంది
యగ్నిసాధ్యము మోక్ష - మని చచ్చు ధూమాది
మార్గస్థు లెఱుఁగరు - మత్పదంబుఁ
గర్మశస్త్రులు ప్రాణ - ధర్మ రక్షణపరుల్
నీహార వృత నేత్ర - నిభులుగాన
నిదియెందు జనియించు - యదభిన్న మిది యట్టి
హృదయస్థు నన్ను వా - రెఱుఁగలేరు

తే.గీ. వారికి స్ఫుటంబుగాని గం - భీరమైన
నాయభిప్రాయ మెఱుఁగ క - న్యవిషయేచ్ఛఁ
దవిలి పశుహింస వారు వ్య - ర్థముగఁజేసి
చచ్చి పడుదురు వానిచే - సకలహింస. 682

సీ. హింసఁ జేసెడువాఁడు - మాంసంబుఁదిన దాని
ఫలమును భుజియింప - వలచెనేని

నది ఫలాంతంబగు - యజ్ఞమే గాని చో
దన గా దనెడు శ్రుతి - ధ్వనిని వినియు
నరులు దెల్వొంది యొ - నర్పరు కర్మముల్
మత్ప్రీతిఁ గోరి కా - మ్యమములు విడిచి
స్వసుఖంబుకొఱకు హిం - సాక్రీడఁ బశువులఁ
బట్టి యజ్ఞములు దే - వ పితృభూత
తే.గీ. తృప్తికై చేసి కలవంటి - దియు నసత్తు
వినికి కింపగు పరలోక - మునను నిందు
భోగములు గోరి యవి కొన - సాగకునికి
స్వార్థవిభ్రష్టులగుదు ర - య్యర్యునట్లు. 683
చ. అదియెటులన్న దుస్తర మ - హాంబుధిదాఁటి యట న్విశేషసం
పదన గడింపఁగోరి యొక - వైశ్యుఁడు పూర్వధనంబుఁబెట్టి పె
ద్దది యొకనావఁ గట్టి చను - నప్పుడు నావ మహాబ్ధి భగ్నమై
మొదటిధనంబుఁ గోల్పడుటఁ - బోలును యాజ్ఞిక కామ్యకర్మముల్ 684
సీ. సత్త్వగుణంబు నై-జంబగు వారికి
సాత్త్వికోపాసనా - సక్తి గలుగుఁ
బ్రవహించు రజను స్వ - భావమౌ వారికి
రాజసోపాసనా - రక్తి పుట్టు
స్తబ్ధమౌ తమసు ప్ర - ధానమౌ వారికిఁ
దామసోపాసన - దవిలియుండు
నీ మూఁడుతెగల వా - రింద్రాదులను యక్ష
రాక్షసులను భూత - రాజిఁగూర్చి
తే.గీ. వివిధఫలకాంక్షఁ దగిలి మ - ద్భిన్నులనుచు
వారినెల్లను భావించి - భూరిబలుల
వివిధయజ్ఞంబు లొనరించి - వివిధగతులఁ
బొందుదురుగాని వారు న - న్బొందలేరు. 685

సీ. పుడమి మే మధ్వరం - బులు సేసి సురలను
దనిపి పోదుము స్వర్గ - మునకు మహిమ
నచ్చటఁ బుణ్యాంత - మగుదాఁకఁ దత్ఫలం
బనుభవింతుము లెస్స - తనివిదీఱ
నంతట మఱల నీ - యవనికి నేతెంచి
యొనర మహాకులం - బున జనింతు
మందు మేము మహోగ్ర - హస్థులమై మించి
వివిధయజ్ఞములఁ గా - వించుచుందు
తే.గీ. మనుచుఁబుష్పితవృక్షంబు - నట్లు రమ్య
మైన వాగ్జాలమున హృద - యంబు లుబ్బ
దురభిమానులు సువివేక - దూరులు నగు
వారి చెవి దూర దెపుడు నా - వార్తయైన. 686
సీ. కర్మకాండము దేవ - కాండము జ్ఞానకాం
డము నన మూఁడు భా - గములు గలుగు
నీవేదములు బ్రహ్మ - మే యాత్మ సంసారి
గాఁడని యింద్రియా - గమ్యమైన
విషయంబుఁ దెలుపఁ బ్ర - వృత్తి పరంబులు
గావు మహర్షులు - నీవిషయమె
యెప్పుడుఁ బల్కుదు - రిదియె నాకిష్టంబు
వేదార్థవివరంబు - ద్వివిధ మగుచుఁ
తే.గీ. బరగు రూపంబు నర్థంబుఁ - బట్టి స్థూల
సూక్ష్మ సంజ్ఞను వీనిలోఁ - జొచ్చి బుద్ధి
నరసి యెఱుఁగ నశక్య మె - వ్వరికి నాకుఁ
దక్క నుద్ధవ! దాని వా - స్తవము వినుము. 687
సీ. ప్రాణమయంబు ప - రాఖ్య శబ్దంబగు
నదె మనోమయము ప - శ్యంతియగును

మతి యది యింద్రియ - మయమయి మధ్యమ
యగును శబ్దబ్రహ్మ - మనఁగ నిదియె
యిది సమష్టి ప్రాణ - హృదయేంద్రియాత్మకం
బై నిర్విశేష మే - కాత్మ మగుట
గూఢార్థమగుట న - కూపారసదృశమై
దుర్విగాహంబౌట - దుర్గహార్థ

తే.గీ. మయ్యె దీని కధిష్ఠాత - నగుదునేను
భూమమూర్తిని బ్రహ్మంబ - భూరిశక్తి
బిసములనుఁ దంతువును బోలి - వివిధభూత
ములను నే ఘోషరూపినై - పోల్చుచుందు. 688

సీ. తన హృదయాంతరం - బుననుండి తంతువు
లూత వాతను గ్రక్కు - నా తెఱఁగున
మును హృదయాకాశ - ముననుండి ఘోషమై
ప్రాణంబుతోడ వె - ల్వడును వేద
మది మనోయుక్తి స్ప - ర్శాది వర్ణాకృతిఁ
దాల్చి ఛందోమయ - త్వంబునొందు
దీనికి నేనె య - ధిష్ఠాత విభుఁడను
నమృతమయుండ నా - యందునుండి

తే.గీ. నేనె సృజియింతు బహుమార్గ - మైన దీని
వరుస హృద్గతమౌ ప్రణ - వంబువలన
స్వరములను వ్యంజనంబుల - బయలుపఱచి
వివిధ వాఙ్మయమెల్లఁ గా-వింతు నంత. 689

వ. అందు వైదికలౌకిక భాషా వైచిత్ర్యవిస్తరంబును చతురక్షరోత్తరఛందః పరంపరచే నుపలక్షితంబును ననంతపారంబును నగు బృహతీఛందంబును హిరణ్యగర్భ రూపుండ నగు నేనే సృజియించి యుపసంహరించుచుందు. ఆ ఛందంబులు గాయత్రీ ఛందంబును నుష్ణిక్ఛందంబును ననుష్టు ప్ఛందంబును బృహతీ

ఛందంబును బజ్క్తి ఛందంబును త్రిష్టుప్ఛందంబును జగతీఛందంబును నత్యష్టిఛందంబును నతిజగచ్ఛందంబును విరాట్ఛందంబునునై యుండు. ఉక్తాఛందంబు చతురక్షరంబు. అత్యుక్త యష్టాక్షర. మధ్య ద్వాదశాక్షర. ప్రతిష్ఠ షోడశాక్షర. సుప్రతిష్ఠ వింశత్యక్షర. గాయత్రి చతుర్వింశత్యక్షర. ఇట్లు చతురక్షరవృద్ధిచే నుష్ణిగాద్యుత్కృత్యంతంబులగు ఛందంబు లేర్పడు. ఉత్కృతి చతురుత్తరశతాక్షర. కావున నీ ఛందోమయంబగు వేదంబు స్వరూపం బిట్టిదని సాకల్యంబుగ నెఱుంగ శక్యంబు గానియట్లే దీని యర్థంబును నెఱుంగ శక్యంబుగా దెట్లనిన వినుము. 690

సీ. కర్మకాండమున నే - కర్మము ల్వేదంబు
విధివాక్య సరణి నె - వ్విధి విధించె
దేవతాకాండ నే - దేవతలను గూర్చి
మంత్రవాక్యార్థ మా - మ్నాత మయ్యె
జ్ఞానకాండమున నె - ద్దాని నౌఁగాదని
నిగమంబు యుక్తుల - నిర్ణయించె
నీ మూఁడు కాండలు - నేయర్థమందుఁ దా
త్పర్యంబుచేత నే - ర్పఱుపఁబడియె

తే.గీ. నీ రహస్యంబు నేఁ దక్క - నెవరు నెఱుఁగ
రుద్ధవా! నీకుఁ జెప్పెద - నున్న తెఱఁగు
నేనె యజ్ఞంబు దేవతల్ - నేనె సృష్టిఁ
జెప్పి కాఁదని మన్నిష్ఠఁ - జెప్పు శ్రుతులు. 691

తే.గీ. అరసి పరమార్థ రూపు న - న్నాశ్రయించి
వేద మీ భేదమంతయు - నాదు మాయ
యని నిషేధించి నను నిషే - ధావధి యని
యంత విరమించు సర్వ వే - దార్థ మింతె. 692

## -: తత్త్వ సంఖ్యానము :-

సీ. అన విని యుద్ధవుం - డను దేవ! విశ్వేశ!
ఋషులు తత్త్వంబుల - నెన్ని యందు
రంటి నీ వవి తొమ్మి - దని పదునొక్కటి
యైదు మూఁడని వింటి - నా వివరము
నిరువదియాఱని - యెంతురు గొంద ఱీ
ర్వదియైదె యందురు - పరులు మఱియుఁ
గొంద ఱేఁడని మఱి - కొందఱు దొమ్మిది
యన్యులు బదునొకం - డాఱు నాల్గుఁ
తే.గీ. బదియు నేడని పదియాఱుఁ - బదియు మూఁడు
ననుచు బహువిధములుగ మ - హర్షు లందు
రేమి చెప్పఁ దలంచి వా - రిట్లు చెప్పి
రిందు నెది యుక్త మది చెప్ప - వే మహాత్మ! 693
చ. అన భగవంతుఁ డిట్లను మ - హాత్ములు బ్రాహ్మణులాడుమాట లొ
ప్పును కల విన్నితత్త్వములు - మోహినియైన మదీయ మాయఁ జే
కొని గణియించు వారి కిలఁ - గూడని లెక్కయు నున్నె యెట్టు లె
న్నను దగ దెండమావులఁ గ - నంబడు వేగముఖప్రమాణముల్. 694
క. విను నా లెక్కయె సరి నీ
వను నట్టులు గా దటంచు - నా తత్త్వములన్
గొని యెంచుచు వివదించుట
ఘనమగు నా మాయ వలనఁ - గలుగుచు నుండున్. 695
తే.గీ. ఏగుణంబులు క్షోభింప - నీ వివాద
పటలికాస్పదమగు విక - ల్పంబు పుట్టు
నవి లయించి శమాదులు - ప్రాప్తములగు
తఱి నదియు దానితోడ వా - దము నశించు. 696
తే.గీ. ఒండొకటఁ దత్త్వములు గూడి - యుండు కతన

నెట్లు చెప్పఁదలంచిన - నట్లు వాని
గణనఁ జెప్పఁగ వచ్చుఁ గా - రణముఁ గార్య
మును వెనుక ముందుగాఁ జేసి - పెనచి పెనచి. 697

ఉ. కారణ తత్త్వమౌ నొకటఁ - గార్యము లన్యము లుండుఁ గార్యముం
జేరి తదన్యతత్త్వములు - సిక్కఁగ నంతట నుండుఁ గాన నీ
కారణ కార్యసంఖ్య గణ - క ప్రియపద్ధతి నుండు నెవ్వఁ డే
తీరున యుక్తియుక్తముగఁ - దెల్పు నదే సరియందు మేమునున్. 698

క. పురుషుం డనాద్యవిద్యా
వరణంబున నుండు కతన - వాఁడు దనంతం
బొరయఁడు స్వాత్మజ్ఞానముఁ
బరుఁ డఖిలజ్ఞుండు వలయు - వానిం దెల్పన్. 699

క. జీవేశ్వరులకు భేదము
గావలె ననువారు తత్త్వ - గణ మిరువది యా
ఱై వెలయు ననెడి పక్షం
బీవిధిఁ దద్భేద మాత్మ - నెంచని వాగల్. 700

క. జీవేశ్వరులకు భేదం
బేవెరవునఁ గలుగు వార - లిరువురుఁ జిద్రూ
పావగతు లంద్రు తత్త్వము
లీ విధమునఁ జూడ నిరువ - దే నగుచుండున్. 701

వ. ఈయుభయపక్షంబులను నీశ్వరప్రసాదలబ్ధంబగు జ్ఞానం బన్యతమంబై యుండుటంజేసి తత్త్వవృద్ధి యగు ననిన నట్టి జ్ఞానంబు ప్రకృతిగుణంబగు సత్త్వంబు వృత్తియుఁ గావునఁ దదంతర్భూతంబకాని యన్యంబు గాదు. తత్త్వ వృద్ధియు లేదు. 702

తే.గీ. అఖిలము సృజింప రక్షింప - నణఁపఁ గార
ణములు రజసును సత్త్వంబు - దమసు ననెడి
గొనము లివి గల్గుఁ బ్రకృతి కా - త్మునకు లేవు
వీని సమతయ ప్రకృతి నా - విశ్రుతంబు. 703

తే.గీ. సత్త్వవృత్తి జ్ఞానంబు రా - జసము గర్మ
మజ్ఞతయె తామసము వీని - వ్యతికరంబుఁ
గలుగఁజేయు నీశ్వరుఁడెయోఁ - గాల మనఁగ
నదె స్వభావంబు సూత్రంబు - నగు మహత్తు. 704

వ. ఇట్లు జ్ఞానాజ్ఞాన కర్మ కాల స్వభావ సూత్ర మహత్తు లెల్లను గుణత్రయాంత ర్భూతంబులగుట నేపక్షంబునను దత్త్వవృద్ధి లేదు. కావున గుణత్రయంబే తత్త్వత్రయంబు. ఇది నామతంబు. మన్మతాంతరంబులును వినుము. పురుష ప్రకృతి మహ దహంకార వియ ద్వాయు తేజస్సలిల భూములనందత్త్వంబులు తొమ్మి దనియును శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లను జ్ఞానేంద్రియంబు లైదును వాక్పాణి పాదపాయూపస్థలను కర్మేంద్రియంబు లైదును మనంబుతోడ నవి పదునొకం డనియును శబ్దాది విషయపరిణామంబులును వచనాది కర్మేంద్రియసిద్ధఫలంబులునునగు నాకాశాదిమహాభూతంబులైదే తత్త్వంబులనియును నేఁజెప్పి యుండితిం గాదే. ఈ వివిధ మతంబుల తాత్పర్యంబును వివరింతు వినుము. ఈ జగంబును సృజియింప నారంభించి నప్పుడు ప్రకృతి మహదహంకార పంచతన్మాత్రంబులను నేడు కారణరూపంబులను దశేంద్రియ పంచప్రాణమనస్సులను పదునాఱు కార్యరూపంబులనుం దాల్చి తా నీజగంబునకు నుపాదానకారణం బగుటం దన సత్త్వాది గుణత్రయంబుతో సృజ్యత్వాద్యవస్థలం బొందు. పరిణామరహితుండగు పురుషుండు నిమిత్తమాత్రుండై యా ప్రకృతిం జూచుచుండు. కావునఁ బురుషుండు ప్రకృతివిలక్షణుండు. ఈపురుషు నీక్షణంబునం బ్రకృతింబుట్టిన మహదాదు లేడు లబ్ధవీర్యంబులై యన్యోన్యసంగతంబులై యా కార్యరూప జగదండంబును బ్రకృతి బలంబున సృజియించు. ఇఁక నేడే తత్త్వంబు లనువారి మతంబున నాకాశాది మహాభూతంబు లైదునుం దద్ద్రష్ట యగు జీవుండును నీ ద్రష్టృ దృశ్య సాక్షియగు నాత్మయుం జేరి యేడగుం గావున నేతత్కార్యరూప దేహేంద్రియ ప్రాణంబులు సంఘీభవించి యొండొంటినీడకుండు. తత్త్వంబు లాఱనువారు పృథివ్యాది మహాభూతంబు లైదును దద్భిన్నుండగు జీవునితోడ నాఱుగ లెక్కించి

భౌతికంబులకు భూతాంతర్భావంబును జీవునకుం బరమాత్మాంత ర్భావంబును భావించి స్వసంభూతంబులగు నా మహాభూతంబులం గూడి యాత్మయీజగంబెల్లను సృజియించి యందు జీవరూపంబునఁ దాను బ్రవేశించియుండు నందురు. తత్త్వంబులు నాలుగే యనువారు పృథివ్యప్తేజస్సులు మూఁడును నాలుగవవాఁడగు నాత్మవలనం బుట్టెననియు వానిచే నీ సావయవంబగు జగం బుద్భవించె ననియును జెప్పుదురు. తత్త్వంబులు పదునొకండునువార లవి మహాభూతపంచకంబును జ్ఞానేంద్రియపంచకంబును నాత్మయుంగాఁ బరిగణింతురు. తత్త్వంబులు పదునేడనువార లవి పృథివ్యాది మహాభూతంబు లైదును శబ్దాదులైదును జ్ఞానేంద్రియంబు లైదును మనంబును జేరియైన పదునాఱింటికి నాత్మం జేర్చి లెక్కింతురు. తత్త్వంబులు పదునాఱే యనువార లిందాత్మయే సంకల్పించుటం జేసి మనస్సయ్యెనని తలంతురు. తత్త్వంబులు పదుమూఁ డనువారి మతంబున నాకాశాది మహాభూతంబులు శబ్దాదులతోడం గలసి యైదనియుఁ దత్ప్రకాశకంబులగు నింద్రియంబులైదనియు మనంబును జీవుండును బరమాత్మయుం జేరి పదుమూఁడగునని యవి యెన్నంబడుచుండు. 705

తే.గీ. ఇట్లు నానా విధంబుల - ఋషులు తత్త్వ
ములను లెక్కించి రిన్ని లె - క్కలును సరియె
ప్రకృతి పురుషాత్మలక్షణ - పరములును స
యుక్తికము లౌట విజ్ఞోక్తు - లొప్పకున్నె 706

వ. అనిన నుద్ధవుం డిట్లనియె. 707

-: ప్రకృతి పురుష స్వరూప నిరూపణము :-

సీ. అరయఁగాఁ బ్రకృతియుఁ - బురుషుండు జడమును
నజడంబు నగుట భి - న్నాత్మకంబు
లట్లుండియును నవి - యన్యోన్యమును వీడి
వేఱుగానుంట గా - న్పింప దెందుఁ

బ్రకృతి పూరుషునందుఁ - బ్రకృతియం దాతండు
పాల్నీరునట్లు వే - ఱ్పడకయుండు
నవి యొక్కటియొ వేఱొ - యను మహాసంశయం
బరవిందనయన! నా - యాత్మఁ గలఁచు
తే.గీ. యుక్తి నిపుణ! భవద్వచో - యుక్తిదీనిఁ
బాపు సర్వజ్ఞ! జ్ఞానత - ద్భ్రంశములకు
నీవు నీశక్తి హేతువుల్ - జీవకోటి
కనఘ! నీమాయ నెఱుఁగ న - న్యునకుఁ దరమె. 708

వ. అనిన భగవంతుం డిట్లనియె నుద్ధవా! వికారా వికారంబులు నానాత్వైకత్వంబులు సాపేక్ష నిరపేక్షంబులు నప్రకాశ ప్రకాశంబులు నను లక్షణంబులచే నీప్రకృతి పురుషు లత్యంత భిన్ను లది యెట్లనిన. 709

సీ. ప్రకృతినా స్థూల మా - ర్గమున సృష్టంబగు
దేహాది సంఘాత - దృశ్యగణము
పుట్టు నియ్యది గుణం - బులు గలంగిన తఱి
నానావికార సం - తానమయత
గుణమయి నామాయ - గుణములచేఁ జేయు
భేదంబులను బుద్ధి - భేదములను
నాభేదమధ్యాత్మ - మదిభూత మధి దైవ
మనఁగ మూఁడువిధంబు - లగుచునుండు
తే.గీ. దృక్కు మొదటిది రూపంబు - రెండవ యది
యక్షిగోళ ప్రవిష్ట సూ - ర్యాంశమగును
మూఁడవది రూపుఁజూచు టీ - మూఁడు గూడి
నపుడు సిద్ధించు వీని య - న్యోన్యమైత్రి. 710

వ. రూపజ్ఞానంబు చక్షుస్సాపేక్షంబు చక్షుర్జ్ఞానంబు దదధిష్ఠాతృ సూర్యదేవతాసాపేక్షంబు సూర్యుండును నాకాశంబున మండలత్మాకుండై చక్షుర్విషయుం డయ్యునుం బ్రతియోగ్యపేక్షాభావ మాత్రంబునం దనంతన

వెలుంగుచుండు. చక్షురింద్రియంబునకుం బోలెఁ ద్వగాదులకును నీవికార త్రైవిధ్యంబు నెఱుంగనగు. అవి త్వక్స్పర్శ వాయువులును శ్రవణ శబ్దదిశలును జిహ్వారసవరుణులును నాసాగంధాశ్వినులును చిత్తచేతయితవ్య వాసుదేవులును మనోమంతవ్య చంద్రులును బుద్ధి బోద్ధవ్య బ్రహ్మలును నహంకారాహంకర్తవ్య రుద్రులునుం గ్రమంబునం ద్వగాదుల నధ్యాత్మాధి భూతాది దైవంబులై యుండు. ఆత్మయన నీ త్రివిధవికారవిలక్షణుండును నిర్వికారైకకారణుండును నఖిల ప్రకాశక స్వతస్సిద్ధ ప్రకాశ చిన్మాత్రుండై వెలుంగుచుండు. ఈ గుణక్షోభం బొనర్చు నిమిత్తకారణంబగు కాలాత్మక పరమేశ్వరుని వలనం బ్రధానోపాదానకంబై మహత్తత్త్వంబు సాత్త్విక రాజస తామసాహంకారంబులను వికారంబుఁ బుట్టించు. ఈ త్రివిధాహంకారంబే మోహమయ వికల్పత్రయ హేతువగు. 711

సీ. ఈ యహంకృతియుఁ ద - త్కృత వికల్పములను
స్వాత్మ నెఱుంగమి - వస్తువులుగఁ
దోఁచు మూఢులు వానిఁ - జూచి యున్నవి లేవ
టంచు వివాదంబు - లాడుచుందు
రావివాదంబు ల - న్యోన్యయుక్తులఁ జెడు
నవ్వి యవస్త్వాశ్ర - యంబు లగుట
నట్లుండియును మాయ - వవి మత్పరాఙ్ముఖు
లగు వారి బుద్ధుల - యందు నిలిచి

తే.గీ. వారు దత్కృతకర్మ ని - బద్ధులగుచు
నుచ్చ నీచ లోకంబుల - నొందుచుందు
రీ పరిభ్రాంతి వారి స్వ-రూప భూతు
నను నెఱుఁగుదాఁక వారి క-ణంగిపోదు. 712

సీ. అనిన నుద్ధవుఁ డహం - తను వికల్పంబుల
మరుమరీచిక లట్లు - మాయలంటి
జీవుల రూపంబు - నీవంటి వింక వారు
నిన్నెఱుంగక చేయు - చున్న కర్మ

ములఁబట్టి నీచోచ్చు - ముల శరీరంబులఁ
బొంది పుట్టుచుఁ జచ్చు - చుందు రెట్లు
తలఁచుగా లోకమం - దెఱిఁగిన వారు నీ
మాయచేఁ భ్రమిసి యీ - మర్మమెఱుఁగ
తే.గీ. రజుఁడు నక్రియుఁడును విభుం - డైన నీకు
జన్మ కర్మాదు లెట్లగు - జడమతులకు
నెఱుఁగరాదిది గోవింద! - యీ రహస్య
మెల్ల వివరంబుగా నాకు - నెఱుఁగఁ జెపుము. 713
వ. అనిన భగవంతుఁ డిట్లనియె. 714
సీ. కర్మసంస్కార యు - క్తంబగు మన సింద్రి
యాదులతోడ సూ - క్ష్మాంగ మగుచు
నొకదాని విడిచి వే - ఱొక స్థూల దేహంబుఁ
జొచ్చుచు నుండు నా - సూక్ష్మతనువె
దా ననుకొని యన్యుఁ - డౌ నాత్మయు నహంత
వెనుకొని మనసుతోఁ - జనుచునుండుఁ
దాఁ గన్న విన్న య - ర్థముల ధ్యానించుచుఁ
గనువాని రూపు గై - కొనుచుఁదొంటి
తే.గీ. వాని మఱచుచుఁ గర్మ వ - శాను గతిని
మనసు దేహ పరంపరం - జనుచునుండ
నుత్తర శరీరమున నహం - వృత్తి నాట
మనసు పూర్వ శరీరంబు - మాట మఱచు. 715
సీ. యాతనా దేహమం - దభినివేశము గల్గ
భయశోక వికృతు లే - ర్పడు మనసున
నదియె దేవాది దే - హములు దా ననుకొని
హర్ష తర్షాదుల - నందుచుండు
నప్పుడు పూర్వ దే - హంబు దా ననుచున్న
జీవుఁ డందలి యహం - భావమెల్ల

వదలుఁ జావనఁగ ని - య్యదె గాని దేహి స
శించుట గాదు జ - న్మించు టనఁగఁ
తే.గీ. బూర్వ తనువును మఱచి యా - త్ముండు సర్వ
భావముల నదె తానని - పర తనువును
స్వీకరించుటె యందురు - విజ్ఞు లిదియుఁ
గలుగు స్వప్న మనోరథ - తులిత మగుచు. 716
సీ. జని మరణంబుల - సమయంబునం బోలె
స్వప్న మనోరథా - వస్థ లందుఁ
బురుషుండు తొలిమేని - స్మరియింపఁ దప్పటి
తనువున మునుపటి - ధ్గాన నట్లె
యప్పుడే దాఁ బుట్టి - నట్టులు తలపోయు
నిటఁ బోలె ద్వంద్వంబు - లటనుఁ బొందు
నది దీనియట్లె ని - త్యంబని భావించు
నిదియెల్ల మానస - సృష్టి త్రివిధ
తే.గీ. మాత్మ వస్తువునందు ను - న్నట్లు తోఁచు
వెలిని లో నను భేదంబు - గలుగు దీన
నాత్మ దుష్పుత్త్ర జనకు న - ట్లన్య జనిత
వికృతులను దెచ్చుకొని కుందు - వికలుఁ డగుచు. 717
సీ. గణుతింపరాని వే - గము గల కాలంబు
చే ననుక్షణము నీ - సృష్టియందు
వివిధ దేహంబు లు-ద్భవ మందు నశియించు
నిది సూక్ష్మ మజ్ఞుల - కెఱుఁగరాదు
జ్వాలల నదుల వృక్ష ఫ - లంబులను బోలు
నాభూతతతుల వ - యస్సు లెల్ల
జ్వాలలు దీపంబు - వంటివి నదులు జ
లాకృతు లున్నట్లె - యా పరాత్ముఁ

తే.గీ. డీ పురుషు నట్టిఁడను బుద్ధి - హీనులైన
బహు శరీరుల మతులును - బలుకు లరయ
సత్యములుగావు దేహత - జ్జన్మ మరణ
జీవ భావంబు లెల్ల వీ - క్షింపఁ గల్ల. 718

సీ. పూరుషునకు లేవు - పుట్టువు సావు న
ట్లగుట నాతం డజ్ఞుఁ - డయ్యు నతని
కర్మబీజముచేతఁ - గాంచఁడు జన్మంబు
మరణంబునేని నా - పురుషుఁ డట్లు
జనిమరణంబులఁ - గనుచుండునట్లు వి
భ్రాంతి నజ్ఞునకుఁ జూ - పట్టుచుండు
నదియు మహాభూత - మగు నగ్ని కొయ్యలోఁ
బుట్టి మాసినయట్లు - పొల్చునట్లె

ఆ.వె. విను నిషేక గర్భ - జని బాల్య కౌమార
యౌవనములు నడివ - యస్సు ముదిమి
మృతియు నను నవస్థ - లీ తొమ్మిదియు దేహ
మునకె గలవు పూరు - షునకు లేవు. 719

తే.గీ. ఇవి మనోరథమయము లా - త్మేతరమగు
తనువునకుఁ గల్గు హెచ్చులు - తగ్గులగు న
వస్థ లివి గుణసంగియౌ - వాఁడు వొందుఁ
బాయు నివి దైవకృప జ్ఞాన - వంతుఁ డొకఁడు. 720

క. తన తండ్రిని గొడుకును గని
తనకు భవాప్యయములుంటఁ - దానూహించున్
జని నాశము గల వస్తువు
లను నెఱిఁగినవాఁడు దద్వి - లక్షణుఁడె యగున్. 721

ఉ. బీజమునందుఁ బుట్టినది - వృక్షము దాని విపాకమందు నా
భూజము నాశమొందునని - పొందుగ దాని జని ప్రణాశముల్

నైజమనీష వేఱయి క-నంగల వాఁ డదిగాక యుండు నా
యోజను దేహముం గనుచు - నుండెడి వాఁడది గాక వేఱగున్. 722

ఆ.వె. ఇట్లు ప్రకృతికన్న - నే వేఱని విమర్శ
నెఱుఁగకుండు పురుషుఁ - డీశరీర
మే నిజం బటంచు - నెదనమ్మి సంసార
మున నిపాతమొందు - మూఢుఁ డగుచు. 723

సీ. పురుషుండు సాత్త్వికం - బులగు కర్మములచే
సురలందొ ఋషులందొ - పొరయుఁ బుట్టు
నతఁడు రాజస కర్మ - మాచరించినయెడ
జనియించు నరులందొ - దనుజులందొ
తామసకర్మంబుఁ - దాఁజేయఁ దిర్యక్త్వ
మునొ భూతజన్మమో - పొందు నతఁడు
త్రిగుణసంగంబిట్లు - త్రిప్పులఁ బెట్టంగ
భ్రమ వాఁడు గర్మ చ-క్రమునఁ దిరుగుఁ

ఆ.వె. దా నకర్తయైన - ద్రష్టయయ్యును నాత్మ
బుద్ధిగుణ విశేష - ములను జూచి
ద్రష్ట నృత్య గాన - తాళానుకరణంబుఁ
జేయుగతిని దాను - జేయుఁ గ్రియలు. 724

సీ. నీరు పారుచునుండఁ - దీరవృక్షంబులు
పఱచుచున్నట్లు గ - న్పట్టుమాడ్కిఁ
గన్నులు దిరుగుచుఁ - నున్నఁ జుట్టును భూమి
తిరుగుచున్నట్లు వ - ర్తించురీతిఁ
దలఁపుల బుద్ధుల - బొలిచెడు విషయాను
భవము దా నొందిన - ట్లవు విధమున
గలయందు బుద్ధిచేఁ - గల్పితంబగు లోక
మంతయు నిక్కమ - ట్లగపడుగతి

తే.గీ. విషయముల లేని సుఖము గ - ల్పించు మనసు
దాని నిజమని భ్రాంతి నా - త్మయును జూచు
నాత్మసంసార మగు విష - యానుభవము
లేక యున్నట్లు తోఁచు క - ల్పితము మిథ్య. 725

తే.గీ. విషయములు లేనివైనఁ బూ-రుషుని వదలి
పోదు సంసృతి విషయము - ల్బుద్ధినెంచ
స్వప్నమున వివిధానర్థ - జాత మెల్ల
నున్న యట్టులె తోఁచుచు - నుండుఁ గాదె. 726

తే.గీ. అట్లు గావున నసదింద్రి - యములచేత
విషయములఁ గొను టుద్ధవా! - విడుపు మెపుడు
నాత్మ నెఱుఁగమిఁ గల్పితం - బౌ భ్రమాత్మ
కం బఖిల మంచుఁ గను సంశ - యంబు మాని. 727

-: భిక్షుగీత :-

తే.గీ. అన్ని విధముల విషయ భో - గార్థమేనిఁ
బ్రాప్త దుఃఖాపవారణా - ర్థముగ నేని
యత్న మావంతయైనఁ జే - యక నిరంత
రాత్మ నిష్ఠైకరతుఁడవై - యలరు మీవు. 728

వ. ఇట్లు యోగి పరిత్యక్త సర్వారంభుండై యున్నతఱి. 729

సీ. దుష్టులు దను నెంత - దూరిన నవమతిఁ
జేసిన హేళనఁ - జేయుచున్న
సద్గుణంబులను దో - షములుగా నెంచినఁ
గొట్టిన నిర్బంధ - పెట్టుచున్న
జీవనోపాయంబుఁ - జెడఁగొట్టినను బైన
నుమిసిన నైన మూ - త్రము విడిచిన
బహువిధంబుల నిట్లు - బ్రహ్మనిష్ఠఁ జలింపఁ
జేసిననైన ని - శ్శ్రేయసార్థి

తే.గీ. యైన సాధువు గష్టంబు - లన్ని యోర్చి
తన మనసు బుద్ధిచేత స్వ - స్థముగ నిలిపి
సద్విచారంబుచే మన - శ్శాంతి నొంది
ధీరుఁడై తన్నుఁ దాఁ గడ - తేర్పవలయు. 730

సీ. అన విని యుద్ధవుం - డను దేవ! యేమాట
నీవలె జెప్పఁగా - నేర రెవరు
నిపు డీవు సెప్పిన - యీయర్థము సుబోధ
మగునట్లు వివరింపఁ - దగుదు మాకు
నీధర్మములయందు - నిరతులై శాంతులై
నీపాదభక్తులై - నిలిచియుండు
వారలుదప్ప నే - పాటిపండితు లైనఁ
దమకు దుష్టులు సేయు - తప్పు సైఁప

తే.గీ. నోపరని యెంతు విశ్వాత్మ! - యోర్వరాని
బలము గలది గదా స్వభా - వంబు నరుల
కట్టు లోర్చినవార లెం - దైనఁ గలరె
వినవలతు నాకుఁ జెప్పవే - విశదముగను. 731

వ. అని యిట్లుద్ధవుండు శ్రీకృష్ణదేవు నడిగెనని చెప్పి శుకయోగీంద్రుండు
పరీక్షిన్నరేంద్రు నవలోకించి మఱియు నిట్లనియె. 732

క. తను నిట్లు భాగవత ధ
ర్మ నిరూఢిం దెలుపుమనుచుఁ - బ్రార్థించిన భృ
త్యునిమాట నాదరించుచు
ననియెన్ శ్రవణీయవీర్యుఁ - డగు హరి కృపతోన్. 733

తే.గీ. తనమనసు దుర్జన దురుక్తు - లను గలంగ
దాని శాంతంబుఁ జేయఁగా - లేనివాఁడు
సాధువేకాఁడు గద సురా - చార్యశిష్య
నీవెఱుంగవె సాధుస్వ - భావ మవని. 734

క. వలువల పరుసపుఁ బలుకుల
ములుకులు తనయాయములను - బొడిచినపుడు నొ
వ్వొవలసిన వడువున నెవ్వఁడుఁ
గలఁగఁడు గుఱి నమ్ములు మెయిఁ - గాఁడిన యపుడున్. 735

క. ఇల నీయర్థంబునకుం
గలదు మహాపుణ్యమైన - కథ యొక్కటి ని
శ్చలమతి వినుమది నీమది
గల సంశయమెల్ల వీడఁ - గా వర్ణింతున్. 736

క. మును దుర్జను లొక యతికిన్
ఘన పరిభవముం బొనర్పఁ - గా నది యతఁడున్
దనమది ధీరత నోరిచి
తన కర్మవిపాక మనుచుఁ - దాఁ దలపోసెన్. 737

సీ. వెలయు నవంతిలో - ద్విజుఁడొక్కఁడు ధనాఢ్యుఁ
డతఁడు బేరమున సే - ద్యమునఁ బ్రతుకుఁ
గామి కదర్యుండు - గడుఁ గోపనుఁడు లోభి
తాను భుజింపఁ డె - వ్వాని కిడఁడు
జ్ఞాతుల నతిథుల - నాతఁడు మాటమా
త్రంబుననైన మ - ర్యాదసేయఁ
డెప్పుడు నాత్మనౌ - నే వాని పాడింటఁ
గోరికల్వడయఁగా - నేరకుందు

తే.గీ. నవని దుశ్శీలుఁడుఁ గదర్యుఁ - డగు నతనికి
భార్య కొడుగులుఁ గూఁతులు - బంధువులును
గడఁక నెగ్గొనరింతురు - గాన వారు
వీని మాటను వినరైరి - విన్నఁబోయి. 738

తే.గీ. ధర్మకామ విహీనుఁడై - ధనపిశాచి
కై ధనముఁ గూర్చి యుభయలో - కములఁజెడిన

వాని కలిగిరి ధన పంచ - భాగులైన
దేవ ఋషి భూత పితృగణా - తిథులు వరుస. 739

తే.గీ. వారిఁదలఁపమిఁబుణ్యంపు - దారిఁదప్పి
యున్న యతఁడు గృష్యాది బ-హు ప్రయాసఁ
గూర్చి దాఁచిన ధనమెల్లఁ - గొంచెమైన
మిగులకుండ నశించె ని - ట్లగుట యరుదె. 740

తే.గీ. బ్రాహ్మణాభాసుఁడగు వాని - ద్రవ్య మెల్లఁ
గొంత జ్ఞాతులు దొంగలు - గొంతఁ గొనిరి
దైవ కాలవశంబునఁ - దఱిగెఁ గొంత
నరులు దొరలును మఱికొంత - నాఁచికొనిరి. 741

ఉ. ఈగతి ద్రవ్యమెల్ల నశి - యించిన విప్రుండు ధర్మదూరుఁడున్
భోగవివర్జితుండు నయి - పొక్కుచు నెల్లరుఁ దన్ను దెప్పుచున్
బాగుగఁ జెంతఁ జేరుపమిఁ - బట్టఁగరాని మహామనోవ్యథన్
సాఁగిన నాటి పూర్వపు ద - శం దలపోయుచునుండె నుద్ధవా! 742

ఆ.వె. ఇట్లు డబ్బువోయి - యెదఁ బరితాపంబు
నొంది ఖిన్నుఁడగుచు - నుబ్బి బాష్ప
జలము గంతమానఁ - జాల దుఃఖించు నా
యనకుఁ బుట్టెఁ దీవ్ర - మైన విసుగు. 743

సీ. అప్పు డావిప్రుఁ డి - ట్లనె నక్కటా వృథా
నాయాత్మఁ దపియింపఁ - జేయుటాయె
నర్థార్జనమున నా - యాయాస మిది ధర్మ
కామ సాధనమును - గాక పోయెఁ
దఱచుగా ధరణిఁ గ - దర్యుల విత్త మె
ప్పటికి వారికి సుఖ - ప్రదముగాదు
వారల కది యిందుఁ - బరితాప హేతువు
చచ్చిన నరకంబుఁ - దెచ్చు నందుఁ

తే.గీ. గీర్తిమంతుల శుభ్రమౌ - కీర్తినైన
గుణము గలవారి యొప్పగు - గుణమునైనఁ
జెఱుచు నలుసంత లోభంబు - సేరెనేనిఁ
దెల్లపొడ మేని యందంబు - నెల్లఁ బోలె. 744

సీ. ధనముఁ గూర్చుటను గూ - ర్చిన దానిఁబెంచుట
బాగుగా దాని గా - పాడు కొనుట
వ్యయమునఁ జేటున - ననుభవించుటయందు
నరుల కాయాస సం - త్రాసములును
జింతయు భ్రమయు నిం - తింతనరాకుండు
నివిగాక ద్రవ్యసం - భవము లగుచుఁ
బదునే ననర్థముల్ - బ్రాపించు మనుజుని
నవియును స్తేయ హిం - సానృతములు

తే.గీ. దంభ కామ స్మయములుఁ గ్రో - ధ మద భేద
వైరములు నవిశ్వాస సం - స్పర్ధలును బ
దంతి పొందును జూద మా - టయును గల్లు
ద్రావుటయు నను వ్యసనముల్ - దారుణములు. 745

వ. మఱియును 746

ఉ. అన్నలు దమ్ములున్ సతులు - నాప్తులు మిత్రులుఁ దల్లి దండ్రులై
క్యోన్నతిఁ జూడ ముచ్చటగ - నొద్దిక నున్నను నొక్క కానికై
భిన్నతనొంది శత్రులయి - బీరముతోఁ గలహించి స్పర్థ ము
న్నున్న స్వమైత్రిఁ బోవిడిచి - యూరక చత్తురు వ్యర్థజన్ములై. 747

క. సురలును వలవందగు నీ
నరజన్మము నందు బ్రాహ్మ - ణత్వము గని యె
వ్వ రుపేక్ష స్వార్థమును జెఱు
తురు వారలు పోదు రట్ల - ధోగతి పాలై. 748

ఆ.వె. స్వర్గమోక్షములకు - ద్వారమౌ నీ లోక
మందుఁ బుట్టి మర్త్యుఁ - డైన పురుషుఁ

డిం దనర్థములకు - నెల్ల బుట్టిల్లగు
నర్థమందు సక్తుఁ - డగుట తగునె? 749

తే.గీ. ఆత్మధనమునఁ బాలి వాం - డ్రగు సురర్షి
భూత పితృ బంధు జనులకు - జ్ఞాతులకునుఁ
బంచి పెట్టక తిన కది - పాతిపెట్టు
నతఁడు యక్షధనుం డధః - పతన మొందు. 750

తే.గీ. ఎవి వివేకుల ముక్తికి - హేతువులగు
నా వయోవిత్తబలములు - వ్యర్థమైన
ద్రవ్యము గడించుటనె ప్రమా - దమునఁ బోయె
నిప్పు డే నేమి సాధింతు - వృద్ధనైతి. 751

తే.గీ. ఎఱుకఁ గలవారు సైత మ - దేమొ కాని
పలుమఱును వ్యర్థమగు నర్థ - వాంఛఁ గష్ట
పడుచు నున్నారు లోకంబు - వాస్తవముగ
నెవని మాయనొ మునిఁగి పో-యినది లెస్స. 752

తే.గీ. మృత్యు వొకతట్టు తనుఁ బట్టి - మ్రింగుచుండఁ
దనకు నేటికి ధనచయం - బును ధనదులు
గామములు గామదులు జన్మ - గతుల కీడ్చు
కర్మకోటులు ని- వి యెల్లఁ గాల్చుటకునె. 753

తే.గీ. అఖిలదేవమయుండగు - హరికిఁ బ్రీతి
గలదు నాయెడ నిజముగాఁ - గాకయున్న
నాకు సంసారమును దాఁట - నావయైన
యీదశయు వేసటయుఁ గల్గ - టెట్టులిపుడు. 754

ఆ.వె. ఉండునేని మిగిలి - యుండు నా యాయువు
కాలమందుఁ దనువు - గరఁగునట్టు
లప్రమత్తుఁడ నయి - యఖిలార్థసిద్ధికై
యాత్మతుష్టి యత్న - మాచరింతు. 755

ఆ.వె. అందు నాకనుగ్ర - హము ద్రిభువనవిభుల్
సురలు బ్రీతిఁ జేయు - దురు ముహూర్త
మునను బ్రహ్మలోక - మును బొందలేదె ఖ
ట్వాంగుఁడనెడి మనుజ - వరుఁడు తొల్లి. 756

క. అని తన మనమున నిశ్చయ
మును జేసి యవంతివిప్ర - ముఖ్యుఁడు మతిలో
ననుమానము లుడిగి ప్రశాం
తిని భిక్షుండగుచు మౌన - నియతిన్ దాల్చెన్. 757

వ. అంత 758

చ. అతఁడు చరించె నీ ధరణి - యందు మనంబును నింద్రియాసుసం
తతిని జయించి భిక్షముఁ గొ - న న్నగరంబులు నూళ్లు సొచ్చుఁద
న్నితరు లెఱుంగకుండ మది - నేదియు నంటక మాటలాడ కీ
గతి నవధూతుఁడై తిరుగఁ - గాఁ బ్రవయస్కుని నా యతీశ్వరున్. 759

సీ. కనుగొని దుర్జనుల్ - గర్వించి యతనికి
బహువిధంబులఁ బరి - భవ మొనర్తు
రొకఁడు త్రివేణువు - నొడిసి కైకొను జోలె
నొకఁడు గమండలు - వొకఁడు గొనును
జపమాల నొకఁడు గా - షాయంబు లొక్కఁడు
బొంత గుశాసనం - బును నొకండు
గొని చని మరల వా - నిని దెచ్చి స్వామీ! యి
వే పుచ్చుకొం డని - యిచ్చునట్లు

తే.గీ. చూపి కొనిపోదు రా యతీ - శుండు భిక్ష
మెత్తి యన్నంబు నదియొద్ద - నిడి భుజింప
దానిలోఁ బాపమతులు మూ - త్రంబు విడుతు
రతని నెత్తిని నుమియుదు - రంతఁ బోక. 760

సీ. పలుక కుండెడువానిఁ - బల్కరింతురు పల్కఁ
డాయెనా కొట్టుదు - రతనిఁ బట్టి

మఱికొంద ఱితఁడు దు - ర్మతి దొంగ యని వాని
వాక్కుల బెదరింతు - రుక్కుమీఱి
కట్టుఁడు కట్టుఁడం - చట్టె వానినిఁ బట్టి
త్రాళ్ళ బంధింత్రు కొం - దఱు దురాత్మ
లితఁడు వంచకుఁడగు - కృత్రిమయతి క్షీణ
ధనుఁడయి తనవారు - దన్ను దరుమ

తే.గీ. నిప్పు డీతఁడు బ్రతుకు నీ - వృత్తిఁ బూని
తన నిజస్థితి తెలియునో - యని పలుకఁడు
జ్ఞానగంధలవంబును - లేనివాఁడ
టంచు నిందింత్రు మఱికొంద - ఱతనిఁజూచి. 761

తే.గీ. మఱియుఁగొందఁ ఱొహో వీఁడు - మహితబలుఁడు
వీని ధైర్యంబు హిమగిరి - కైన లేదు
మాటలాడక కడు గట్టి - మనసుతోడఁ
గోరికలఁ దీర్చుకొను వీఁడు - కొంగఁబోలె. 762

ఆ.వె. అనుచుఁ బరిహసింతు - రన్య లపానదు
ర్వాత మతనిపైన - వదలుచుందు
రాటపిట్టఁబోలెఁ - ద్రాటఁ గట్టుదురు ని
ర్బంధపెట్టుచుంద్రు - వానిఁ బట్టి. 763

సీ. ఈవిధంబున వాఁడు - దైవిక దైహిక
భౌతిక దుఃఖముల్ - వడుచు నాత్మ
నా వచ్చునవి యెల్ల - దైవసంప్రాప్తంబు
లనుభవింపక తప్ప- వని తలంచుఁ
దనధర్మమున నిల్చి - తలఁగక సాత్త్విక
ధైర్యంబుఁబూని యా - తందు దన్ను
నధము లధర్మంబు - నందుఁ ద్రోయుచు నవ
మానంబు సేయ నీ - మాడ్కి నెంచె

తే.గీ. నాకు సుఖదుఃఖహేతువు - ల్నరులు గారు
కారు దేవతలాత్మయు - గ్రహగణంబుఁ
గావు కర్మంబుఁ గాలంబుఁ - గారణంబు
మనసె సంసారచక్రసం - భ్రామకంబు. 764

తే.గీ. బలయుతము మానసమె గుణం - బుల సృజించుఁ
బొడము నందుండి కర్మముల్ - ముత్తెఱంగు
లగుచు వేత్వేఱ శుక్ల కృ - ష్ణాతిశోణ
వర్ణముల సాత్త్వికాది స్వ - భావములను. 765

తే.గీ. అట్టి కర్మంబుల ఫలంబు - లగుచుఁ బుట్టు
దేవ తిర్య ఙ్నరాదిక - త్రివిధ జాతు
లింతయును మానసోద్గతం - బీజగంబు
దీని తగు లాత్మ కేమాత్ర - మైన లేదు. 766

సీ. సర్వజ్ఞుఁడును సర్వ - శక్తి సంపన్నుండు
జీవనియంతయుఁ - గేవలుండు
నగు నీశ్వరుఁడు మన - స్సు గుణంబులను సృజిం
పఁగ దన్నియంతృత్వ - వర్తియయ్యుఁ
దక్రియాసంగంబు - దక్కి నిత్యజ్ఞాన
సుఖరూపుఁడై దానిఁ - జూచుచుండు
జీవుండు చేష్టాస్వ - భావమై సంసార
బీజమౌ మనసుతోఁ - బెరసి కర్మ

తే.గీ. సంగమునఁ గోర్కులొందుచు - సన్నిబద్ధుఁ
డగుచు నుండును గావున - నఖిలమైన
సంసృతి మనఃకృతంబె త - త్సంగరహితుఁ
డైన యాత్మకు లేదు స - త్యముగఁ జూడ. 767

సీ. దానంబులును నిజ - ధర్మంబు గర్మముల్
శ్రుతమును విహిత స - ద్వ్రతము లెల్ల

యమములు నియమంబు - లన్నియు మనసును
నిలుపు ఫలం బిచ్చి - నిలిచిపోవు
జ్ఞానంబనంగ మ - నోనిగ్రహంబె యు
ద్దాని కివెల్ల సా - ధనము లరయ
మన సెవ్వనికిఁ జలిం - పక ప్రశాంతం బగు
నతనికి నేల దా - నాదులెల్ల
తే.గీ. మనసు విక్షిప్త మగుచు నె - వ్వనికి వశము
గాక చెడు వాని దానాది - కంబువలన
నగు ప్రయోజనమేమి కృ - త్యం బశేష
మును గృతంబగు నతనికి - మనసు నిలువ. 768
సీ. మనసు వశంబుఁ జే - సిన వాని కింద్రియ
దేవత ల్వశులౌదు - రీ విధమున
మన సన్యముల వశం - బున నిల్వ దదిబల
వంతుల కతిబల - వంతమగుట
నది భయంకరము యో - గారూఢులకుఁ గూడ
నట్టి దానినిఁ జిక్కఁ - బట్టఁ గలుగు
వాఁడె సర్వేంద్రియ - వర్గంబు గెల్చిన
వాఁ డట్టి దుర్జయ - వైరి మర్మ
తే.గీ. భేది యత్యంత దుస్సహ - వేగమైన
మనసు గెలువక కొందఱు - మర్త్యులందు
స్నేహితులు శత్రువులు నుదా - సీను లనుచు
భేదమొనరింతు రిల నవి - వేరు లగుచు. 769
క. మనసే దేహము దీనిం
గొని నాయది నే నటంచు - గ్రుడ్డిమతుల నే
నని పరుఁడని భ్రమఁ దిరుగుదు
రనయమును దురంత పార - మగు సంసృతిలోన్. 770

సీ. మూలంబు సుఖదుఃఖ - ములకు నీ జనులైన
నవి పార్థివములౌట - నాత్మకేమి
తన నాల్క నొక్కఁడు - దన దంతములఁ గొఱి
కిన దాను నొప్పి కె - వ్వనికిఁ గినియు
దుఃఖంబులకును హే - తువులు దేవతలన్న
నాపక్ష మందును - నాత్మ కేమి
వా రిరువురును వి - కారాత్మకులు కన్ను
వ్రేలు దాఁకినఁ దిట్టఁ బోలు నెవని

తే.గీ. సుఖమునకు దుఃఖమునకును - జూడ హేతు
వాత్మయన నన్నుఁ గినియఁగా - నగునె ద్వయము
నాత్మ పరిణామ మాత్ముని - కన్న నన్య
మున్న దన నది మృష రెండు - నొకఁడె యాత్మ. 771

సీ. గ్రహములు సుఖదుఃఖ - కారణంబు లటన్న
నాపక్షమందును - నాత్మకేమి
గ్రహములచేఁ బీడ - గ్రహముల కగుచుండుఁ
దను భిన్నుఁ డాత్ముఁ డె - వ్వనికిఁ గినియఁ
గర్మంబు సుఖదుఃఖ - కారణంబన్నను
నాత్మకు నేమి జ - డాజడత్వ
ములు రెండు నతనికిఁ - గలిగినఁ గావచ్చు
జడము దేహం బాత్మ - జ్ఞానమూర్తి

తే.గీ. కాలమందమె సుఖ దుఃఖ - కారణము త
దాత్మకుం డాత్మ యిఁక నాత్మ - కగునదేమి
వహ్నికిని మంచునకు వేఁడి - వలియుఁ గలవె
ద్వంద్వ మాత్మకులే దిఁకె - వ్వనికి నలుగ. 772

తే.గీ. అఖిలసంసారహేతు వ - హం కృతి కగు
నట్లు ప్రకృతికిఁ బరుఁడగు - నాత్మ కెందు

నెట్లు నెంధున ద్వంద్వ సం - స్సృష్టి గలుగ
దని తెలియ భూతకృతభయం - బందc డెవcడు. 773

చ. అని యతివర్యుc డాత్మ వెల - యం దలపోసి ముకుందపాదసే
వనె మతిc బూని పూర్వతమ - భాగవతోత్తములౌ మహర్షు లె
ల్ల నలవరించినట్టి యమ - లంబగు నాపరమాత్మనిష్ఠ నా
త్మ నిరపుకొల్పి దాcటెదను - దాcటcగరాని భవాబ్ధినం చెదన్. 774

వ. నిశ్చయించె నని చెప్పి భగవంతుం డుద్ధవునింగని మఱియు నిట్లనియె. 775

తే.గీ. ధనముc బోcగొట్టుకొని విర - క్తిని వహించి
వగపుడిగి భూమిcదిరుగుచుc - బలువ లట్లు
దన్నురిభవించుచున్న స్వ - ధర్మచలన
మొంద కా యతి కథc జెప్పు - చుండెనిట్లు. 776

తే.గీ. పురుషునకు సుఖదుఃఖముల్ - బొరయcజేయc
దన్యుcడెవ్వcడు మానసం - బైన భ్రమయె
యరులు మిత్రు లుదాసీను - లనcగc దోcచు
సంసృతి యిదెల్ల నజ్ఞాన - సంభవంబు. 777

తే.గీ. కాన నీబుద్ధి నాయందు - గలిపి నిలిపి
దానిచే నెట్టులైన నీ - మానసంబు
నిగ్రహింపుము వేదాంత - నిశ్చితమగు
యోగ సంగ్రహమిది వింటి - వే గుణాఢ్య! 778

క. ఇది భిక్షుcడు గీర్తించిన
సదమలమగు బ్రహ్మనిష్ఠ - సరణి స్థిరమతిన్
జదివిన విన వినిపించిన
మది నిలిపిన నరుcడు ద్వంద్వ - మల ముక్తుcడగున్. 779

వ. అని సమాదరంబునంబలికి భగవంతుం డుద్ధవునింగని మఱియు నిట్లనియె. 780

-: సాంఖ్య విచారము :-

క. మును గపిలాది మును ల్సె
ప్పిన సాంఖ్యము నీకు నిపుడు - వివరించెద దీ
ని నెఱింగిన పురుషుఁడు గడు
ఘనమగు ద్వంద్వభ్రమంబు - గ్రక్కున విడుచున్. 781

సీ. సృష్టికిఁ బూర్వమీ - దృశ్యమంతయు నేక
మై యవికల్పితం - బగుచు ద్రష్ట
యౌ బ్రహ్మమున లీన - మై యుండెఁగృతయుగం
బందును నంతయే - యందు జనులు
సువివేకనిపుణులై - చూడరు భేదంబు
నణుమాత్రమైన బ్ర - హ్మంబునందు
నా నిర్వికల్ప ని - త్యాద్వితీయ బ్రహ్మ
మిరుదెఱంగుల దృక్కు - దృశ్యమనఁగ

తే.గీ. వాఙ్మనోగోచరంబయ్యె - వానియందు
దృక్కొకటె కార్యకారణా - కృతులు రెండుఁ
బ్రకృతి దాలిచె నన్యథా - భావరహిత
మగుటె జ్ఞానంబు పూరుషం - దనఁగ నదియె. 782

తే.గీ. ప్రకృతి నాదృష్టిచేత క్షో - భంబు నొంది
పురుషుని యదృష్టవశమునఁ - బొలుచుఁ దమసు
రజసు సత్త్వంబు నను గుణ - త్రయముభాతి
నీ గుణంబులె హేతువుల్ - సృష్టికెల్ల. 783

తే.గీ. వానివలనఁ గ్రియాశక్తి - జ్ఞానశక్తి
యనెడి శక్తులు గలిగి మ - హత్తు పుట్టె
నది వికృతిఁబొంద జీవమో - హాస్పదంబు
ముత్తెఱఁగులౌ నహంత దాఁ - బుట్టెనందు. 784

వ. ఇట్లు మహత్తత్త్వంబునం బుట్టిన యహంకారంబు వైకారికంబనీయు రాజసం బనియుఁ దామసం బనియు మూఁడువిధంబులై యుండు. ఇది

క్రమంబుగాఁ దన్మాత్రేంద్రియ మానసంబులఁ బుట్టించి చిదచిన్మయంబై యుండు. ఇందుఁ దామసాహంకారంబువలన శబ్దాదిపంచతన్మాత్రంబులును వానివలన నావరణస్వభావంబగు పంచమహాభూత రూప ప్రపంచంబును జనియించె. రాజసాహంకారంబువలనఁ బ్రవృత్తి స్వభావంబగు నింద్రియ దశకంబును సాత్వికాహంకారంబువలనఁ బ్రకాశస్వభావంబులగుదిగ్వాతార్క ప్రచేతోఽశ్వి వహ్నీం ద్రోపేంద్ర మిత్రచంద్రులను నింద్రియాధిష్ఠాన దేవతలును మనస్సును జనియించె. ఇమ్మహదాదికంబులగు సర్వ భావంబులును వైరాజరూపంబున నంతర్యామినగు నాచేఁ బ్రేరితంబులై పరస్పర సంయుక్తంబులై నాకు నుత్తమాశ్రయంబగు హిరణ్మయాండంబును బుట్టించె. ఈయండంబు సలిలసుస్థితంబై యుండ నేనందు నారాయణ రూపలీలా విగ్రహంబుతో నుండితి. అప్పుడు నా నాభియం దఖిలలోక కారణభూతంబగు నొక్క పద్మం బుద్భవించె. అందుఁ జతురానన రూపభోగ విగ్రహంబు దాల్చి మఱల నా వై రాజుండె యావిర్భవించె. విశ్వాత్ముండగు నాబ్రహ్మ తపోయుక్తుండై రజస్సుచే నా యనుగ్రహంబున నతలాది సహితంబగు భూలోకంబును నంతరిక్షలోకంబగు భువర్లోకంబును మహర్లోకాదిసంయుక్తంబగు స్వర్గలోకంబును లోకపాలురతోడ సృజియించె. అందు భూలోకంబు మర్త్యాదులకును భువర్లోకంబు భూతంబులకును స్వర్గలోకంబు దేవతలకును స్వర్లోకంబునకు మీఁదిలోకంబులు సిద్ధులకును భూమికిం గ్రిందిలోకంబు లసురనాగులకును నివాసస్థానంబులయ్యె. త్రైలోక్యంబున భూతంబులకు సాత్వికాది త్రివిధ కర్మ తారతమ్యంబునుం బట్టి గతి భేదంబులు గలుగుచుండు. యోగతపస్సన్న్యాసంబులవలన మహర్జన స్తపస్సత్యలోకంబుల విమలగతులు గలుగు. భక్తియోగంబునకు మద్గతియే ఫలంబు. కాలాత్మకుండను గర్మఫలప్రదుండను బరమేశ్వరుండను నగు నాచే ధరియింపఁబడుచుండు నీలోకంబు గుణప్రవాహరూపంబగు నీ నంసారంబున సత్యలోకపర్యంతంబగు నుత్తమగతి నొండె స్థావరాంతంబగు నీచగతి నొండెం బొందుచుండు. అణుబృహత్కృశ స్థూలాదికంబగుచు నిం దేయేభావంబు గన్పట్టుచుండు నవియెల్లం

దత్కారణబులగు ప్రకృతి పురుషోభయ వ్యాప్తంబులై యుండు. అది యెట్లనిన దేనికేది యాదియు నంతంబు నగు నదే దానికి మధ్యంబునై యుండు. తద్భిన్నంబుగా నది కానంబడుట వ్యవహారార్థంబైన మిథ్యారూపంబగు వికారమాత్రంబు. అద్యంతంబుల మృత్సువర్ణాదులగు ఘటకటకాదుల మధ్యావస్థయు నయ్యవియ. వాని నామరూపాదివికారం బంతయు వ్యవహారార్థంబై కారణాభిన్నంబైయుండుంగాదే. పూర్వకారణం బగు మహదాదికంబే తన రూపంబుపాదానకారణంబుగాఁ గొని పరంబగు నహమాదివికారంబు సృజియించు. ఎయ్యది యవ్వికారంబునకు నాదియు నంతంబునునగు నట్టి కారణంబే సత్యంబని చెప్పంబడు. పరిదృశ్య మానంబగు నీజగంబున కెల్లం బ్రకృతి యుపాదానంబు. పరమ పురుషుండధిష్ఠానంబు. కాలంబు గుణక్షోభాభివ్యంజకంబు. ప్రకృతి పురుషకాలంబులను నీమూఁడును బ్రహ్మంబగు నేన. జీవభోగార్థంబైన యీ నానావిధసృష్టి కార్యకారణపరంపరారూపంబై యవిచ్ఛిన్నంబై పరమేశ్వరనిరీక్షణం బుండువఱకుం బ్రవర్తించుచుండి యంత నంతంబు నొందు. కాలాత్ముండనగు నాచే వ్యాప్తంబగుచు వివిధ లోకసర్గప్రళయాత్మ కంబగుచుండు నీబ్రహ్మాండంబఖిలభువనంబుతోడ భూతపంచ కపృథగ్భావంబగు లయంబునకు యోగ్యంబగు. అప్పుడు మర్త్యంబులగు శరీరంబులెల్ల నన్నంబున లయం బొందు. అన్నంబు గింజలను నవి భూమిని నది గంధంబును నది జలంబునను నది నిజగుణంబగు రసంబునను నది తేజంబునను నది రూపంబునను నది వాయువునను నది స్పర్శంబునను నది యాకాశంబునను నది శబ్దతన్మాత్రంబుననుం గలియు. ఇంద్రియంబులు తమ యధిష్ఠాన దేవతలందును వారు దమ యుత్పత్తికిఁ గారణంబును దమకు నియంతయునగు సాత్విక మనంబునను నది సాత్వికాహంకారంబునను లీనంబులగు. ఇది సాత్వికాహంకార కార్యలయ ప్రకారంబు. ఇమ్మనంబు బింద్రియ దేవతాయుక్తంబై రాజసాహంకారంబునం గలియుట రాజసాహంకార కార్యవిలయ విధానంబు. తామసాహంకార

కార్యావశేషితం బగు శబ్దంబు తామసాహంకారంబునం గలియుట తామసాహంకార కార్య ప్రళయంబు. అంతం ద్రివిధాహంకారంబు నిజజడాంశంబు విడిచి జగన్మోహనసమర్థంబగు జ్ఞానక్రియాశక్తి మాత్రరూపంబై మహత్తత్త్వంబునం గలియు. మహత్తత్త్వం బాశక్తి ద్వయంబు విడిచి స్వకారణంబగు త్రిగుణ మాత్ర రూపంబై యవ్యక్తంబునం జేరు. అంత నది వృత్తిరహితంబగు కాలంబుతో నేకీభావంబు నొందు. కాలంబు మాయాప్రవర్తకుండు జ్ఞానమయుండు మహాపురుషుండు నగు జీవునియందును నాజీవుండు ప్రకృతిలీలా మాత్రుం డగుటం బ్రతియోగిలేమి జన్మాది విశ్రమరహితంబగు నా రూపంబు నొందు. మద్రూపంబగు నా పరమాత్మ నిరుపాధికుండును విశ్వోత్పత్తి లయంబులకు నధిష్ఠానంబును విశ్వలయావధి భూతుండును నగుట నాత్మస్థుండై తనంత నుండు. 785

తే.గీ. ఇవ్విధమున విమర్శించి - యెఱుఁగు నతని
స్వాంతమునఁ గల్గునే వికల్ప భ్రమంబు
భానుఁ డుదయించి వినువీథిఁ - బ్రబలి వెలుఁగు
చుండఁ జీఁకటి యచ్చట - నుండఁ గలదె. 786

క. ఇది మది సంశయపు న్మొడి
విదళింపం జాలు సాంఖ్య - విధి దీని జగం
బుదయించు సమయు వరుసను
జిదచి ద్విదుఁడవగు నీకుఁ - జెప్పితిఁ దెలియన్. 787

వ. అని భగవంతుండు మఱియు నిట్లనియె. ప్రకృతిపురుష వివేకంబు గలిగినను నరునకు గుణత్రయవృత్తిజయంబు గలిగినంగాని ద్వంద్వోపరమంబు సిద్ధింపదు గావున. 788

తే.గీ. గొనము లొండొంటఁ గలియకుం - డినపు డందు
దేనిఁ గూడిన నెట్టివాఁ - డౌనొ పురుషుఁ
డా విశేషంబు వర్ణింతు - సావధాన
బుద్ధితో విను మిప్పుడు - పురుషవర్య. 789

వ. శమదమతితిక్షా తపస్సత్యదయాస్మృతులును దుష్టిత్యాగవైరాగ్యహ్రీశ్రద్ధా వివేకార్జవ వినయాదులును నాత్మరతియు **సత్త్వవృత్తులు**. కామంబును వ్యాపారంబును దర్పంబును గర్వంబును దృష్ణయు ధనాభిలాషచే దేవతలం బ్రార్థించుటయు భేదబుద్ధియు విషయభోగంబును మదోత్సాహంబును స్తోత్రప్రియత్వంబును నవహాసంబును బ్రభావప్రకటనంబును బలోద్యమంబును **రజోవృత్తులు**. క్రోధలోభానృతహింసా యాచ్ఞా దంభకలహ శ్రమానుశోచన భ్రమదుఃఖ దైన్య నిద్రాశాభయానుద్యమంబులు **తమోవృత్తులు**. ఇఁక మిశ్రగుణవృత్తులు విను మహంకార మమకార పూర్వకంబుగా మనోమాత్రేంద్రియ ప్రాణంబులచేఁ జేయుంబడు వ్యవహారంబును శ్రద్ధారతి ధనావహంబగు ధర్మకామార్థ పరినిష్ఠయు గృహస్థాశ్రమోచిత ప్రవృత్తి నిష్ఠయు స్వధర్మానుష్ఠానంబును గుణసన్నిపాత లక్షణంబులు పురుషుండు శమాదులచే సత్త్వయుక్తుండనియుఁ గామాదులచే రజోయుక్తుండనియుఁగ్రోధాదులచేఁదమోయుక్తుండని యుఁ దెలియంబడు. స్త్రీపురుషులలో స్వకర్మంబులచే నేకోరికయు లేక నన్ను నెవ్వరు భక్తిం భజింతు రట్టివారిని సత్త్వస్వభావులనియుఁ గోరిక లేవేనిఁ గలిగి యట్లు నన్ను భజియించు వారిం రజస్స్వభావులనియు శత్రుమరణాదికంబుఁగోరి నన్నట్లు భజియించు వారిం దమస్స్వభావులనియు నెఱుంగందగు. సత్త్వరజస్తమోగుణంబులు జీవనోపాధియగు చిత్తంబునం బుట్టునవి గావున నవి జీవునకే గలుగుంగాని నాకు లేవు. వాఁడాగుణంబులచే దేహరూపంబులం బ్రవర్తించుచు నిబద్ధుండగు. నేను గుణనియంతనై సృష్ట్యాది కర్త నయ్యు నిత్యముక్తుండనై యుండుదు. ఇఁక నొక్కొక్క గుణంబుద్రేకంబు నొందినం గలుగు ఫలంబు వర్ణింతు వినుము. 790

తే.గీ. మించి రజసును దమసు న - డంచి సత్త్వ
మమలమై శాంతమై ప్రకా - శమును బొందు
నప్పు డది పూరుషునకు సౌ - ఖ్యంబు నిచ్చు
ధర్మమును జ్ఞానశమదమా - ద్యమును గూర్చు. 791

తే.గీ. ప్రబలి సత్త్వతమస్సుల - రజసు గెల్చి
యెప్పు డది సంగభేద ప్ర -వృత్తి హేతు
వగు నపుడు పూరుషున కది - యశము సిరియు
దుఃఖమును గర్మమును దెచ్చుఁ - దొడరి వరుస. 792

తే.గీ. తమసెపు డడంచు రజసు స - త్త్వంబు నప్పు
డది వివేకముమాపి ల - యాత్మకమయి
యలసత నొనర్చి శోకమో - హములు నిద్ర
హింస యాశయుఁ బురుషున - కెసఁగఁజేయు. 793

చ. ఎవనికిఁ జిత్త మచ్ఛమయి - యింద్రియము ల్విరమించి దేహ సం
భవభయమెల్ల దూరమయి - మానసముం దగులంబు మాని సన్
బ్రవిమలదృష్టిఁ జూడఁగల - పాటవమేర్పడు నట్టి వాని నెం
చవలయు నుత్తమంబయిన - సత్త్వము గల్గిన వానిఁగా నిలన్. 794

సీ. బుద్ధి విక్షేపంబుఁ - బొంద నెవ్వఁడు వికా
రముఁ జెంది చేయుఁ గా - ర్యములనెల్ల
జ్ఞానేంద్రియంబు లె - వ్వానికి విషయ సం
గతములై యుపరతిఁ - గాంచవెపుడుఁ
గర్మేంద్రియంబు లొ - క్కట నైన స్వస్థంబు
లై యెవ్వనివశంబు - నందు నిల్వ
వెపుడు నెవ్వనిమనం - బెందెందొ పేరెము
ల్వెట్టుచు నాశలఁ - బెంచుచుండు

తే.గీ. నట్టి పురుషునిఁ జూచిన - యపుడు వాని
యందు రజసుత్కటంబైన - దని యెఱుంగు
రజసె కామాది శత్రు వ - ర్గమున కెల్లఁ
బుట్టిని ల్లుద్ధవా! దాని - పొత్తు వలదు. 795

సీ. శిథిలమై మాయమౌఁ - జిత్త మెవ్వనికిఁ జి
దాకార పరిణామ - మందలేక

మనుసును నిల్పఁ బో - యిన నెవ్వనికిఁ జిక్క
కిటు నటు నేఁగి యెం - దేని మలఁగు
నేది చెప్పిన బుద్ధి - కెక్కక సద్విచా
రాక్షముండయి మూఢుఁ - డగు నెవండు
వ్యర్థంబుగాఁ గష్ట - పడుచు దుఃఖంబుల
పాలగుచుండు నె - వ్వాఁడు ధరణి

తే.గీ. నట్టివానికి నుద్ధవా! - యతిశయించెఁ
దమసనుచు నీవెఱుంగఁ గాఁ - దగును దాని
బలము జగమెల్లఁ గప్పు నా - వరణశక్తి
జనుల సంసారమునకుఁ గా - రణము దమసె. 796

సీ. సత్త్వగుణంబు హె - చ్చను దేవబలము ని
వృత్తి స్వభావంబు - వృద్ధినొందుఁ
బెంపొందుఁ రజసుచేఁ - బెరుఁగు. నాసురబలం
బదె ప్రవృత్తి స్వభా - వాభిదంబు
తమ సుత్కటంబైన - తటిని రక్షోబలం
బవు మోహవృత్తి మా - నవున కెచ్చు
మెలఁకువ సత్త్వంబు - వలన రజస్సునఁ
గల నిద్ర తమసునఁ - గలుగుచుండు

తే.గీ. మూఁడవస్థల విడువక - కూడెయుండి
నిర్వికారైకరూపమై - నిత్యమగుచు
నాల్గవ యవస్థయనఁ దనం - తన వెలుంగు
నాత్ముఁడె తురీయుఁ డనఁబడు - నన్ఘచరిత. 797

తే.గీ. వేదతాత్పర్యమెఱిఁగి య - వ్విధిఁ జరించు
బ్రాహ్మణులకు సత్త్వమున నూ - ర్ధ్వగతి గలుగుఁ
దమసుచే స్థావరాది జ - న్మమగుఁ గ్రింద
రజసు మధ్యమలోక న - రత్వ మొసఁగు. 798

తే.గీ. సత్త్వగుణవృద్ధిఁ జచ్చిన - స్వర్గమబ్బు
రజ సతిశయింపఁజావ న - రత్వమొందు
నతితమస్సున మృతి నిర - యంబుఁ దెచ్చు
నిర్గుణుం డయ్యేనేని నన్ - జేరు నరుఁడు. 799

తే.గీ. ఫలముఁ గోరక మత్పద - ప్రాప్తి కొఱకు
సలుపఁబడు కర్మమంతయు - సాత్త్వికంబు
రాజసం బగునది ఫల - ప్రాప్తిఁ గోర
దంభ హింసాది కృతమగుఁ - దామసంబు. 800

సీ. అది సాత్త్వికజ్ఞాన - మగునేది దేహాది
భిన్నుఁడౌ నాత్ముఁ బ్రా - పింపఁ జేయు
నది రాజసజ్ఞాన - మెది శరీరేంద్రియా
దుల నెఱుంగుచు వానిఁ - గలసి యుంట
పశుశిశుమూకవ - త్ప్రాకృతజ్ఞానంబు
దామసంబనఁ బ్రసి - ద్ధంబు జగతిఁ
బరమేశ్వరుఁడ నయి - భాసిల్లు నన్నుఁ బొం
దించు జ్ఞానంబగు - నిర్గుణంబు

తే.గీ. విజనమగుట వనంబు సా - త్త్వికుల నెలవు
రాజసులు నివసింతురు - గ్రామ మందు
ద్యూత సదనంబు దామసు - లుండుచోటు
నా నికేతంబు నిర్గుణ - స్థాన మనఘ! 801

తే.గీ. సంగముడిగిన కర్తయౌ - సాత్త్వికుండు
రాజసుండగు నత్యంత - రక్తుఁడైన
మతిమఱపు నొందువాఁడు దా - మసుఁడు నన్నె
కోరి సేవించువాఁడు ని - ర్గుణుఁడు సుమ్ము. 802

తే.గీ. సాత్త్విక శ్రద్ధ యాత్మ వి - చారకంబు
రాజసశ్రద్ధ యగును గ - ర్మములు సేఁత

ధర్మమని యధర్మము సేఁత - దామసంబు
ననుఁ గొలుచు శ్రద్ధయే నిర్గు - ణంబు వత్స! 803

తే.గీ. కష్టపడ కబ్బినది యరో- గకర మమల
మైన భుక్తి సాత్త్వికము క - ట్వాది బహుళ
రసము విక్షేపకరము రా - జసము మలిన
మార్తిదము దామసము మద - ర్ప్యం బగుణము. 804

తే.గీ. ఆత్మజన్యంబు సాత్త్వికం - బగు సుఖంబు
విషయ జన్యంబు రాజసా - భిధము మోహ
దైన్య సంజాత సుఖమగుఁ - దామసంబు
కోరి నను జేరఁ గలుగు ని - ర్గుణసుఖంబు. 805

తే.గీ. ద్రవ్యములు దేశములును గ - ర్మములు ఫలము
లెఱుక కాలంబు కర్త యా - కృతి యవస్థ
శ్రద్ధ నిష్ఠయు నీరీతి - సాత్త్వికాది
గుణములను మూఁట ముత్తెఱం - గు లగుచుండు. 806

తే.గీ. ప్రకృతి పురుషుండుఁ గూడుట - వలన నిందు
దృష్టములు నందు శ్రుతములౌ - నెల్ల భావ
ములును మతిఁ బొల్చు నవియు నీ - మూఁడు గుణము
లందుఁ బుట్టినవే యగు - నరసి యెఱుఁగ. 807

చ. గొనములచేతఁ గర్మములఁ - గూరిచి పూరుషుని న్నిబద్ధుఁగాఁ
బొనరిచి యివ్వి సంసరణ - పు న్నుడి వానిని ద్రిప్పుఁ జిత్త సం
జనిత గుణత్రయంబును వె - సం గడఁద్రోచిన జీవుఁ డుద్ధవా!
ఘనమగు భక్తి నన్గొలిచి - కాంచును మత్పదము న్విముక్తుఁడై. 808

తే.గీ. కానఁ బురుషుండు జ్ఞాన వి - జ్ఞాన హేతు
వైన యీతను వొందిన - యపుడె బుద్ధి
మంతుఁడై గుణసంగము - న్మాని నన్ను
నేక భక్తిభజింప నౌ - నిద్ధ చరిత! 809

తే.గీ. ఏమఱక యింద్రియంబుల - నెల్ల గెలిచి
ఫలము గోరక విజ్ఞుండు - గొలుచు నన్ను
సత్త్వ సంసేవ నతఁడు ర- జస్త మస్సు
లణఁచనగు సత్త్వము నణంచ - నగుఁ బ్రశాంతి. 810

తే.గీ. నైరపేక్ష్యప్రయుక్తశాం - తమతి యగుచు
మూఁడు గుణములు విడిచి ప్ర - బుద్ధుఁడైన
జీవుఁ డీ లింగదేహంబుఁ - బోవ నణఁచి
శాంతుఁడైఁ నన్నుఁ బొందఁగాఁ - జాలు నసఘ! 811

తే.గీ. ఎవఁ డనాదిజీవత్వ హే - తువగు లింగ
దేహమును జిత్తమునఁ బుట్టు - త్రిగుణములను
బాసి పరిపూర్ణుఁడగు వాఁడు - బ్రహ్మమైన
నను గలిసి వెల్పలను లోప - లను దిరుగఁడు. 812

వ. అని మఱియు భగవంతుం డిట్లనియె. 813

ఆ.వె. అరసి సన నెఱుంగఁ - బరమ సాధనమైన
యీశరీర మొంది - యెవఁడు భక్తి
నన్నుఁ గొలుచు వాఁడు - నను బుద్ధిసాక్షి నా
నందమయుఁ బరాత్ముఁ - బొందనేర్చు. 814

తే.గీ. జ్ఞాననిష్ఠను గుణమయం - బైన సూక్ష్మ
వపుపు వొలిసిన యాతఁడ - వస్తువగుచు
దృశ్యమగు మాయలోన వ - ర్తించుచున్న
గుణములను వస్తువుల నంటు - కొనఁడు బ్రమసి 815

-: ఐళ గీత :-

క. మనుజుఁడు శిశ్నోదర త
ర్పణ పరుఁడగు కుజనుఁ గూడ - రా దెన్నడుఁ గూ
డిన నాతఁ డంధువెంటం
జను నంధుని పగిదిఁగూలు - సంతమసమునన్. 816

క. ఈ యర్థమునఁ బురాతన
మై యొప్పెడు నొక్క గాథ - యది నీ కిపుడే
నో యుద్ధవ! వర్ణించెదఁ
బాయక విను మనుచు హరి కృ - పామతి ననియెన్. 817

సీ. ము న్నిళాకన్యకుఁ - బుట్టెఁ బురూరవుం
డను చక్రవర్తి వి - ఖ్యాత కీర్తి
యతని సౌందర్యాదు - లట విని యూర్వశి
వలచి మనుష్య రూ - పమున వచ్చి
నిలిచె నాతేనిముం - గల దాని యందంబు
గని వాఁడు భ్రాంతుఁడై - కదిసె దాని
నంత నా యిద్దఱుఁ - గంతుని వలఁ జిక్కి
గడుచు కాలము నెఱుం - గక చరించి

తే.గీ. రంత నొకనాఁడు నగ్నుఁడై - నట్టి యతనిఁ
గాంచి యూర్వశి వెడలె స్వ - ర్గమున కరుగ
దాని నెడబాయఁజాలక - దీనుఁడగుచు
శోకమును బట్టలేక చీ - కాకు నొంది. 818

ఆ.వె. తన్నుఁ బాసి యేఁగు - దానిఁ జూచి వివస్త్రు
డైన రాజు వెఱ్ఱి - వానిఁ బోలి
యేడ్పు టెలుఁగు తోడ - గృహిణి ఘోరా నిల్వ
వే యటంచు దాని - వెంబడించె. 819

తే.గీ. ఏండ్ల నిశలను దనివి యొ - క్కింత లేక
నీచ కామంబు లొందుచుం - డిన నృపాలుఁ
డెఱుఁగఁ డయ్యెను వచ్చుచు - నేఁగుచుండు
రేల నూర్వశి తన మనం - బోలి నీడ్వ. 820

ఆ.వె. అప్పు డా నరేంద్రు - నాత్మను నూర్వశిఁ
బాయు శోక మెక్కు - వగఁ గలంప

వగలఁ బొగిలి పొగిలి - వ్యాకులచిత్తంబు
తోడ నిట్లనంగఁ - దొడఁగె విసివి. 821

సీ. ఊర్వశీ బాహుల - తోపగూహితకంఠుఁ
డైన నాచిత్తమ - య్యారె యెంత
కామకశ్మలమయ్యె - వ్యామోహముత్కటం
బై ముంచె నన్ను నా - యాయు వెల్లఁ
దునుకలై పగలు రా - త్రులుగ క్షీణించె నే
నీ కీడొకింతయు - నెఱుఁగనైతిఁ
బ్రొద్దు గ్రుంకుటయును - బొడుచుట యీ యింతి
పొత్తునఁ దెలియక - పోయె నకట

తే.గీ. దినములను వారములు నెల - లీర్ఘ వత్స
రంబులును నెన్ని చనియె వ్య - ర్థంబులగుచు
మోహమునఁ జక్రవర్తిని - భూపమణిని
స్త్రీకిఁ గ్రీడామృగంబనై - చిక్కినాఁడ. 822

తే.గీ. అఖిల రాజ్యాంగ సహితుఁడ - నైన ప్రభుని
నన్నుఁ దృణమట్లు ద్రోచి యీ - నాతి వోవ
వెఱ్ఱివలె నేడ్చుచును దాని - వెంటఁ గట్టు
బట్టలేకయె చనుచున్న - వాఁడ నౌర. 823

తే.గీ. కాళ్ళఁ దనుఁ దన్ను పెంటి వె - న్కఁజను ఖరముఁ
బోలి పోయెడు స్త్రీవెంటఁ - బోవుచుందు
నాకు నేటి ప్రభావ మ - స్తోకబలము
ప్రాభవంబును దేజంబు - బలము సిరియు. 824

తే.గీ. స్త్రీ యెవని మానసంబు హ - రించు వాని
కేల విద్యయుఁ దపమును - నేల త్యాగ
మేల యేకాంత సేవయు - నేల శ్రుతము
మౌనమును నేల వ్యర్థమౌ - గ్లానిగాదె. 825

తే.గీ. పండితుండ ననుకొనుచుండు - పామరుండ
నాకుఁ బరమార్థ బుద్ధి సుం -తయును లేదు
ధరణిపతి నైతిఁగాని గో - ఖరములట్లు
స్త్రీ జితుండ నాదు జన్మంబు - ఛీ యిదేల. 826

తే.గీ. అనుచుండితి నూర్వశి - యధురమధువు
నెన్ని సంవత్సరంబులో - యేమి వింత
మనసిజుండు కాముఁ డేమియుఁ - దనివిఁ జెందఁ
డాజ్యమునఁ దృప్తి నొందని - యగ్ని యట్లు. 827

సీ. స్వైరిణీ వంచితం - బై రాగ పాశని
బద్ధమై దానిచేఁ - బట్టు వడిన
నాచిత్త మాబంధ - నమునుండి విడిపింప
వలఁతి యాత్మారాముఁ - దలఘుశక్తి
భగవంతుఁ డీశ్వరుం - డగు నధోక్షజుండె గా
కితరుఁ డెవ్వఁడు శక్తుఁ - డెంచి చూడ
దేవి యూర్వశి నాకు - దివ్య వాక్కులను బో
ధించిన దుర్మతిఁ - దెలియనైతి

ఆ.వె. మనసు నిలుపలేని - మందుండ నా మనో
గుహను మొలిచి యల్లు - కొనిన మోహ
లతలఁ ద్రెంపనేర - గతి యేమి నా కిఁక
నెంత వంతఁ దెచ్చె - నింతి పొత్తు. 828

క. అనుచుం జింతించెడు నా
తని మతిని వివేక మపుడు - తలయెత్తుటయున్
జనపతి యిట్లు వితర్కిం
చెను సువిచార ప్రవీణ - చేతస్కుండై. 829

సీ. కాముకులగు మాకుఁ - గామిని యిది యేమి
యపకార మొనరించె - నట్టె చూడ

నిది త్రాడటంచుఁ దా - నెఱుఁగని ద్రష్టకు
మతిచెడ నటఁ గనం - బడిన పాము
సేసిన కీడేమి - మోసపోయి యనిర్జి
తేంద్రియుండగు నాదె - యింత తప్పు
కడు మలినంబు దు - ర్గంధ భూయిష్ఠంబు
నశుచి యౌ దాని దే - హం బదేడ
తే.గీ. సుందరంబు సుగంధియు - శుద్ధ మనుచు
దాని నే నెంచుటేడ వా - స్తవము సూడ
నన్య వస్తు గుణంబుల - నందు నున్న
యట్లు చూచు నవిద్యచే - నయ్యె నింత. 830
సీ. ఇది కన్న తల్లిదండ్రు - లదొ భోగదాయిని
యగు భార్యదో స్వామి - యగు నతనిదొ
యంతమం దాహుతి - యగుట నగ్నిదొ దాని
భక్షించు కుక్కదో - పక్షులదియె
యది సేయుచుండు శు - భాశుభంబులఁ బొందు
నాత్మదో యుపకారు - లగు హితులదొ
యని నిశ్చయము సేయ - ననువుగాని కళేబ
రం బిది కడు నమే - ధ్యంబు తుచ్ఛ
తే.గీ. మిట్టి స్త్రీదేహమును జూచి - యెంత మంచి
దెంత చక్కని మొగము ము - క్కెంత సొంక
మా మొలకనవ్వు సొగసేమి - యహహ యనుచు
మెచ్చి మూఢులు వర్ణింతు - రిచ్ఛ కొలఁది. 831
**తే.గీ. తోలు నెముకలు చీము నె - త్తురును గ్రొవ్వు**
**మాంసమును నరములు నేరి - మల జలముల**
**గబ్బిలయు తొట్టియగు మేనఁ - గడు రమించు**
**నరులకును బుర్వులకును నం - తరము గలదె. 832**

తే.గీ. రోత బుట్టించు నిట్టి స్త్రీ - జాతితోడఁ
దత్పరులతోడను వివేకి - దగులరాదు
మనసు విషయేంద్రియంబుల - నెనసినపుడు
కలఁకఁ బడుఁగాని కానిచోఁ - గలఁగ దెపుడు. 833

ఆ.వె. కనని వినని యర్థ - మున మనో భావంబు
గలుగ దింద్రియములఁ - గదలకుండ
నిలిపి నపుడు మనసు - నిశ్చలంబై ప్రస
న్నతను గాంచు నిర్మ - లత వహించి. 834

తే.గీ. కాన నింద్రియముల కొగ్గి - కామినులను
గాముకులఁ గూడ నొప్పదు - కామ ముఖ్య
శత్రువర్గంబు వంచించు - సద్విబుధుల
ననిన మాబోఁటి యవివేకు - లనఁగ నెంత. 835

వ. అని యా పురూరవుండు దలపోసె నని చెప్పి మఱియు భగవంతుండుద్ధవునితో
నిట్లనియె. 836

సీ. నరనాథులందును - సురలందు మిన్నయౌ
నా పురూరవుఁ డిట్టు - లాత్మనెంచి
యూర్వశియెడఁ దన - కున్న చింతను మాని
తనబుద్ధి నాత్మ నౌ - నను నెఱింగి
మోహ మెల్లను జ్ఞాన - మున నాశ మొందించి
పరమశాంతిని ముక్తిఁ - బడసెఁ గాన
సన్మతి దుర్జన - సంగంబు వర్జించి
సజ్జనసంగంబు - సల్ప వలయు

తే.గీ. వార లతనికి హితము నే - ర్పడఁగ జెప్పి
మనసులో నున్న మాలిన్య - మును హరింతు
రట్టి సజ్జను లెట్టి వా - రనిన వినుము
నీకు వారి విధంబు వ - ర్ణింతుఁ గొంత. 837

సీ. ఏ కోర్కె లేనివా - రెపుడు నన్నెంచు వా
రత్యంత శాంతులై - నట్టివారు
సర్వభూతములను - సమముగాఁ గనువారు
మమత నహంతను - మానువారు
ద్వంద్వ నిస్పృహులైన - వారు పరిగ్రహ
రహితులు సాధు వ- ర్తను లనంగ
నట్టి మహాత్ముల - యం దనిశంబు నా
కథల ప్రసంగము - ల్గలుగు చుండు

తే.గీ. వాని విని పాయుదురు నరుల్ - పాతకముల
నవి వినుచుఁ గీర్తించుచు - ననుమతించు
చాదరించుచు మత్పరు - లగుచు శ్రద్ధ
గలుగు వారికి నాయందుఁ - గలుగు భక్తి. 838

తే.గీ. నిగమ వేద్యుండ నే ననం - తగుణనిధిని
నిత్యసౌఖ్యానుభవమయ - సత్య మూర్తి
నమలమగు భక్తి యిట్టి నా - యందుఁ గలుగఁ
జాలదె యిఁకేమి గావలె - సాధువునకు. 839

తే.గీ. సూర్యుఁ బావకు నాశ్రయిం - చు నతఁ డెపుడు
వలిని భయమును జీఁకటిఁ - బడని యట్లు
పరమ సాధుల సేవించు - నరుఁడు గనఁడు
జడత సంసారభయము న - జ్ఞాన తమము. 840

తే.గీ. ఘోర సంసార జలధిలోఁ - గూలి మునిఁగి
తేలుచుండెడి వారికి - దిక్కు బ్రహ్మ
మెఱుఁగు శాంతులు సాధువు - లే జలంబు
నను మునుఁగు వారలకు గట్టి - నావ వోలె. 841

తే.గీ. ప్రాణులకు రక్షకం బన్న - మైన యట్లు
దీనులకు నెల్ల నేనె ది - క్కైన యట్లు

మైదొఱగు వారి కటచ ధ - ర్మధనమట్లు
భవభయార్తుల కెల్ల సా- ధువులె దిక్కు. 842

తే.గీ. బయటఁ జూడంగ నొక కన్నె - భానుఁ డిచ్చు
బయట లోపలఁ జూడఁగా - నయనములను
సాధువు లొసంగుదురు వారె - సకలదివిజు
లెల్ల బాంధవు లాత్మయౌ - నేనుగూడ. 843

తే.గీ. ఇట్టు లూర్వశియందు ని - స్పృహతఁ దాల్చి
దాని సంగంబు హేతువు - గా నసంగుఁ
డగుచు నాత్మ రతుండయి - యవనియందు
ధీరతను సంచరించెఁ - బురూరవుండు. 844

-: శ్రీభగవదారాధన విధానము :-

క. అన విని హరిఁ గని యుద్ధవుఁ
డను నిను సేవించు వారి - కాపద లడఁగున్
వనజోదర! నీ యారా
ధనముఁ గ్రియాయోగ సరణి - దయఁ జెప్పఁగదే. 845

చ. యదుకులనాథ! భక్తులకు - నప్పుడె సత్ఫల మిచ్చుచుండు ని
య్యది యదె మోక్షసాధన మ - టంచు నమర్త్యగురుండు వ్యాస నా
రద మునిముఖ్యు లందురు ధ - రాతలి దానిని భక్తు లెట్లు సే
యుదురొ యెఱుంగఁ గోరెద స్ఫు - టోక్తులఁ జెప్పవె దాని పద్ధతిన్. 846

తే.గీ. విందు నది బ్రహ్మ కీవు సె - స్విితి వటంచు
నతఁడు భృగ్వాదులగు తన - సుతుల కెలిమిఁ
దెలిపె నభవుండు పార్వతీ - దేవి కెఱుక
పఱిచెఁ గద యీ క్రియా యోగ - పథము వరుస. 847

తే.గీ. సకల వర్ణాశ్రమములకు - సమ్మతంబు
స్త్రీలకును శూద్రులకు మేలు - సేయు నిదియె

కర్మబంధ విమోచన - కారి గాన
దీనిఁ జెప్పవె ప్రియభక్తుఁ - డైన నాకు. 848

తే.గీ. అనిన హరి యుద్ధవునికి ని - ట్లనె ననంత
సారమగు కర్మకాండఁ జె - ప్పంగఁ దరమె
యైన నే దాని సంక్షేప - మైన రీతి
నంతయును నీకు వర్ణింతు - నాలకింపు. 849

తే.గీ. వైదికము దాంత్రికము మిశ్ర - పథము ననఁగ
మూఁడు విధముల నుండు నా - పూజ సరణి
యిందు నెయ్యది యెవనికి - నిష్ట మగునొ
యవ్విధిని వాఁడు పూజింప - నగును నన్ను. 850

చ. తన నిగమంబునందు విశ - దంబుగఁ జెప్పిన రీతిఁ బూరుషుం
డొనర ద్విజత్వ మొంది కడు - నొప్పెడు భక్తిని శ్రద్ధ నన్నుఁ బూ
జన మొనరింపఁగా వలయు - జాడ నెఱుంగఁగ నీకుఁ జెప్పెదన్
విను మిది భక్తులెల్ల నను - వేగమ పొందెడు త్రోవ యుద్ధవా! 851

తే.గీ. అగ్నినో వేదికనొ ప్రతి - మాదులందొ
యర్కజల విప్రులనొ హృద - యంబు నందొ
స్వగురుఁడగు నన్నమాయక - భక్తితోడఁ
జిక్కిన పదార్థములఁ బూజ - సేయవలయు. 852

వ. అదియెట్లనినం దొలుత ధౌతరదనుండై మృద్గ్రహణాదులచే వైదికతాంత్రికోభయ మంత్రంబులతో నంగశుద్ధికొఱకు స్నానం బొనర్చి వేద విహితంబులగు సంధ్యోపాసనాది కర్మంబులు సాకల్యంబుగా నొనర్పవలయు. అంతం బరమేశ్వరప్రీత్యర్థంబని సంకల్పించి సర్వకర్మనిర్హారిణియగు నాపూజం దన్మంత్రంబులతో నాచరింపదగు. పూజాయోగ్యంబగు ప్రతిమ శిలామయంబు దారునిర్మితంబు లోహకల్పితంబు మృచ్చందనాదిలేప్యంబును లేఖ్యంబును సికతాకృతంబును మనోమయంబును మణిరచితంబు నన నెనిమిది విధంబులై యుండు. కళాన్యాసంబున నాకు నిలయంబగు నా

ప్రతిమ చరంబనియు స్థిరంబనియు నిరుదెఱంగులు గలది. పూజయం దుద్వాసనావాహనంబులు స్థిరప్రతిమలకు లేవు. చరంబున కవి గలుగుటయు లేకుండటయుంగలదు. స్థండిలంబునను సైకతంబునను నవి గలవు. సాలగ్రామంబున లేవు. తక్కినవాని యం దవి చేసిననుం జేయకున్నను నొప్పు. మృన్మయలేఖ్యంబుల మార్జనంబును నవిగానిచో నభిషేకంబునుం జేయంబను. నిష్కాముండగు భక్తుండు దనకు లభించిన సుమంగళంబులగు ద్రవ్యంబులతోడను లభింపనిపట్ల హృదయంబున భావించిన వానితోడను బ్రతిమాదులయందు ననుం బూజించు. మానసపూజావిధానంబునఁ బూజాద్రవ్యంబు లన్నియును భావితంబుల. ప్రతిమాదికంబున స్నానాలంకరణంబు లుత్తమంబులు. వేదికం దత్త్వవిన్యాసంబును వహ్ని నాజ్యప్లుతంబగు హవిష్యంబును సూర్యునియందుపస్థానార్ఘ్యాదులును జలంబులఁ దర్పణాదులును యోగ్యంబులు. 853

తే.గీ. విమలమగు శ్రద్ధ భక్తుఁడ - ర్పించునట్టి
సలిలమైనను నాకు శ్రే - ష్ఠం బనంగ
గంధ సుమ ధూప దీపాన్న - కలితమైన
వాని పూజ నే నేమన - వలయు నింక. 854

వ. ఇట్లుపాసకుండు శుచియై పూజాద్రవ్యంబులు సేకరించి ప్రాగగ్రదర్భాసనంబునఁ బ్రాఙ్ముఖుండైగాని యుదఙ్ముఖుండై గాని మన్మూర్తి కభిముఖంబుగాఁ గూరుచుండి గుర్వాది నమస్కార పూర్వకంబుగాఁ దదుపదిష్టప్రకారంబున మూలమంత్రంబుచేఁ గరహృదయాది న్యాసంబొనర్చి తన్మంత్రకృత న్యాసంబగు మద్విగ్రహంబును నిర్మాల్యాపకర్షణాదులచే శోధింపందగు. అంతఁ బూర్ణకుంభంబును బ్రోక్షణపాత్రంబును జందనపుష్పాదులచే సంస్కరించి ప్రోక్షణీయ తోయంబున దేవపూజాస్థానంబును ద్రవ్యంబులను దన్నుం బ్రోక్షించుకొని శ్యామకదూర్వాబ్జవిష్ణుక్రాన్తాదియుక్తోదకంబులం బాద్యపాత్రంబును గంధపుష్పాక్షత యవకుశాగ్ర తిల సర్షప దూర్వాంకుర సమేత జలంబుల నర్ఘ్యపాత్రంబును నిట్లు పాదార్ఘ్యాచమనీయార్థంబుగాఁ

బాత్రత్రయం బాసాదింపవలయు. వీనిం గ్రమంబుగా గాయత్రీ హృదయంబు నను శిరశ్శిఖలను మూలమనువునను నభిమంత్రింపవలయు. పిదపం గోష్ఠగతవాయుశోషితంబును నాధారగతాగ్నిదగ్ధంబును నైన తన శరీరంబు లలాటస్థచంద్రమండలామృతాప్లావనంబుచే నమృతతమయంబై యుండు నందు హృదయ కమలంబున నకారోకారమకారబిందునాద్మాతక ప్రణవ పంచమాంశంబగు నాదంబునకవ్వల సిద్ధపురుషులచే ధ్యానింపం బడుచుండు మదంశంబగు సూక్ష్మ జీవకళారూప శ్రీమన్నారాయణమూర్తిని ధ్యానింపవలయు. అంత దీపప్రభచే గృహంబ ట్లాజీవకళచేతం దనశరీరంబు వ్యాప్తంబై వెలుంగొందుచుండం గని తాను దన్మయుండై మానసికోప చారంబులం దొలుత దానిం బూజించి పిమ్మట దానిం బ్రతిమాదుల నావహింపంజేసి సుప్రతిష్ఠితం బొనర్చి న్యస్తాంగుండనగు నన్నందుఁ బూజింపందగు. దాని తెఱంగు వినుము. ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యంబులనుకో ళ్ళాగ్నేయాది చతుష్కోణంబులం గలిగి యధర్మాజ్ఞానావైరాగ్యానైశ్వర్యంబులను పట్టెలు పూర్వాది చతుర్దిక్కులనమరి గుణత్రయంబను మూఁడు పలక లానస పర్యంక మధ్యంబునందు నొప్పు విమలయు నుత్కర్షణియు జ్ఞానయు క్రియయు యోగయు ప్రజ్ఞయు సత్యయు నీశానయు ననుగ్రహయు నను
131 నవశక్తుల నొప్పు దివ్యసింహాసనంబును దన్మధ్యంబున గుణత్రయోపరి స్థాపితంబగు సకర్ణి కాకేసరాష్టదళపద్మంబునునందు వరుసగా నుజ్జ్వలంబులగు సోమసూర్యాగ్ని మండలంబులను భావించి యిందు సుఖోపవిష్టుండనగు నన్ను వైదికాగమిక విధానంబుల భక్తిముక్త్యు భయసిద్ధికొఱకుఁ బాద్యార్ఘ్యాచమనాద్యుపచారంబులచేఁ బూజించునది. ఆవల శ్రీ వత్స వైజయంతీ కౌస్తుభంబులను నావక్షః స్థలంబునను శంఖ చక్ర గదా ఖడ్గ ధను ర్బాణ హల ముసలంబు లను మదాయుధంబుల నష్టదిక్కులను నంద సునంద చండ ప్రచండ బల మహాబల కుముద కుముదేక్షణు లను మత్పార్షదుల నెనమండ్ర నెనిమిది దిశలను నాయెదుట మద్వాహనంబగు గరుడుని దుర్గా వినాయక వ్యాసవిష్వక్సేనులను నాలుగు మూలలను దన గురుని నా వామభాగంబు నను నింద్రాగ్ని యమ రాక్షస

వరుణ వాయు ధన దేశానులగు లోకపాలురం బూర్వాదిదిగ్వి దిగ్భాగంబులను మదభిముఖులనుగా భావించి వారికిం బాద్యాది వివిధోపచారంబులు ప్రోక్షణాదులచే నొనర్చునది. ఇందు విభవంబుగల దేని నిత్యంబును జందనోశీర కర్పూరకుంకుమాగరు సంవాసితంబులగు జలంబులతో స్వర్ణఘర్మానువాకంబు మహాపురుషవిద్య పురుషసూక్తంబు రాజనాదిసామంబులు నను మంత్రంబులతో నా కభిషేకంబు సేయు చుండవలయు. మఱియు నా భక్తుండు వస్త్రోపవీతాభరణంబులచేతను గపోల వక్షఃస్థలాదులం గుంకుమపత్రలేఖనంబునను గుసుమమాలికలను గంధలేపంబునను ప్రేమపూర్వకంబుగా యథోచితంబుగ నన్నలంకరింప వలయు. నన్నుఁబూజించువాఁడు పాద్యాచమనీయ గంధ పుష్పాక్షతంబులను ధూప దీపోప హార్యంబులను నాకు శ్రద్ధతో సమర్పింపవలయు. కలిగెనేని నాకు గుడపాయస ఘృతశష్కుల్యపూప మోదక సంయావ దధి సూపంబులతో నైవేద్యంబు సేయవలయు. ఏకాదశ్యాది పర్వకాలంబుల నాదర్శ దంతధావనాభిషేచన భక్ష్యభోజ్యాదినివేదన నృత్తగీతోపచారంబు లొనరింపందగు. అధికఫలంబుగోరువాఁడగ్నియందును నన్ను పాసించు. ఆ క్రమంబు వినుము. అతండు స్వగృహోక్తంబున సప్రమాణంబుగాఁ ద్రవ్వంబడినకుండంబున నగ్నింబ్రజ్వలింపవలయు. అంత దానిచుట్టుం గుశపరి స్తరణంబు లిడి చేతితో జలంబు నంతటం బ్రోక్షించి యథావిధిగ సమిత్ప్రక్షేపాది రూపాస్వాధానంబు వ్యాహృతులతో నొనర్చి హోమద్రవ్యంబుల పై జలంబును బ్రోక్షణపాత్రతోఁ జల్లి యయ్యగ్నియందు. 855

సీ. తప్తమౌ జాంబూన - దముతో సమానమై
 వెలుఁగొందుచుండు మై - గలుగువాఁడు
శంఖ చక్ర గదాంబు - జాత శోభిత చతు
 ర్బాహుడు శాంత స్వ - భావమూర్తి
పద్మకేసర విభా - భాసి దివ్యాంబర
 రత్న కిరీట - విరాజితుండు

శ్రీవత్స కౌస్తుభ - శ్రీస్ఫుర ద్వక్షుండు
వనమాలికా గంధ - వాసితుండు

తే.గీ. కటక కటిసూత్ర మణిమయాం - గదయుతుండు
చారుతర వేషుఁడుగ నన్ను - సత్త్వ మయుని
నిశ్చలంబగు భక్తి ధ్యా - నించి తన య
భీష్టసిద్ధికినై యర్చ - లీయ వలయు. 856

వ. అంత నందు ఘృతసంసిక్తంబులైన శుష్క సమిధల నునిచి యగ్నిం బ్రజ్వలింపం జేసి ప్రజాపతికిని నింద్రునకునుం బ్రీతిగా నాఘారంబసు నాహుతిద్వయంబు వేల్చి యగ్నికిని సోమునకును బ్రియంబుగా నాజ్యభాగంబులను రెండాహుతులను వేల్చి యనంతరం బష్టాక్షర మూలమంత్రంబున నేని షోడశాక్షరంబగు పురుషసూక్తంబున నేనిం బ్రతిబుక్కునకు నొక్క యాహుతిగా నాజ్యప్లుతంబగు హవిస్సు వేల్చునది. పిదప ధర్మాదులను గ్రమంబుగా మంత్రంబులతోఁ బూజించి స్విష్టకృద్ధోమం బొనర్చి వహ్నిస్థుండగు భగవంతు నభ్యర్చించి నమస్కరించి పార్షదులగు నందాదులకొఱకు నష్టదిక్కులను బలి సమర్పణంబు సేయునది. అంతఁ బూజాస్థానంబున కేతెంచి దేవుని సమ్ముఖమ్మునం గూర్చుండి బ్రహ్మస్మరణ సంయుతంబుగా నారాయణాత్మకంబగు మూలమంత్రంబు యథాశక్తిగ జపింపందగు. పదంపడి పూజాస్థానంబునను నగ్నిని భగవంతునకు భోజనం బయ్యెనని ధ్యానించి యాచమనం బొసంగి తద్భుక్తశేషంబు విష్వక్సేనునకు సమర్పించి తదనుజ్ఞం దానును భుజించి సుగంధతాంబూలాద్యం బర్పించి పుష్పాంజలి నొసంగవలయు నంత. 857

మ. హరిగీతంబులఁ బాడుచుం బొగడుచున్ - హర్షంబుతో నాడుచున్
హరిచేష్ట ల్దనయందుఁ జూపుచుఁ దదీ - యామేయ గాథల్ ఘోరిం
బొరి విన్పింపుచు వించుఁ గాలమును నే - పుణ్యుండు వుచ్చుం బరా
త్పరు నన్నెంచుచునే యతండొకముహూ - ర్తంబుండు విశ్రాంతుండై. 858

తే.గీ. భక్తుఁ డుచ్చావచంబులౌ - ప్రాకృతములు
గాని పౌరాణికంబులు - గాని యైన
స్తవముల నను న్నుతించి ప్ర - సన్నుఁడ వగు
మయ్య యని నాకు మ్రొక్కు సా - ష్టాంగముగను. 859

తే.గీ. శిరసు మత్పాదయుగళంబుఁ - జేర్చి బాహు
యుగ్మమును వెన్కఁ గూరిచి - యుర్వి సాగి
మ్రొక్కి మృత్యుగ్రహోర్ణవం - బునకు వెఱచి
శరణుఁ జొచ్చితి ననుఁ గావు - వరద యనుచు. 860

తే.గీ. మనవి సేసి నేనిచ్చు ని - ర్మాల్య మాద
రంబుతోఁ గొనివాఁడు శీ - ర్షంబు నందుఁ
దాల్చి ప్రతిమాది నిహిత చై - తన్య మాత్మఁ
జేర్చుకొను నంత నను నుద్వ - సింప దలఁప. 861

తే.గీ. నేను సర్వాత్మకుండనై - పూనియందు
నఖిల భూతంబులందును - నాత్మయందుఁ
గాన నర్చాదులందు నె - ద్దాన శ్రద్ధ
గలుగు నరునకు నట సల్పు - వలె మదర్చ. 862

తే.గీ. కాన నిగమాగమోక్తమా - ర్గములఁ జెప్పఁ
బడు క్రియాయోగపదములఁ - బట్టి నరుఁడు
నన్ను బూజింపఁ దాఁ గోరు - కొన్న ఫలము
నిందు నందును ధ్రువముగాఁ - బొందఁగలఁడు. 863

తే.గీ. నాప్రతిమ నిల్పి దృఢబంధ - నముగ దేవ
ళమును గట్టించి పూఁదోఁట - లను సమర్చి
దానఁ బూజలు యాత్ర లు - త్సవము లెపుడు
జరుగఁగఁ గుదుర్పవలెఁ బరి - చారకులను. 864

తే.గీ. సంతతంబొ మహాపర్వ - సమయములనొ
యదినునమొ నాదుపూజాదు - లను నడుపఁగఁ

బూని క్షేత్రాపణ గ్రామ - పురములిచ్చు
వాఁడు మత్సామ్యమొందు నై - శ్వర్యమందు. 865

సీ. ప్రతిమాదికముఁ బ్రతి - ష్ఠిత మొనర్చినవాఁడు
సార్వభౌమపద ప్ర - శస్తిఁగాంచు
భక్తితో నాకు దే - వళముఁ గట్టించిన
యతఁడు త్రైలోక్య రా - జ్యంబు నేలుఁ
బూజాదిసత్క్రియా - పోషకుండగువాఁడు
బ్రహ్మలోకంబుఁ జే - రంగ నరుగు
నీమూఁడుఁజేసిన - యా మానవుండు మ
త్సామ్యంబు నొందు ని - స్సంశయముగ

తే.గీ. నీపగది నన్నుఁ బూజించు - నెవ్వఁ డెపుడు
వాఁడు మద్భక్తియోగ భా - వంబుఁ బడయు
ఫలముఁ గోరక నన్ను స - ద్భక్తిఁ గొలువ
నరుఁడు ధ్రువముగ నన్నె పొం - దంగఁగలుగు. 866

తే.గీ. ఎవఁడు తానిచ్చినదొ పరు - లిచ్చినదియొ
యైన సుర విప్ర వృత్తిని - నపహరించు
వాఁ డనేకాయుతాయుత - వత్సరములు
మలమునందలి పురుగు జ - న్మంబునెత్తు. 867

తే.గీ. కర్త సహకారి పురికొల్పఁ - గలుగువాఁడు
సమ్మతించెడువాఁడును - సకలకర్మ
ఫలములకుఁ బాలివారలు - వారిలోనఁ
బ్రబలుఁడగువాని కెక్కుడు - ఫలముగలుగు. 868

తే.గీ. ప్రాకృతుల చిత్తమలమును - బరిహరించి
నాదుసద్భక్తి వారి మ-నంబులందు
నూర్జితమొనర్చు నీక్రియా - యోగసరణి
జ్ఞానయోగంబునకు నిది - సాధనంబు. 869

-: జ్ఞానయోగ ప్రకారము :-

క. మును నేవివరించితి నె
మ్మనమున నిల్పితివె జ్ఞాన - మార్గము మఱల
న్వివను సంగ్రహముగఁ జెప్పెద
ఘనతర దార్ఢ్యంబు నీకుఁ - గలుగును దానన్. 870

వ. అని యానతిచ్చి కరుణామయుండగు భగవంతుం డుద్ధవుని ంగని యిట్లనియె. 871

సీ. ప్రకృతిపూరుషుల కూ - డికఁ దోఁచు నీవిశ్వ
మేకాత్మకంబని - యెంచి చూచి
యందలి శాంత ఘో - రాది భూతస్వభా
వములను వాని క - ర్మములలోన
దేనిని బొగడఁడు - తెగడఁడు దేనిని
సువివేకి యన్నిటిం - జూచు సమత
నట్లుగా కెవ్వఁ డ - న్య స్వభావములఁ గ
ర్మముల మెప్పును దూరు - మది వహించు

తే.గీ. నతఁ డసత్తగు జగము స - త్యముగ నెంచు
కతనఁ బరమార్థ సువిదూర - గతిని బొంది
శీఘ్రముగ భ్రష్టుఁడగుఁ గానఁ - జిత్తమందు
జగము మదభిన్నముగఁ జూడ - నగు బుధుండు. 872

తే.గీ. నిద్రలో నింద్రియంబుల - న్నియు నణంగ
మనసుసేయు మృషాసృష్టిఁ - గనును దేహి
మనసును లయింప నష్టచే - తనత నతఁడు
మృతినిబోలెడి నిద్రలో - మెదలకుండు. 873

తే.గీ. అట్లె నానాత్వదృష్టియౌ - నట్టి ద్వైతి
భ్రాంతివిక్షేప లయములఁ - బడుచునుండుఁ
బ్రాజ్ఞసంపర్కమున జగ - ద్భ్రంశమొందు
నాత్మ విభ్రంశమగు నవి - ద్యావశమున. 874

తే.గీ. ఇది యవస్తువు ద్వైత మిం - దేది మంచి
దేది చెడ్డ దిదేమాత్ర - మెంచి చూడ
నింద్రియ మనః ప్రకల్పితం - బీ సమస్త
మాత్మ భిన్నం బన్నృతము మా - యా మయంబు. 875

సీ. ఇంద్రియ గోచరం - బిదియెల్ల సత్యమౌ
నర్థకరంబౌట - ననిన వినుము
ప్రతిబింబమును బ్రతి - ధ్వని భ్రాంతికల్పితం
బీ యసత్తులు నర్థ - కృతులు గద
కావున దేహాది - భావంబులెల్ల న
సత్తులయ్యును భయా - స్పదములగుచు
దోఁచుచు నుండు మృ - త్యువు దోఁచు దాఁక స
త్యము లనరా దివి - యంతమాత్ర

తే.గీ. సృష్ట మీవిశ్వమును సృజి - యించు ప్రభువు
రక్షితము సర్వమును జగ - ద్రక్షకుండు
హృతము సకలంబు సంహర్త - యీశ్వరుండు
నంతయును నాత్మయే సంది - యంబులేదు. 876

ఆ.వె. ఆత్మకన్న నన్య - మైన యెద్దాన న
న్యమగు భావ మెదియు - నగుట లేదు
ముత్తెఱంగు లగుచుఁ - బొలుచు నీ జగ మాత్మ
యందుఁ దోఁచు మృష ని - రా స్పదంబు. 877

తే.గీ. అగపడుచునుండు నధ్యాత్మి - కాది సృష్టి
మాయచేఁ జేయఁబడు గుణ - మయము త్రివిధ
మంతయే గాని నిజముగా - దని దృఢముగ
నెఱుఁగు ముద్ధవ! యిఁకఁ జెప్ప - నేల వేయి. 878

తే.గీ. నేను జెప్పిన జ్ఞానవి - జ్ఞాననిష్ఠ
ని ట్లెఱింగిన విబుధుఁ డే - దేనిఁ దెగడఁ

దేది పొగడఁడు లోకమం - దినుని పోల్కి
సంచరించుచు నుండు ని - స్సంగుఁ డగుచు. 879

సీ. ఆద్యంతవంత మీ - యఖిలంబసత్తు ఘ
టాదుల ట్లనుచుఁ బ్ర - త్యక్షముననును
నిది సావయవమును - దృశ్యంబు గాన స
సత్తని యనుమాన - శక్తిచేత
నింద్రి యాప్రత్యక్ష - మిది యసత్తగు వియ
దాదికం బను నిగ - మార్థముననను
నాది యంతము గల - యదియు దృశ్యమును స
ర్వము నసత్తను స్వాను - భవము చేత
తే.గీ. నఖిల జగమును లేక యు - న్నట్లు దోఁచు
స్వప్న కల్పితమట్టి య - సత్తటంచు
నెఱిఁగి యెందును గుణదోష - దృష్టిలే క
సంగుఁడై మౌని తిరుగఁగాఁ - జను ధరిత్రి. 880
వ. అనిన విని యుద్ధవుం డిట్లనియె. 881

-: దృగ్దృశ్యస్వరూపవిమర్శనము :-

ఆ.వె. ఆత్మ స్వప్రకాశుఁ - డగు ద్రష్ట దృశ్యం బ
నాత్మ తనువు రెంటి - యందు సంస
రణము దేనికేనిఁ - గనఁ బడదిఁక దేని
కది పొసంగు దేవ! - యానతీవె. 882
ఆ.వె. ఆత్మ స్వప్రకాశుఁ - డవ్యయుం డగుణం డ
నావృతుండు శుద్ధుఁ - డగ్నివోలెఁ
దను వచేతనంబు - దారువు పోలిక
జరుగు దేని కింక - సంసరణము. 883
వ. అనిన శ్రీకృష్ణదేవుం డిట్లనియె 884

సీ. ఇది దృక్కుచేత నం - బిది దృశ్యము జడం బ
టంచు వేర్పఱచి తా - నెంచలేమి
దేహేంద్రియాదిక - దృశ్యంబుతోఁ గూడి
దాని తాదాత్మ్య మెం - దాఁక నాత్మ
పొంది సంభ్రాంతుఁడౌ - నందాఁక సంసృతి
లేనిదయ్యును నిక్క - మైన యట్లు
సుఖ దుఃఖ హేతువై - చూపట్టుచుండు నీ
జగము రజ్జుహియ ట్ల - సత్య మయ్యు
తే.గీ. నాత్మ వదలదు సంసార - మనవరతము
ద్రష్ట విషయాళి మతిలోనఁ - దలఁపఁ గల్ల
జగము నిజమైన యట్లుగా - స్వప్నమందు
నగపడుచు నుండదే జగం - బనఁగ నంతె. 885
క. కలమేలుకొనని వానికిఁ
గలిగించును బహ్వార్థ - కంబుల నదియే
మెలఁకువఁబడినపు డతనికిఁ
గలిగింపంగలదె యించు - కయు మోహంబున్. 886
సీ. తనువు మున్నగు వానిఁ - దాననుకొను వృత్తి
యదియె యహంకార - మనఁగ బరగుఁ
గలవు హర్షమును శో - కము క్రోధ భయ లోభ
మోహమదాదులుఁ - బుట్టు సావు
నీయహంకృతికే యి - వేవియులే వాత్మ
కతఁడు దేహేంద్రియ - ప్రాణమాన
సములయం దభిమాన - సహితుఁడై గుణకర్మ
మూర్తియై యంతరా - త్ముఁడన మఱియు
తే.గీ. సూత్రమనఁగ మహత్తన - సూక్ష్మమగును
పాధి జీవుండనంగను - బహువిధముల

బేర్కొనంబడు సంసృతి - వివిధగతుల
నీశ్వరాధీనుఁడై భ్రమి - యించు నితఁడు. 887

సీ. వివిధరూపముల రూ - పితములౌ మానస
వాచిక కాయిక - ప్రాణవృత్తు
లన్నియు వట్టిమి - థ్యలు కారణములేక
యైంద్రజాలికముల - యట్లు తోఁచు
సద్గురుసేవఁ దీ - క్ష్ణంబైన జ్ఞానాసి
చే వీని నఱికి య - క్షీణనియతి
విజ్ఞుఁ డాశావిష - బీజంబు లెద నంకు
రింపకుండఁగ ధరి - త్రిని జరించు
తే.గీ. జ్ఞానమనఁగ వివేకంబు - దాని సాధ
నములు వేదంబులును స్వధ - ర్మమును స్వాను
భవము నుపదేశ మూహయు - నవును వీని
ఫలము బ్రహ్మంబె జగమని - పరగునెఱుక. 888

తే.గీ. అగపడెడు దీని మొదలను - నంతమందు
నిర్వికల్పకమై యేది - నిలచియుండు
దోఁచు నప్పుడు దీనిని - జూచునేది
యయ్యధిష్ఠానమైన బ్ర - హ్మంబె జగము. 889

శా. నానాభూషణ రూపమొందిన హిర - ణ్యం బంతకు న్ముందునుం
దా నా రూపము లుజ్జగించు పిదపం - దథ్యంబుగా స్వర్ణమై
తా నా రూపులు బేర్లు దాల్చినపుడుం - దన్మాత్రమే యైన య
ట్లే నేనే యిది ముందు వెన్క వివిధా - కృత్యాఖ్యలౌ మధ్యనున్. 890

సీ. బహువిధజ్ఞాన రూ - పంబగు నీ మాన
సమును దత్కృత మవ - స్థాత్రయంబు
దాని హేతువు గుణ - త్రయము నధ్యాత్మాధి
భూతాధిదైవ వి - ఖ్యాతమగుచు

ద్రిగుణకార్యంబైన - త్రివిధ కారణ కార్య
కర్తృరూపంబీ జ - గంబఖిలము
నెద్దాని యనుగతి - దృశ్యమై వెలుఁగొందు
నెయ్యది పెడమొగం - బిడినయంత
తే.గీ. నంతయును మాయును సమాధి - యందుఁ బోలె
నట్టి బ్రహ్మాఖ్యమగు తురీ - యం బొకండె
సత్య మెది ముందు వెనుక న - సత్తు మధ్య
నది యసత్తగు మృష వ్యవ - హారమెల్ల. 891
ఆ.వె. అన్యమైనదేని - యందు నెయ్యది పుట్టు
దేనిచేత నేది - దీపితమగు
నట్టి కార్యమెల్ల - నాకారణమె తద
న్యంబు గాదటంచు - నాత్మ నెంతు. 892
చ. వివిధ వికారజాతమగు - విశ్వము లేనిదియయ్యు రాజసో
ద్భవమగు బ్రహ్మకార్యమయి - తత్ప్రభచే వెలుఁగొందుచుండు న
ట్లవుటఁ బ్రకాశకంబును స్వ - యంభువు బ్రహ్మము భూతపంచకం
బు విషయమానసేంద్రియస - మూహము దానయి వెల్గుఁ జిత్రమై 893
సీ. బ్రహ్మస్వరూప మీ - పగిది స్ఫుటంబుగా
నిపుణుఁడౌ గురుని స - త్కృపనుజేసి
వేదాదులగు చతు - ర్విధ హేతువులచేత
నిశ్చయంబొనరించి - నిక్కమైన
యట్లు తోఁచెడు శరీ - రాది తదన్యం బ
సత్తని నిరసించి - సత్తముండు
తన మనమందు నా - త్మను గూర్చి కలుగు సం
శయమెల్ల మాయించి - స్వసుఖలబ్ధి
తే.గీ. వలన సంతుష్టుఁడై సుఖా - భాససాధ
నముల వివిధేంద్రియాదులం - దవుల కెపుడు

నాత్మమాత్రైకదృష్టి నీ - యఖిలజగముఁ
గనుచు స్వానంద పరిపూర్ణ - తను జరించు. 894

సీ. పార్థివంబగుట నీ - వపు వాత్మగా దింద్రి
యములు నధిష్ఠాత - లైన సురలు
ప్రాణంబు భూజలా - గ్న్యనిల వియ న్మనో
హంకృతుల్ జిత్తబు - ద్ధ్యాదికంబు
లన్నాశ్రయములు - దేహమువంటివేగాన
నవి యేవియును జూడ - నాత్మగావు
శబ్దాదులును గుణ - సామ్యమౌ ప్రకృతియు
నాత్మగా వవియు జ - డాత్మకములు

తే.గీ. నస్వతంత్రంబు లని తన - యాత్మ నరసి
సద్విచారంబుచేత ని- శ్చయమునొంది
నిర్వికార దృఙ్మాత్రత - నిలువవలయు
సంతతము నేకనిష్ఠతో - సజ్జనుండు. 895

తే.గీ. మన్మయైకాంత భావ సం - ప్రాప్తిగన్న
వానికి గుణాత్మకేంద్రియ - వర్గ జయము
వలన గుణమేమి తత్క్షోభ - వలన దోష
మేమి రవికేమి మబ్బువో - యినను నున్న. 896

తే.గీ వాయుతేజోఽ౦బుభూ గుణ - వర్గ మదని
యందు వచ్చినఁ బోయిన - నాకసమున
కేమి సంసృతి హేత్వహం - కృతి గుణములు
మూఁడు నంటునె యక్షరా - త్మునిఁ బరాత్మ. 897

ఉ. ఐనను నాయెడన్ దృఢ మ - నన్యమునైన విశుద్ధభక్తి యె
వ్వానికిఁగల్గి దుర్విషయ - వాసన మానసమున్ గలంచుటన్
మానుప దంతదాఁక నణు - మాత్రము నంటఁగరాదు మాయచే
నైన గుణప్రవాహవిష - యంబుల నాతఁడు వంచితాత్ముఁడై. 898

ఉ. మంచిచికిత్స సేయమిని - మానక రోగము మాటిమాటికి
న్మించుచు నొందుచుండు నరు - మేనిని నట్టుల మానసంబునన్
సంచితమైన రాగముఖ - సంగసముద్భవకర్మమెల్ల ని
ర్వంచనఁగాల్పకున్న నది - భ్రష్టుని జేయుఁ గుయోగినుద్ధవా!. 899

సీ. యోగనిష్ఠుండయి - యుండువానికి విఘ్న
బాహుళ్యమగు శిష్య - బంధు ముఖ్య
రూపంబులను - దివిజోపకల్పితమయి
యవ్విఘ్నములఁ జెడు - నా కుయోగి
మృతినొంది మఱల జ - న్మించినప్పుడు తన
తొలుతటి యభ్యాస - బలమువలన
మఱల నాయోగమే - మానక సాగించుఁ
గాని కర్మపరుఁడు - గాఁ డతండు

తే.గీ. కర్మములు సేయు విక్రియ - ల్గాంచుఁదనువు
లెల్ల మృతిదాఁక సంస్కార - మీఁదు చుండ
నందు విజ్ఞుండు దేహస్థుఁ - డయ్యు స్వసుఖ
మనుభవించుచు విషయాళి - నంటకుండు. 900

సీ. తనబుద్ధి యాత్మయం - దునె నిల్చియుండుట
యోగిస్వదేహ మొ - క్కొక్కచోట
నిలుచున్నఁ గూర్చున్న - నిలువ కేఁగుచునున్న
నన్నంబు భక్షించు - చున్ననైన
జలమలాదికవిస - ర్జన మొనర్చుచునున్న
దాని స్వభావ వ - ర్తనముకొలఁది
నది మఱి యేపని - నైనఁ జేయుచునున్న
దాని నించుకయును - దా నెఱుంగ

తే.గీ. డాతఁ డొకవేళ నసదింద్రి - యార్థసమితిఁ
గాంచెనేనియు నానాత్వ - కారణమున

నాత్మభిన్నం బసత్తైట - నాత్మ నెఱిఁగి
వస్తుభావంబుతో దాని - వలను గనఁడు. 901

క. కలగని మేల్కొన్న నరుం
డలకలఁ దాఁగన్న లోక - మంతయు మాయన్
దెలిసి యది మిథ్యయని మదిఁ
దలపోసినయట్లె జగముఁ - దలంచు నితండున్. 902

చ మును గుణకర్మ చిత్రమయి - పోల్చిన యజ్ఞతకార్యమైన యా
తనువును నింద్రియాదులను - తథ్యము నాత్మగఁ జూచె వానినే
గనెఁ దెలివొందిఁ మిథ్యయని - కావున వాఁడవి మానెఁగాని యా
త్మనిజము గల్లయంచుఁదనుఁ - దా నెపుడేఁ గొని మాసి యుండెనే. 903

తే.గీ. సూర్యుఁడుదయించి నరుల చ - క్షువుల తమము
నడఁచునేగాని ఘటపటా - ద్యములఁదేఁడు
నన్నుఁగనునేర్పునట్టులే - నరునిబుద్ధి
నజ్ఞతను బాపు నిత్య స - త్యాత్మఁ దేదు. 904

సీ. ఈ యాత్మ దనయంత - నే వెలింగెడువాఁడు
జన్మాదిరహితుండు - శాశ్వతుండు
నప్రమేయుండు మ - హైశ్వర్య సంపన్నుఁ
డఖిలప్రకాశకుం - డైనవాఁడు
నాద్యుండు దేశకా - లాద్యనవచ్ఛేద్యుఁ
డద్వితీయుండు మా - యాతివర్తి
వాక్కు లీతని నిట్టి - వాఁడని చెప్పఁగా
నేరక చెప్పఁగాఁ - గోరి తుదకు

తే.గీ. నెవఁడు ప్రేరింప వాక్ప్రాణ - నివహమెల్ల
చేతనతనొంది నడుచునో - యాతఁ డీతఁ
డనుచు విరమించుచుండు వే - దాంతమందు
నునికి తెలివియు సుఖము నీ - తనివె యెందు. 905

తే.గీ. కేవలుండగు నాత్మునం - దీవికల్ప
మంతయును మానసభ్రమ - మావికల్ప
మునకు నాశ్రయమాత్మయే - ముత్తియంపుఁ
జిప్ప రజత భ్రమకుఁబోలె - సిద్ధ మనఘ! 906

సీ. వివిధనామాకృతి - భేదముల్గలది ప్ర
త్యక్షంబుగా గ్రాహ్యా - మర్థకారి
పంచభూతమయ ప్ర - పంచ మీద్వైతం బ
బాధితంబగుట ధ్రు - వంబటంచుఁ
బల్కుచునుండుట - పండితంమన్యుల
దుర్వాదమిది సత్య - దూర మతము
వ్యర్థమౌ దానియం - దర్థప్రతీతి యి
య్యది దీనిఁ దత్త్వజ్ఞు - లాదరింప

తే.గీ. రామతంబున వారి సి - ద్ధాంతమునకుఁ
బరగు కారణములె దాని - బాధసేయు
దాని నొప్పదు విజ్ఞుల - స్వానుభవము
స్వప్నదృష్ట పదార్థంబు - సత్యమగునె. 907

సీ. ఒనర యోగాభ్యాస - మొనరించువాని దే
హమున రోగాది వి- ఘ్నములుగలుగ
నవి నివారించు టె - ట్లన విను కొన్నింటి
రవిచంద్రవహ్ని ధా - రణలచేత
ననిలధారణను నా - సనములచేఁ గొన్ని
తపమున మంత్రౌష - ధములఁ గొన్ని
నన్ను ధ్యానించుటఁ - గొన్నింటి మన్నామ
సంకీర్తనాదులు - సలిపి కొన్ని

తే.గీ. ధరణి మతికొన్ని యోగ వి- ద్యా ప్రవీణు
లైన పెద్దలవర్తన - మనుసరించి

శుభములగు మార్గములచే న - శుభకరంబు
లైన విఘ్నంబులు హరింప - నగు బుధుండు. 908

సీ. ధీరులు కొందఱీ - దేహంబ రోగంబు
నజరామరము నిత్య - యౌవనంబు
నగునట్లుగా నుపా - యములు పెక్కులొనర్చి
యన్యకాయ ప్రవే - శాదిసిద్ధు
లొందఁగా నయ్యయి - యోగధారణఁ జేయు
దురు జ్ఞాన నిష్ఠఁబొం - దుటకుఁ గాక
పెద్దలు మెచ్చ రీ - విధము వారలుపడు
నాయాసమెల్ల య - సార్థకంబు

ఆ.వె. చెట్టుఁబోలు నాత్మ - చెడని పదార్థంబు
దాని పండుఁబోలు - మేననిత్య
మాత్మనిష్ఠ మాని - యధ్రువంబగు మేని
కొఱకుఁ గష్టపడుట - చెఱుపుగాదె. 909

ఆ.వె. యోగసేవఁ జేయు - చుండఁగా నవశత
మేన సిద్ధు లేవి - యైనఁ దోఁప
వాని నమ్మరాదు - ప్రాజ్ఞుండు మత్పరం
బైన యోగనిష్ఠ - మాని యెపుడు. 910

క. నను నాశ్రయించి యోగం
బును నిట్లొనరించుచు - బుధునకు నెందున్
మనసున నగు నిస్పృహతను
నెనయవు విఘ్నములు స్వసుఖ - మే భోగ్యమగున్. 911

వ. అనిన విని యుద్ధవుం డిట్లనియె. 912

ఆ.వె. మనసు వశముగాని - మానవు లీయోగ
మభ్యసింపఁజాల - రని తలంతుఁ
బురుషుఁ డప్రయాస - మున ధన్యుఁడౌ తెఱం
గరసి తెలియ నాకు - నానతీవె. 913

చ. నిలుపంగఁబూని మానసము - నిల్వక యెందఱొ యోగులచ్యుతా!
యలసి మహాప్రయాసమని - యాపని మాని సమస్తసౌఖ్యమీఁ
గలదని నిశ్చయించి సర - గ న్భవదీయ పదాంబుజంబుఁ గే
వలముగ నాశ్రయింతురు భ - వత్ప్రియభక్తులు వార లీశ్వరా! 914

తే.గీ. అట్టివారికి నీ మాయ - యడ్డపడదు
యోగకర్మజ్ఞతాగర్వ - మొరులకట్లు
వారి కెన్నఁడుఁ గలుగదు - వారిజాక్ష!
కావున విముక్తి వారిదే - గద ధరిత్రి. 915

సీ. శ్రీమన్మహారా ట్కి - రీట పీడిత పాద
పీఠుండవయ్యుఁ - గపిప్రవీర
సఖుఁడవై యడవుల - సామాన్య పోలిక
వర్తించితివి రామ - మూర్తి వగుచు
నచ్యుత! నీ వఖి - లాత్మ బాంధవుఁడవు
నిన్నె నమ్మిన దాస - నిచయమునకు
గోగోపికాదుల - కును నధీనుండవై
యిందు నుండుట చూడ - నేమి వింత

తే.గీ. యిట్టి నీవు ప్రహ్లాదదై - త్యేంద్ర ముఖ్యు
లైన భక్తుల కొనరించి - నట్టి మేలు
నెఱిఁగి యుండియు నిన్నాశ్ర - యించి శుభముఁ
బొందక తొలంగు నెవఁడు గో - విందు! వినుము. 916

సీ. అఖిలాంతరాత్ముండ - వత్యంతహితుఁడ వీ
శ్వరుఁడ వాశ్రితలోక - వత్సలుఁడవు
సకలార్థదాతవు - సదయుండ విట్టి ని
న్నెవ్వఁడు తుచ్ఛ భో - గేచ్ఛనేని
సంసృతి న్మఱచు మో - క్షము గోరియేని భ
జించు నేఫల మపే - క్షింపకుండ

నీపాదకమల సేవా - పరాత్ములమగు
మాకేమి కొదువ కృ - పాకటాక్ష!

తే.గీ. లోన నాత్మవు వెలుపల - లోకగురుఁడ
వగుచు దేహుల దుర్విష - యాశఁ బాపి
మెలఁగు నీమేలు బ్రహ్మవే - త్తలును ముదము
తోఁ దలంతురు ప్రతికృతి - దోఁప కెపుడు. 917

వ. అని యిట్లుద్ధవుండు శ్రీకృష్ణదేవుని. బ్రార్థించెనని శుకయోగీంద్రుండు
పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. 918

సీ. అనురాగరసపూర - మున నిండు మనముతోఁ
దను భక్తుఁడైనఁ యు - ద్ధవుఁడు వేఁడ
విని నిజసత్త్వాది - వివిధ శక్తులఁ గూడి
యజ హరి శివమూర్తు - లమరఁ దాల్చి
జగముతోఁ గ్రీడించు - సర్వేశ్వరేశ్వరుం
డనెఁ బ్రేమరస మనో - హర ముఖాబ్జ
మునఁ జిఱునగవులు - మొలకలెత్తఁగ నుద్ధ
వా! నీదు [illegible]కుల - కలరినాఁడ

తే.గీ. మంగళాయతనంబులు - మామకములు
ధర్మములు నీకు జెప్పెదఁ - గూర్మి వినుము
శ్రద్ధతో వీని నడుప దు - ర్జయము భయద
మైన మృత్యువు గెలుచు మ - ర్త్యాళి యవని. 919

తే.గీ. మనసుఁ జిత్తంబు నాయందు - మరగఁజేసి
యవ్వి మద్ధర్మరతి నుండ - నన్ని పనులు
నన్ను దలఁచుచు నప్రయ - త్నముగఁ జేయ
వలయు మత్ప్రీతికొఱకె నా - భక్తుఁ డెపుడు. 920

తే.గీ. ఎందు నాభక్తులగు సాధు - లుందు రట్టి
పుణ్య భూములఁ జేరనౌఁ - బురుషుఁ డెపుడు

నతఁడు దేవాసురమనుష్య - లందు నాదు
భక్తుల తెఱంగుననె నడు - వంగ పలయు. 921

శా. చేయింపన్వలె వర్షయాత్రలును మ - త్సేవోత్సవ ప్రక్రియల్
న్యాయంబైన స్వకీయవిత్తముననో - యన్యార్థసంభూతినో
శ్రీయుక్తాధికరాజవైభవముతో - నృత్తంబు గీతంబు ము
న్నై యొప్పారెడునట్లు నిత్యము నన - న్యంబైన మద్భక్తితోన్. 922

సీ. తనయందు నఖిల భూ - తలమందు వెలి లోన
నావృతుండును బూర్ణుఁ - డైన నేనె
యాకాశమును బోలి - యంటక యుండుట
నిర్మలమతిఁ గాంచి - నిశ్చలముగ
నెల్లభూతములు నే - నే యని భావించి
వానిఁ బూజించి కే - వలము జ్ఞాన
మాశ్రయింపఁగ నొప్పు - నా జ్ఞానదృష్టిచే
ద్విజునిఁ జండాలుని - స్తేను దాత

తే.గీ. సూరు మిణుఁ గురుఁ గ్రూరు న - క్రూరుఁ జూచి
నపుడు సమముగ నిర్వికా - రైక మతిని
వాని నన్నుఁగఁ జూచు నా - భక్తుఁడెవ్వఁ
డతఁడె పండితుఁడని యెంతు - నమలహృదయ! 923

తే.గీ పలుమఱును నన్నె కా మను - ష్యులను జూచు
నాతఁ డచిరమ సమదృష్టి - యగుచుఁ బాయు
స్పర్థను నసూయనును దిర - స్కార మాను
విషమ దృష్టిని బుట్టెడు - వికృతులెల్ల. 924

సీ. తనుఁజూచి నగుచుండు - తనబంధుమిత్రాదు
లను లేశమైనఁ ద - లంపకుండఁ
దనుదృష్టిమాని యు - త్తముఁడ నే నిది నీచ
మను తలం పుడిగి సి - గ్గను ద్యజించి

యన్ని భూతములు భూ - తాంతరాత్ముందును
నొక్కఁడౌ నన్నుగాఁ - జక్క ఁజూచి
యమర మనుష్య తి - ర్యక్ష్వావరంబులఁ
గుక్క చండాలుండు - గోవు ఖరము

తే.గీ. నవధిగా నన్నిటింగని - యవని వ్రాలి
నాకుఁబోలె సాష్టాంగ దం - డప్రణామ
మాచరించుచు నుండనౌ - నమలభక్తి
విషమదృష్టి నిర్మూలమై - వెస నశింప. 925

తే.గీ. అఖిలభూతంబులందు నే - ననెడు బుద్ధి
స్థిరముగా నిల్చుదాఁక నీ - తెఱఁ గుపాస్తి
వాఙ్మనః కాయవృత్తులఁ - బరగఁ గలిపి
సలుపఁగావలె జ్ఞానవి - జ్ఞానయుతుఁడు. 926

తే.గీ. అంతయును నన్నె కాఁజూచు - నట్టి విద్య
నాత్మబుద్ధి నిదెల్ల బ్ర - హ్మాత్మకముగఁ
గాంచి వాఁడంత బంధమో - క్షంబు నొంది
యుడుగవలెఁ గ్రియలెల్ల న - న్నొకని బొంది. 927

క. మనసున వాక్కునఁ గాయం
బునఁ గర్మంబులను సర్వ - భూతంబులు నే
నని చూచు నిదియె యన్నిట
ఘనమగు వెరవని తలంతుఁ - గద ముక్తింగనన్. 928

క. ఆరంభించిన పిమ్మట
నారయ మద్ధర్మమందు - హాని రవయు లే
దీరీతి నిశ్చయించితిఁ
గోరిక లేకునికి నిదియె - కూర్చు విముక్తిన్. 929

తే.గీ. పరుఁడనగు నాకు నర్పింపఁ - బడిన ధర్మ
మెయ్యదేనియు నిష్ఫలం - బయ్యెనేని

దాని యాయాసమును నిర - ర్థకమెయగు భ
యాదులఁ బలాయనాదుల - యట్టు లనఘ. 930

తే.గీ. బుద్ధియును నేర్పు గలిగిన - పురుషులందు
సత్య మమృతంబు నగున న్న - సత్య మర్త్య
మైన యీ సందేహంబు - నందు నిందె
యందఁజేయునదే బుద్ధి - యదియె నేర్పు. 931

తే.గీ. అమరులకుఁగూడ దుర్గమం - బైన బ్రహ్మ
వాదసంగ్రహ మిది నీకు - బహువిధములఁ
దరిచి సంక్షేపముగను వి - స్తరముగాఁగ
దెలియఁజెప్పితి నుద్ధవా! - తెలిసెఁగాదె. 932

తే.గీ. నీకు విస్పష్టయుక్తుల - న్నియును గూర్చి
జ్ఞానమును బల్మఱును జెప్పి - నాఁడ వింటె
దీని బాగుగా నెఱిఁగిన -మానవుండు
గళితసంశయుఁడై ముక్తిఁ - గాంచఁగలడు. 933

ఆ.వె. నీదుప్రశ్నమునకు - నేఁజెప్పినట్టి యీ
యర్థమెల్ల నెవ్వఁ - డాత్మ నిల్పు
నతఁడు వేదగుహ్య - మగు సనాతన పర
బ్రహ్మపదము నొందు - భ్రాంతులుడిగి. 934

తే.గీ. పుష్కలంబగు నీయర్థ - మును నెవండు
నాదు భక్తుల కొసఁగు నా - జ్ఞానదాత
కేను నా నిక్కమగు రూప - మేర్పఱించి
చూపి తత్ప్రాప్తి నొసఁగుదు - దాఁపకుండ. 935

ఆ.వె. ఎవ్వఁ డనుదినంబు - నెడపక కడుఁ బవి
త్రంబుఁ బరమపావ - నంబునైన
యట్టి దీనిఁ జదువు - నాతఁడు జ్ఞాన దీ
పమున నన్నుఁ జూపి - భవ్యుఁడగును. 936

ఆ.వె. శ్రద్ధతోడ దీనిఁ - జదువు నెవ్వఁడు నిత్య
మెవఁడు వినును - దీని నేకభక్తి
వారు నన్నుఁ బరమ - భక్తి సేవించుటఁ
గర్మబంధములను - గట్టువడరు. 937

తే.గీ. సారమైనట్టి బ్రహ్మ వి - చార మిద్ది
నెచ్చెలీ యుద్ధవా మతి - నిల్పికొంటె
నీదు మోహంబు వాసెన - నెమ్మనమునఁ
బుట్టినట్టి శోకంబును - బొలిసెఁగాదె. 938

తే.గీ. నీకు నేర్పిన యీవిద్య - నీకుమయ్య
దాంభికునకును నాస్తిక - తార్కికునకు
వంచకునకును నీకు సె - వకుఁడు గాని
యాతని కభక్తునకు దుర్వి - నీతునకును 939

తే.గీ. ఎవని కీదోషములు లేవొ - యెవఁడు వేద
బద్ధుడో నీకుఁ బ్రియుఁడొ వి - శుద్ధ మతియొ
సాధువో వాని కిది చెప్పఁ - జనును భక్తి
చొప్పడినఁ జెప్పవచ్చు స్త్రీ - శూద్రులకును. 940

తే.గీ. దీనిఁ దెలిసిన జిజ్ఞాసు - వైనవాని
కింకఁ దెలియంగ వలసిన - వెవియు నుండ
వమృత మతిరుచ్య మానిన - యతని కింక
ద్రావ వలసిన వేవియు - లేవు గావె. 941

సీ. జ్ఞానసాధ్యంబు మో - క్షంబును విహిత క
ర్మఫలంబు ధర్మ కా - మద్వయంబు
యోగసాధ్యములగు - భోగ సిద్ధులును గృ
ష్యాదులచేనగు - నర్థచయము
దండనీతి యొసంగు - చుండు నైశ్వర్యంబు
నెంత ప్రయోజనం - బిచ్చు నరుల

కంతయు నీకు నే - నగుదు నాతండ్రి నీ
పురుషార్థములు నేనె - పురుషవర్య
తే.గీ. మర్త్యుఁ డెపుడు సమస్త క - ర్మములు విడిచి
యప్పగించును దను నాకు - నప్పు డెను
మాని నధికుని జేయఁగాఁ - బూని ముక్తి
కర్హునిగఁ జేసి మద్భావ - మతనికిత్తు. 942

వ. అని భగవంతుం డానతిచ్చెనని మఱియు శుకయోగీంద్రుండు రాజేంద్రున
కిట్లనియె. 943

## -: ఉద్ధవనిర్గమనము :-

సీ. క్షితినాథ వినవయ్య - శ్రీకృష్ణదేవుఁడి
ట్లాదరంబునఁ జూపి - నట్టి యోగ
మార్గంబుఁ దెలిసి య - మ్మహితాత్ము వాక్యసు
ధారసంబును వీను - లారఁ గ్రోలి
యా యుద్ధవుండు బ - ద్ధాంజలియై ప్రీతి
మిక్కుటంబై మాట - యెక్కిరాక
తన కంఠమున నాఁగఁ - గనుల నానందాశ్రు
లుబ్బి పొర్లఁగ నూర - కుండె నప్పు
ఆ.వె. డంతఁ గొంతవడికి - నత్యంతమగు ప్రీతి
చేతఁ గలఁగియున్న - చిత్తమందు
ధైర్యమూని తనదు - ధన్యతఁ దలపోసి
దోసిలొగ్గి ప్రణతిఁ - జేసి యంత. 944

క. తన శిర మా యదుకులనా
థుని పాదాంబుజయుగంబుఁ - దొదరి స్పృశింపం
గను సాగిమ్రొక్కి యతఁడి
ట్లనియెను సవినయంబుఁగా మ - హా హర్షముతోన్. 945

ఆ.వె. జన్మరహిత! బ్రహ్మ - జనక! సనాతన!
నిన్ను నాశ్రయించి - యున్న నాకు
సన్నిధానముననె - సమసె మోహంబను
నంధకారమెల్ల - నాత్మయందు. 946

తే.గీ. భాస్కరునిగాని మండెడు - వహ్నిఁగాని
యాశ్రయించి తదంతికం - బందునుండు
నరునకుండునె లేశమై - నను తమంబు
చలియు భయమును సుఖమె కే - వలముగాక. 947

ఉ. దానికిఁ దోడుగా సదయ - దానము సేసితిగావె నాకు వి
జ్ఞానమయ ప్రదీపమునుఁ - జాలుఁ గృతజ్ఞత గల్గియుండు నే
మానవుఁడైన నిట్టి పర - మంబగు నీచరణంబుఁ బాసి యెం
దైనను నేఁగునే శరణ - మంచుఁ ద్వదన్యముగూర్చి కేశవా! 948

ఆ.వె. సృష్టి వృద్ధిసేయ - నీవు నీ మాయచేఁ
బఱుతు గట్టి స్నేహ - పాశపటలి
యాదవాళియందు - నవి నాకు లేకుండ
నీ సుబోధహేతి - సేసి తనఘ 949

తే.గీ. నీకు మ్రొక్కెద శరణంబు - నీవె నాకు
నీ పదాంబుజరతి నాకు - నిత్యముగను
గలిగి యుండెడున ట్లను - గ్రహము సేయు
సెలవొసంగు మహాయోగి! - సిద్ధపురుష! 950

సీ. అన భగవంతుఁడి - ట్లనియె నుద్ధవ పొమ్ము
బదరికాశ్రమమును - పట్టు నాది
యందు మత్పాదతీ - ర్థాంబువౌ గంగలో
స్నానాచమనములు - సలిపి శుద్ధి
నలకనందను జూచి - యఖిలపాపముఁ బాసి
నారచీరలు గట్టి - నవ్యవన్య

ఫలమూలముఖ్యము - ల్భక్షించి సుఖముల
యెడ నిస్పృహుండవై - యొడలఁ గలుగు

తే.గీ. ద్వంద్వమాత్రల కోర్చి స - త్త్వ స్వభావ
మమర నియతేంద్రియుండవై - యధికశాంతిఁ
బూని మతినిల్పి జ్ఞాన వి- జ్ఞాన యుతుఁడ
వై చరించుచు నుండు మా - యాశ్రమమున. 951

ఉ. నే వివరింపఁగా మతిని - నీవు విచార మొనర్చి నిల్పియు
న్నా వెవి వాని నేమఱ క - నారతముం దలపోయుచు న్ననున్
భావమునందు వాక్కనునుఁ - బాయక మామకధర్మవృత్తి వై
తే వెసమూఁడు త్రోవలను - నేఁగక పొందెదు నన్నరుం దుదిన్. 952

వ. అని మఱియు శుకయోగీంద్రుండిట్లనియె. 953

సీ. జననాథ! హరి యిట్టు - లన విని యుద్ధవుం
దత్యంత భక్తి నా - యనను జూచి
మూఁడు ప్రదక్షిణం - బులు సేసి తన శిరం
బును వారి పదయుగం - బునను జేర్చి
యతఁడు ద్వంద్వాతీతుఁ - డయ్యును హరిఁబాయు
నపుడు మనంబు నీ - రై కరంగ
వారి పాదము లశ్రు - ధారలఁ దడుపుచు
విడరాని స్నేహంబు - విడుచు భీతి

తే.గీ. హరిని బాయంగఁజాల కా - తురత నొంది
వారి పాదుకలను దల - పైనఁ దాల్చి
మఱియు మఱియు దండములిడి - మఱలి మఱలి
స్వామిఁ జూచుచు నెట్టులో - చనియె నతఁడు. 954

సీ. హరిమూర్తిఁ దన మన మందుఁ దప్పక నిల్పి
యా మహాభాగవ - తాగ్రగణ్యుఁ

డటఁ జని సువిశాల - మై జగదేక బాం
ధవుఁడగు హరి మున్ను - దనకుఁ జెప్పి
నట్లే వెలయు బద - ర్యాశ్రమంబునఁ జేరి
యందుఁ దపశ్చర్య - నాశ్రయించి
చిరకాలముండి శ్రీ - హరి పదంబును జేరె
హరిభక్తులు విముక్తు - లగుట యరుదె

ఆ.వె. యతఁడు బదరిఁజేర - నరుగక ము న్నుప
సంప్రృతాత్మకులుని - స్వామి నేక
తమున మఱలఁ జూచి - తత్త్వంబు మైత్రేయ
మునికిఁ జెప్పెఁ దాను - వినిన యట్లు. 955

మ. పరమానంద సముద్రజంబు విబుధా - స్వాద్యంబు జ్ఞానామృతం
బరుదౌ నియ్యది దీని యోగిపర సే - వ్య శ్రీ పదుండైన శ్రీ
హరి భక్తాగ్రణియైన యుద్ధవునకున్ - హర్షంబుతో నిచ్చె నిం
దు రవంతైనను శ్రద్ధఁ గొన్నతనికిన్ - లోకంబె దూరంబగున్. 956

సీ. వేద విధాతయౌ - విశ్వేశ్వరుఁ డెవండు
వేదసారంబు క్షీ - రోద సార
మైనట్టి జ్ఞాన వి - జ్ఞానామృతము నమృ
తంబును సుమమధు - ద్రవముఁ దేఁటి
తీరునఁ దీసి సం - సారభీతిని జరా
మరణ భీతిని - దన్ను శరణుఁ జొచ్చి
కావ వేఁడిన విబు - ధావళిఁ ద్రావించె
నట్టి మహావిష్ణు - వనఁగఁ బరగు

ఆ.వె. పరమపురుషు నాద్యుఁ - బరమ కారుణికుని
నఖిలలోకగురుని - నిరత మేను
బరమభక్తిభావ - భావితుఁగావించి
మ్రొక్కువాఁడ బంధ - ముక్తికొఱకు. 957

వ. అనిన విని పరీక్షిన్నరపాలుం డిట్లనియె. 958

## - : యదుక్షయ భగవన్నిర్యాణాభివర్ణనము : -

సీ. బ్రాహ్మణోత్తమ మహా - భాగవతుం డుద్ధ
వుండు తపోవని - నుండఁ బోవ
భూతభావనుఁడైన - పురుషోత్తముఁడు గృష్ణుఁ
డవల నేమి యొనర్చె - ద్వారవతిని
యదుకులంబెల్ల బ్రా - హ్మణ శప్తమై యుండ
సర్వేంద్రియోత్సవ - జనకమగుచుఁ
బ్రియతమంబౌ స్వశ - రీర మేక్రియఁ బాసె
దానికిఁ దగిలెనే - మౌనిశాప
తే.గీ. మకట శ్రీకృష్ణదేవు దే - హంబు సక్కఁ
దనపు గని గద యది యేవి - ధనముఁ బోయెఁ
దనివిదీరదు వినవిన - దానవారి
చరితమెల్లను జెప్పవే - కరుణతోడ. 958
సీ. ఎవనిరూపముఁ జూచి - యింతులు దమకను
ల్మఱలింపనేరక - భ్రాన్పడుదురు
వీనుదోయిని జొచ్చి - మానసంబున నిల్చి
వీఁడ దెవ్వనిరూపు - విబుధకోటి
కెవని వర్ణించు క - వీంద్రుల వాక్కుల
కుత్సాహలక్ష్మి పె - ల్లొదపుచుండు
నర్జును రథముపై - నాసీనుఁడైన యె
వ్వనిఁ గని సామ్యంబు - గనిరి మృతులు
తే.గీ. మనుజులన నెంత యనిమిష - ల్దనివి దీఱఁ
గాంచలేరైరి దేని శృం - గార మవని
నట్టి శ్రీకృష్ణమూర్తి యే మయ్యె నయ్య
త్వరపడెడిఁ జిత్త మాచరి - త్రంబుఁ జెపుమ. 960

తే.గీ. అనిన శుకయోగి యిట్లను - నవనినాథ!
విను మపుడు ద్వారవతిని బృ - థ్వీతలమున
నంతరిక్షంబునను దివి - నద్భుతముగఁ
గానఁ బడియె మహోత్పాత - గణము పెలుచ. 961

తే.గీ. వానిఁగనుగొని యాదవే - శ్వరుడు గృష్ణుఁ
డట సుధర్మాసభాసీను - లైన సకల
యాదవులఁజూచి భయ విస్మ - యములు గదుర
ననియె నక్కట కీడయ్యె - ద్వారవతికి. 962

సీ. ఇదె యబ్ధిరొాదఁబెట్టె - మొదవులకును బుట్టెఁ
బులిపిల్ల లవని ది - క్కులును వడఁకె
మిన్నెల్లఁ గావిరి - మిక్కుటంబయ్యెఁ బె
ద్దాకులు మిన్నక - మండసాగెఁ
దరణిమండలమునఁ - బరివేషముదయించె
రక్తవర్షము మేఘ - రాజి గురిసెఁ
బిడుగులు పడె వట్టి - వినువీధినుండి యా
ర్తధ్వను లింటింటఁ - దాఁకెఁ జెవికి

తే.గీ. మన పతాకయు వణఁకుచు - మహికివ్రాలె
ఘోరములు మృత్యుచిహ్నము - ల్గాడె నిచట
బ్రాహ్మణుల దాఁటరాని శా - పమును మనకుఁ
గలిగె నిట నిల్వరా దొక్క - క్షణము మనము. 963

తే.గీ. బాలురును వృద్ధులును స్త్రీలు - త్వరగ లేచి
పోవవలయు శంఖద్వార - మునకుఁజేరి
నెట సరస్వతి పడమటి - కేఁగఁబాఱు
నది ప్రభాసము మన మట - కరుగవలయు. 964

సీ. ఆ తీర్థమందు సు - స్నాతపూతులమయి
యుపవసించి మనస్సు - లొకట నిలిపి

యభిషేకగంధలే - పాద్యుపచర్యల
దేవపూజలు సేయఁ - గావలయును
మహనీయులైన బ్రా - హ్మణులచే మనము స్వ
స్త్యయనంబు వడసి య - త్యంత భక్తి
వారి గోభూస్వర్ణ - వస్త్రాశ్వగజరథ
ధనగృహాదు లొసంగిఁ - తనుపవలయు
తే.గీ. భూతములకు స్వర్గమున న - భ్యుదయ మొసఁగ
నిలనుఁ గీడెల్లఁ బాపి మం - గళముసేయ
దేవతలకును ద్విజులకు - గోవులకును
జక్కఁగాఁ బూజసేయుటే - సాధనంబు. 965
తే.గీ. అనిన యదువృద్ధు లాపల్కు - లాలకించి
యట్లెకాకని నావల - నబ్ధిదాఁటి
రథములెక్కి ప్రభాసతీ - ర్థంబుఁజేర
నరిగి రందఱు నుత్సాహ - భరితులగుచు. 966
ఉ. అచ్చట యాదవేంద్రుఁడగు - నా భగవంతుని యాజ్ఞనందఱున్
హెచ్చగుభక్తి నెల్లరకు నెల్ల - శుభంబు లొసంగు సత్క్రియల్
వొచ్చెములేక యుండఁ బరి - పూతమతిం జరియించి రంత నే
మచ్చెరువొందు భూమివర - యా భగవంతుని మాయ గప్పినన్. 967
క. వారలు మతిసెడి మనసు న
వారణఁ ద్రిప్పులను బెట్టు - వస్తువు మధువున్
మైరేయకమును ద్రావి ర
యారె మహాపాప మది య - నర్థకము గదా. 968
సీ. ఆ మహాపాన మ - హామతులై యదు
వీరు లందఱును ద - ర్పించి విష్ణు
మాయచే మూఢులై - మనసులఁ దోఁచిన
ట్లాడసాగిరి మాట - లనుచితముగ

నప్పుడు మునుపటి - తప్పులొక్కరి వొక్క
రెత్తి యాక్షేపింప - నీసు వెరిగె
వారింపరాని వా - గ్వాదంబు మితిమీఱి
కడ కది యొక పెద్ద - కలహమయ్యె

తే.గీ. నంతఁగ్రోధంబు మించి దు - రంతమగుడుఁ
గడలిదరి వాన లిషుధనుః - ఖడ్గములను
గదలఁ దోమరములఁ బూని - కదనమునకుఁ
గడఁగి సన్నద్ధులై మహో - గ్రహము తోడ. 969

మ. పవమాన ప్రచలద్ధ్వజంబులగు ది - వ్యస్యందనంబు ల్గజా
శ్వవితానంబులు గోఖరోష్ట్రమహిష - వ్రాతంబు లింతేల మా
నవులు వ్వారికి వాహనంబులుగ బా - ణ ప్రస్ఫురత్పాణులై
కవలై పోరిరి వారలొండొరులతో - గాఢప్రహారంబులన్. 970

తే.గీ. దంతములతోడ వనగజ - ద్వయములట్లు
కోఱలను గోళ్ల సింగంపుఁ - గొదమలట్లు
వారు దుర్మదులై పర - స్పరముఁ గవిసి
బవరమొనరించి రంబుధిఁ - బ్రాంతమందు. 971

వ. ఇట్లారూఢమత్సరులై ప్రద్యుమ్నసాంబులును నక్రూరభోజులును ననిరుద్ధ సాత్యకులును సుభద్రసంగ్రామజిత్తులును సుచారుగదులును సుమిత్ర సురథులను మఱియు నన్యులగు భిషదోల్ముకాదులును శతజి త్సహస్రజి ద్భానుప్రముఖులును దాశార్హ భోజాంధక వృష్ణిసాత్వత దుర్వారక వితర్జన కుకుర కుంతి మద్ర కుల సంభూతులైన యర్బుద సంఖ్యాకులును మధుర శూరసేన దేశజులగు నగు యాదవులందఱను హరిమాయావిమోహితులై మదాంధకారంబున నన్యోన్యసౌహృదంబులు విడిచి డెందంబుల నమందవైరంబులుపూని పారావారతీరంబున ఘోరంబుగాఁ బోరొనర్చిరి. అందుఁ బుత్త్రులు దమపితృపితృవ్యభ్రాతలతోడను మేనమామలతోడను దండ్రులు పుత్త్రపౌత్త్రదౌహిత్రులతోడను మేనల్లుంద్రతోడను మిత్త్రు● మిత్త్రుల

తోడను సుహృదులు సుహృదులతోడను జ్ఞాతులు జ్ఞాతులతోడను మూఢులై పోరాడి రప్పుడు. 972

తే.గీ. శరము లఱిపోయె విఱిగెను - చాపములును
దొడరి యొండొంట శస్త్రము - ల్బనుకలయ్యె
నంత నందున్న తుంగల - నందుకొనిరి
యాదవులు పిడికిళ్ళతో నవనినాథ. 973

ఉ. వారలు చేతఁబట్టఁగనె - వజ్రముల ట్లవి భాసిలె న్మహా
భారదృఢంబులై యపుడు - వారలు తత్పరిఘాయుధాఢ్యులై
వైరముఁబూని శ్రీహరియె - వారణఁ జేసిన మానకుండ దై
త్యారిని వారవారిని మ - హాబలులై ప్రహరించి రేపునన్. 974

తే.గీ. అంత వారు తదాయుధ - హస్తులగుచు
శత్రువనకొని బలభద్రు - సైత మపుడు
చంప మది నిశ్చయించి మో - హంపు కప్పు
వలన మతిసెడి యాతని - పైకిఁ జనిరి. 975

తే.గీ. అపుడు బలకృష్ణు లిద్దఱు - నధికమైన
క్రోధమున నేరకాముష్టి - రూప పరిఘ
లెత్తికొని భీమమూర్తులై - పృథివి యద్రువ
యుద్ధమొనరించి చంపిరి - యోధవరుల. 976

తే.గీ. బ్రాహ్మణోత్తమదత్త శా - పంబు దగిలి
విష్ణుమాయను గడు నవి - వేకులైన
యాదవుల స్పర్ధయును గ్రోధ - మవనిఁ గలిపె
వారి కులము వంశాటవి - వహ్నివోలె. 977

తే.గీ. తన కులములెల్ల నీరీతి - గను నశింప
శ్రీహరి దలంచెఁ దన మదిఁ - బృథివి మిగిలి
యున్న భారంబు నేఁటి కీ - యుద్ధమందుఁ
తొలిసె నిశ్శేషముగ నని - భూమినాథ! 978

తే.గీ. అంత బలభద్రుఁ డంబుధి - చెంత సుస్థి
రాసనంబునఁ గూర్చుండి - యాత్మఁ బరమ
పూరుష ధ్యానయోగంబుఁ - బూని యాత్మ
నాత్మఁ గలిపి మనుష్య దే - హంబు వదలె. 979

ఆ.వె. ఈవిధమున రాముఁ - డేఁగుటఁ గని భగ
వంతుఁడైన హరియుఁ - బజ్జనున్న
రావిమ్రానికడ ధ - రాస్థలిఁ గూర్చుండె
సుస్థిరాసనమున - స్వస్థముగను. 980

తే.గీ. నాల్గుభుజములుగల తన - వెల్గుచేత
దిశల జీఁకట్లు విరయఁగా - దెజరిలుచు
నుండె హరిమూర్తి పొగలేక - మండుచుండు
పావకుని భంగి స్వప్రభాభాసి - యగుచు. 981

వ. అది మఱియును. 982

సీ. శ్రీవత్సలాంఛనాం - చితవక్ష మంబుద
శ్యామంబు తప్తకాం - చన సమాన
కౌశేయయుగధారి - కల్యాణ నిలయంబు
దరహాస రుచిర తా - మరస వక్త్ర
మళికుంతలంబు సి - తాంభోజ నేత్రంబు
మకరకుండల కర్ణ - మండనంబు
నుపవీత కటిసూత్ర - యుతము రత్నకిరీట
కటకాంగుళీయ కాం - గదవిభాసి

తే.గీ. హారనూపుర కౌస్తుభా - ద్యము స్వలంకృ
తమును వనమాలికాపరీ - తము స్వరూప
ధారిపంచాయుధంబయి - దక్షిణోరు
వున నరుణ వామచరణంబు - నునిచియుండె 983

వ. ఇట్లు హరి వీరాసనంబున సుఖోపవిష్టుండై యున్న సమయంబున. 984

తే.గీ. ఉక్కురోకటిఁ జాదగా - నున్న తుమక
ములికిమొనఁ జెక్కి జరుఁడను - బోయ వచ్చి
యచట హరిణాస్యమట్లున్న - హరి చరణము
మృగమని తలంచి యాముల్కి - నేసె దాని. 985

తే.గీ. ఏసి దగ్గఱి యాబోయ - హృదయ మెఱియఁ
గనెఁ జతుర్భుజుఁ బురుషవ - ర్యునిఁ బరేశు
నంతఁ గృతకిల్బిషుఁడు భీతుఁ - డై యతండు
హరిపదంబులు దనశిరం - బానఁ బడియె. 986

సీ. పడిమ్రొక్కి లేచి నేఁ - బాపుఁడఁ దెలియక
యిట్లు నేసితిఁ గావ - వే మహాత్మ!
పాపుఁడ నగు నాదు - పాపంబు మన్నింప
నీకెయౌ నుత్తమ - శ్లోక దేవ!
యెవనిఁ దలంప మా - నవుల యజ్ఞానత
మంబు మాయునటంచు - మహితులందు
రట్టి మహావిష్ణు - వగు నీకు నపకృతి
సేసితి మృగముల - నేసి బ్రతుకు
తే.గీ. పాపజీవనుఁడను నన్నుఁ - బావనునిగ
మనుపు వైకుంఠ సదతిక్ర - మంబు నిట్లు
ఘటల నేఁజేయకుండ నాఁ - మతిని దిద్దు
దేవ! నీకన్న నాకింక - దిక్కులేదు. 987

సీ. స్వాధీనమాయుండ - వగు నీదు రచన బ్ర
హ్మయును రుద్రాదు లై - నట్టి యతని
తనయులు మఱియు వే - దద్రష్ట లెఱుఁగరు
మాయావృతంబు త - దీయ దృష్టి
యట్టి నీవు రచించి - నట్టి బ్రాహ్మణ శాప
తదనర్థము లి వెల్ల - మది నెఱుంగ

నెవనికి వశ మీశ్వ - రేశ్వర! పాపజ
న్మలమైన మేము ని - న్నొగడఁ గలమె
తే.గీ. యనుచు నాబోయ వేఁడిన - హరియు జరుఁడ
భయపడకు లెమ్ము నేనె కా - వలయు ననుచు
నిట్లు చేసితి మదనుజ్ఞ - నేఁగు సుకృతు
లరుగు స్వర్గంబునకు నని - యానతిచ్చె. 988
వ. అని శుకుండు మఱియు నిట్లనియె. 989
తే.గీ. ఈవిధంబున నిచ్ఛా గృ - హీత దేహుఁ
డైన శ్రీకృష్ణ భగవంతుఁ - డానతీయ
నలరి ముమ్మాఱు వలగొని - హరికి మ్రొక్కి
యేఁగె జరుఁడు విమానంబు - నెక్కి దివికి 990
సీ. అంత దారుకుఁడు గృ - ష్ణా న్వేషణముసేయు
చును వెస సాశ్వకే - తనము రథముఁ
గొనివచ్చువాఁడు గా - లిని దులసీగంధ
మొదవ మూర్కొని - దాని కెదురు నడచి
యట భగవంతు దీ - ప్తాయుధావృతుఁ బిప్ప
లాగమూలస్థితు - నధిపుఁ జూచి
స్నేహంబుచే నెద - నీరయి యరదంబు
వెస డిగ్గి కన్నుల - వేఁడి నీరు
తే.గీ. జాలుగాఁ దత్పదద్వయి - వ్రాలి దేవ
నీ పదాబ్జముఁ గనని నా - పాప నయన
ములకుఁ జీఁకటి గ్రమ్మె ది - క్కులును నెఱుఁగ
జందురుఁడు లేని రాతిరి - చందమయ్యె. 991
మ. అని సూతుండు గలంగి పల్కు నెడ ది - వ్యంబై గరుత్మత్పతా
కను వెల్గొందుచు నున్న తే రెగసె నా - కాశంబున న్సాశ్వకే
తనమై దానిని వెన్కొనె న్వెలుఁగుచున్ - దైత్యారి దివ్యాయుధా
ళి నిజాత్మ న్వెలుఁగంది దీని గని జా - లింబొందు నాసారథిన్. 992

చ. కని హరివల్కె సూత చను - గ్రక్కున ద్వారక కీవు జ్ఞాతుల
ల్కను దముఁదామె చంపుకొని - కాలగతిం జనిరంచు రాముఁడుం
దనువుఁ ద్యజించె నేను నది - త్యాగమొనర్పఁగ నున్నవాఁడ నం
చను నెఱిఁగింపు బంధువులఁ - జూచి విషాదమునొందఁబోకిఁకన్. 993

తే.గీ. వారితో నేను మీరు మీ - బంధువులను
ద్వారకాపురి నిఁక నుండఁ - దగదు నేను
దాని విడువఁగనే సము - ద్రంబు వొంగి
ముంచు నవ్వీటి నని తర - లించువారి. 994

తే.గీ. చెపుము విజయుఁడు దమ్ము ర - క్షించుచుండఁ
దమతమ పరిగ్రహంబు భ - ద్రముగఁ గొనుచు
వారు మాతలిదండ్రులున్ - సేరవలయు
నెల్లవారు నింద్రప్రస్థ - మిపుడె యనుచు. 995

తే.గీ. దారుకా! పూను నీవు మ - ద్ధర్మనిరతి
జ్ఞాననిష్ఠనుజేసి దృ - శ్యం బుపేక్ష
సేయు మిదియెల్ల నయ్యె నా - మాయ ననుచుఁ
దెలియుచు విరక్తినొంది శాం - తిని వహించు. 996

వ. అని శ్రీకృష్ణదేవుం డానతిచ్చెనని శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. 997

తే.గీ ఇట్లు హరి వల్క దారుకుం - డెద సఖేద
భక్తితో స్వామి వలగొని - ప్రణతు లెన్నొ
చేసి తత్పాదయుగ మాత్మ - శిరముఁ జేర్చి
పొక్కుచును లేచి ద్వారకా - పురికిఁ జనియె. 998

సీ. అంత శ్రీకృష్ణుఁడు - న్నట్టిచోటికి వచ్చి
రజుఁడు సతీయుక్తుఁ - డైన భవుఁడు
శక్రాది సురలును - సంయమీంద్రులు బ్రజా
వతులును ద్విజులును - బితృగణంబు
సిద్ధ గంధర్వ ప్ర - సిద్ధ విద్యాధరో
రగచారణులు యక్ష - రాక్షసులును

గిన్న రాప్సరసలు - గృష్ణు నిర్యాణంబుఁ
గాంచఁగాఁ బరమోత్సు - కత వహించి

తే.గీ. తుములముగ వారు దివి విమా - నముల నిలిచి
శౌరి నిజ జన్మ కర్మప్ర - కారమెల్లఁ
బాడుచును సన్నుతించుచుఁ - బరమభక్తిఁ
గురిసి రలరులు నభము సం - కులము గాఁగ. 999

తే.గీ. వారినందఱ నాభగ - వంతుఁ డాత్మ
విభవములుగాఁ గనుంగొని - విభుఁడు గాన
నాత్మఁ బరమాత్మఁ గలిపి ప - ద్మాభ నేత్ర
ములను రెంటిని నల్లన - మూసికొనియె. 1000

తే.గీ. భక్తులకు ధారణాధ్యాన - పరమమంగ
ళంబు లోకాభిరామ సు - లక్షణంబు
నైన తన తనువాగ్నేయ - మైన ధార
ణను దహించి ప్రవేశించెఁ - దనదు నెలవు. 1001

తే.గీ. అపుడు దివి దుందుభులు మ్రోసె - నద్భుతముగ
పూల వానయుఁ గురిసె నీ - పుడమి నున్న
సత్య ధర్మ యశో ధైర్య - సంపదలుచు
స్వామి వెంబడిఁ జనియెను - భూమివిడిచి. 1002

తే.గీ. బ్రహ్మముఖ దివిజాదులు - పరమపదము
నెవరు నెఱుఁగని గతిఁ జేర - నేఁగుచున్న
కృష్ణుఁ గనఁ గోరి యాతని - కెలన నిలిచి
యరసి కనలేక కడు విస్మి - తాత్ములైరి. 1003

ఆ.వె. మెఱుపు నభమునందు - మేఘమండలి దాఁటి
చనెడు సరణి నరులు - గననియట్లు
హరి పరేశుఁ దరుగు - నప్పటి తెలఁగు నా
దేవతలు నెఱుంగ - దివిని గనరు. 1004

తే.గీ. బ్రహ్మరుద్రాదు లెల్లవా - రలును గృష్ణు
యోగగతిఁ జూచి విస్మయం - బొంది యతని
వినుతిసేయుచుఁ దమతమ - వివిధలోక
ములకుఁ జని సుఖముండిరి - భూమినాథ! 1005

వ. అని యిట్లు భగవన్నిర్యాణ ప్రకారం బెఱింగించిన విని పరీక్షిన్న రేంద్రుండు బాష్పావరుద్ధనయనుండై విన్నంబోయి మిన్నకున్నంగని శుకయోగీంద్రుం డతనితో మఱియు నిట్లనియె. 1006

సీ. పరుఁడు శరీరంబు - ధరియించి పుట్టుట
దానిని విడిచి యం - తర్ధినొందు
టిదియెల్ల నటుని య - ట్లే మాయఁ గైకొని
యతఁ డొనరించు మి - థ్యా ప్రచార
మిది తనచేఁ దానె - సృజియించి యటఁ జొచ్చి
విహరించి తుద నిది - వెస హరించి
తన మహామహిమచేఁ - దనయంత నుపరతుఁ
డౌట మాయామాత్ర - మని యెఱుంగు

ఆ.వె. మాయ సేయుచుండు - మాడ్కిఁ దాఁ జేసిన
యట్లు కానవచ్చు - నంతెగాని
నిత్య నిర్వికార - నిరతిశయానంద
మాత్రుఁ డతఁడు వగపు - మాను మధిప! 1007

సీ. ఎవ్వఁడు యమపురి - కేఁగిన గురుపుత్త్రు
మర్త్యదేహంబుతో - మఱలఁ దెచ్చె
బ్రహ్మాస్త్ర దాహ ప్ర - పన్ను ని నినుఁ గాచి
రక్షించె నేదయా - ర్ద్ర స్వభావుఁ
డంతకాంతకుఁ దగు - నభవుని గెలిచె నే
స్వామి యాబాణ సం- గ్రామమందుఁ

దను నేసినట్టి బో - యసు మర్త్యతనువుతో
స్వర్గంబునకు నంప - జాలె నెవ్వఁ

తే.గీ. డట్టి సర్వస్వతంత్రుండు - నలఘుశక్తి
యైన శ్రీకృష్ణ భగవంతుఁ - డాత్మతతనువుఁ
గాచుకొనలేఁడె వలసినఁ - గార్యమెల్లఁ
దీఱెనని తానె చాలించె - దేహమతఁడు. 1008

సీ. విశ్వసర్గ స్థితి - విలయంబుల కనన్య
హేతు వశేష వి - ఖ్యాతశక్తి
యతఁడు మహీభార - మంతయు నిజకుల
నాశంబుతోడఁ బూ - ర్ణముగఁదీఱు
నందాఁక భువినుండి - యాత్మీయులకు నాత్మ
నిష్ఠచే ముక్తులై - నెగడుత్రోవఁ
జూపి స్వదేహ మి - చ్ఛో నిల్పనొల్లక
చాలించె నది మర్త్య - మేల యనుచుఁ

తే.గీ. గృష్ణనిర్యాణ పదవీ చ - రిత్రమిద్ది
దీనిఁ బ్రొద్దునలేచి యే - మానవుండు
ప్రతిదినంబును భక్తితో - శ్రద్ధతోడఁ
జదువు వాఁడా యనుత్తమ - పదమె పొందు. 1009

సీ. దారుకుం డంటత - శౌరియానతిఁబూని
కృష్ణవియోగాస - హిష్ణుఁ డయ్యు
ద్వారకాపురి కేఁగి - వసుదేవు నుగ్రసే
నునిఁ గని వగచుచుఁ - గనులను నీటఁ
దచ్చరణంబులు - దడుపుచు సాఁగిల
పడి మ్రొక్కి యదువీర - వర్యులెల్ల
మడియుటఁ జెప్పె నా - మాట విన్నంతనే
పిడుగుపాటునఁ జెట్లు - పడినయట్లు

తే.గీ. జనులు వ్యాకుల చిత్తులై - ఘనవిషాద
మున విమూర్ఛితులై ప్రాణ - ములను విడుచు
నరులు సను చక్కి కరిగిరి - త్వరితగతిని
స్వామిఁ బాసిన దుఃఖంబుఁ - బట్టఁదరమె. 1010

తే.గీ. కృష్ణ! మమునెల్లఁ బాసి యేఁ - గితివె స్వామి
మేము నీవుండఁ జావఁగా - నోపమైతి
మయ్యయో మాకు దిక్కెవ్వ - రనుచుఁ బనివి
మోము లగల దాయాదులు - మోదుకొనిరి. 1011

సీ. హాకృష్ణ! యెందేఁగి - తయ్య నా కగపడ
వా? యని యేడ్చె దే - వకి మహార్తిఁ
గటకటా కడుపుదుః - ఖము నెట్టు లోర్తునం
చేదువసాగె రో - హిణియుఁ బొగిలి
యెంత పాపాత్ముఁడ - నేల నాబ్రతుకని
దిగువఁ బొర్లుచు వసు - దేవుఁ డేడ్చె
నిట్టులా మువ్వురు - నిలఁగూలి యేడ్చుచు
నా భగవద్విర - హార్తి మునిఁగి

తే.గీ. యయ్యయో రామ! హా కృష్ణ! - హా కుమార!
యనుచు స్మృతి దప్పి విడిచిరి - ప్రాణములను
స్త్రీలు దమతమభర్తల - దేహములను
గౌఁగిళులజేర్చి చొచ్చి రం - గారచితుల. 1012

మ. వసుదేవాంగన లాత్మభర్తృశవమున్ - బ్రద్యుమ్నసాంబాది కృ
ష్ణసుతాంగంబుల వారివారిసతులు - న్సద్బుద్ధిఁ గౌఁగిళ్ళఁ జే
ర్చి సహర్షంబుగ నగ్ని సొచ్చి రటులే - శ్రీరుక్మిణీముఖ్యలై
న సతుల్ శ్రీహరిభార్య లగ్నిఁబడి రం - తశ్చింతితాత్మేశలై. 1013

తే.గీ. అర్జునుం డంతఁ బ్రియుఁడగు - నాత్మసఖునిఁ
గృష్ణుఁ బాయుట వ్యాకుల - హృదయుఁడయ్యు

దనకు హరి సెప్పినట్టి గీ - తలను దలంచి
కుదురుపఱచెను మనసు న - య్యదన నతఁడు. 1014

తే.గీ. నిహతులై సంతతులు లేక - నిలిచిపోయి
నట్టి బంధుల కర్జునుం - డపరకర్మ
ముల యథావిధిఁ జేయించెఁ - బుణ్యలోక
ములు గలుగ నందఱకుఁ దప్పి - పోవకుండ. 1015

ఉ. ద్వారవతీపురంబు హరిఁ - బాసిన యాక్షణమందె ముంచె నా
వారిధి శ్రీహరిప్రియ ని - వాసముఁ దక్కఁగ నందు నెప్పుడున్
జేరి దయామయుండగుచు - శ్రీహరి యుండుఁ దనున్ స్మరించున
వ్వారి కశేషపాపములు - వాపి నిరంతర భద్రమిచ్చుచున్. 1016

తే.గీ. చావమిగిలిన ముదుసళ్ల - సతుల బాల
కులను దగు యానము లమర్చి - కొంచుఁ బోయి
వారి విజయుఁ డింద్రప్రస్థ - వసతిఁ జేర్చి
క్షితికి వజ్రునిఁ బట్టాభి - షిక్తుఁ జేసె. 1017

తే.గీ. అర్జునుఁడు సెప్ప మీ తాత - లాప్త మరణ
వార్త విని సువిరక్తులై - వసుమతీశ!
నిన్నుఁ దమ వంశమును ధర - నిల్ప నిల్పి
పయనమైపోయి రమ్మహా - పథముఁబట్టి. 1018

ఆ.వె. దేవదేవుఁడైన - శ్రీవిష్ణు జన్మక
ర్మముల వర్ణనంబు - మహితభక్తి
శ్రద్ధతోడఁ జదువు - సజ్జనుం డప్పుడే
పాపజాలమెల్లఁ - బాయు నధిప. 1019

సీ. రాజేంద్ర! వింటివే - రమ్యంబులగు మహా
విష్ణుని యవతార - వీర్య కథల
నవిగాక మంగళా - యతనంబు లా హరి
బాలచేష్టితములు - బహువిధంబు

లివి వినువారికి - నిహపరసౌఖ్యంబు
లా పరేశు నను(గ - హంబు వలనఁ
గలుగుట తథ్యంబు - కారుణ్య మయుఁడగు
నాతని సేవింప - నబ్బదేది?
ఆ.వె. కాన భాగవతముఁ - గడుభక్తిఁ జదివిన
మానవులకునెల్ల - మహితభక్తి
గలుగుఁ బరమహంస - గమ్యుఁడౌ శ్రీహరి
యందు నతని భక్తు - లందు నధిప. 1020

వ. అని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుఁ బరమానందంబు గలుగ శ్రీమద్భగవత్కథాభివర్ణనం బొనర్చెనని. 1021

-: ముక్తపదగ్రస్తమత్తేభవిక్రీడితము :-

జలధిస్తంభనదక్ష! దక్షతనయా - జప్యస్వనామా! స్వనా
మలతాపాదిదరేంద్ర యింద్రముఖస - మ్మాన్యప్రభావా! ప్రభా
వళివిద్యోతితదిఙ్ముఖా! ముఖసుధా - భానుప్రఫుల్లప్రియా
మలహృత్కైరవ! కైరవారికులజ - న్మా! జన్మరుగ్భేషజా 1022

-: అపంచవర్గీయ చంపకమాల :-

శివసహవాస! హేల సవి - శేష! యశస్వి! సహస్రశీర్ష! యా
హవవివశాసురా! సురస - హాయ! హయాస్యవిశేషవేష! వా
సవవశ! హ్రస్వలీల! శయ - శస్యశరా! వసువర్షవారివా
హ! విషయలోలవైరి! శశి - హారి! హరీశ్వరసేవ్య! యీశ్వరా! 1023

-: చక్రబంధము :-

శా. భక్తారాధిత కోమలాంగి! జలదా - భా! మన్మథద్రవ్యభా
రక్షామర్త్యవిపత్తిను న్నిజచరి - త్రా! కర్మభీ కృత్స్నహా

సక్తాచంచల! రాఘవేంద్ర! జగదీ - శా! విశ్వభూతిస్వభా
భాక్తప్రాభవ దూర! రాజసగుణా - భావా! మహాత్మర్షభా. 1024

-: అచుంబిత నిరోష్ఠ్య చంపకమాల :-

కరధృతశాత సాయక ని - కాయ నికృత్త దశాస్య కంధరా!
గరగళ సాహ్య దగ్ధశర - కర్కశ రాక్షసరాణ్ణికేతనా!
సరిదధినాథని స్తరణ - సాధక కాననచారదీక్షితా!
శరధిశయాన! దీనజన - జాడ్యహరా! సకలార్థదాయకా. 1025

-: అచలజిహ్వా కందము :-

బహుపాపౌఘ విపాకా
పహ! పంకభవాంబకా! వి - భా భవ! మోహో
వహభూమికా! భవాపహ
బహుభంగీ భూమి! భూ వి - వాహ మహేహా. 1026

-: శుద్ధాంధ్ర సీసము :-

సీ. వేలుపుగమి సేయు - విన్నపం బాలించి
కఱకు రక్కసుల యు- క్కఱఁగజేయ
బంతితేరుల తేని - పలుజన్నముల పంట
వై ప్రొద్దువంగడ - మందుఁ బుట్టి
తలిసి వేలిమిఁ గాచి - తమి నేలచేడియ
కన్నియఁ బెండ్లాడి - కానకేఁగి
రాకాసి మూఁకలఁ - బోకార్చి యిల్లాలి
చెఱ విడిపించి జే - జేలు మెచ్చ
తే.గీ. మఱలి వీటికి నేతెంచి - గఱితతోడ
రతనముల సింగపుంబీట - రమణ నెక్కి
తమ్ములును మన్నెదొరలు డెం - దముల నలర
నేలయేలిన ప్రోడ! జే - జేల తేఁడ! 1027

-: నాగబంధము :-

చ. నరవర! రాజధీరత! ఘ - నాఘనభవ్యవినీల దేహా! సుం
దరవదనా! దయారసమ - తా! మతిమ ద్విజవారశోభనా!
కరతలచాప! వీరవర - గౌరవనిత్యద! శారదామనో
హరశరణా! విచారపరి - హారిమహత్త్వపదా! దయానిధీ! 1028

-: మత్తేభకందగర్భసీసము :-

అభవభీతార్త్యప - హా! ధరారమణ! దృ
పృద్వైరిరా ణ్ణిగ్ర - హాద్వితీయ!
త్రిభువనాధీశ్వర! - దివ్యకీర్తి నిలయా!
భూపుత్త్రికా వల్ల - భా! పరేశ!
సుకవివిద్వన్నుత - శుభ్రనైజ చరితా!
కల్యాణ సంధాయ - కా! నరేంద్ర!
ప్రణవచాపారవ - పాటితారి హృదయా!
నాగేంద్రతల్పా శ్ర - యా! గభీర!

తే.గీ. సురనికరవందితాంబుజ - చరణ! జనక
వాక్యకరణ! సత్యవచన! - వార్ధరనిభ1
మునివరనుత! సుందరవేష! - భువననిలయ!
నతపనకులభవ! ప్రణవ - నాదవిదిత! 1029

-: గర్భితమత్తేభవిక్రీడిత వృత్తము :-

భవభీతార్త్యావహా! ధరారమణ! దృ - పృద్వైరిరా ణ్ణిగ్రహా!
భువనాధీశ్వర! దివ్యకీర్తి నిలయా! - భూపుత్త్రికా వల్లభా!
క వివిద్వన్నుత శుభ్రనైజ చరితా! - కల్యాణసంధాయకా!
నవచాపారవపాటితారి హృదయా! - నాగేంద్ర తల్పాశ్రయా! 1030

-: గర్భితకందము :-

సురనికరవందితాంబుజ
చరణ! జనకవాక్యకరణ! సత్యవచన! వా
ర్ధరనిభ! మునివరనుత! సుం
దరవేష! భువననిలయన! - తపనకులభవా! 1031

-: సర్వలఘు సీసము :-

సీ. దశరథ వరసుత! - ప్రశమిత మునిభయ
దశముఖ విదళన! - కుశల సదయ!
కరధృత శరహృత - ఖరముఖ దనుభవ!
ఘనసమ తనురుచి! - కమల నయన!
జనసుత మనునయ! - జలనిధి భయకర!
సనియమ కృతవన - చలనశపథ!
జలరుహ సఖకుల - శరనిధి శశధర!
సవినయ సురరిపు - శరణ చరణ!

తే.గీ. తరణిభవ సఖ! సురవిభు - తనయ హరణ!
పవనసుత ధృత పదయుగ! - భవభయ హర!
విపిన మునిజన పరసుఖ - వితరణ చణ!
సుగుణ మణిగణనిధి! నినుఁ - బొగడఁ దరమె? 1032

క. మిత్రులరూపున నీవీ
చిత్రగతుల నిన్ను బొగడఁ - జేసితి నన్నున్
సుత్రామ వినుత! నీకిది
శోత్రప్రియమగుట నాదు - సుకృతమె రామా! 1033

ఉ. పండితులు న్మహాకవులు - బ్రహ్మవిదగ్రణు లెంద ఱెందఱో
యుండఁగ నేమియుం దెలియ - కుందు ననున్ భవదీయలేఖినీ
కాండముఁ జేసి వ్రాసితివి - గ్రంథము నీశ్వర! నీయనుగ్రహం
బుండినఁ గాని దేపనియు- నుండదు చీమయుఁ దాఁటు మేరువున్ 1034

**మాలిని**

నిగమవన విహారీ! - నిత్య లోకోపకారీ!
విగుణ దనుజ హర్తా! - విశ్వసంభూతి కర్తా!
జగదవన వినోదా! - సర్వ సంపూజ్య పాదా!
విగత గుణవికారా! - విశ్వరూప ప్రకారా! 1035

**- : గద్యము : -**

ఇది
శ్రీ పరమేశ్వర కరుణాసమాసాదిత కవితావైభవ
కోవూరి వేంకటరమణార్య తనూభవ
కామకాయనవిశ్వామిత్రసగోత్ర అశ్వలాయనసూత్ర
పట్టాభిరామాభిధాన ప్రణీతంబైన
శ్రీమదాంధ్రమహాభాగవతైకాదశస్కంధము
సమాప్తము.
శ్రీ రామచంద్రార్పణమస్తు.
ఓం తత్సత్

